అనుప్రమాణము చేత, మహాప్రళయమైన బ్రహ్మాప్రళయము (బ్రహ్మ ఆయువు తీరగా) సంప్రాప్తించగా, బ్రహ్మలోక వాసులు బ్రహ్మదేవుని ఉపదేశము చేత ఆత్మజ్ఞానమును పొంది బ్రహ్మతో సహా పరమ పదమును (కైవల్యమును) పొందుదురు॥ 1॥

శ్లో॥ ప్రవృత్తి లక్షణశ్చైవ త్రైగుణ్య విషయో మునే ।
యోఽసావలీన ప్రకృతేర్గుణ సర్గః పునః పునః ॥2॥

తా॥ ఓ మునీ! త్రిగుణముల విషయముతో కూడిన (ఏ) ఈ మార్గమున అవిద్య తొలగని వానికి మరల మరల గుణముల కార్యము కలుగుచుండునో అట్టి ప్రవృత్తి మార్గము(కర్మానుష్ఠాన మార్గము) ను కూడా వివరించితిరి. ॥2॥

టీ॥ త్రైగుణ్యం స్వర్గాది సుఖం తదేవ విషయః ప్రాప్యం యస్య । న లీనా ప్రకృతిర్యస్య తస్య పుంసః । పునః పునర్గుణసర్గో భోగార్థం దేహారంభ రూపో యో మార్గః స చ కథితస్తృతీయే, దక్షిణేన పథాఽర్యమ్ణః పితృలోకం వ్రజంతి తే"ఇత్యాదినా. ॥2॥

టీ॥ మరియు త్రిగుణ సహితమైన స్వర్గాది సుఖముల పొంది ఎవని యొక్క ప్రకృతి నాశము పొందలేదో, ఆ పురుషునకు మరల మరల భోగముల కొఱకు దేహారంభము ఏర్పడు మార్గమును "దక్షిణేన పథాఽర్యమ్ణః పితృలోకం వ్రజంతి తే" (దక్షిణమార్గమున పితృ లోకమునకు వారు కొనిపోబడుదురు) ఇత్యాదిగా తృతీయ స్కంధమున చెప్పబడినది. ॥2॥

శ్లో॥ అధర్మ లక్షణా నానా నరకాశ్చానువర్ణితాః ।
మన్వన్తరశ్చ వ్యాఖ్యాత ఆద్యః స్వాయంభువో యతః ॥ 3

తా॥ అధర్మ ఫలములైన వివిధ నరకములు కూడా వర్ణింపబడినవి. మరియు స్వాయంభువాది మన్వన్తరములును వివరింపబడినవి. ॥3॥

టీ॥ అనువర్ణితా నిరన్తరాధ్యాయే. వ్యాఖ్యాతశ్చతుర్థస్యాదౌ. యతో-యస్మిన్. ॥3॥

శ్లో॥ ప్రియవ్రతోత్తానపాదోర్వంశస్తచ్చరితాని చ ।
దీపవర్షసముద్రాద్రి నద్యుద్యాన వనస్పతీన్ ॥ (4)

శ్లో॥ ధరామన్దల సంస్థానం భాగలక్షణమానతః ।
జ్యోతిషాం వివరాణాం చ యథేదమసృజద్విభుః ॥ (5)

టీ॥ ద్వీపాదీన్ భాగతో లక్షణతో మానతశ్చ ధరామణ్డలస్య సంస్థానం జ్యోతిషాం వివరాణాం చేదం సంస్థానం విభుర్యథాఽసృజత్తథా వ్యాఖ్యాతమిత్యర్థః ॥4,5 ॥

శ్లో॥ అధునేహ మహాభాగ యథైవ నరకాన్నరః ।
నానోగ్రయాతనాన్నేయాత్తన్మే వ్యాఖ్యాతుమర్హసి ॥ (6)

టీ॥ నాల్గవ స్కంధ ప్రారంభము నందు స్వాయంభువాది మన్వన్తర ముల వృత్తాంతములను, అధర్మములను వాని వలన పొందు వివిధ నరకములను మీరు చెప్పియున్నారు ॥3॥

తా॥ ప్రియవ్రత ఉత్తానపాదుల వంశమును, వారి వృత్తాంతములను మఱియు ద్వీపముల, ఖండముల, సముద్రముల. పర్వతముల, నదుల, ఉద్యానవనముల, వృక్షముల గూర్చియు, భూమండలము యొక్క భాగములను వాని ఇతర లక్షణములను, కొలతలను, జ్యోతిర్మండల-మును, చీకటి గుహలను, సర్వవ్యాపకుడైన భగవానుడు ఈ జగత్తును ఏ విధముగా సృజించెనో ఆ విధానమును వివరించితిరి. ॥4,5॥

టీ॥ ద్వీపముల యొక్క లక్షణములను, భాగములను విశేషముల తోను, ధరామణ్డలము యొక్క ఉనికిని, గ్రహగతులు మొదలైన వివరణములను ప్రభువు సృజించిన విధమును యథా తథముగా చెప్పియున్నారు. ॥ 4,5 ॥

తా॥ ఓ మహాత్మా! ఇప్పుడు, ఈ లోకమందుండే మానవుడు, క్రూరమైన (వివిధ) యాతనలుగల నరకములను పొందకుండా ఉండుటకు ఏమి చేయవలెనో దానిని నా కొఱకు వివరించి చెప్పదగిన వారలు మీరే. ॥ 6 ॥

టీ॥ నానా ఉగ్రా యాతనా యేషు తాన్నరకాన్ యథా యేనోపాయేన ఇయాన్న గచ్ఛేత్తన్మేఽధునా వ్యాఖ్యాతుమర్హసి. ॥6॥

టీ॥ ఉగ్రమైన వివిధ నరక యాతనలను ఏ ఉపాయములచే తొలగించుకోవచ్చునో వానిని ఇప్పుడు నా కొఱకు చెప్పవలసినది.॥6॥

అవ॥ తత్ర తావన్మన్వాద్యుక్తం ప్రాయశ్చిత్తం వినా నరకా దుర్నివారా ఇత్యాహ - నచేదితి ద్వాభ్యామ్.

అవ॥ నచేదిత్యాదిగా గల రెండు శ్లోకముల ద్వారా పూర్వము మన్వాదుల చేత చెప్పబడినట్లు ప్రాయశ్చిత్తము చేసుకొనకుండా నరకముల నివారించుట దుర్లభము అని చెప్పబడినది.

శ్రీశుక ఉవాచ

శ్లో॥ నచేదిహైవాపచితిం యథాం హసః
కృతస్య కుర్యాన్మ న ఉక్తిపాణిభిః ।
ధ్రువం స వై ప్రేత్య నరకానుపైతి
యే కీర్తితా మే భవతస్తిగ్మ యాతనాః ॥ (7)

శ్రీశుకులు ఇట్లు పలికిరి

తా॥ ఈ లోకమునందు మనోవాక్కాయములచే చేసిన పాపములకు యథా విధముగా ప్రాయశ్చిత్తము చేసుకొనవలయును. లేనిచో నిశ్చయముగా నరకములను పొందుదురు. మరణించిన పిదప పొందు ఘోరమైన నరక యాతనల గూర్చి నీకు వివరించి చెప్పినాను. ॥7॥

టీ॥ మనఉక్తిపాణిభిః - మనోవాక్కాయైః - కృతస్యాం హసః పాపస్యస్తైరేవ ఇహైవాపచితిం-ప్రాయశ్చిత్తం న కుర్యాచ్చేత్తర్హి స పురుషః ప్రేత్య - మృత్వా - నరకాన్ధ్రువముపైతి । మే మయా యే భవతః కీర్తితాః తిగ్మా-దారుణా, యాతనా యేషు తాన్. ॥7॥

టీ॥ మనోవాక్కాయముల చేత చేయబడిన పాపములకు ప్రాయశ్చిత్తము చేయబడనిచో ఆ పురుషుడు మరణించి తీక్ష్ణమైన నరక యాతనలను పొంది, పాపశేషము చేత మరల భూమిపై జన్మించునని వివరించనైనది.॥7॥

శ్లో॥ తస్మాత్పురైవాశ్విహ పాపనిష్కృతౌ
యతేత మృత్యోరవిపద్యతాత్మనా ।
దోషస్య దృష్ట్వా గురులాఘవం యథా
భిషక్చికిత్సేత రుజాం నిదానవిత్ ॥ (8)

తా॥ అందుచేత మరణమునకు పూర్వమే, దేహము రోగగ్రస్తము కాక ముందే ఈ జన్మమందే దోషము యొక్క హెచ్చు తగ్గుల పరిశీలించుకొని, ఏ విధముగా రోగముల హెచ్చు తగ్గుల ననుసరించి, వైద్యుడు చికిత్స చేయునో, అట్లు పాపముల హెచ్చు తగ్గులను బట్టి ప్రాయశ్చిత్తములచే పాప నివృత్తికి ప్రయత్నము చేయవలెను. ॥8॥

టీ॥ యస్మాదేవం తస్మాత్పాపస్య ప్రాయశ్చిత్తే యతేత। కదా । మృత్యోః పురైవ । తత్రాపి అవిపద్యతా అక్షీయమాణేనాత్మనా దేహేన । యద్వా అవిపత్ విపత్తిరహితో యావత్ । యతాత్మనా సంయతేన మనసా । తత్రాప్యాశు । అన్యథా "అతీవ చిరకాలే తు ద్విగుణం వ్రతమర్హతి" ఇతి ద్వైగుణ్యాపత్తేః । తత్ర చ పాపస్య మహత్త్వమల్పత్వం చావేక్ష్య తదనురూపే ప్రాయశ్చిత్తే యతేత । రుజాం రోగాణాం నిదానవిత్ యథా వైద్యస్తదనురూపం చికిత్సేత తద్వత్ ॥8॥

టీ॥ అందుచేత మరణమునకు పూర్వమే ఏ పాపమునకు ఆ ప్రాయశ్చిత్తమును చేయవలయును. అవిపత్ అను పదము నాశము లేని లేదా ఇంద్రియ నిగ్రహముగల, మనస్సును సంయమనము చేసుకొన్న అను అర్థమునిచ్చును. అదియును శీఘ్రముగా పాపమును తొలగించుకొనుటకు వ్రతాది ప్రాయశ్చిత్తముల రెండితలుగా చేయ-వలయును. మఱియును పాపము యొక్క అల్పాధిక్యముల ననుసరించి, రోగము యొక్క తీవ్రతర స్వభావము ననుసరించి వైద్యుడు ఏ విధముగా చికిత్స ద్వారా రోగముల నివారింపజేయునో ఆ విధముగా ఏకవార, ద్విగుణిత ప్రాయశ్చిత్తముల నాచరించవలెయును. ॥8॥

రాజోవాచ

శ్లో॥ దృష్ట శ్రుతాభ్యాం యత్పాపం జానన్నప్యాత్మనోఽహితమ్ ।
కరోతి భూయో వివశః ప్రాయశ్చిత్తమథో కథమ్ ॥ (9)

రాజు పలికెను

తా॥ శ్రుతి స్మృతులను (చూచిన దానిని విన్నదానిని) అనుసరించి ఏది పాపమో ఏది తనకు అహితమో తెలియుచున్నవాడైనను స్వాధీనత

లేనివాడై మరల మరల పాపమును చేయు వారికి ప్రాయశ్చిత్తము ఎట్లు? ॥9॥

టీ॥ అత్ర చోదయతి ద్వాభ్యామ్ । దృష్టం రాజదండాది శ్రుతం నరకపాతాది । తాభ్యామాత్మనః పాపమహితం జానన్నపి భూయః ప్రాయశ్చిత్తానంతరం కరోతి । అథో అతః కారణాత్ ద్వాదశాబ్దాది కథం ప్రాయశ్చిత్తం । తేన సమూలస్య దోషస్యానివృత్తేః నివృత్తౌ వా పునశ్చ పాపప్రరోహాయోగాదితి భావః. ॥9॥

టీ॥ రాజ దండాది శిక్షాదులు పాపము యొక్క దృష్టఫలము. నరకాది యాతనలు పాపము యొక్క శ్రుత ఫలము అను రెండింటిచే తనకు గల పాపము అనుభవములో తెలియుచున్నను ప్రాయశ్చిత్త అనంతరము కూడా మరల అహితమైన పాపములనెందుకు చేయుచున్నాడు? అందువలన ద్వాదశాబ్ది ప్రాయశ్చిత్తములచే ప్రయోజనమేమి? వానిచే దోషములు సమూలముగా తొలగింప బడవుకదా! నివృత్తి పొందినను మరల పాపము చేయబడుచునే ఉన్నది అని భావము.॥9॥

శ్లో॥ క్వచిన్నివర్తతేఽభద్రాత్క్వచిచ్చరతి తత్పునః ।
ప్రాయశ్చిత్తమతోఽపార్థం మన్యే కుఞ్జర శౌచవత్ ॥ (10)

తా॥ ఒక్కొక్కప్పుడు పాపకర్మము నుండి తొలగుచున్నాడు. మరల అభద్రతచే మరియొకప్పుడు పాపమును ఆచరించుచున్నాడు. అందు వలన ప్రాయశ్చిత్తము గజస్నానము వలె అర్థము లేనిదని భావించు చున్నాను. ॥10॥

టీ॥ కించ క్వచిత్కదాచిత్ అభద్రాత్పాపాత్ నివర్తతే క్వచిత్తదేవ పునరావృత్త్యా ఆచరతి యథా కుఞ్జరః స్నాతోఽపి రజోభిరాత్మానం మలినీకరోతి తథా పాపస్య పునర్ధుర్నివారత్వేన నరకపాతస్యావశ్యం

టీ॥ (మరియు) ఒకప్పుడు పాపము నుండి నివృత్తుడైనను దానినే మరల మరల చేయుచున్నాడు. ఏనుగు స్నానము చేసినప్పటికిని తన శరీరమును బురద మట్టితో మలినము చేసుకొనును. అదే

భావిత్వాత్ప్రాయశ్చిత్తం వ్యర్థమితి మన్యే ॥10॥

విధముగా పాప నివారణమునకు ప్రాయశ్చిత్తము చేసి కూడా మరల పాపమును చేయుచునేయున్నాడు అందుచేత ప్రాయశ్చిత్తము వ్యర్థము కదా! ॥10॥

శ్రీశుక ఉవాచ

శ్లో॥ కర్మణా కర్మ నిర్హారో న హ్యాత్యన్తిక ఇష్యతే ।
అవిద్వధికారిత్వాత్ప్రాయశ్చిత్తం విమర్శనమ్ ॥ (11)

శ్రీశుకులు పలికిరి

తా॥ అజ్ఞానియే అధికారి (జ్ఞానలోపమువలన) యగుటవలన కర్మలచే సమూలముగా కర్మనాశము అంగీకరింపబడుటలేదు. విమర్శనమే (ఆత్మజ్ఞానమే) ప్రాయశ్చిత్తము.॥11॥

టీ॥ పరిహరతి. కర్మణా- కృచ్ఛ్రాచాన్ద్రాయణాది ప్రాయశ్చిత్తేన కర్మణః పాపస్య నిర్హారో నాశః ఆత్యంతికః. సమూలో నహీష్యతే. అవిద్యానధికారీ యస్మిన్ తస్య భావస్తత్వం తస్మాత్. అతోఽవిద్యాయా నాశా భావాన్నష్టేఽపి తస్మిన్పాపే తత్సంస్కారేణ పాపాన్తరస్య పునః పునః ప్రరోహోభవత్యేవ. కిం తర్హి ముఖ్యం ప్రాయశ్చిత్తం తదాహ. ప్రాయశ్చిత్తం తు విమర్శనం జ్ఞానమ్। ॥11॥

టీ॥ శంకను తొలగించుచున్నాడు. కృచ్ఛ్ర చాంద్రాయణాది ప్రాయశ్చిత్తములచేత పాపము సమూలముగా తొలగిపోదు. అవిద్య కారణముగా కర్మచేసినవాడు పాపము తొలగిపోయినదని భావించు కున్నను పాప సంస్కారముల వలన మరల మరల పాపములు చేయుచునే యుండును. అయినచో ముఖ్య ప్రాయశ్చిత్తము ఏదియో దానిని చెప్పుచున్నాడు. యథార్థమైన ప్రాయశ్చిత్తము విమర్శనమే జ్ఞానమే. ॥11॥

అవ॥ తత్తు నిత్యమప్రమత్తః శనైర్లభతే నాన్య ఇతి సదృష్టాన్తమాహ - నేతి.

అవ॥ న ఇత్యాది శ్లోకమున - అదియును నిత్యము అప్రమత్తుడైన వానికి నెమ్మదిగా లాభించును. కాని వేరు మార్గము లేదు అని దృష్టాంత పూర్వకముగా చెప్పుచున్నాడు.

శ్లో॥ నాశ్నతః పథ్యమేవాన్నం వ్యాధయోऽభిభవంతి హి ।
ఏవం నియమకృద్రాజన్ శనైః క్షేమాయ కల్పతే ॥ (12॥)

తా॥ ఓ రాజా! పథ్యకరమైన (హితకరమైన) అన్నము స్వీకరించు వారికి రోగములు ఏర్పడవు కదా, ఆ విధముగనే నియమములను పాటించు వారు నెమ్మదిగా క్షేమము (ఆత్మజ్ఞానము) కొఱకు సమర్థులగుదురు.॥12॥

టీ॥ పథ్యమేవాన్నమశ్నతః పురుషాన్ యథా వ్యాధయో న బాధన్తే తథా నియమాదికర్తా క్షేమాయ తత్త్వజ్ఞానాయ సమర్థో భవతి ॥12॥

టీ॥ పథ్యముతో కూడిన అన్నమును భుజించు వానిని వ్యాధులు ఎట్లు బాధించవో, ఆరోగ్యమునకు కారణమగునో, అట్లే ప్రాయశ్చిత్తాది కర్మలు ఆత్మజ్ఞానమునకు హేతువులగును.॥12॥

అవ॥ ఏతదేవ విశదయతి ద్వాభ్యామ్.

అవ॥ దీనినే రెండు శ్లోకములలో వివరించుచున్నారు.

శ్లో॥ తపసా బ్రహ్మచర్యేణ శమేన చ దమేన చ ।
త్యాగేన సత్యశౌచాభ్యాం యమేన నియమేన చ ॥ (13)

శ్లో॥ దేహవాగ్బుద్ధిజం ధీరా ధర్మజ్ఞాః శ్రద్ధయాన్వితాః ।
క్షిపన్త్యఘం మహదపి వేణుగుల్మమివానలః ॥ (14)

తా॥ తపస్సు చేతను, బ్రహ్మచర్యము చేతను, శమ, దమములచేతను, త్యాగముచేతను, సత్యశౌచములచేతను, యమ, నియమములచేతను, వివేకవంతులు, ధర్మజ్ఞులు మరియు శ్రద్ధగలవారు దేహము, వాక్కు బుద్ధుల నుండి ఏర్పడు తీవ్ర పాపములను వెదురు పొదలను అగ్ని దహించునట్లు నశింప చేయుదురు.॥13,14॥

టీ॥ తపసా ఐకాగ్ర్యేన.'మనసశ్చేంద్రియాణాం చ ఐకాగ్ర్యం పరమం తపః' ఇతి స్మృతేః . బ్రహ్మచర్యేణాష్టాంగేన. తదుక్తం "స్మరణం కీర్తనం

టీ:- తపస్సు, బ్రహ్మచర్యము అను రెండింటిచేత జ్ఞానార్హుడగుచున్నాడు. మనసశ్చేన్ద్రియాణాం చ ఐకాగ్ర్యం పరమం తపః మనస్సు

కేలిః ప్రేక్షణం గుహ్యాభాషణం. సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియా నిర్వృత్తిరేవ చ. ఏతన్మైథునమష్టాంగం ప్రవదన్తి మనీషిణః. విపరీతం బ్రహ్మచర్యమేతదేవాష్ట లక్షణమ్" ఇతి. శమో మనసో నియమనమ్. దమో బాహ్యేంద్రియాణామ్. త్యాగో దానమ్.యమో ఽహింసాదిః . నియమో జపాదిః. ॥13,14॥

మరియు ఇంద్రియముల యొక్క ఏకాగ్రతను సాధించుటయే తపస్సు అని స్మృతి వాక్యము. స్మరణం, కీర్తనం, కేలి(ఆట),ప్రేక్షణము (దర్శనము), రహస్య సంభాషణము (ఏకాంతము) సంకల్పము, అధ్యవసాయము, ప్రయత్నము (పూనిక, నిశ్చయము) క్రియా నిర్వృత్తి (కార్యనిర్వహణ) అను ఎనిమిదింటిని, అజ్ఞి మైథునము కాగా, దాని అజ్ఞములుగా బుద్ధి మంతులు చెప్పెదరు. ఈ అష్టాజ్ఞ మైథునమునకు విపరీతముగా (వ్యతిరేకముగా) బ్రహ్మచర్యమునకు కూడా శ్లోకమున చెప్పబడిన తపస్సు, శమము, దమము, త్యాగము, సత్యము, శౌచము, యమము, నియమము అను ఎనిమిది లక్షణములు కలవని భావించ-వలయును. మనస్సును నిగ్రహించుట శమము, బాహ్యేంద్రియముల నిగ్రహించుట దమము, దానమే త్యాగము, యమము అహింసాదికము (అహింస, సత్యము, అస్తేయము, అపరిగ్రహము) జపాదులు నియమములు. ॥13,14॥

అవ॥ అస్యాతిదుష్కరత్వాన్ముఖ్య మేవాన్యత్ప్రాయశ్చిత్తమాహ. కేచిదితి అనేనైవం భూతా భక్తిప్రధానా విరళా ఇతి దర్శయతి.

అవ॥ కేచిదితి శ్లోకమున బ్రహ్మచర్యాదులు దుష్కరములగుటచే మరొక ముఖ్య ప్రాయశ్చిత్తము చెప్పబడుచున్నది. మరొకటియైన భక్తి ప్రధాన మార్గమందు కొందఱు మత్రమే ఉందురని చెప్పబడుచున్నది.

శ్లో॥ కేచిత్కేవలయా భక్త్యా వాసుదేవ పరాయణః ।
అఘం ధున్వన్తి కార్త్స్యేన నీహారమివ భాస్కరః ॥ (15)

తా॥ వాసుదేవుణ్ణే ఆశ్రయించిన కొందఱు కేవలమైన భక్తిచేత, సూర్యుడు పొగమంచును తొలగించినట్లు, పాపమును తొలగించు - కొనెదరు. ॥15॥

టీ॥ కేవలయా -తప ఆది నిరపేక్షయా వాసుదేవ పరాయణా ఇతి నాధికారివిశేషణమేతత్ కిన్త్వన్యేషాం, శ్రద్ధయా తత్రాప్రవృత్తేరర్థాత్తేష్వేవ పర్యవసానాదనువాద మాత్రమ్. ॥15॥

టీ॥ అయితే తపస్సు మొదలగు చర్యల యందు అపేక్షలేని కేవల భక్తులైనవారికి వాసుదేవ పరాయణులైనవారికి, మాత్రమే అధికార విశేషణము కాదు. ఇతరులకు భక్తియందు ప్రవృత్తిలేని కారణమున ప్రాయశ్చిత్తము చెప్పబడుచున్నది. ॥15॥

శ్లో॥ న తథా హ్యఘవాన్ రాజన్పూయేత తప ఆదిభిః ।
యథా కృష్ణార్పిత ప్రాణస్తత్పూరుష నిషేవయా ॥ (16)

తా॥ ఓ రాజా! పాపి, కృష్ణప్రేమ లేక జీవింపలేనివారు ప్రాణములను (ఇంద్రియములను, దేహమును) అర్పించి (కృష్ణార్పణ బుద్ధితో) ఆయన భక్తులను సేవించుటచే పవిత్రులగునంతగా తపస్సు మున్నగు వానిచే పవిత్రుడు కాజాలడు. ॥16॥

టీ॥ ఏతచ్చ జ్ఞానమార్గాదపి శ్రేష్ఠమిత్యాహ. న తథా పూయేత శుద్ధ్యేత్. తత్పూరుష నిషేవయా కృష్ణేஉర్పితాః ప్రాణా యేన కృష్ణేర్పిత ప్రాణాః ॥16॥

టీ॥ మరియు ఈ భక్తి మార్గము జ్ఞాన మార్గముకన్న శ్రేష్ఠమని చెప్పబడుచున్నది. ఏ విధముగా కృష్ణార్పిత ప్రాణులైన వారికి, ఆ పురుషుని (కృష్ణ) సేవచే మనస్సు శుద్ధమగునో, అట్లు ప్రాయశ్చిత్తాదుల వల్ల కాజాలదు. కృష్ణుని యందు ప్రాణములు అర్పించిన వారు కృష్ణార్పిత ప్రాణులు. ॥16॥

శ్లో॥ సధ్రీచీనో హ్యయం లోకే పన్థాః క్షేమో౽కుతోభయః ।
సుశీలాః సాధవో యత్ర నారాయణ పరాయణాః ॥17॥

తా॥ ఈ లోకమందు సచ్ఛీలముగల సత్పురుషులు నారాయణ పరాయణులైనవారు. వారు అనుసరించు భక్తిమార్గము సముచితమైనది. క్షేమకరమైనది. భయములేనిది. 17

టీ॥ తత్ర హేతుః. సధ్రీచీనః సమీచీనః. అయంపన్థా భక్తిమార్గః . యతః క్షేమః. క్షేమత్వే హేతుః – నకుతశ్చిద్విఘ్నాదేర్భయం యస్మిన్. తదేవాహ – సుశీలాః కృపాలవః. సాధవో నిష్కామాః. యత యస్మిన్మార్గే ధర్మనిష్ఠాః. అతో న జ్ఞానమార్గ ఇవాసహాయతా నిమిత్తం భయం నాపి కర్మమార్గమన్మత్సరాదియుక్తేభ్యో భయమితి భావః. ॥17॥

టీ॥ దానికి హేతువు. దీని యందు ఏ విధమైన విఘ్నాది భయములు లేవు. కావున జ్ఞానమార్గము కన్న భక్తిమార్గము శ్రేష్ఠమైనది అని చెప్పుచున్నాడు. కృపాలులైన వారలు, నిష్కామ సాధకులు, ధర్మనిష్ఠులు గల భక్తిమార్గమందు జ్ఞానమార్గము వలె అసహాయతా నిమిత్తమైన భయము, కర్మమార్గము నందువలె మత్సరాది యుక్తములైన భయమును లేవు అని భావము. ॥ 17

అవ॥ భక్తేరన్యనిరపేక్షత్వముక్తం, కృచ్ఛ్రాదీని తు భక్తిం వినా న శోధయన్తీత్యాహ ప్రాయశ్చిత్తానీతి.

అవ॥ భక్తి కాకుండా అన్యమైనది నిరపేక్షమని చెప్పి కృచ్ఛ్రచాంద్రాయణాది ప్రాయశ్చిత్త కర్మలు కూడ భక్తి లేకుండగా మనస్సును శుద్ధమొనర్పవని చెప్పబడుచున్నది.

శ్లో॥ ప్రాయశ్చిత్తాని చీర్ణాని నారాయణ పరాఙ్ముఖమ్ ।
న నిష్పునన్తి రాజేంద్ర సురాకుంభమివాపగాః ॥ (18)

తా:- ఓ రాజేంద్రా! నదులు కల్లు కుండను పవిత్రమొనర్చలేనట్లు నారాయణుని యందు భక్తిలేని వారు (నారాయణ పరాఙ్ముఖులు) అనుష్ఠించు ప్రాయశ్చిత్తములు వారిని పవిత్రము చేయలేవు. (భక్తికి కర్మాపేక్ష అనావశ్యకము కాని, కర్మలకు భక్త్యపేక్ష ఆవశ్యకము అని భావము) ॥18॥

టీ॥ మహతామప్యశోధకత్వే దృష్టాంతమాహ- సురాకుమ్భమాపగా నద్య ఇవేతి. ॥18॥

టీ:- నదీ జలములు సురాకుంభమును వలె, భక్తిలేని మహత్తరమైన ప్రాయశ్చిత్తకర్మలు మనస్సును శుద్ధ మొనర్పవని దృష్టాంతముగా చెప్పబడుచున్నది. ॥18॥

అవ ॥ భక్తిః స్వల్పాపి పునాత్యేవేత్యాహ- సకృదితి.

అవ॥ సకృదిత్యాది శ్లోకమున కొద్దిపాటి భక్తియైనను పవిత్రమొనరించునని చెప్పబడుచున్నది.

శ్లో॥ సకృన్మనః కృష్ణ పదారవిందయో
ర్నివేశితం తద్గుణరాగి యైరిహ ।
న తే యమం పాశభృతశ్చ తద్భటాన్
స్వప్నేఽపి పశ్యంతి హి చీర్ణనిష్కృతాః ॥19॥

తా॥ ఈ లోకమందు ఎవరైతే శ్రీకృష్ణ చరణారవిందముల యందు ఒకసారి మనస్సును లగ్నమును చేసి, ఆయన గుణముల యందు అనురాగము గలిగి యుందురో అట్టివారు ప్రాయశ్చిత్తములన్నీ పొందినట్లే, వారు స్వప్నములో కూడా యమునిగాని, పాశమును ధరించిన ఆయన భటులనుగాని చూసే అవకాశము లేదు. 19

టీ ॥ తస్య గుణేషు రాగమాత్రమస్తి న తు జ్ఞానం యస్య తన్మనః। తావతైవ చీర్ణం నిష్కృతం ప్రాయశ్చిత్తం యైః. ॥19॥

టీ॥ జ్ఞానరహితమైనను ఒకసారి పరమాత్మ గుణముల యందు రాగ మాత్రమైన మనస్సును, ఆమేరకు ప్రాయశ్చిత్తములు పవిత్ర మొనరించును. 19

అవ॥ ఇమమర్థమితిహాసేనోపపాదయతి - అత్ర చేతి.

అవ॥ అత్ర చేత్యాది శ్లోకములలో ఈ విషయమై పురాతన ఇతిహాసము చెప్పబడుచున్నది.

శ్లో॥ అత్ర చోదాహరన్తీమమితిహాసం పురాతనమ్ ।
దూతానాం విష్ణుయమయోః సంవాదస్తం నిబోధ మే ॥ (20)

తా॥ ఈ సందర్భమున ప్రాచీనమైన ఇతిహాసమును పెద్దలు చెప్పుదురు. విష్ణుదూతలకును, యమదూతలకును మధ్య సంవాదము అగు దానిని నేను చెప్పెదను. 20

టీ॥ మే - మత్తః. 20

టీ॥ నా నుండి. 20

శ్లో॥ కన్యా కుబ్జే ద్విజః కశ్చిద్దాసీపతిరజామిలః ।
నామ్నా నష్ట సదాచారో దాస్యాః సంసర్గ దూషితః ॥ (21)

తా॥ కన్యాకుబ్జ నగరమునందు దాసికి భర్తయైన అజామిలుడను పేరు గల ఒకానొక బ్రాహ్మణుడుండెను. దాసిదాని యొక్క కలయికచే తన సదాచారమును, (సచ్ఛీలమును) కోల్పోయెను. 21

టీ॥ కన్యా కుబ్జే పురే - దాస్యాః పతిః నామ్నా అజామిలః. ॥21॥

టీ॥ కన్యాకుబ్జమనే నగరమందు అజామిలుడనే పేరుగల, దాసి యొక్క పతిగలడు. ॥21॥

శ్లో॥ బన్ధక్షకైతవై శ్చౌర్యైర్గర్హితాం వృత్తిమాస్థితః ।
బిభ్రత్కుటుంబ మశుచిర్యాతయామాస దేహినః ॥ (22)

తా॥ ఆతడు బంధించి ధనము గైకొనుట, దొంగతనము, ద్యూతము, మోసము మున్నగు నిందించదగిన వృత్తులనాశ్రయించి, అశుచియై కుటుంబమును పోషించుకొనుచు ప్రాణులను పీడించుచుండెడివాడు. (22)

టీ॥ బన్ధీ గ్రహేణ అక్షైశ్చ దూత్యేన కైతవైర్వంచనాదిభిశ్చ వృత్తిం జీవికామ్ బిభ్రత్ పుష్ణన్ యాతయామాస పీడయామాస. ॥22॥

టీ॥ ధనాశచేత ధనికులు మొదలగు వారిని బంధించి వారి ధనమును పొంది, జూదములచేత, వంచనచేత, జీవులను పీడించుచూ, దాసి యొక్క కుటుంబ పోషణము చేయుచుండెడివాడు. ॥22॥

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ ఏవం నివసతస్తస్య లాలయానస్య తత్సుతాన్ ।
కాలోऽత్యగాన్మహాన్ రాజన్నష్టాశీత్యాయుషః సమాః॥ (23)

తా॥ ఓ మహారాజా! ఈ విధముగా అతడు ఆ దాసీ పుత్రులను లాలించుచూ నివసించుచుండగా ఎనుబదిఎనిమిది సంవత్సరముల గొప్ప ఆయుర్దాయము (పెద్దకాలము) గడచిపోయెను. 23

టీ॥ ఆయుషః సంబన్ధీ మహాన్ కాలోత్యగాత్ స కియా నిత్యపేక్షయా మాహ అష్టాశీత్యా సంఖ్యయా యుక్తాః సమాః సంవత్సరాః. ॥23॥

టీ॥ దాసి పుత్రుల లాలించుచూ, పోషించుచూ, మహాకాలము గడిపి ఎనుబది ఎనిమిది సంవత్సరముల వయస్సును పొందెను. ॥23॥

శ్లో॥ తస్యః ప్రవయసః పుత్రా దశ తేషాం తు యోऽవమః ।
బాలో నారాయణో నామ్నా పిత్రోశ్చ దయితో భృశమ్ ॥ (24)

తా॥ వయస్సు మళ్ళిన అతనికి పదిమంది పుత్రులు. వారిలో అందరి కన్న పిన్నవాడు “నారాయణ” అనుపేరుగల బాలుడు. ఈ బాలుడు అతనికి మిక్కిలి ప్రీతి పాత్రుడు. 24

టీ॥ ప్రవయసో వృద్దస్య. ॥24॥

టీ॥ వృద్ధుని యొక్క. ॥24॥

శ్లో॥ స బద్ధహృదయస్తస్మిన్నర్భకే కలభాషిణి ।
నిరీక్షమాణస్తల్లీలాం ముముదే జరఠో భృశమ్ ॥ (25)

తా॥ ముద్దులొలుకు పలుకులుగల ఆ పిల్లవాని యందు బద్ధ హృదయుడై వాని ఆటలను చూచుచూ ఆ ముదుసలి మిక్కిలి ఆనందించు చుండెను. 25

టీ॥ బద్ధం హృదయం యేన బద్ధహృదయః జరఠః వృద్ధః. ॥25॥

టీ॥ ఎవరి హృదయము బద్ధమైయున్నదో వాడు బద్ధ హృదయుడు. వృద్ధుడు. ॥25॥

శ్లో॥ భుఞ్జానః ప్రపిబన్ఖాదన్బాలక స్నేహ యంత్రితః ।
భోజయన్పాయయన్మూఢో నవేదాగతమన్తకమ్ ॥ (26)

తా॥ పిల్లవాని యందలి ప్రేమచే నియంత్రింపబడినవాడై తినుచూ, తినిపించుచూ, త్రాగుచూ, త్రాగించుచూ వ్యామోహితుడై వచ్చి పడిన మృత్యువును తెలియకుండెను.॥26॥

శ్లో॥ స ఏవం వర్తమానోఽజ్ఞో మృత్యుకాల ఉపస్థితే ।
మతిం చకార తనయే బాలే నారాయణాహ్వయే ॥ (27)

తా॥ ఈ విధముగా కాలము గడుపుచున్న ఆ అజ్ఞాని మరణము సంప్రాప్తించగా, తన కొడుకు, బాలుడగు నారాయణుడను పేరుగల వాని పైననే మనస్సును నిలిపెను. ॥27॥

టీ॥ ఏతచ్చ తదుపలాలనాది శ్రీనారాయణనామోచ్చారణమాహాత్మ్యేన తద్భక్తిరేవాభూదితి సిద్ధాన్తోపయోగిత్వేనాపి ద్రష్టవ్యమ్. ॥26,27॥

టీ॥ వాడి తోడిదే లోకముగా పిల్లవాని లాలనాదుల కారణముగా నైనను 'నారాయణ'నామోచ్చారణ మాహాత్మ్యమున (భక్తి కలుషిత మయినను) భక్తుడు అయ్యెనను అంశము గమనింపదగినది. ॥26,27॥

శ్లో॥ స పాశ హస్తాం స్త్రీన్దృష్ట్వా పురుషాన్భృశదారుణాన్ ।
వక్రతుణ్డానూర్ధ్వరోమ్ణ ఆత్మానం నేతు మాగతాన్ ॥ (28)

తా॥ చేతుల యందు పాశములు ధరించి, వంకర నోళ్ళు కలిగి నట్టియు, నిక్కబొడుచుకొన్న రోమములుగల వారును, తనను కొని పోవుటకు వచ్చిన మిక్కిలి భయమును గొల్పు ముగ్గురు పురుషులను చూచి.. 28

టీ॥ వక్రాణి తుండాని ముఖాని యేషామ్–వక్రతుండాః ఊర్ధ్వాణి రోమాణి యేషాం తాన్– ఊర్ధ్వరోమ్ణః. ॥28॥

టీ॥ వంకర మూతులు ఎవరికి గలవో వారు వక్రతుండులు. నిక్క బొడుచుకొన్న వెంట్రుకలు ఎవరికి గలవోవారు ఊర్ధ్వరోమ్ణులు ॥28॥

శ్లో॥ దూరే క్రీడనకాసక్తం పుత్రం నారాయణాహ్వయమ్ ।
ప్లావితేన సస్వరేణోచ్చై రాజుహావాకులేంద్రియః ॥ (29)

తా॥ అతడు వ్యాకులమైన ఇంద్రియములుగలవాడై దూరముగా నున్న ఆట వస్తువులయందు ఆసక్తి కలిగియున్న నారాయణయను పేరుగల తన కొడుకును దీర్ఘమైన స్వరముతో బిగ్గరగా నారాయణా అని పిలిచెను. (29)

టీ॥ ప్లావితేన ప్లుతత్త్వం నీతేన. ॥29॥

టీ॥ సుధీర్ఘస్వరముతో – మూడు మాత్రలుగల స్వరముతో ॥29॥

శ్లో॥ నిశమ్య మ్రియమాణస్య బ్రువతో హరికీర్తనమ్ ।
భర్తుర్నామ మహారాజ పార్షదాః సహసాఽపతన్ ॥ (30)

తా॥ ఓ మహారాజా!మరణించుచున్నవాడై, ప్రభువగు హరి పేరును పలుకుచుండగా విని, వెంటనే హరి పార్షదులు వచ్చి పడిరి. (క్రిందికి దిగిరి) 30

శ్లో॥ వికర్షతోఽన్తర్హృదయాద్దాసీపతిమజామిలమ్ ।
యమప్రేష్యాన్విష్ణుదూతా వారయామాసు రోజసా ॥ (31)

తా॥ దాసీపతియైన అజామిలుని హృదయాంతరము నుండి ప్రాణములను (జీవుని) లాగివేయుచున్న యమ కింకరులను విష్ణు దూతలు (బలముతో) నివారించిరి. ॥31॥

టీ॥ హరికీర్తనం నిశమ్యమాపతన్ యతస్తద్భర్తృనామ.॥30,31॥

టీ॥ తమ ప్రభువైన హరికీర్తనమును వినినంతనే క్రిందికి వచ్చిరి. ॥30,31॥

శ్లో॥ ఊచుర్నిషేధితాస్తాంస్తే వైవస్వత పురః సరాః ।
కే యూయం ప్రతిషేద్ధారో ధర్మరాజస్య శాసనమ్ ॥ (32)

తా॥ అడ్డగింపబడిన యమదూతలు (యమ) ధర్మరాజు యొక్క శాసనమును అడ్డగించుటకుమీరెవరు? అని వారిని ప్రశ్నించిరి. 32

టీ॥ పురః సరా భృత్యాః. ॥32॥

టీ॥ భృత్యులు(సేవకులు) ॥32॥

శ్లో॥ కస్య వా కుత ఆయాతాః కస్మాదస్య నిషేధథ ।
కిందేవా ఉపదేవా వా యూయం కిం సిద్ధసత్తమాః ॥ (33)

తా॥ మీరు ఎవరి అనుచరులు? ఎక్కడి నుండి వచ్చితిరి? వీనిని కొనిపోవుచుండగా ఎందుకు నిషేధించుచున్నారు? మీరు దేవతలా? ఉప దేవతలా? సిద్ధ పురుషులా? ॥33॥

టీ॥ అస్య నయనం నిషేధథ. ॥33॥

టీ॥ వీనిని తీసుకొని పోవుటను నిషేధించుచున్నారు. 33

అవ॥ వయం యుష్మాన్నజానీమ ఇతి న కోపః కార్యో యతోఽలౌకికా ద్భుతరూపా యూయమిత్యాహుః సర్వ ఇత్యాది త్రిభిః.

అవ॥ సర్వ ఇత్యాది మూడు శ్లోకములలో, అలౌకికమైన అద్భుత రూపములు కలిగియున్న మీరు ఎవరో మాకు తెలియదు. అందుచేత కోపగించుకోవద్దు అని చెప్పుచున్నారు.

శ్లో॥ సర్వే పద్మపలాశాక్షాః పీతకౌశేయవాససః ।
కిరీటినః కుండలినో లసత్పుష్కర మాలినః ॥ (34)

తా॥ మీరందరు పద్మదళముల వంటి కన్నులు కలిగి, పీతాంబర ధారులై, కిరీటములతో, కుండలములతో, పద్మముల హారములతో శోభిల్లు చున్నారు. 34

టీ॥ లసన్త్యః పుష్కర మాలాః సన్త్యేషాం పుష్కర మాలినః. ॥34॥

టీ॥ ఎవరి యందు (మెడలో) పద్మముల మాలలు వ్రేలాడుచున్నవో వారు వారు పుష్కరమాలినః- పుష్కరమాలులు. ॥34॥

శ్లో॥ సర్వే చ నూత్నవయసః సర్వే చారుచతుర్భుజాః ।
ధనుర్నిషంగాసి గదా శంఖ చక్రాంబుజ శ్రియః ॥ (35)

తా॥ మీరందరు పిన్న వయసులో నుండి (యవ్వన మందుండి) చతుర్భుజములు గలవారై ధనుస్సు, అమ్ములపొది, కత్తి, గద, శంఖము, చక్రము మరియు పద్మములతో శోభిల్లుచున్నారు. ॥35॥

టీ॥ నూత్నం నవం వయో యేషాం నూత్న వయసః. నిషంగ ఇషుధిః ధనుర్నిశంగాదిభిః శ్రీః శోభా యేషాం తే ॥35॥

టీ॥ పిన్న వయసుగల వారు ఎవరో వారు నూత్న వయస్కులు (యవ్వనవంతులు) ధనుస్సు మున్నగు వానిచే ప్రకాశించు వారలు ఎవరో వారు. ॥35॥

శ్లో॥ దిశో వితిమిరాలోకాః కుర్వన్తః స్వేన రోచిషా ।
కిమర్థం ధర్మపాలస్య కింకరాన్నో నిషేధథ ॥ (36)

తా॥ మీ కాంతితో దిక్కులలోని చీకటిని తొలగించి లోకములను ప్రకాశింపజేయుచున్న మీరు ఎందుచేత ధర్మపాలుని (యమధర్మరాజు) కింకరులమగు మమ్ము నిషేధించుచున్నారు? 36

టీ॥ విగతం తిమిరమాలోకశ్చాన్యస్య ప్రకాశో యాసు తథా భూతా దిశః కుర్వన్తః. భవతామేతదనుచితమిత్యాహుః కిమర్థమితి ॥36॥

టీ॥ ఎవరి ప్రకాశము అంధకార లోకములను, అట్లే దిక్కులను ప్రకాశింపచేయుచున్నదో అట్టి మీకు ఇది అనుచితమని చెప్పబడు చున్నది. అనగా యమధర్మరాజు యొక్క కింకరులను నిషేధించుట. 36

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఇత్యుక్తే యమదూతైస్తైర్వాసే దేవోక్త కారిణః ।
తాన్ ప్రత్యూచుః ప్రహస్యేదం మేఘనిర్హ్రాదయా గిరా ॥ (37)

శ్రీశుకులవలికిరి

తా॥ ఈ విధముగా యమదూతలచే ప్రశ్నింపబడినవారై వాసుదేవ కింకరులు నవ్వి వారినుద్దేశించి మేఘ గంభీర వాక్కులచే ఇట్లు బదులు పలికిరి. 37

టీ॥ అహో దణ్డ్యాదణ్డ్యది జ్ఞాన శూన్యా ఏతే చోరా ఏవాస్మద్భియా ధర్మరాజస్య కింకరా ఇత్యనృతం వదంతీతి విస్మయేన ప్రహస్య తాన్ప్రత్యూచుః. మేఘస్యేవానిర్హ్రాదో ధ్వనిర్యస్యాస్తయా. ॥37॥

టీ॥ అయ్యో! దండింపదగినది, దండింపదగదనే జ్ఞానశూన్యులైన వీరు చోరులవలె, యమధర్మరాజ కింకరులమని అసత్య భాషణము చేయుచున్నారని, ఆశ్చర్యముతో వారిని పరిహసిస్తూ – మేఘమువలె గంభీరమైన ధ్వనిగల వారలెవరో వారు మేఘనిర్హ్రాదయులు. ॥37॥

విష్ణుదూతా ఊచుః

శ్లో॥ యూయం వై ధర్మరాజస్య యది నిర్దేశకారిణః ।
బ్రూతధర్మస్య నస్తత్వం యస్య ధర్మస్య లక్షణమ్ ॥ (38)

విష్ణుదూతలు పలికిరి

తా॥ మీరు నిశ్చయముగా యమధర్మరాజు యొక్క ఆజ్ఞలను పాలించు వారైనచో మాకు ధర్మము యొక్క రహస్యమేద్దియో, ధర్మము యొక్క ప్రమాణ స్వరూపమేమియో వానిని చెప్పుడు. 38

టీ॥ తత్త్వం – స్వరూపం; లక్షణం ప్రమాణం. 38

టీ॥ తత్త్వమనగా స్వరూపము, లక్షణమనగా ప్రమాణము.॥38॥

శ్లో॥ కథం స్విద్ధ్రియతే దణ్డః కిం వాస్య స్థానమీప్సితమ్ ।
దణ్డ్యాః కింకారిణః సర్వే అహో స్విక్తచిన్నృణామ్ ॥ (39)

తా॥ శిక్ష విధించు విధానమెట్టిది? ఈ శిక్షకు అర్హమైన స్థానము ఏది? మానవులలో కర్మలు చేయువారందరూ శిక్షలకు అర్హులా? లేనిచో కొందరేనా? 39

టీ॥ కథంస్విక్తేన ప్రకారేణ స్థానం విషయః కారిణం కర్మిణః నృణామితి నరా ఏవ న పశ్వాదయః తేష్వపి కతిచిదేవేత్యర్థః.॥39॥

టీ॥ ఏ ప్రకారముగా, ఏ విషయ కారణముగా, కర్మపరులగు మనుష్యుల విషయంలో దండనాదులను విధించెదరు. నృణామనగా మానవులు మాత్రమే పశ్వాదులు కావు. వారి యందును కొందరికి మాత్రమే అని అర్థము. 39

యమదూతా ఊచుః

శ్లో॥ వేద ప్రణిహితో ధర్మో హ్యధర్మస్తద్విపర్యయః ।
వేదో నారాయణః సాక్షాత్స్వయం భూరితి శుశ్రుమ ॥ (40)

టీ॥ వేదేన ప్రణిహితో విహితో ధర్మః వేద ప్రమాణక ఇత్యర్థః. అనేన యో వేదప్రమాణకః స ధర్మో యో ధర్మః స వేద ప్రమాణక ఇతి స్వరూపం ప్రమాణం చోక్తమ్ యథాహ జైమినిః "చోదనాలక్షణోఽర్థో ధర్మః" ఇతి. వ్యాఖ్యాతం చ భట్టపాదైః."ద్వయమేకేన సూత్రేణ శ్రుత్యర్థాభ్యాం నిరూప్యతే " ఇతి. అపృష్టస్యాప్య ధర్మస్య స్వరూపం లక్షణం చ దణ్డస్థాన కథనాయాహుః. తద్విపర్యయో యోవేద నిషిద్ధః సోఽధర్మః. నిషేధశ్చ తస్మిన్ప్రమాణ మిత్యర్థః. వేదస్య ప్రామాణ్యే హేతుః వేదో నారాయణాదుద్భూతః స ఏవ సాక్షాదిత్యుపచారః స్వయం భూరితి చ నిఃశ్వాస మాత్రేణ స్వయమేవ భవతీతి తథా చ శ్రుతిః "అస్య మహతో భూతస్య నిః శ్వాసితమేతద్యదృగ్వేదః" ఇతి. ॥40॥

యమదూతలు పలికిరి

తా॥ వేదముచే విధింపబడినది ధర్మము. దానికి విరుద్ధమైనది అధర్మము గదా! వేదము స్వయం సిద్ధమనియు, వేదము సాక్షాత్తుగా నారాయణ స్వరూపమనియు విని యుంటిమి. 40

టీ॥ వేదముచేత చెప్పబడినదే విహిత ధర్మము. అనగా వేద ప్రమాణము అయినది ఏదియో అదియే ధర్మము. జైమిని మహర్షి 'చోదనాలక్ష ణోర్థోఽధర్మః' చోదనయే లక్షణముగా గల అర్థము. ధర్మము అని చెప్పెను. భట్టిపాదులు కూడ స్వరూప, ప్రమాణముల చేత "ద్వయం ఏకేన సూత్రేణ శ్రుత్యర్థాభ్యాం నిరూప్యతే" అని ఒకే సూత్రముచేత శ్రుత్యర్థములను నిరూపించుచు, అపరాధిని, దండ స్థానమును చెప్పుచు ఏది వేద నిషిద్ధమో అది అధర్మము అని చెప్పెను. నిషేధమునకు కూడ వేదమే ప్రమాణము అని అర్థము. వేద ప్రమాణమునకు హేతువు - వేదము నారాయణుని నుండి ఉద్భవించినది. అదియే ఆచరింపదగినది. ఆ నారాయణుని నిఃశ్వాసము చేత స్వయముగా ఆవిర్భవించినది. దీనికి "అస్య మహతో భూతస్య నిఃశ్వాసితమేతద్యదృగ్వేదః-ఈ మహాభూతము (నారాయణుని) యొక్క నిఃశ్వాసమే వేదమని ఋగ్వేదము.- అని శ్రుతి ప్రమాణము. (కర్మవిశేషణమునకు, కర్మవిశేషణము యొక్క నిషిద్ధమునకు కూడ వేదమే ప్రమాణము అని భావము. ॥40॥

శ్లో॥ యేన స్వధామ్న్యమీభావా రజః సత్త్వతమోమయాః ।
గుణ నామక్రియారూపై ర్విభవ్యన్తే యథా తథమ్ ॥ (41)

తా॥ ఎవని చేత తన స్వరూపమునందు ఈ సత్వ రజస్తమో గుణ మయమైన ప్రాణులు యోగ్యతలననుసరించి నామ రూప గుణములతో భావింపబడుచున్నవో. 41

టీ॥ కోఽసౌ నారాయణస్తత్రాహుః. యేన స్వధామ్ని స్వస్వరూపే. అమీభావాః ప్రాణినః. గుణాః శాన్తద్వాదయః. నామాని బ్రాహ్మణ ఇత్యాదీని. క్రియాశ్చాధ్యయనాద్యాః. రూపాణి వర్ణాశ్రమాదయస్తైర్వి భావ్యన్తే వివిచ్యన్తే. యథా తథం యథావత్. స నారాయణః. ॥41॥

టీ॥ నారాయణుడు ఎవరో చెప్పుచున్నాడు. ఎవని యొక్క స్వరూప మందు ప్రాణుల యొక్క స్వస్వరూపములతో, శాంత్యాది గుణములు, బ్రాహ్మణాది నామములు, అధ్యయనాది కర్మలు, వర్ణాశ్రమాది రూపములు ప్రకటింపబడుచున్నవో వాడు నారాయణుడు. ॥41॥

అవ॥ తథాప్యధర్మోఽనేన కృత ఇతి కుతో జ్ఞాయతే తత్రాహుః- సూర్య ఇతి.

అవ॥ 'సూర్య' ఇత్యాది శ్లోకమున ఇతని చేత అధర్మము చేయబడినది. అనుటకు సాక్ష్యము చెప్పబడుచున్నది.

శ్లో॥ సూర్యోఽగ్నిః ఖం మరుద్గావః సోమః సన్ధ్యాహనీ దిశః ।
కం కుః కాలో ధర్మ ఇతి హ్యేతే దైహ్యస్య సాక్షిణః ॥ (42)

తా॥ సూర్యుడు, అగ్ని. ఆకాశము, వాయువు, ఇన్ద్రియములు, చన్ద్రుడు, సన్ధ్య, పగలు. దిక్కులు, నీరు, భూమి, కాలము, ధర్మము అనునవి జీవుని కర్మలకు సాక్షులు. 42

టీ॥ అహనీ అహశ్చ రాత్రిశ్చ। కమ్ ఉదకమ్. కుః పృథ్వీ. దైహ్యస్య జీవస్య। యథాహుః "ఆదిత్యచంద్రవనిలోఽనలశ్చద్యౌర్భూమిరాపో హృదయం యమశ్చ. అహశ్చ రాత్రిశ్చ ఉభే చ సన్ధ్యే ధర్మశ్చ జానాతి

టీ ॥ అహనీ అనగా పగలును, రాత్రియును, కం ఉదకము, కుః అనగా పృథ్వీ (భూమి), దైహ్యస్య అనగా జీవుని యొక్క "ఆదిత్య... నరస్య వృత్తమ్ అను ప్రమాణ శ్లోకముననుసరించి సూర్యుడు,

నరస్య వృత్తమ్". ॥42॥

చంద్రుడు, భూమి, అగ్ని, వాయువు, ఆకాశము,నీరు, తాను(ఆత్మ) యముడు, పగలు,రాత్రి, ఉభయ సన్ధ్యలు ధర్మము అనునవి నరుని యొక్క వృత్తములకు (కర్మలకు) సాక్షులు. ॥42॥

శ్లో॥ ఏతైరధర్మో విజ్ఞాతః స్థానం దణ్డస్య యుజ్యతే ।
సర్వే కర్మానురోధేన దణ్డమర్హన్తి కారిణః ॥ (43)

తా॥ వీనిచే తెలియబడు అధర్మమునకు దండనము ఎచట విధించబడు చున్నదో చెప్పబడుచున్నది. కర్మలను చేయువారందరు వారి వారి కర్మానుసారము దండనమునకు అర్హులే. 43

టీ॥ స్థానమాహుః ఏతైర్నిమిత్త భూతైర్విజ్ఞాతః. దణ్డ్యానాహుః- సర్వ ఇతి. ॥43॥

టీ॥ ఈ నిమిత్తముల చేత అధర్మము తెలియును. (కర్మలయొక్క మంచి చెడ్డలననుసరించి చెడ్డకర్మలు చేసినవారు దండణార్హులు) "సర్వ ఇత్యాది పాదమున దండ్యులను చెప్పుచున్నాడు. ॥43॥

శ్లో॥ సంభవన్తి హి భద్రాణి విపరీతాని చానఘాః ।
కారిణాం గుణసఙ్గోఽస్తి దేహవాన్నహ్య కర్మకృత్ ॥ (44)

తా॥ ఓ పాపరహితులారా! కర్మలను చేయువారలకు మేలు, కీడులు సంభవించుచున్నవి. గుణములతో సంగమముగల దేహాభిమానము గల వారలు కర్మలు చేయకుండ ఉండలేరు. 44

టీ॥ విపరీత్యాన్యభద్రాణ్యపి కర్మిణాం సంభవన్తి యతస్తేషాం గుణ సఙ్గోస్తి. యది కశ్చిదకర్తా స్యాత్తర్హి తస్యాభద్రాణి న స్యుః, న త్వేతదస్తీత్యాహుః. న హి దేహవానకర్మ కృదస్తీతి। అతః సర్వే కర్మిణః

టీ॥ శుభాశుభకర్మలనందరు చేయుదురు. గుణసంగము చేత దేహము పొందినవాడు కర్మలు చేయకుండుండలేడు. ఒకవేళ అకర్త అయినచో కర్మఫల ముండదు. కాని అకర్తగా ఉండుట అసంభవము.

కర్మిణాం చ పాప స్యావశ్యంభావిత్వాత్తే సర్వే దణ్డమర్హన్తీత్యర్థః ॥44

అనగా దేహము పొందిన వాడు కర్మచేయకుండా ఉండలేరు. శుభ కర్మల యందు కూడ పాప స్పర్శ యుండుటచే అందరును పాపకర్మల యొక్క ఫలములను అనుభవించవలసినదే. అందుచేత దండనార్హులే. ॥44॥

అవ॥ కథం స్విద్ధ్రియతే దణ్డ ఇత్యస్యోత్తరమ్– యేనేతి.

అవ॥ యేన ఇత్యాది శ్లోకమున దండన ఏ విధముగా పొందుదురు? అను ప్రశ్నకు సమాధానము చెప్పబడుచున్నది.

శ్లో॥ యేన యావాన్యథాధర్మోహ్యధర్మో వా సమీహితః ।
స ఏవ తత్ఫలం భుఙ్క్తే తథా తావదముత్ర వై ॥ (45)

తా॥ ఈ లోకమందు ఎవనిచే ధర్మముగాని, అధర్మముగాని ఏ విధముగా ఎంత మేరకు చేయబడినదో అతడు దాని ఫలమును అదే విధముగా అంతమేరకు నిశ్చయముగా అనుభవించియేతీరును. 45

టీ॥ ధర్మో వేతి దృష్టాన్తః. అధర్మానుసారేణ దణ్డో ధర్మానుసారేణ సుఖవదిత్యర్థః. 45

టీ॥ ధర్మ కర్మముల ననుసరించి సుఖములను; అధర్మ కర్మముల ననుసరించి దుఃఖమును 'ఈ జన్మమునందుగాని పరజన్మము నందు గాని అనుభవించెదరు.॥45॥

అవ॥ న కేవలం సూర్యాదయ ఏవ ధర్మాధర్మ జ్ఞాపకాః కింత్వర్థాపత్తి రపీత్యాహుః – యథేతి.

అవ॥ యథేతి శ్లోకమున ధర్మాధర్మజ్ఞాపకులైన సూర్యాదులేకాక ధర్మాధర్మ జ్ఞాపకమునకు అర్థాపత్తి కూడ ప్రమాణముగా చెప్పబడు చున్నది.

శ్లో॥ యథేహ దేవ ప్రవరాస్త్రైవిధ్యముపలభ్యతే ।
భూతేషు గుణవైచిత్ర్యాత్తథాన్యత్రానుమీ యతే ॥ (46)

తా॥ దేవతలలో శ్రేష్ఠులారా! ఈ లోకములో గుణ వైచిత్ర్యముచే ప్రాణులందు ఏ విధముగానైతే ఫలాది త్రైవిధ్యము తెలియుచున్నదో అట్లే పరలోకమందు కూడా అనుమానింపబడుచున్నది. 46

టీ॥ హే దేవ ప్రవరాః ఇహ జన్మని శాంతఘోర మూఢత్వేన వా సుఖ దుఃఖ మిశ్రత్వేన వా ధార్మికత్వాదినా వా త్రైవిధ్యం భూతేషు యథోపలభ్యతే తథాన్యత్ర జన్మాన్తరేఽనుమీయతే త్రైవిధ్యాన్యథా నుపపత్త్యాకల్ప్యతే. ॥46

టీ॥ ఓ దేవతలలో శ్రేష్ఠులారా! ఏ విధముగా ఈ జన్మము నందు శాంత, ఘోర, మూఢత్వ రూపమున లేదా సుఖ దుఃఖ మిశ్రమ రూపమున గాని ఉత్తమ, మధ్యమ, అధమ రూపమున గాని భూతముల యందు త్రిగుణములు అనుభవింపబడుచున్నవో అట్లే అర్థాపత్తితో (ఒక అర్థము చెప్పినచో మరొక అర్థము వచ్చుట) జన్మాంతరములలో కూడ ఈ హేతువుల చేత నిశ్చయించబడు ధార్మికాధార్మిక మిశ్ర రూపమున త్రైవిధ్యము గోచరించును.॥46॥

శ్లో॥ వర్తమానోఽన్యయోః కాలో గుణాభిజ్ఞాపకో యథా ।
ఏవం జన్మాన్యయోరేతద్ధర్మాధర్మ నిదర్శనమ్ ॥ (47)

తా॥ ఏ విధముగా వర్తమాన, భూత, భవిష్యములు మిగిలిన రెండింటి యొక్క గుణములను తెలియచేయునో అదే విధముగా ఈ జన్మ మిగిలిన రెండు జన్మముల యొక్క ధర్మాధర్మములకు నిదర్శనము. 47

టీ॥ వర్తమాన జన్మనా పూర్వపర జన్మ ధర్మాధర్మ జ్ఞానం భవతీతి సదృష్టాన్తమాహుః. వర్తమానో వసన్తాది కాలః. అన్యయోర్భూత భవిష్యయోర్వసన్తయోర్యే గుణాః పుష్పఫలాదయస్తేషామభిజ్ఞాపకో యథా।

టీ॥ వర్తమాన జన్మచేత పూర్వ, పరజన్మల ధర్మాధర్మముల జ్ఞానము కలుగునని దృష్టాంతముగా చెప్పబడుచున్నది. వర్తమానమనగా వసంతాది కాలము. అన్యములైన భూత భవిష్యద్గుణములకు వసంతము

ఏవమేతజ్జన్మ అన్యయోర్భూత భావి జన్మనోర్ధర్మా ధర్మౌ నిదర్శయతీతి తథా. ॥47॥

యొక్క గుణములు అనగా పుష్ప ఫలాదుల జ్ఞాపకము ఎట్లో, అట్లే వర్తమాన జన్మము భూత భవిష్యజ్జన్మల ధర్మాధర్మములకు అనగా జ్ఞానమునకు జ్ఞాపకము .47

శ్లో॥ మనసైవ పురేదేవః పూర్వరూపం విపశ్యతి ।
అనుమీమాంసతేఽపూర్వం మనసా భగవానజః ॥ (48)

తా॥ పుట్టుకలేనివాడు, దేవుడు (చైతన్యస్వరూపుడు) అగు భగవానుడు (యమధర్మరాజు) మనస్సు చేతనే దేహము నందు జీవుని పూర్వ రూపమును (గత జన్మములను) విశేషముగా చూచును. తరువాత రాబోవు జన్మములను విచారించి అవలోకించును.(తెలుసుకొనును)48

టీ॥ అయం చ ధర్మాధర్మజ్ఞాన ప్రకారోఽన్యేషాం, ధర్మరాజస్తు మనసైవ సర్వం పశ్యతీత్యాహుః. పురే సంయమిన్యాం స్థిత ఏవ దేవో యమో దేహే స్థితోన్తర్యామీ వా జీవస్య పూర్వ రూపం ధర్మాధర్మాది యుక్తం విశేషణ పశ్యతి. అన్వనన్తరమపూర్వం రూపం మీమాంసతే. యద్యస్యానురూపం తద్విచారయతి, యతోఽసౌ భగవానజః. ॥48॥

టీ॥ ఈ ధర్మాధర్మజ్ఞాన ప్రకారములన్నింటిని ధర్మరాజైన యముడు మనస్సు చేతనే చూచుచున్నాడు. ఎవనిది ఏ రూపమో దానిని విచారించుచున్నాడు. బ్రహ్మదేవుడు ఏ విధముగా జీవుల కర్మాను - సారము జన్మలను ప్రసాదించునో అట్లే యమధర్మరాజు కూడ జీవుల యొక్క ధర్మాధర్మములను పరిశీలించి తదనురూపముగ దండనాది ఫలముల నిచ్చుచున్నాడు.॥48॥

అవ॥ జీవస్త్వీశ్వరేణోపస్థాపితం వర్తమానం దేహం పశ్యతి న తు పూర్వమపరం చేత్యాహుః- యథేతి.

అవ॥ యథేతి శ్లోకమున జీవుడు ఈశ్వరుడు కల్పించిన వర్తమాన దేహమును మాత్రమే చూచును కాని పూర్వ, పరములను అనగా భూత, భవిష్యద్దేహములనుకాదు అని చెప్పుచున్నాడు.

శ్లో॥ యథాஉజ్ఞ స్తమసా యుక్త ఉపాస్తే వ్యక్తమేవ హి ।
నవేద పూర్వమపరం నష్ట జన్మ స్మృతి స్తథా ॥ (49)

తా॥ తమోగుణముతో కూడుకొనిన అజ్ఞాని, వ్యక్తమగుచున్న వానిని మాత్రమే ఆరాధించువిధముగా గత జన్మల స్మృతి నష్టపోయిన జీవుడు గడిచిన జన్మలను మరియు రాబోవు జన్మలను తెలియజాలడు. 49

టీ॥ అజ్ఞోஉవిద్యోపాధిర్జీవస్తు వ్యక్తమేవ ప్రాచీన కర్మాభివ్యక్తం వర్తమానమేవ దేహాద్యుపాస్తేஉహమితి మన్యతే, పూర్వమపరం వా న వేద. అత్ర హేతుః నష్టా జన్మనాం స్మృతిర్యస్య. అత్ర దృష్టాన్తః తమసా నిద్రయా యుక్తో యథా స్వప్నేஉపి వ్యక్తమేవ దేహాద్యుపాస్తే నతు జాగ్రద్దేహాది పూర్వ స్వప్నాది గతం వా తద్విదిత్యర్థః. ॥49॥

టీ॥ అవిద్య ఉపాధిగాగల జీవుడు ప్రాచీన కర్మలచేత అభివ్యక్తమైన దేహమును తననుగా భావించుచూ, పూర్వ పర జన్మలను తెలియకున్నాడు. జన్మచేత పూర్వ స్మృతిని కోల్పోవుటయే ఇందులకు కారణము. (నష్టాజన్మనాం స్మృతిర్యస్య–నష్టజన్మస్మృతిః) దీనికి దృష్టాంతము– నిద్రాయుక్తుడైన దేహి స్వప్నము నందు స్వప్న దేహమును మాత్రమే చూచును జాగ్రద్దేహమును చూడజాలడు గదా! తానే వ్యక్తమగుచు పూర్వ స్వప్నాది దేహములను చూడడు. అట్లే భూత భవిష్యజ్జన్మల జ్ఞానము కోల్పోయి వర్తమాన దేహమును తననుగా భావించుచున్నాడని అర్థము. 49

అవ॥ ఏవం భూతస్య జీవస్య సంసారం ప్రపఞ్చయన్తి పఞ్చభిఃశ్లోకైః

అవ॥ పంచభిఃతో ఆరంభింపబడిన ఐదు శ్లోకములలో జీవుని యొక్క సంసారమును విస్తరించుచున్నాడు.

శ్లో॥ పఞ్చభిః కురుతే స్వార్థాన్పఞ్చ వేదాథ పఞ్చభిః ।
ఏకస్తు షోడశేన త్రీన్స్వయం సప్తదశోஉశ్నుతే ॥ (50)

తా॥ పదునాఅవ దానితో (మనస్సుతో) పదునేడు యంశములగల ఒక జీవుడు ఐదింటితో తాను కోరుకొను కార్యములను చేయుచు,

టీ॥ పఞ్చభిః కర్మేంద్రియైః స్వార్థానుపాదానాదీన్కురుతే. పఞ్చ శబ్దాదీన్వేద పఞ్చభిర్ జ్ఞానేన్ద్రియైః. షోడశేన మనసా సప్తదశః షోడశోపాధ్యన్తర్గతోఽపి స్వయం త్వేక ఏవ. సర్వేన్ద్రియ విషయ ప్రతిసంధానాత్. త్రీన్ జ్ఞానకర్మేన్ద్రియమనోవిషయాన్ప్రాప్నోతి. ॥50॥

శ్లో॥ తదేతత్షోడశకలం లిఙ్గం శక్తిత్రయం మహత్ ।
ధత్తేఽనుసంసృతిం పుంసి హర్షశోక భయార్తిదామ్ ॥ (51)

టీ॥ తదేతల్లిఙ్గశరీరం శక్తి త్రయం గుణ త్రయకార్యం మహదనాది పుంసి జీవే అన్వనుసంసృతిం ధత్తే. (51)

మరియు ఐదింటితో ఐదింటిని తెలియును. స్వయముగా మూడింటిని అనుభవించును.(50)

టీ॥ ఐదు కర్మేంద్రియములతో తన కర్తవ్యములను నిర్వర్తించును. ఐదు జ్ఞానేంద్రియముల చేత శబ్దాది విషయములను గ్రహించును. పదహారవదియైన మనస్సుతో కూడిన పదిహేడవ వాడు స్వయముగా ఒక్కడే అయినను ఈ పదహారు ఉపాధుల అంతర్గతుడేయైనను ఇంద్రియములన్నింటి సంధానముచే జ్ఞాన, కర్మ, మనోవిషయముల మూడింటిని పొందుచున్నాడు.॥50।

తా॥ పదునాఱు అంశములతో కూడిన మూడు శక్తులు గల ఈ గొప్పనైన సూక్ష్మ శరీరము జీవుని యందు సంసృతిని (జనన మరణ పరంపరను) సుఖ, దుఃఖ, భయాపదలను కలిగించుచున్నది. 51

టీ॥ ఈ పదహారు కళలుగల లింగశరీరము సత్త్వ, రజస్తమో గుణ త్రయ కార్యమును అనాదియైన జీవుని యందు మరల మరల జన్మ పరంపరను కలిగించుచున్నది. 51

శ్లో॥ దేహ్యజ్ఞోఽజిత షడ్వర్గో నేచ్ఛన్కర్మాణి కార్యతే ।
కోశకార ఇవాత్మానం కర్మణాచ్ఛాద్య ముహ్యతి ॥ (52)

తా॥ అరిషడ్వర్గములను జయించని అజ్ఞానియైన దేహిచే తాను కోరుకొనక పోయినను కర్మలు చేయించబడుచున్నవి. పట్టుపురుగువలె కర్మతో కప్పివేసుకొని వ్యామోహితుడగుచున్నాడు. 52

టీ॥ నేచ్ఛన్ననిచ్ఛన్నప్యనే నైవ కర్మాణి కార్యతే. కోశకారః కీట విశేషః ముహ్యతి నిర్గమో పాయం న జానాతి. 52

టీ॥ జీవుడు (అజ్ఞానజనితములైన షడ్వర్గమును) ఇష్టపడక పోయినను, కర్మలు చేయుచున్నాడు. కోశకార కీటకము (పట్టుపురుగు) వలె నిర్గమోపాయము తెలియని కారణముగా వ్యామోహితుడగుచున్నాడు. ॥52॥

అవ॥ కార్యత ఇత్యత్రానుభవం ప్రమాణయన్తి–నహీతి.

అవ॥ నహీతి శ్లోకమున అనుభవమును ప్రమాణీకరించుచున్నాడు.

శ్లో॥ న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ గుణైః స్వాభావికైర్బలాత్ ॥ (53)

తా॥ ఎవ్వడైనను క్షణకాలమైనను, ఏ కాలమందైనను, కర్మలను చేయకుండా ఉండలేడు. స్వాభావిక గుణముల చేత బలాత్కారముగా అవశుడై కర్మలు చేయుచునే యున్నాడు. ॥53॥

టీ॥ గుణైర్గుణకార్యరాగాదిభిః. స్వాభావికైః పూర్వకర్మ సంస్కారోద్భూతైః. 53

టీ॥ పూర్వకర్మ సంస్కార విశేషముల చేత ఏర్పడిన రాగాది గుణముల చేత అవశుడై కర్మలు చేయుచునేవున్నాడు. 53

అవ॥ కర్మవశేన చ తదనురూపో దేహో భవతీత్యాహుః–లబ్ధ్వేతి.

అవ॥ లబ్ధ్వా ఇత్యాది శ్లోకమున కర్మవశము చేత తదనురూప దేహము కలుగుచున్నదని చెప్పుచున్నాడు.

శ్లో॥ లబ్ధ్వా నిమిత్తమవ్యక్తం వ్యక్తావ్యక్తం భవత్యుత ।
యథాయోని యథా బీజం స్వభావేన బలీయసా ॥(54)

తా॥ మరియు అవ్యక్తమగు (గ్రహించబడని) కారణములను (పుణ్యా పుణ్య రూప) పొంది మిక్కిలి బలముగల (అజ్ఞాన) స్వభావముచే ఏ విధమైన క్షేత్రమో, ఏ విధమైన బీజమో వానిననుసరించి వ్యక్తావ్యక్త రూపములు (స్థూల, సూక్ష్మ శరీరములును) కలుగుచున్నవి. 54

టీ॥ అవ్యక్త మదృష్టం నిమిత్తం లబ్ధ్వా వ్యక్తావ్యక్తం తదనురూపం స్థూలం సూక్ష్మం చ శరీర భవతి. యథాయోని మాతృ సదృశమ్ యథా బీజం పితృ సదృశమ్ స్వభావో వాసనా. శుక్ల శోణితయోరేకత్వే ఽపి కర్మ వాసనయా మాతాపితృ సదృశో దేహో భవతీత్యర్థః. (54)

టీ॥ పూర్వాచరిత కర్మల సంచయమునకు వశుడైన కారణమున ఆయా ఫలముల ననుభవించుటకు తగిన, ఆ యా జన్మలలోని కర్మ వాసన చేత మాతా పితరుల (యోని,బీజ) శుక్ల శోణిత ఏకత్వముచేత మాతా పితృ సదృశములైన వ్యక్తావ్యక్త సూక్ష్మ స్థూల శరీరములు ఏర్పడుచున్నవి.॥54॥

అవ॥ సంసార చక్రముపసంహరన్తో ముక్తి ప్రకారమాహుః–ఏష ఇతి.

అవ॥ 'ఏష' ఇతిశ్లోకమున సంసార చక్రమును తొలగించుకొను ముక్తి ప్రకారమును చెప్పుచున్నాడు.

శ్లో॥ ఏష ప్రకృతి సఙ్గేన పురుషస్య విపర్యయః ।
ఆసీత్స ఏవ నచిరాదీశ సఙ్గాద్విలీయతే ॥ (55)

తా॥ పురుషునికి ప్రకృతి సంగము చేత ఈ విపర్యము ఏర్పడినది. అది ఈశ్వర సంగము చేత శీఘ్రముగా విలీనమగును. 55

టీ:– ఈశ సంగాత్ పరమేశ్వర భజనాత్. (55)

టీ॥ పరమేశ్వరుని భజనముచేత (ముక్తుడగుచున్నాడు) 55

అవ॥ తదేవం సామాన్యతో ధర్మాదినిర్ణయముక్త్వా ప్రస్తుతస్యాజామిల స్యాధర్మం ప్రపఞ్చయన్తో దణ్ణ్యత్వ మాహుః– అయం హీత్యాది యావద ధ్యాయ సమాప్తిః. తత్ర ద్వాభ్యాం తత్పూర్వవృత్తానువాదోఽన్యాయా తిరేక ప్రదర్శనార్థః.

అవ॥ అయం ఇత్యాది శ్లోకముతో ప్రారంభించి అధ్యాయసమాప్తి వరకు గల శ్లోకములలో, ఈ విధముగా సామాన్య ధర్మాది నిర్ణయమును చెప్పి అజామిళుని అధర్మ విస్తారమును దాని దండత్వమును చెప్పు చున్నాడు. (అందు ముందు రెండు శ్లోకములలో వాని పూర్వ వృత్తాంతమును, అధర్మప్రవర్తనమును ప్రదర్శించుచున్నాడు.)

శ్లో॥ అయం హి శ్రుతి సంపన్నః శీలవృత్త గుణాలయః ।
ధృతవ్రతో మృదుర్దాన్తః సత్యవాన్మన్త్రవిచ్ఛుచిః ॥ (56)

తా॥ ఇతడు నిశ్చయముగా విజ్ఞాన సంపన్నుడు. సచ్ఛీలము, మంచి నడవడి మరియు సద్గుణములు కలవాడు. వ్రతనిష్ఠ గలవాడు. మృదుస్వభావి, దాన్తుడు (ఇంద్రియ జయము గలవాడు) సత్యవంతుడు, మంత్రవేత్త మరియు శుచిగలవాడు. 56

టీ॥ శీలం సుఖభావః వృత్తం సదాచారః గుణాః క్షమా దయ స్తేషామాలయః. ॥56॥

టీ॥ శీలము– సుఖభావము, వృత్తము– సదాచారము, గుణములు– క్షమాదిగుణములు వీనికి ఆలయమైనవాడు (అజామిళుడు) ॥56॥

శ్లో॥ గుర్వగ్న్యతిథి వృద్ధానాం శుశ్రూషుర్నిరహంకృతః ।
సర్వభూత సుహృత్సాధుర్మితవాగనసూయకః ॥57॥

తా॥ గురువులకు, అగ్నులకు, అతిథులకు, వృద్ధులకు, శుశ్రూషలు చేయువాడును, నిరహంకారి, సకల భూత హితకారి, మంచి వాడు మితముగా మాట్లాడువాడు. అసూయ లేనివాడు. 57

టీ॥ నిరహంకృతో నిరహంకారః ॥57॥

టీ॥ అహంకారములేనివాడు.॥57॥

శ్లో॥ ఏకదాఽసౌ వనం యాతః పితృసందేశ కృద్ద్విజః ।
ఆదాయ తత ఆవృత్తః ఫలపుష్పసమిత్కుశాన్ ॥ (58)

తా॥ ఈ బ్రాహ్మణుడు ఒకనాడు తండ్రి యొక్క ఆదేశమును నెరవేర్చుటకు అడవికి వెళ్ళి అక్కడి నుండి ఫలములను, పుష్పములను, సమిధలను, కుశలను(దర్భలను) తీసుకొని వచ్చుచుండెను. 58

టీ॥ తత ఆవృత్తో వనాత్పరావృత్తః. 58

టీ॥ వనము నుండి తిరిగి వచ్చుచున్న. ॥58॥

శ్లో॥ దదర్శ కామినం కంచిచ్ఛూద్రం సహ భుజిష్యయా ।
పీత్వా చ మధు మైరేయం మదాఘూర్ణిత నేత్రయా ॥ (59)

తా॥ వచ్చుచుండగా బెల్లపు మద్యమును సేవించి, మత్తుచే తిరుగు-చున్న కన్నులు గల పరిచారిక (వేశ్య) తో బాటుగా ఉన్న ఒక శూద్రుని చూచెను. 59

టీ॥ భజిష్యయా భోగస్త్రియా దాస్యా మైరేయం మధు పైష్టిం సురాం పీత్వా. మదేనాఘూర్ణితే భ్రాన్తే నేత్రే యస్యాః- మదఘూర్ణిత నేత్రే.॥59॥

టీ॥ భోగ స్త్రీయైన దాసితో (వేశ్యతో) బాటుగా, బెల్లపు మద్యమును ద్రావి, మత్తుచే గిరగిర తిరుగుచున్న కన్నులు ఎవరికో ఆమె మదఘూర్ణిత నేత్రురాలు. ॥59॥

శ్లో॥ మత్తయా విశ్లథన్నీవ్యా వ్యపేతం నిరపత్రపమ్ ।
క్రీడన్తమను గాయన్తం హసన్తమనయాఽన్తికే ॥ (60)

తా॥ మత్తుతో, కోకముడి జారిపోవుచున్న ఆ స్త్రీతో (సిగ్గు వదలి) క్రీడించుచున్నట్టి, పాడుచున్నట్టి, వ్యపేతుడైన (భ్రష్టుడైనట్టియు) వానిని చూచెను. 60

టీ॥ విశేషేణ శ్లథన్తీ నీవీ యస్యాస్తయాసహ- విశ్లథన్తీ వ్యపేతం స్వాచారాద్భ్రష్టమ్. ॥60॥

టీ॥ జారిపోవుచున్న కోకముడిగల దానితో, తన ఆచారము నుండి భ్రష్టుడైన ॥60॥

శ్లో॥ దృష్ట్వా తాం కామలిప్తేన బాహునా పరిరమ్భితామ్ ।
జగామ హృచ్ఛయవశం సహసైవ విమోహితః ॥ (61)

తా॥ కామమును కలిగించు (కామోద్దీపకములగు) గంధాదులచే పూయబడి, చేతితో యువకుణ్ణి కౌగిలించుకొన్న ఆమెను చూచి వెంటనే వ్యామోహితుడై మనస్సు నందలి కోరికకు వశుడయ్యెను. 61

టీ॥ కామేన కామోద్దీపకేన తదఙ్గరాగేణ హరిద్రాదినా లిప్తేన. ॥61॥

టీ॥ కామోద్దీపకాంగరాగము చేత, హరిద్రాదిలేపనముల చేత ॥61॥

శ్లో ॥ స్తమ్భయన్నాత్మనాత్మానం యావత్సత్త్వం యథా శ్రుతమ్ ।
న శశాక సమాధాతుం మనో మదనవేపితమ్ ॥ (62)

తా॥ శాస్త్రజ్ఞానము ననుసరించి బుద్ధితో తనను తాను నిలద్రొక్కు కొనుటకు శక్తిమేరకు ప్రయత్నము చేసెను. కాని మన్మథునిచే కుదిపి వేయబడినవాడై మనస్సును సమాధానపరచుటకు సమర్థుడు కాలేక-పోయెను.॥62॥

టీ॥ సత్త్వం- ధైర్యం. శ్రుతం-జ్ఞానం. తద్బలేన స్తమ్భయన్నపి మదనేన కమ్పితం మనః సమాధాతుం నియమితుం శక్తో నాభూత్. 62

టీ॥ సత్త్వముచే, జ్ఞానముచే హృదయాన్ని బలంగా నిగ్రహించుకొనే ప్రయత్నము చేయుచున్నను మదనుని చేత కంపించిన మనస్సును నియమించ లేకపోయినాడు. ॥62॥

శ్లో॥ తన్నిమిత్త స్మరవ్యాజ గ్రహ గ్రస్తో విచేతనః ।
తామేవ మనసా ధ్యాయస్స్వధర్మాద్విరరామ హ ॥ (63)

తా॥ ఆమె నిమిత్తముగా మన్మథగ్రహముచే పీడింపబడినవాడై వివేకమును కోల్పోయెను. ఆమెనే మనస్సుచేత ధ్యానించుచున్నవాడై ధర్మమును విడనాడెను. 63

టీ॥ తద్దర్శన మేవ నిమిత్తం యస్య స్మరవ్యాజస్య గ్రహస్యతేన గ్రస్తః విచేతనో గత స్మృతిః. ॥63॥

టీ॥ ఆ స్త్రీ దర్శనమే నిమిత్తముగా స్మరవ్యాజ గ్రహగ్రస్తుడై (మదన తాపపీడితుడై) తన స్మృతిని కోల్పోయెను.॥63॥

శ్లో॥ తామేవ తోషయామాస పిత్ర్యేణార్థేన యావతా ।
గ్రామ్యైర్మనోరమైః కామైః ప్రసీదత యథా తథా ॥ (64)

తా॥ గ్రామ్యములైన మనోల్లాసమును కలిగించు (పామరములైన) భోగములచే ఏ విధముగా ప్రసన్నురాలగునో ఆ విధముగా ఆమెను సంతోషపరచుచు పిత్రార్జిత ధనమును పూర్తిగా వ్యయపఱచెను. 64

టీ॥ యావతా - సమగ్రేణ. ॥64॥

టీ॥ సమగ్రముగా. ॥64॥

శ్లో॥ విప్రాం స్వభార్యామప్రౌఢాం కులే మహతి లమ్బితామ్ ।
విససర్జాచిరాత్పాపః స్వైరిణ్యాపాఙ్గవిద్ధధీః ॥ (65)

తా॥ వేశ్యయొక్క కడగంటి చూపులతో కొట్టబడిన మనస్సుకలవాడైన (కామవశుడై) ఆ పాపి, ఉన్నత వంశమునందు జన్మించిన, విప్రురాలు, యవ్వనవతియగు, (వివాహము చేసుకొన్నట్టియు) ఉత్తమురాలైన తన భార్యను వదిలిపెట్టెను. ॥65॥

శ్లో॥ యతస్తతశ్చోపనిన్యే న్యాయతోఽన్యాయతో ధనమ్ ।
బభారాస్యాః కుటుంబిన్యాః మన్దధీరయమ్ ॥ (66)

తా॥ మందబుద్ధియైన ఈతడు ఎక్కడో ఒక చోటు నుండి న్యాయముగాను అన్యాయముగాను ధనమును తీసుకొని వచ్చి ఈమె (వేశ్య) యొక్క కుటుంబమును పోషించెను.॥66॥

టీ॥ లమ్బితాం పరిణీతామ్. ॥65,66॥

టీ॥ వివాహముచేసుకొన్న. ॥65,66॥

శ్లో॥ యదసౌ శాస్త్రముల్లఙ్ఘ్య స్వైరచార్యార్యగర్హితః ।
అవర్తత చిరంకాలమఘాయురశుచిర్మలాత్ ॥ (67)

తా॥ మహాత్ములచే నిందించబడియు, యథేచ్ఛగా సంచరించుచున్న ఈతడు శాస్త్రమునుల్లంఘించి, అశుచిగాను, రాగాది దోషములతో కూడినవాడై చాలాకాలము గడిపెను. 67

టీ॥ అఘరూపమాయుర్యస్య అఘాయుః మలమేవ తదీయమన్నాదిక మత్తీతి మలాత్. ॥ 67 ॥

టీ॥ పాపమే చేయుచూ ఆయువుగడిపెను. (వాని ఆయువు పాప రూపమే) వాని అన్నాదికములు మలమే. పాపపు రూపమే ఆయువుగా గలవాడు అఘాయువు.॥ 67 ॥

శ్లో॥ తత ఏనం దణ్డపాణేః సకాశం కృత కిల్బిషమ్ ।
నేష్యామోఽకృతనిర్వేశం యత్ర దణ్డేన శుద్ధ్యతి ॥ (68)

తా ॥ అందువలన పాపాలకు ప్రాయశ్చిత్తము చేయని వీడు ఎక్కడైతే శిక్షచే శుద్ధిని పొందునో ఆ దండపాణి (యముని) సమీపమునకు తీసుకొని పోవుచున్నాము. 68

టీ॥ అకృతనిర్వేశమకృత ప్రాయశ్చిత్తమ్ అస్యైవ చ హితార్థం నేష్యామ ఇత్యాహుః యత్రేతి. (68)

టీ॥ ప్రాయశ్చిత్తము చేయబడని వీనిని, (ఎక్కడైతే దండమున శుద్ధి చేయబడునో) వీని హితార్థము తీసుకొనిపోవుచున్నాము. అని చెప్ప-బడుచున్నది. (68)

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే
ప్రథమోఽధ్యాయః

శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆఱవ స్కంధమున
మొదటి అధ్యాయము సమాప్తము

### ద్వితీయో౽ధ్యాయః

అవ॥ ద్వితీయే వైష్ణవైర్యామ్యాన్నామ మాహాత్మ్యమద్భుతమ్. శ్రావయి-త్వా ద్విజో విష్ణోర్లోకం నీత ఇతీర్యతే.

శ్రీశుక ఉవాచ:

శ్లో॥ ఏవం తే భగవద్దూతా యమదూతాభిభాషితమ్ ।
ఉపాధార్యాథ తాన్ రాజన్ప్రత్యాహుర్నయకోవిదాః ॥ (1)

టీ॥ నయకోవిదాః - న్యాయనిపుణాః. ॥1॥

విష్ణుదూతా ఊచుః

శ్లో॥ అహో కష్టం ధర్మదృశామధర్మః స్పృశతే సభామ్ ।
యత్రాదణ్డ్యేష్వపాపేషు దణ్డో యైర్ధ్రియతే వృథా ॥ (2)

టీ॥ ధర్మదృశాం సభామధర్మః స్పృతి తదాహుః-యత్ర సభాయాం యైః ధర్మదృగ్భిః తేషాం తాం సభాం. ॥2॥

### రెండవ అధ్యాయము

అవ॥ రెండవ అధ్యాయమునందు విష్ణుదూతల చేత యమదూతలకు (విష్ణు)నామముల అద్భుత మాహాత్మ్యము వినిపించబడి, ఆ ద్విజుడు (అజామిళుడు) విష్ణులోకమునకు కొనిపోబడినాడని చెప్పబడుచున్నది.

శ్రీ శుకులంవలికిరి:

తా॥ ఓ రాజా! ఈ విధముగా యమదూతల భాషణమును సావధానముగా విని (ధర్మనిర్ణయ) నయ కోవిదులైన విష్ణుదూతలు వారితో ఇట్లు బదులు పలికిరి. 1

టీ॥ న్యాయనిపుణులు. ॥1॥

విష్ణుదూతలంవలికిరి

తా॥ అయ్యో! ఎంత కష్టము! ధర్మవేత్తయయిన యముని సభయందు, పాపులుకాని వారికి, శిక్షింపదగని వారికి వ్యర్థముగా శిక్షవేయబడు - చున్నందున అధర్మము స్పృశించుచున్నది. 2

టీ॥ ఏ సభయందు, ఎవరిచేత ధర్మము చూడబడునో, వారి యందు, ఆ సభ యందు ధర్మమును చూచు ధర్మరాజుసభ యందు ధర్మాత్ములను, అపాపులను శిక్షించుటయను అధర్మము స్పృశించబడుచున్నది. ॥2॥

శ్లో॥ ప్రజానాం పితరో యే చ శాస్తారః సాధవః సమాః ।
యది స్యాత్తేషు వైషమ్యం కం యాన్తి శరణం ప్రజాః ॥ (3)

టీ॥ పితరః – పితృవత్పాలకాః శాస్తారో దండ్యనుశిక్షకాః వైషమ్యమ్– అదండ్య దండనమ్. ॥3॥

అవ॥ ఏతత్ప్రవర్తితమధర్మమన్యోఽపి కరిష్యతీతి మహత్కష్టమభూది త్యాహుః – యద్యదితి.

శ్లో॥ యద్యాదాచరతి శ్రేయానితరస్తత్తదీహతే ।
సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥ (4)

టీ॥ శ్రేయాన్ – శ్రేష్ఠః. 4

అవ॥ విశ్వస్తఘాతౌదపీత్యాహుః యస్యేతిద్వాభ్యామ్.

తా॥ ఎవరైతే ప్రజలకు తండ్రులో, శాసకులో, సత్పురుషులో, సములో వారి యందే వైపరీత్యము కలిగినచో ప్రజలు ఎవనిని శరణు పొందెదరు. 3

టీ॥ ప్రజలను తండ్రులవలె పాలించువారు, దండ్యులను శిక్షించు వారు, అదండ్యులను దండించుట. ॥3॥

అవ॥ యద్యదితి శ్లోకమున, శ్రేష్ఠుల అధర్మ ప్రవర్తనమును సామాన్యులు కర్తవ్యముగా భావించు కష్టమేర్పడినదని చెప్పుచున్నాడు.

తా॥ శ్రేష్ఠ పురుషుడు దేనిని ఆచరించునో దానిని ఇతరులు ఆచరించుదురు. అతడు ఏ ప్రమాణమును (ఏర్పాటు) చేయునో దానినే లోకము అనుసరించును. 4

టీ॥ శ్రేష్ఠులు. ॥4॥

అవ॥ 'యస్య' ఇత్యాది రెండు శ్లోకములందు విశ్వాస ఘాతము చెప్ప బడుచున్నది.

శ్లో॥ యస్యాఙ్కే శిర ఆధాయ లోకః స్వపితి నిర్వృతః ।
స్వయం ధర్మమధర్మం వా న హి వేద యథా పశుః ॥ (5)

టీ॥ నిర్వృత – నిశ్చిన్తః. 5

శ్లో॥ స కథం న్యర్పితాత్మానాం కృతమైత్రమచేతనమ్ ।
విశ్రమ్భణీయో భూతానాం స ఘృణో ద్రోగ్ధుమర్హతి ॥ (6)

టీ॥ విశ్వాసేన నితరామర్పిత ఆత్మామేనతమ్. విశ్రమ్భణీయః – విశ్వసనీయః సఘృణశ్చేత్. ॥6॥

అవ॥ నన్వస్య పాపినో దండే కిమర్థమాక్రోశః క్రియతే? తత్రాహుః – అయం హి ఇతి.

శ్లో॥ అయంహి కృతనిర్వేశో జన్మకోట్యంహసామపి।
యద్వ్యాజహార వివశో నామ స్వస్త్యయనం హరేః ॥ (7)

తా॥ ఎవని వొడి యందు శిరస్సు నుంచి సామాన్యుడు సుఖించునో, నిద్రించునో, (అతడు) తాను స్వయముగా పశువువలె ధర్మమునుగాని, అధర్మమునుగాని తెలియకున్నాడు. (ధర్మరాజు) 5

టీ॥ చింతలేనివారు. ॥5॥

తా॥ ప్రాణులకు నమ్మదగినవాడు, దయగలవాడు అయిన వ్యక్తి, తనతో (ఆత్మార్పణముగా) మైత్రిచేసిన అజ్ఞానికి ఏ విధముగా కూడా ద్రోహము చేయకూడదు కదా! (ద్రోహము చేయుటకు తగడు గదా!)6

టీ॥ విశ్వాసము చేత స్వయముగా ఆత్మను సమర్పించిన వానిని – విశ్వసనీయుడైన; అసహ్యత కలవాడై. ॥6॥

అవ॥ అయమిత్యాది శ్లోకమున వానిని దండించుట యందు ఆక్రోషమునకు కారణము చెప్పుచున్నాడు.

తా॥ ఈతడు కోటి జన్మముల పాపములకైనను నిశ్చయముగా ప్రాయశ్చిత్తము చేసుకొన్నవాడే. ఏలయనగా స్వాధీనత తప్పినవాడైనను కల్యాణములకు నిధానమైన శ్రీహరి నామమును పలికినాడు. 7

టీ॥ యద్యస్మాత్ వివశోఽపి హరేర్నామ వ్యాజహార ఉచ్చారితవాన్ న కేవలం పాప ప్రాయశ్చిత్తమాత్రం హరేర్నామ అపి తు స్వస్త్యయనం మోక్షసాధనమపి. "సకృదుచ్చరితం యేన హరిరిత్యక్షరద్వయం. బద్ధః పరికరస్తేన మోక్షాయ గమనం ప్రతి". ఇతి స్మృతేః. ॥7॥

టీ॥ హరియను రెండు అక్షరములను ఒకసారి ఉచ్చరించినంత మాత్రమున మోక్షమునకు సన్నాహము చేసుకొన్నవాడగుచున్నాడను స్మృతి ననుసరించి, ప్రాణ త్యాగమున వివశుడై ఉచ్ఛరించిన, హరి నామము జన్మ కోటుల యందు చేసిన పాపములకు కేవలము ప్రాయశ్చిత్తము మాత్రమేగాక మోక్ష సాధనమగుచున్నది.॥7॥

అవ॥ నను కర్మసాద్గుణ్యకరం హరేర్నామేతి యుక్తం "యస్య స్మృత్యా చ నామోక్త్యా తపో యజ్ఞ క్రియాదిషు. న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే తమచ్యుతమ్". ఇత్యాది వచనాత్ స్వాతంత్ర్యేణత్వఘ నివర్తకం హరేర్నామ కథం స్యాత్తత్రాహుః - ఏతేనైవేతి.

అవ॥ ఏతేనైవేత్యాది శ్లోకమున, యస్య స్మృత్యా చ నామోక్త్యా తపో యజ్ఞ క్రియాదిషు న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే తమ-చ్యుతమ్. తపో యజ్ఞాది క్రియలందు అచ్యుతుని యొక్క నామములను చెప్పినపుడు, అవి అసంపూర్తిగా చేయబడినప్పటికి సంపూర్ణతను పొందును. అను ప్రమాణమును బట్టి హరినామ స్మరణ కర్మసాద్గుణ్య-కరమని చెప్పుచూ స్వతంత్రముగానే హరినామము ఏ విధముగా పాప నివారణమో చెప్పుచున్నాడు.

శ్లో॥ ఏతేనైవ హ్యఘోనోఽస్య కృతం స్యాదఘనిష్కృతమ్ ।
యదా నారాయణాయేతి జగాద చతురక్షరమ్ ॥ (8)

తా॥ ఈతడు ఎప్పుడైతే 'నారాయణా' యను నాలుగక్షరముల నామము పలికెనో నిశ్చయముగా దాని చేతనే ఈ పాపికి వీనికి పాప నిష్కృతి చేయబడినది కదా! 8

టీ॥ అఘోనః అఘవతః. మఘవచ్ఛబ్దవద్రూపం. యత్ ఆ ఇతిచ్ఛేదః ఆ ఈషదాభాసమాత్రం చతురక్షరం యన్నామ జగాద ఏతే నైవ కేవలేన చతురక్షరమిత్యనేనాధిక్యం చ దర్శితం. కథం జగాద. నారాయణ ఆయ ఆగచ్ఛ. ఇత్యేవం విక్రోశరూపేణ పుత్రాహ్వానేన. అయం భావః కర్మాంగత్వేఽపి హరినామ్నః ఖాదిరత్వాదివత్సంయోగ పృథక్త్వేన సర్వ ప్రాయశ్చిత్తార్థత్వం యుక్తమేవ. తథాహి "అవశేనాపి యన్నామ్ని కీర్తితే సర్వపాతకైః. పుమాన్ విముచ్యతే సద్యస్సింహత్రస్తైర్మృ గైరివ." ఇత్యాదిభిః పురాణేషు చ "తావత్సహస్రశో నామ్నః స్వాతంత్ర్య మవగమ్యతే" నచైతేఽర్థవాదామ్ ఇతి శంకనీయమ్ విధిశేషత్వాభావాత్. న చ విద్యశ్రవణాదన్యశేషతా కల్పనీయా. యదాగ్నేయోఽష్టా కపాలో భవతి" ఇత్యాదివత్ ఆగ్నేయోఽప్రాప్త్యార్థత్వేన విధికల్పనోపపత్తేః। మంత్రేషుచ "మర్తా అమర్త్యస్య తే భూరి నామ. మనామహే. విప్రాసో జాతవేదసః "అస్య జానంతో నామ చిద్వివక్తన్" ఇత్యాదిషు నామ్న స్తపో దానాది సర్వధర్మాధిక్యమవగమ్యతే. ఉపపాదితం చ మంత్రార్థ వాదానామపి స్వార్థే ప్రామాణ్యం దేవతాధికరణే. తస్మాత్ శ్రీనారాయణ నామాభాసమాత్రేణైవ సర్వాఘ నిష్కృతం కృతం స్యాదితి. ॥8॥

టీ॥ 1॥ మఘవత్ శబ్దము యొక్క షష్ఠ్యైక వచనము మఘోనః అయినట్లు అఘవత్ శబ్దము యొక్క షష్ఠ్యైకవచనము అఘోనః అగుచున్నది.

2॥ యదా అనుచోట యత్+ఆ అని పదవిభాగము చేయబడినది. కొంచెము స్ఫురించినను 'నారాయణ' అను చతురక్షరము పలుకుట యను ఏకోపాయమునే చెప్పుట చేత హరినామము యొక్క ఆధిక్యము తెలియుచున్నది.

3॥ నారాయణాయ-నారాయణ+ఆయ (ఆగచ్ఛ) నారాయణా రమ్ము! అని విలపించుట చేత, పుత్రుని పిలచినను హరినామము చ్ఛరించినట్లైనది.

4॥ 'నారాయణా' అని పుత్రుని పిలుచుటకే నారాయణ శబ్దము ఉచ్చరింపబడుట కర్మాంగమైనను, ఖాదిరత్వాత్ - అన్నింటికి ఉపయోగింపబడు చంద్ర చెక్కవలె, సర్వ ప్రాయశ్చిత్తముగా హరి నామము చెప్పబడుట యుక్తమే గదా!

5॥ సింహమునకు భయపడి పారిపోవు మృగములవలె హరి నామమును ఉచ్చరించుచున్నంతనే సర్వ పాపములు తొలగి పోవు-చున్నవి. ఈ విధముగా పురాణముల యందు నామ మాహాత్మ్యము యొక్క స్వాతంత్ర్యము వేలకొలది వచనములవలన తెలియబడుచున్నది.

6॥ ఈ వాక్యము అర్థవాదము (ప్రశంసాపరముగా సత్యము కాని మాట) అని శఙ్కించరాదు. ఇది విధిశేషమును కాదు, విధి శ్రుతము కాక పోవుట చేత విధిశేషముతో బాటు అన్య శేషత్వము కల్పించరాదు. విధి కల్పనము చేయవలెనందురేమో,

॥7॥ ఆగ్నేయోఽష్టా కపాలో భవతి' (ఆగ్నేయ పురోడాశము అష్టా కపాలమగును) అను వాక్యము అప్రాప్తమైన అర్థము కావున విధి కల్పనమును సరి కాదు. బ్రాహ్మణులు, అగ్నులు, మర్త్యామర్త్యులలో అమర్త్యుడవైన నీ నామము గొప్పదని తలంచుచున్నాము. "మర్త్యా అమర్త్యస్య తే భూరి నామ మనామహే. విప్రాఽసౌ జాతవేదసః అస్యజానంతో నామ చిద్వివక్తన తపో దానాది సర్వధర్మముల కన్నను నామ మహాత్మ్యము అధికము అని తలంచుచున్నాము.

॥8॥ దేవతాధికరణము లందు మంత్రార్థ వాదములకు స్వార్థ ప్రామాణ్యము కలదని చెప్పబడినందున అర్థ వాదార్థము ప్రమాణము కాదని చెప్పుట సరికాదు. అందువలన 'నారాయణా' నామాభాసమును పాపహరము, మోక్షకరము, చేయబడని వైదికకర్మలు సైతముచేయబడిన కర్మలవలె ఫలమునిచ్చుట నామోచ్చారణము వలన సంభవించును అని భావము. ॥8॥

అవ॥ నను కామ కృతానాం బహూనాం మహాపాతకానాం సహస్రశః ఆవర్తితానాం ద్వాదశబ్ద కోటిభిరప్యని వర్తానాంమిదమేకమేవ ప్రాశ్చిత్తం స్యాత్తత్రాహుః- స్తేన ఇతి ద్వాభ్యామ్.

శ్లో॥ స్తేనః సురాపో మిత్రధ్రుగ్బ్రహ్మహా గురుతల్పగః ।
స్త్రీ రాజ పితృ గో హంతా యే చ పాతకినోఽపరే ॥ (9)

శ్లో॥ సర్వేషామప్యఘవతామిదమేవ సునిష్కృతమ్ ।
నామ వ్యావహరణం విష్ణోర్యతస్తద్విషయా మతిః ॥ (10)

టీ॥ సునిష్కృతం శ్రేష్ఠం ప్రాయశ్చిత్తమిదమేవ. తత్ర హేతుః యతో నామ వ్యాహరణాత్. తద్విషయా నామోచ్చారక పురుష విషయా మదీయోఽయం మయా. సర్వతో రక్షణీయ ఇతి విష్ణోర్మతిర్భవతి. ॥9,10॥

అవ॥ శ్రేష్ఠత్వమేవోపపాదయన్తి – నేతి ద్వాభ్యామ్.

అవ॥ ద్వాదశాబ్దాది కోట్లకొలది ప్రాయశ్చిత్తములు కూడ తొలగించలేని కామ పూర్వకముగా చేయబడిన వేలకొలది మహాపాతకములను హరి నామ మొక్కటియే ఎట్లు తొలగించునో స్తేన ఇత్యాది శ్లోకములలో చెప్పుచున్నాడు.

తా॥ దొంగతనము చేసిన వాడు, మద్యపానము చేసినవాడు, మిత్ర ద్రోహము చేసినవాడు, బ్రాహ్మణుని చంపినవాడు, గురుపత్నిని కోరినవాడు, స్త్రీని, రాజును, తల్లిని, గోవును సంహరించిన వాడు, ఇంకను ఇతరములగు పాపులు ఎవరో వారందరిని దేనివలన బుద్ధి భగవద్విషయ మందు ప్రేరితమగునో అట్టి విష్ణునామమునుచ్చరించు టయే శ్రేష్ఠమైన ప్రాయశ్చిత్తము. ॥9,10॥

టీ॥ అన్నిరకముల పాపములకు శ్రేష్ఠమైన ప్రాయశ్చిత్తము విష్ణునామ సంకీర్తనమే. ఏలననగా నామోచ్చారణచేయు పురుషుడు, నా వాడని అన్ని విధములుగా రక్షింపదగినవాడు, అను బుద్ధి విష్ణువునకు కలుగును. ॥9,10॥

అవ॥ న ఇత్యాది రెండు శ్లోకములలో హరినామము యొక్క శ్రేష్ఠత్వము ప్రతిపాదింపబడుచున్నది.

శ్లో॥ ననిష్కృతైరుదితైర్బ్రహ్మవాదిభిస్తథా
విశుధ్యత్యఘవాన్ వ్రతాదిభిః ।
యథా హరేర్నామ పదైరుదాహృతైస్త
దుత్తమశ్లోక గుణోపలమ్భకమ్ ॥ (11)

టీ॥ బ్రహ్మవాదిభిర్మన్వాదిభిరుక్తైర్వ్రతాదిభిః నిష్కృతైస్తథా న శుద్ధ్యతి. ఉదాహృతైరుచ్చారితైర్యథా. నామపదైరిత్యనేన నమామీత్యాది క్రియా-యోగోఽపి నాపేక్షిత ఇతి దర్శితం.కిం చ తన్నామపదోచ్చారణం ఉత్తమ శ్లోకస్య గుణానాం చోపలంభకం జ్ఞాపకం భవతి. నతు కృచ్ఛ్రచాంద్రాయణాది వత్పాప నివృత్తిమాత్రోపక్షీణమిత్యర్థః. ॥11॥

తా॥ ఉత్తమ కీర్తిగల శ్రీహరి గుణముల ప్రకాశింపచేయు పదముల నుచ్చరించుటచే పాపి ఏ విధముగా శుద్ధిని పొందునో, అట్లు వేద వాదులచే చెప్పబడిన వ్రతాది ప్రాయశ్చిత్తములచే విశేషమగు శుద్ధిని పొందుట లేదు. ॥11॥

టీ॥ మన్వాదులు చెప్పిన కృచ్ఛ్రచాంద్రాయణాదులచే పాప నివృత్తి మాత్రమే కలుగును. కాని నామోచ్చారణముచే శుద్ధిని పొందినట్లుగా, శుద్ధిని పొందరు. హరినామ స్మరణమే ఉత్తమశ్లోకులు పొందుగతులను కలిగించును. నామ పదములనుట చేత నామములకు నమః అను పదమును జోడించనవసరము లేదు అని తెలియును. ఈ ప్రాయశ్చిత్తాది కర్మలచే పాపము క్షీణమైనట్లు, హరినామములట్లు ఉపక్షీణములుకావు. అంతేగాక, నామములవలె ప్రాయశ్చిత్తములు విష్ణుగుణ స్మారకములు గావు. ॥11

శ్లో॥ నైకాంతికం తద్ధి కృతేఽపి నిష్కృతే
మనః పునర్ధావతి చేదసత్పథే ।
తత్కర్మ నిర్హారమభీప్సతాం హరేః
గుణానువాదః ఖలు సత్త్వభావనః ॥ (12)

టీ॥ నైకాంతికం నాత్యంతశోధకం. తన్నిష్కృతమ్. యస్మిన్ కృతేఽపి

తా॥ ప్రాయశ్చిత్తము చేయబడినను మనస్సు మరల మరల చెడు మార్గము లందు పరుగెత్తినచో ఆ ప్రాయశ్చిత్తము పవిత్రమైనది కాదు. అందువలన కర్మనాశమును కోరు వారలకు శ్రీహరి నామ గుణముల భజనము సత్వగుణమును పెంపొందించును. ॥12॥

టీ॥ పాప కర్మలకు ఏ ప్రాయశ్చిత్తము కూడ సంపూర్ణ నిష్కృతిని

అసత్పథే పాపమార్గే మనో ధావతి చేత్. కర్మణాం పాపానాం నిర్హార మాత్యంతికం నాశమిచ్ఛతాం హరేర్గుణానువాద ఏవ ప్రాయశ్చిత్తం. యతోఽసౌ ఖలు సత్త్వభావనః చిత్తశోధకః. ॥12॥

కలిగించదు. ఎందుకనగా ప్రాయశ్చిత్తమొనరించి పాప నివృత్తిని పొందినను, మరల మరల పాపము చేయుటయందే మనస్సు పరుగెత్తుటను ఆప జాలదు. హరినామ స్మరణ చిత్త శోధకము. కావున సంపూర్ణ నివృత్తిని కోరు వారికి హరిగుణానువాదమే సరియైన ప్రాయశ్చిత్తము. ॥12॥

శ్లో॥ అథైనం మాఽపనయత కృతాశేషాఘ నిష్కృతమ్ ।
యదసౌ భగవన్నామ మ్రియమాణః సమగ్రహీత్ ॥ (13)

తా॥ ఈతడు మరణించుచూ భగవానుని నామమును గ్రహించుట చేత పాపములకు ప్రాయశ్చిత్తము చేయబడిన వాడు, కావున వీనిని యమ లోకమునకు తీసుకొనిపోరాదు. ॥13॥

టీ॥ అథ తస్మాదేనం అపమార్గేణ మా. నయత. కృతమశేషాణా మఘానాం నిష్కృతం యేన. యద్యస్మాత్. సమగ్రహీత్సంపూర్ణ ముచ్చారితవాన్. పాప పరిహారాయ నామైకదేశేవాప్యలమితి భావః మ్రియమాణ ఇత్యనేన పునః పాతకాంతరాసంభవ ఉక్తో న తు తత్కాల- త్వమేవ వివక్షితం. తదానీం కృచ్ఛ్రాది విధివన్నామమోచ్చారణ విధేరప్య సంభవాత్. న చ విధిం వినా కాకతాలీయనామోచ్చారణం పాపాపహ- మితి ప్రమాణమస్తి. ॥13॥

టీ॥ మ్రియమాణః అను శబ్దముచే మరణము పొందుచున్న అనుటచే మరల పాపము చేయుటకుసంభవము కాదు అనుట చెప్పబడినది. కేవలము మరణ కాలమని చెప్పుటకాదు. అప్పుడు కృచ్ఛ్రాది విధులు చెప్ప నవసరములేదు. నామోచ్చారణవిధి కూడ చెప్పనవసరములేదు. మ్రియామానునకు కృచ్ఛ్రాది ప్రాయశ్చిత్తములను, నామోచ్చారణ విధియును అసంభవము కావున విధిలేకుండానైనను, కాకతాలీయముగానైనను మరణించు సమయమున ఒక్క నామస్మరణ మాత్రముననే వీని పాపములు పూర్తిగా తొలగిపోయినవి. అందుచేత వీనిని అపమార్గమున తీసుకొని పోకుదు. నామోచ్చారణ పాప హరమని ప్రమాణము కలదు. ॥13॥

అవ॥ నన్వయం పుత్రనామాగ్రహీత్ న తు భగవన్నామ తత్రాహుః – సాంకేత్యమితి.

అవ॥ సాంకేత్యమిత్యాది శ్లోకమున పుత్ర నామమునే గ్రహించినాడు భగవంతుని నామము కాదు అను ప్రశ్నకు సమాధానము చెప్పు–చున్నాడు.

శ్లో॥ సాంకేత్యం పారిహాస్యం వా స్తోభం హేలనమేవ వా ।
వైకుంఠనామగ్రహణమశేషాఘహరం విదుః ॥ (14)

తా॥ పుత్రాదుల పేరుగానైనను, సంకేతము పూర్వకముగా నైనను, అవమాన (పరిహాస) పూర్వకముగానైనను, వైకుంఠ నామోచ్చారణము పాపహరమని తెలుసుకొనుడు. 14

టీ॥ సాంకేత్యం పుత్రాదౌ సంకేతితమ్. పారిహాస్యమ్ పరిహాసేన కృతం స్తోభం గతాలాప పురాణార్థం కృతం హేళనం కిం విష్ణునేతి సావజ్ఞమపి చ వైకుంఠనామోచ్చారణమ్. ॥14॥

టీ॥ సంకేత రూపమునగాని, పరిహాసము కొఱకుగాని, ఊత పదము గానైనను, హేళన పూర్వకముగానైనను, వైకుంఠవాసియగు శ్రీహరి నామగ్రహణము(నామమునుచ్చరించుట) అన్ని పాపములను విశేష ముగా తొలగించునని చెప్పెదరు. సంపూర్ణనామోచ్చారణ చేయలేక పోయినను నామైకదేశోచ్చారణము కూడా సరిపోవునని ఫలప్రదమేనని భావము. ॥14॥

అవ॥ ననునాయం సంకల్పపూర్వకం వైకుంఠనామాగ్రహీత్కింతు పుత్రస్నేహపరవశస్సన్ తత్రాహుః– పతిత ఇతి.

అవ॥ సంకల్పపూర్వకముగా హరినామమును గ్రహించలేదు. పుత్ర ప్రేమచేత పరవశుడై గ్రహించినాడు. అది ఎట్లు పాపమునుపోగొట్టున–నుటకు పతిత ఇత్యాది శ్లోకమున సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ పతితః స్ఖలితో భగ్నః సందష్టస్తప్త ఆహతః ।
హరిరిత్యవశేనాహ పుమాన్నార్హతి యాతనామ్ ॥ (15)

తా॥ పడిపోయినగాని, జారిపోయినగాని, అవయవములు భగ్నమైనను కాని, ఏదైనకరచినప్పుడుగాని, తాపమును పొందినప్పుడు గాని, కొట్టబడినప్పుడుగాని అవశుడై హరినామముచ్చరించినచో అతడు నరకయాతనలకు అర్హుడు కాడు. 15

టీ॥ అవశేనాపి యో హరిరిత్యాహ స యాతనాం నార్హతి. పుమా నిత్యనేన నాత్ర వర్ణాశ్రమాదినియమ ఇత్యుక్తమ్. అవశత్వమేవాహ - పతితః ప్రాసాదిభ్యః. స్ఖలితో మార్గే. భగ్నో భగ్నగాత్రః. సందష్టః సర్పాదిభిః తప్తో జ్వరాదినా. ఆహతో దండాదినా. ॥15॥

టీ॥ పుమాన్ అనుటచేత ఏ వర్ణాశ్రమాది నియమములు లేనివాడను అర్థము సిద్ధించుచున్నది. అవశుడైనను ఎవరు హరినామముచ్చరించు దురో వారు నరకయాతనలు పొందరు. ప్రాసాదములు మొదలగువాని నుండి, మార్గముల నుండి పతితులైనవారు కాని, శరీరము భగ్నమైన వారు కాని, సర్పాదులచే కఱవబడినవారు కాని, జ్వరాది తాపములుగల వారైనను, దండాదులచే కొట్టబడినవారైనను, ఎవరైనను అవశుడే. 15

అవ॥ నను మహతః పాపస్య మహదేవ ప్రాయశ్చిత్తం యుక్తం నన్వల్పం నామగ్రహణ మాత్రమ్ పాపతారతమ్యేన కృచ్ఛ్రాది తారతమ్య వత్, తత్రాహుర్ద్వాభ్యామ్- గురుణామితి.

అవ॥ కృచ్ఛ్రాదిప్రాయశ్చిత్తముల వలె పాపతారతమ్యముల బట్టి, మహత్తరమైన పాపమునకు మహత్తరమైన ప్రాయశ్చిత్తము యుక్తము కాగా అల్పమైన భగవన్నామ గ్రహణము ప్రాయశ్చిత్తమెట్లో గురూణా మిత్యాది రెండు శ్లోకములలో చెప్పబడుచున్నది.

శ్లో॥ గురూణాం చ లఘూనాం చ గురూణి చ లఘూని చ ।
ప్రాయశ్చిత్తాని పాపానాం జ్ఞాత్వోక్తాని మహర్షిభిః ॥ (16)

తా॥ పెద్ద పాపములకు పెద్ద ప్రాయశ్చిత్తములు, చిన్న పాపములకు చిన్న ప్రాయశ్చిత్తములు మమర్షుల చేత తెలుసుకొని చెప్పబడినవి. 16

టీ॥ గురూణాం పాపానాం గురూణి ప్రాయశ్చిత్తాని లఘూని లఘూనాం చ తారతమ్యం జ్ఞాత్వా మన్వాది భిరుక్తాని అతస్తత్ర తథైవ వ్యవస్థా హరినామ్నస్తు నేయం వ్యవస్థోక్తా విష్ణోః స్మరణ మాత్రేణ ముచ్యతే సర్వపాతకైః" ఇతి వచనాత్. న చ సురా బిందు పానే మహా పాతకత్వ స్మరణవన్నామ్నస్థత్ప్రాయశ్చిత్తత్వ స్మరణస్యాయమతి భారః ॥16॥

టీ॥ మన్వాది మహర్షులచేత, మహాపాపములకు, అల్పపాపములకు గల తారతమ్యమునుబట్టి కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతముల భేదములతో ప్రాయశ్చిత్తములు చెప్పబడి, అట్టి వ్యవస్థ ఏర్పాటు చేయబడినది. కాని హరినామమునకు ఈ వ్యవస్థ చెప్పబడలేదు."విష్ణోః స్మరణ మాత్రేణముచ్యతే సర్వపాతకైః" అనువచనము చేత విష్ణు స్మరణ మాత్రమున అన్ని పాపములు తొలగింపబడును. సురాబిందుపానముచే ఏర్పడు మహాపాపమునైనను, తొలగించుట హరినామమునకు భారము కాదు. 16

శ్లో॥ త్రైస్త్రాన్యఘాని పూయంతే తపోదాన జపాదిభిః ।
నాధర్మజం తద్ధృదయం తదపీశాంఘ్రి సేవయా ॥ (17)

తా॥ తపస్సు, దానము, జపము మున్నగువాని చేత పాపము నశించ వచ్చును. కాని అధర్మ సంకల్పము చేతపుట్టిన అతఃకరణము శుద్ధము కాదు. ఈశ్వరుని పాదసేవనము వలననే శుద్ధియగును. 17

టీ॥ కించ త్రైస్తపోదానాదిభిస్త్రాన్యఘాన్యేవ పూయన్తే నశ్యన్తి, అధర్మాజ్జాతం మలినం తు తస్య పాప కర్తుం హృదయం. యద్వా తేషామఘానాం హృదయం సూక్ష్మం రూపం సంస్కారాఖ్యం న శుధ్యతి తదపీశాంఘ్రిసేవయా కీర్తనాదినా శుధ్యతీర్థః-అయన్య భావోమహాన్త్యపి పాపాని సకృదుచ్చారితేనైవ నామ్నా నశ్యన్తి సకృత్ప్రవర్తి తేన దీపేనేవ గాఢధ్వాన్తాని. తదావృత్యా తు పాపాన్త రస్యానుత్పత్తిః. దీపధారణ

టీ॥ తపో దానాది క్రియలచేత పాపములు నశించుచున్నవి. కాని, అధర్మముచేత ఏర్పడిన మలినము ఆ పాపి హృదయమందు ధరించబడియే యుండును. ఆ పాప కర్మల యొక్క సూక్ష్మరూప సంస్కారములు నశించవు. అవి ఈశాఙ్ఘ్రిసేవవలన లేదా కీర్తనాదులచే మాత్రమే తొలగించబడునని అర్థము. ఒక్కసారి వెలిగించబడిన దీపముచేత గాఢాంధకారము తొలగిపోవునట్లుగా, ఒకసారి నామోచ్చారణచే గొప్ప

ఇవ తమోఽన్తరస్య. తతశ్చ వాసనాక్షయాత్ హృదయ శుద్ధిః. ఏతదర్థమేవ తత్ర తత్రావృత్తి విధానమ్. 'పాప క్షయశ్చ భవతి స్మరతాం తమహర్నిశమ్' ఇత్యాదిషు తదేవాత్రాప్యుక్తం గుణానువాదః ఖలు సత్వభావనః తదపీశాంఘ్రి సేవయా ఇతి చ అతోఽస్య హరినామ్నైవ సర్వ పాపక్షయో వాసనాక్షయస్తు మహాపురుష దర్శనాదిభిరితి. ॥17॥

పాపములు కూడ తొలగిపోవును. అప్పుడు నామము యొక్క ఆవృత్తిచే పాపాంతరము పుట్టకుండును. నిరంతర హరినామ స్మరణ చేత పాప క్షయము జరుగుచున్నది. వాసనాక్షయము చేత హృదయ శుద్ధి ఏర్పడును. ఇందులకే ఆవృత్తి విధానము చెప్పబడుచున్నది. ఈశాఙ్ఘ్రి సేవ చేత గుణముల కీర్తించుట వలన సత్త్వ స్వభావము కలుగును. హరినామస్మరణము వలన సర్వ పాప క్షయమును, వాసనా క్షయమును, మహాపురుషుల దర్శనాదులు కూడ కలుగుచున్నవి. ॥17॥

అవ॥ తథాపి పాపప్రాయశ్చిత్తమిదమితి జ్ఞాత్వా నోచ్చరితమితి చేత్తత్రాహుః - అజ్ఞానాదితి.

అవ॥ 'అజ్ఞానాదిత్యాది' శ్లోకమున భగవన్నామ స్మరణము పాప ప్రాయశ్చిత్తకరమని, తెలిసి భగవన్నామమును ఉచ్చరించ లేదు. అయినను పాప క్షయకరమని చెప్పుచున్నాడు.

శ్లో॥ అజ్ఞానాదథవా జ్ఞానాదుత్తమశ్లోకనామ యత్ ।
సంకీర్తితమఘం పుంసో దహత్యేధో యథాఽనలః ॥ (18)

తా॥ అజ్ఞానము వలనగాని, జ్ఞానము వలనగాని, కీర్తించబడిన హరి నామము అగ్నివలె పాపమును దహించును. 18

టీ॥ బాలకేనాజ్ఞానాదపి ప్రక్షిప్తోఽగ్నిర్యథా కాష్ఠరాశిం దహతి తద్వత్. ॥18॥

టీ॥ బాలకుడు అజ్ఞానముచేత నిప్పును వెలిగించిన అది కాష్ఠరాశిని (కట్టెలమోపును) ఏ విధముగా కాల్చునో అట్లే అజ్ఞానము చేత హరినామ స్మరణ చేసినను అది పాప క్షయకరము కాగలదు. ॥18॥

అవ॥ నన్విదమపి పర్షదనుపదిష్టం శ్రద్ధాహీనం చ కథం ప్రాయశ్చిత్తం స్యాత్తత్రాహుః యథేతి.

శ్లో॥ యథాఽగదం వీర్యతమముపయుక్తం యదృచ్ఛయా ।
అజానతోఽప్యాత్మగుణం కుర్యాన్మన్త్రోఽప్యుదాహృతః ॥ (19)

టీ॥ అగదమౌషధం వీర్యవత్తమమితి వక్తవ్యే వీర్యతమమిత్యుక్తం యదృచ్ఛయా శ్రద్ధాది హీనముపయుక్తం భక్షితమ్ పర్షన్ముఖాదజానతోఽపి స్వగుణమార్యోగం కుర్యాత్. మన్త్రోఽపి నామాత్మకస్తదాస్వకార్యం కుర్యాదేవ. న హి వస్తుశక్తిః శ్రద్ధాదికమపేక్షతే ఇత్యర్థః। తదుక్తం విష్ణుధర్మేషు "హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవ హి పావక" ఇతి. ॥19॥

:

అవ॥ యథేత్యాది శ్లోకమున శ్రద్ధా హీనముగా పలికిన హరినామము వలన ప్రాయశ్చిత్తము ఎట్లగునో చెప్పబడుచున్నది.

తా॥ ఏ విధముగా వీర్యవంతమైన ఔషధము తెలియకున్నను (యాదృచ్ఛికముగా) వాడబడినచో అది తన గుణమును కనబరచునో అట్లే ఉచ్చరించబడిన మంత్రము(నామము) కూడ(తనప్రభావమును చూపును) 19

టీ॥ ఏ విధముగా బలమైన ఔషధమును శ్రద్ధాహీనుడై గ్రహించినను వానికి ఔషధ గుణ కారణముగా ఆరోగ్యమును కలిగించునో అట్లే మంత్రము కూడ నామాత్మకమైనను దాని పని అది చేయును. వస్తుశక్తికి శ్రద్ధతో పనిలేదు. ఇష్టము లేకుండా అగ్నిని తాకినప్పటికి అది ఏ విధముగా కాల్చునో అట్లే దుష్టచిత్తులైనప్పటికి హరినామ స్మరణ మాత్రము చేత వారి పాపములు దహించివేయబడుచున్నవి. హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవ పావకఃఅని విష్ణు ధర్మమున చెప్పబడినది. (మంత్ర శబ్దము యొక్క భూమిక ఇక్కడ పోషింపబడుచున్నది.) ॥19॥

శ్రీశుక ఉవాచ

శ్లో॥ త ఏవం సువినిర్ణీయ ధర్మం భాగవతం నృప ।
తం యామ్యపాశాన్నిర్ముచ్య విప్రం మృత్యోరమూముచన్ ॥ (20)

శ్రీశుకులు పలికిరి

తా॥ ఓ మహారాజా! ఈ విధముగా భాగవత ధర్మమును చక్కగా నిర్ధారించి, ఆ విప్రుని(అజామిలుని) యమపాశముల (మృత్యువు) నుండి విడిపించిరి. 20

టీ॥ తం విప్రం అమూముచన్ మోచయామాసుః. ॥20॥

టీ॥ ఆ విప్రుని విడిపించిరి. 20

శ్లో॥ ఇతి ప్రత్యుదితా యామ్యా దూతా యాత్వా యమాంతికే ।
యమరాజ్ఞే యథా సర్వంసమాచఖ్యురరిందమ। ॥ (21)

తా॥ ఓ అరిందమా! ఇట్లు బదులు చెప్పబడిన యమదూతలు యముని సమీపమునకు వెళ్ళి యమధర్మరాజునకు సర్వమును విన్నవించిరి. 21

టీ॥ ప్రత్యుదితా నిరాకృతాః సంతో యాత్వా–గత్వా– యమరాజాయ యథా వత్కథయామాసుః. ॥21॥

టీ॥ విష్ణుదూతల చేత ఈ విధముగా నిరాకరించబడిన యమ దూతలు జరిగిన వృత్తాంతమును యమధర్మరాజునకు విన్నవించిరి. 21

శ్లో॥ ద్విజః పాశాద్వినిర్ముక్తో గతభీః ప్రకృతిం గతః ।
వవందే శిరసా విష్ణోః కిఙ్కరాన్దర్శనోత్సవః ॥ (22)

తా॥ మృత్యుపాశము నుండి విడిపించబడినవాడై, భయము తొలగిన వాడై స్వస్థతను పొంది విష్ణుదూతలను చూచుటచే ఆనందమును పొందినవాడై ఆ బ్రాహ్మణుడు వారికిశిరస్సువంచి నమస్కరించెను. 22

టీ॥ దర్శనేనోత్సవః యస్య – దర్శనోత్సవః. ॥22॥

టీ॥ దర్శనమున సంతోషము ఎవరికి కలుగునో వాడు దర్శనోత్సవుడు. 22

శ్లో॥ తం వివక్షుమభిప్రేత్య మహాపురుష కిఙ్కరాః ।
సహసా పశ్యతస్తస్య తత్రాన్తర్దధిరేऽనఘ ॥ (23)

తా॥ ఓ అనఘా! మాటలాడగోరుచున్న ఆ విప్రుని గమనించిన వెంటనే ఆ పురుషోత్తమ కింకరులు అతడు చూచుచుండగనే అచట అంతర్ధాన మొందిరి. 23

టీ॥ వివక్షుం వక్తుమిచ్ఛంతం అభిప్రేత్యజ్ఞాత్వా. ॥23॥

టీ॥ మాటలాడగోరుచున్నవానిగా తెలుసుకొని. ॥23॥

శ్లో॥ అజామిళోऽప్యథాకర్ణ్య దూతానాం యమకృష్ణయోః ।
ధర్మం భాగవతం శుద్ధం త్రైవిద్యం చ గుణాశ్రయమ్ ॥ (24)

శ్లో॥ భక్తిమాన్భగవత్యాశు మహాత్మ్య శ్రవణాద్ధరేః ।
అనుతాపో మహానాసీత్స్మరతోऽశుభమాత్మనః ॥ (25)

తా॥ యమదూతలు చెప్పినట్టి వేదోక్తమైన త్రిగుణాత్మక ఆశ్రయము గల ధర్మమును, విష్ణుదూతలు చెప్పిన శుద్ధమైన భాగవత ధర్మమును అజామిళుడు విని ఆ తరువాత శ్రీహరి యొక్క మహిమను వినుట వలన భగవానుని యందు భక్తిగలిగినవాడై తాను చేసిన పాపమును (అశుభములను) స్మరించుకొని వెంటనే అధికమైన పశ్చాత్తాపమును పొందెను. 24.25

టీ॥ అథేతి త్రైవిద్యం వేదత్రయ ప్రతిపాద్యం గుణాశ్రయం. యమ దూతానాం ధర్మం కృష్ణదూతానాం చ భాగవతం భగవత్ప్రణీతం శుద్ధం నిర్గుణం ధర్మమాకర్ణ్యేతి యోజ్యం. భక్తిమానాసీదిత్యుత్తర స్యానుషఙ్గః ॥24,25॥

టీ॥ అజామిళుడు యమదూతలచే చెప్పబడిన వేదత్రయ ప్రతిపాద్యమైన గుణాశ్రయమైన శుద్ధ ధర్మమును, విష్ణుదూతలచే చెప్పబడిన భగవత్ ప్రణీతమైన శుద్ధ భాగవత ధర్మములను విని, భగవంతుని మాహాత్మ్యమును ధరించి తన అశుభకృత్యముల స్మరించుచు పశ్చాత్తాపమును పొందెను. ॥24,25॥

అవ॥ అనుతాపం ప్రపంచయతి – అహో ఇతి చతుర్భిః.

అవ॥ అహో ఇత్యాది నాలుగు శ్లోకములలో పశ్చాత్తాపమును విస్తరించుచున్నాడు.

శ్లో॥ అహో మే పరమం కష్టమభూదవిజితాత్మనః ।
యేన విప్లావితం బ్రహ్మ వృషల్యాంజాయతాత్మనా ॥ (26)

తా॥ అహో! మనస్సును జయించని నాకు పరమకష్టము (ఆపద) కలిగినది. నేను దాసియందు (వృషల) పుత్రుని రూపమున జన్మించి, (పుత్రునికని) వేద ధర్మమును నాశనమొనర్చితిని. 26

టీ॥ యేనాత్మనా మయా వృషల్యాం పుత్ర తయా జాయమానేన బ్రహ్మ బ్రాహ్మణ జాతిః విప్లావితం నాశితం. ॥26॥

టీ॥ తాను చేసిన దోషమునకు పశ్చాత్తాపమును పొందుచున్నాడు. వృషలి యందు సంతానమునుకని బ్రాహ్మణత్వమును కలంకితము చేసుకొంటిని. ॥26॥

శ్లో॥ ధిఙ్మాం విగర్హితం సద్భిర్దుష్కృతం కులకజ్జలమ్ ।
హిత్వా బాలాంసతీం యోఽహం సురాపామసతీమగామ్॥27

తా॥ దుష్కృత్యములు చేసిన నేను సత్పురుషులచే నిందింపబడితిని. అమాయకురాలును, పతివ్రతను అయినట్టి భార్యను వదిలిపెట్టి మద్యపానము చేయు అపవిత్రురాలిని పొంది, వంశమునకు కలంకము తెచ్చిన నేను నిందింపబడుదును గాక. 27

టీ॥ దుష్కృతం దోషకర్తారం కులస్య కజ్జలం కలంకమ్. ॥27॥

టీ॥ దోషముచేయుచున్న – కులమునకు కలంకమైన. ॥27॥

శ్లో॥ వృద్ధావనాథౌ పితరౌ నాన్యబంధూ తపస్వినౌ ।
అహో మయాధునా త్యక్తావకృతజ్ఞేన నీచవత్ ॥ (28)

తా॥ అయ్యో! అనాథలు, వృద్ధులు, బంధువులులేనివారు, తాపసులగు తల్లి దండ్రులను, నీచుని వలె కృతఘ్నుడనై విడిచి పెట్టితిని. 28

శ్లో॥ సోఽహం వ్యక్తం పతిష్యామి నరకే భృశదారుణే ।
ధర్మఘ్నాః కామినో యత్ర విన్దన్తి యమయాతనాః ॥ (29)

తా॥ అట్టి నేను నిశ్చయముగా ధర్మమునకు హాని కలిగించిన వారలు కాముకులు ఎక్కడైతే, యమ యాతనల ననుభవించుదురో, అట్టి మిక్కిలి దారుణమైన నరకమునందు పడుదును. ॥28,29॥

టీ॥ నాస్త్యన్యో బన్ధుః పుత్రాదిర్యయోః. తపస్వినౌ సంతప్తౌ. అధునా తత్క్షణమేవ. ॥28,29॥

టీ॥ ఇతర బంధువులు, పుత్రాదులు లేని తాపసులును, ఈ క్షణమందే (ఇప్పుడే) ॥28,29॥

అవ॥ ఇదానీం తస్య విమర్శపూర్వకం మోక్షక్రమమాహ - కిమిద మిత్యష్టభిః.

అవ॥ కిమిదమిత్యాది ఎనిమిదిశ్లోకములలో విమర్శ పూర్వకముగా అతను మోక్షము పొందిన క్రమము చెప్పబడుచున్నది.

శ్లో॥ కిమిదం స్వప్న ఆహోస్విత్సాక్షాద్దృష్టమిహాద్భుతమ్ ।
క్వ యాతా అద్య తే యే మాం వ్యకర్షన్పాశపాణయః ॥ (30)

తా॥ ఇది స్వప్నమా ఏమి? అట్లే అగుగాక! లేక ఈ అద్భుతమును ప్రత్యక్షముగనే చూచితినా! చేతుల యందు పాశములు కలిగి, నన్ను లాగివేసిన వారు ఎక్కడికి వెళ్లిరి? 30

టీ॥ సాక్షాత్ప్రత్యక్షమిహ జాగ్రతైవ దృష్టం. ॥30॥

టీ॥ జాగ్రదవస్థలో మేలుకొనియే ప్రత్యక్షముగా ఈఅద్భుతమును చూచితిని. ॥30॥

శ్లో॥ అథ తే క్వ గతాః సిద్ధాశ్చత్వారశ్చారుదర్శనాః ।
వ్యమోచయన్నీయమానం బద్ధ్వా పాశైరధోభువః ॥ (31)

తా॥ పాశములతో బంధించి అధో లోకమునకు (నరకమునకు) కొనిపోబడుచున్న నన్ను ముక్తినిగా చేసిన సుందర రూపములు గల ఆ నలుగురు సిద్ధ పురుషులు ఎచటికి వెళ్ళిరి? 31

టీ॥ యే మాం వ్యమోచయన్ తే చ క్వ గతాః. ॥31॥

టీ॥ ఎవరైతే నన్ను విడిచినారో వారు ఎచటికి వెళ్ళిరి? ॥31॥

శ్లో॥ అథాపి మే దుర్భగస్య విబుధోత్తమ దర్శనే ।
భవితవ్యం మఙ్గలేన యేనాత్మా మే ప్రసీదతి ॥ (32)

తా॥ అయినప్పటికిని, దురదృష్టవంతుడనగు నాకు దేనిచే మనస్సు ప్రసన్నమగునో అట్టి పుణ్య పురుషుల (విబుధోత్తముల) దర్శనము కలుగు పుణ్యము ఉండియే తీరును. 32

టీ॥ యద్యప్యహమస్మిన్ జన్మని దుర్భగః పాపీయాన్ అథాపి జన్మాన్తరే నూనం పుణ్యవానిత్యాహ - విభుదోత్తమదర్శన ఇతి నిమిత్త సప్తమీ తేషాం దర్శనార్థం పూర్వేణ మఙ్గలేన మహతా పుణ్యేన భవితవ్యం యేన దర్శనేన. ॥32॥

టీ॥ ఈ జన్మమందు నేను భాగ్యహీనుడను, పాపాత్ముడను అయినను జాన్మాంతరమందు పుణ్యము చేసినవాడనే అని చెప్పుచున్నాడు. ఈ జన్మలో దుర్లభమైన విబుధుల (విష్ణుదూతల) దర్శనము కలుగుట పూర్వజన్మలో ఆచరించిన మంగళకరమైన కర్మల వలననే సాధ్యమైనది. విబుధోత్తముల దర్శనము పొందుట (పొందుటయందు) అని సప్తమీ ప్రయోగము. ॥32॥

శ్లో॥ అన్యథా మ్రియమాణస్య నాశుచేర్వృలీ పతేః ।
వైకుణ్ఠనామగ్రహణం జిహ్వా వక్తుమిహార్హతి ॥33॥

తా॥ అట్లు కానిచో, శూద్ర స్త్రీపతిని, అపవిత్రుడను, మరణించు చున్నట్టి వాడనయిన నా నాలుక శ్రీహరి నామములు గ్రహించుటకు తగి ఉండదు. 33

టీ॥ అన్యథా పూర్వం పుణ్యం వినా. కథం భూతం వైకుణ్ఠనామ గృహ్యతే వశీక్రియతే చిత్తమనేనేతి గ్రహణం. ॥33॥

టీ॥ పూర్వ పుణ్యము లేకుండా వైకుంఠ నామములను గ్రహించుట ఎట్లు కలుగును? నా చిత్తముఎట్లు వశీకరించబడినది. ॥33॥

శ్లో॥ క్వ చాహం కితవః పాపో బ్రహ్మఘ్నో నిరపత్రపః ।
క్వ చ నారాయణేత్యేతద్భగవన్నామ మఙ్గలమ్ ॥ (34)

తా॥ మోసగాడను, పాపిని, బ్రాహ్మణోచిత కర్మలను విడనాడిన - వాడను, సిగ్గులేని వాడను అగు నేనెక్కడ? నారాయణా యను మంగళకరమైన నామమెక్కడ! ॥34॥

శ్లో॥ సోఽహం తథా యతిష్యామి యతచిత్తేన్ద్రియానిలః ।
యథా న భూయ ఆత్మానమన్ధే తమసి మజ్జయే ॥ (35)

తా॥ ఇక ముందు మరల అజ్ఞానాంధకారమునందు నా మనస్సు మునగ కుండ యుండునో అట్లు నేను ప్రయత్నించెదను.॥35॥

శ్లో॥ విముచ్య తమిమం బన్ధమవిద్యాకామ కర్మజమ్ ।
సర్వభూత సుహృచ్ఛాన్తో మైత్రః కరుణ ఆత్మవాన్ ॥ (36)

తా॥ అవిద్యా కామ్యకర్మల వలన పుట్టిన బంధమును విడిచిపెట్టి సర్వభూతముల హితమును కోరువాడను, శాంతుడను, స్నేహ శీలుడను, దయగలవాడను, ఇంద్రియ సంయమనముగలవాడ నగుదును. ॥36॥

శ్లో॥ మోచయే గ్రస్తమాత్మానం యోషిన్మయ్యాత్మ మాయయా ।
విక్రీడితో యయైవాహం క్రీడామృగ ఇవాధమః ॥ (37)

తా॥ ఏ స్త్రీరూపములోనున్నట్టి ఆత్మ మాయచే అధముడను అగు నేను క్రీడామృగమువలె ఆడించబడితినో (దానినుండి) అట్టి నన్ను విడిపించుకొనెదను. 37

టీ॥ బ్రహ్మఘ్నః విప్రత్వ నాశకః. ॥34,35,36,37॥

టీ॥ బ్రాహ్మణత్వమును నాశము చేసినవాడు.॥34,35,36,37॥

శ్లో॥ మమాహమితి దేహాదౌ హిత్వాఽమిథ్యార్థధీర్మతిమ్ ।
ధాస్యే మనో భగవతి శుద్ధం తత్కీర్తనాదిభిః ॥ (38)

తా॥ మిథ్యా భోగములందు బుద్ధిగల నేను దేహము మున్నగు వాని యందలి మమకారాహంకారము విడిచిపెట్టి కీర్తనాదులచే శుద్ధమైన మనస్సును భగవానుని యందు నిలిపెదను. ॥38॥

టీ॥ అమిథ్యాభూతేఽర్థే ధీర్యస్యసః తథా భూతస్సన్ దేహాదౌ మమాహమితి మతిం మనోధాస్యే అమీత్యార్థధీః – అమిథ్యాభూతే అర్థే ధీః యస్య సః. ॥38॥

టీ॥ మిథ్యాభూతము కాని (సత్యమైన) అర్థమందు బుద్ధి ఎవనికో వాడు అమిథ్యార్థ ధీః. (సత్యార్థ బుద్ధిగలవాడు) అట్టి సత్యార్థ బుద్ధిని పొంది దేహాదుల యందు నాది నేననెడి భావములను వీడి భగవంతుని యందు మనస్సు నుంచెదను. ॥38॥

శ్లో॥ ఇతి జాత సునిర్వేదః క్షణ సంగేన సాధుషు ।
గంగాద్వారముపేయాయ ముక్తసర్వాను బన్ధనః ॥ (39)

తా॥ ఈ విధముగా క్షణకాలము సత్పురుషుల సంగముచే కలిగిన చక్కని వైరాగ్యముచే అన్ని బంధముల నుండి ముక్తుడై హరిద్వారము చేరెను. 39

టీ॥ ముక్తం సర్వమనుబన్ధనం పుత్రాది స్నేహో యేన సః – ముక్త సర్వానుబన్ధనః. ॥39॥

టీ॥ పూర్తి అనుబంధము (పుత్రాది స్నేహబన్ధము) ఎవని చేత విడవబడినదో వాడు ముక్త సర్వానుబంధనుడు.॥39॥

శ్రీశుక ఉవాచ

శ్లో॥ స తస్మిన్ దేవ సదనే ఆసీనో యోగమాశ్రితః ।
ప్రత్యాహృతేంద్రియగ్రామో యుయోజ మన ఆత్మని ॥ (40)

టీ॥ ప్రత్యాహృత ఇంద్రియ గ్రామో యేన సః – ప్రత్యాహృతేంద్రియ గ్రామః. ॥40॥

శ్లో॥ తతో గుణేభ్య ఆత్మానం వియుధ్యాత్మ సమాధినా ।
యుయుజే భగవద్ధామ్ని బ్రహ్మణ్యనుభవాత్మని ॥ (41)

టీ॥ గుణేభ్యో దేహేంద్రియాదిభ్య ఆత్మానం వియుజ్య విశోధ్య ఆత్మ సమాధినా చిత్తైకాగ్రేణ భగవతో ధామ్ని స్వరూపే ॥41॥

శ్లో॥ యర్హ్యుపారతధీస్తస్మిన్నద్రాక్షీత్పురుషాన్ పురః ।
ఉపలభ్యోప లబ్ధా న్ప్రాగ్వవన్దే శిరసా ద్విజః ॥42॥

శ్రీశుకులవారు పలికిరి.

తా॥ అతడు ఆ దేవసదనమునందు కూర్చొని, యోగమును ఆశ్రయించి ఇంద్రియములనుపసంహరించి, మనస్సును ఆత్మను ఏకమొనర్చెను. (ఉంచెను) 40

టీ॥ ఎవనిచే ఇంద్రియసమూహము మరిపించబడినదో వాడు ప్రత్యాహృతేంద్రియగ్రాముడు. ॥40॥

తా॥ తరువాత మనస్సును గుణముల నుండి తొలగించి, నిశ్చల చిత్తముతో (సమాధితో) భగవంతుని నివాసస్థానమైన హృదయ మందున్న ఆత్మరూపమైన పరబ్రహ్మము నందు విలీనముచేసెను. 41

టీ॥ గుణములనగా దేహేంద్రియాదులను ఆత్మ యందు నిలిపి (ఆత్మను వివిక్తముచేసెను) ఏకాగ్రచిత్తముతో (నిశ్చల సమాధిచే) స్వస్వరూపము నందు నిలిపెను. ॥41॥

తా॥ భగవానుని యందు నిశ్చలమైన మనస్సుగల కాలములో ఆ బ్రాహ్మణుడు ఇంతకు పూర్వము తనచే చూడబడిన పురుషులను గుర్తు బట్టి శిరస్సుతో నమస్కరించెను. 42

శ్లో॥ హిత్వా కలేవరం తీర్థే గంగాయాం దర్శనాదను ।
సద్యః స్వరూపం జగృహే భగవత్పార్శ్వ వర్తినామ్ ॥ (43)

తా॥ వారి దర్శనానంతరము తన దేహమును గంగాతీర్థమందు (హరిద్వారము నందు) విడిచిపెట్టి వెంటనే భగవానుని అనుచరుల రూపమును స్వీకరించెను. ॥43॥

శ్లో॥ సాకం విహాయసా విప్రో మహాపురుషకింకరైః ।
హైమం విమానమారుహ్య యయౌ యత్ర శ్రియః పతిః॥ (44)

తా॥ ఆ విప్రుడు మహా పురుషానుచరులతో (శ్రీహరిపార్శ్వదులతో) కూడి బంగారు విమానమునధిరోహించి ఆకాశమార్గమున లక్ష్మీపతి స్థానమును (వైకుంఠము) గూర్చి వెళ్ళెను. ॥44॥

టీ॥ తస్మిన్ భగవద్ధామ్నీ ఉపారతౌ నిశ్చలా ధీర్యస్య సః తస్మిన్ కాలే ఉద్రాక్షీదితి వా. పురః పురతః. తతశ్చ ప్రాగుపలబ్ధానేవ తానుపలభ్య ప్రత్యభిజ్ఞాయ వవందే. ॥42,43,44॥

టీ॥ ఉపారతధీః-ఉపారతధీః యస్య సః- విశ్రాంతమైన బుద్ధి ఎవనికో వాడు ఉపారతధీయుతుడు (నిశ్చల బుద్ధి పొందినవాడు) అదే సమయమున నిశ్చల ధ్యానమగ్నుడై తన ముందున్న పూర్వము చూడబడిన విష్ణుదూతలను చూచి గుర్తించి ప్రణమిల్లెను. (42,43,44)

అవ॥ ఉపసంహరతి ఏవం ఇతి ద్వాభ్యామ్.

అవ॥ ఏవం ఇత్యాది రెండు శ్లోకములలో ఉపసంహరిస్తున్నారు.

శ్లో॥ ఏవం స విప్లావిత సర్వధర్మా
దాస్యా పతిః పతితో గర్హ్య కర్మణా ।
నిపాత్యమానో నిరయే హతవ్రతః
సద్యో విముక్తో భగవన్నామ గృహ్ణన్ ॥ (45)

తా॥ ఈ విధముగా ధర్మ భ్రష్టుడు, నిందింప తగిన కర్మలచే పతితుడు, దాసీపతియై చెడిన వ్రతములుగలవాడు, నరకమందు పడవేయబడు చున్నను, భగవానుని నామమును ఉచ్చరించుచూ వెంటనే విముక్తుడయ్యెను. ॥45॥

టీ॥ విప్లావితాః సర్వే ధర్మా యేన హతం వ్రతం హతవ్రతః-హతం వ్రతం స్వదార నియమాది యస్య 45

టీ॥ ఎవని చేత అన్ని ధర్మములు వదిలివేయబడినవో వాడు విప్లావిత స్వధర్ముడు. (స్వదార) ఏకపత్నియు, పత్నీమాత్ర సంభోగాది నియమములను వదిలిపెట్టినవాడు హతవ్రతుడు.॥45॥

శ్లో॥ నాతః పరం కర్మనిబన్ధకృన్తనం
ముముక్షతాం తీర్థపదానుకీర్తనాత్ ।
న యత్పునః కర్మసు సజ్జతే మనో
రజ స్తమోభ్యాం కలిలం తతోఽన్యథా ॥ (46)

తా॥ కావున మోక్షము కోరువారలకు పవిత్ర పదములు గల వానిని (శ్రీహరిని) కీర్తించుటకన్న కర్మబంధమును తొలగించునది మరొకటి లేదు. ఏలయనగా శ్రీహరి కీర్తన వలన కర్మల యందు మరల ఆసక్తిని పొందదు. ఇతరమైన ప్రాయశ్చిత్త కర్మల అనంతరము రజస్తమో గుణాదులచే మనస్సు మరలా మలినమగును. 46

టీ॥ కర్మ నిబంధస్య పాపమూలస్య కృంతనం ఛేదకం అతః పరం నాస్తి. కస్మాత్పరమ్. తీర్థపదస్యానుకీర్తనాత్ . తత్ర హేతుః - యద్యతోఽనుకీర్తనాత్ . తతోఽనుకీర్తినాత్. అన్యథా ప్రాయశ్చింత్తాంతరే రజస్తమోభ్యాం కలిలం యత్త మలినమేవ తిష్ఠతి. 46

టీ॥ కర్మబంధములకు మూలమైన పాపమును ఛేదించుటకు భగవన్నామ కీర్తనముకన్న మరొక ప్రాయశ్చిత్తము లేదు. అందుకు హేతువు - ఎవనిని కీర్తించుటచే కర్మలయందు ఆసక్తిని పొందరో - ఇతర ప్రాయశ్చిత్తములు రజస్తమోగుణముల మాలిన్యమును తొలగింపజాలవు. మనస్సును మరల కర్మల నుండి నివర్తింపజాలవు. 46

శ్లో॥ య ఏవం పరమం గుహ్యమితిహాసమఘాపహమ్ ।
శ్రుణు యాచ్ఛ్రద్ధయా యుక్తో యశ్చ భక్త్యాసుకీర్తయేత్ ॥ (47)

తా॥ పరమగుహ్యమైనట్టియు, పాపముల తొలగించునట్టియునగు ఈ ఇతిహాసమును ఎవడైతే శ్రద్ధతో వినునో, భక్తితో కీర్తించునో, అతడు అమంగళుడైనను (పాపియయినను) నరకముల పొందడు.

శ్లో॥ న వై స నరకంయాతి నేక్షితో యమకిఙ్కరైః ।
యద్యప్యమంగలో మర్త్యో విష్ణులోకే మహియతే ॥ (48)

యమకింకరులచే చూడబడడు. విష్ణు లోకమున ప్రతిష్ఠను పొందును. (47,48)

టీ॥ న చేక్షితో భవతి. (47,48)

టీ॥ చూడబడడు. ॥ 47,48 ॥

శ్లో॥ మ్రియమాణో హరేర్నామ గృణన్పుత్రోపచారితమ్ ।
అజామిలోஉప్యగాద్ధామ కిం పునః శ్రద్ధయా గృణన్॥ (49)

తా॥ మరణించుచున్నవాడైనను పుత్రునికి పెట్టిన హరినామమును స్వీకరించివాడై, అజామిళుడు వైకుంఠమును (పరంధామమును) పొందగా, శ్రద్ధతో శ్రీహరినామములనుచ్చరించు వాని పుణ్యముల గూర్చి మరల చెప్పదగినది ఏమున్నది? ॥49॥

టీ॥ మ్రియమాణోஉవశత్వేన శ్రద్ధావిహీనోஉపి. ॥49॥

టీ॥ శ్రద్ధా విహీనుడైనను మరణించుటకు అవశుడై ॥49॥

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే
ద్వితీయోஉధ్యాయః

శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆఱవ స్కంధమున
రెండవ అధ్యాయము సమాప్తము

తృతీయోధ్యాయః

గోపాలకృష్ణాయనమః

అవ॥ తృతీయే తు యమేనాపి వైష్ణవోత్కర్షవర్ణనైః. సాంతయిత్వా స్వదూతాస్తే వైష్ణవే కింజరీకృతాః. విష్ణుదూతైర్నిర్ణీతం శాస్త్రార్థం యమ ముఖేన దృఢయితుం తృతీయాధ్యాయారంభః

అవ॥ తత్ర యదుక్తం యమ రాజ్ఞే యథా సర్వమాచక్షురితి తతః కిం తత్ర వృత్తమితి పృచ్ఛతి - నిశమ్యేతి.

రాజోవాచ

శ్లో॥ నిశమ్యదేవః స్వభటోపవర్ణితం
ప్రత్యాహ కిం తాన్ ప్రతి ధర్మరాజః ।
ఏవం హతాజ్ఞో విహతాన్ మురారే
ర్నైదేశికైర్యస్య వశే జనోఽయమ్ ॥ 1

టీ॥ మురారేర్నైదేశికైః కింకరైః ఏవం విహతాన్ నిరాకృతాన్. అత ఏవ హతా ఆజ్ఞా యస్య. యమస్య వశవర్త్యయం జనః సోఽపి తాన్ ప్రతి కిమాహ ॥1॥

మూడవ అధ్యాయము

గోపాలకృష్ణునికినమస్కారము

అవ॥ మూడవ అధ్యాయమునందు, విష్ణుదూతల చేత సేవకులుగా చేయబడిన, తన దూతలను ఊరడించి యమధర్మరాజు వైష్ణవులు (భక్తులు) వచించిన విష్ణునామ మాహాత్మ్యమును వర్ణించుట వివరించ-బడినది. విష్ణుదూతలచే నిర్ణయించబడిన శాస్త్రార్థమును యమధర్మ-రాజు ముఖమున దృఢపరచుట తృతీయాధ్యాయారంభము.

అవ॥ నిశమ్య ఇత్యాది శ్లోకమున (జరిగినవిషయము) విన్నవించబడిన తరువాత వృత్తాంతము పరీక్షిన్మహారాజుచే అడగబడుచున్నది.

రాజువలికెను

తా॥ తదపరి ఎవని వశమందు ఈ జీవుడు కలడో అట్టి ధర్మదేవత-యగు, ఆజ్ఞాభ్రష్టుడైన యమధర్మరాజు, మురారి యొక్క భటులచే నిరాకరించబడిన తన భటులు వర్ణించిన వృత్తాంతమును విని వారితో ఏమి బదులు పలికెను? 1

టీ॥ ఈ విధముగా విష్ణుదూతలచే విహతులైన తన దూతలతో, ఆజ్ఞా భ్రష్టుడైన యమధర్మరాజు ఏమని పలికెను? ॥1॥

అవ॥ అత్యాశ్చర్యమేతదిత్యాహ- యమస్యేతి.

శ్లో॥ యమస్య దేవస్య న దండభంగః
కుతశ్చనర్షే శ్రుతపూర్వ ఆసీత్ ।
ఏతన్మునే వృశ్చతి లోకసంశయం
న హి త్వదన్య ఇతి మే వినిశ్చితమ్ ॥ 2

టీ॥ హే ఋషే యమస్య దండస్యభంగః కుతశ్చన కస్మాచ్చిదపి. శ్రుతపూర్వో నాసీత్. ఏతదేతస్మిన్నర్థే యద్వా న శ్రుతపూర్వ ఏతద్యమదూత నిరాకరణం చాసీత్ అతః. సర్వస్యాపి లోకస్య సంశయో వర్తతే. తం చ త్వత్తోఽన్యో న ఛ్చినత్తీతి మే నిశ్చితమతః కథయేతి శేషః. ।2।

శ్రీశుక ఉవాచ

శ్లో॥ భగవత్పురుషై రాజన్యామ్యాః ప్రతిహతోద్యమాః ।
పతిం విజ్ఞాపయామాసుర్యమం సంయమినీపతిమ్ ॥ 3

అవ॥ యమస్యేత్యాది శ్లోకమున ఇది అత్యంత ఆశ్చర్యకరమనుట వివరించబడుచున్నది.

తా॥ ఓ మహర్షీ! యమదేవుని యొక్క దండమునకు భంగము వాటిల్లుట పూర్వము విని యుండలేదు. ఈ విషయమందు ఏర్పడు లోక సంశయమును తీర్చుటకు నీకన్న మరియొకరు సమర్థుడు లేడని నా నిశ్చయము. 2

టీ॥ ఓ మహర్షీ! ఈ విధమైన యమదండ వైఫల్యమును ఎవని వలన గాని, ఇంతకు పూర్వమునగాని, విని యుండలేదు. యమదూతల నిరాకరణమును గూడ విని యుండలేదు. ఈ విషయమై లోకములోని అందఱకును సంశయము కలదు. దానిని తొలగించగల సమర్థత మీ యందే యున్నదని మరియొకరి యందు లేదని నా నిశ్చయము. ఏతత్ అను పదము ఏతస్మిన్ అను అర్థమున ఉపయోగించబడినది.॥2॥

శ్రీశుకులు పలికిరి.

తా॥ ఓ పరీక్షిన్మహారాజా! శ్రీహరి అనుచరులచే ప్రయత్నమునకు విఘాతము కలిగిన యమదూతలు, తమ ప్రభువు, సంయమనీ నగరమునకు శాసకుడు అగు యమునకు ఇట్లు విన్నవించిరి. 3

టీ॥ భగవతః పురుషైః ప్రతిహత ఉద్యమో యేషాం తే - ప్రతిహతోద్యమాః యామ్యాః పురుషాః. 3

యమదూతా ఊచుః

శ్లో॥ కతి సంతీహ శాస్తారో జీవలోకస్య వై ప్రభో।
త్రైవిధ్యం కుర్వతః కర్మ ఫలాభివ్యక్తి హేతవః ॥ 4

టీ॥ కతి సంతీత్యాక్షేపోక్తిః. త్రివిధమ్. స్వార్థే వ్యజ్ త్రైవిధ్యం యథా భవతి తథా కర్మ కుర్వతః. తథా కర్మఫలాస్యాభివ్యక్తి హేతవః కతి సంతీతి. ॥4॥

అవ॥ సంతు బహువః కో బాధస్తత్రాహుః- యదీతి.

శ్లో॥ యది స్యుర్బహవో లోకే శాస్తారో దణ్డధారిణః ।
కస్య స్యాతాం న వా కస్య మృత్యుశ్చామృతమేవ వా ॥5॥

టీ॥ ప్రతిహతమైన ఉద్యమము గలవారు ఎవరో వారు ప్రతిహతోద్యములు. నిరాకరించబడిన ప్రయత్నము కలవారు. యముని యొక్క పురుషులు అనగా యమదూతలు. ॥3॥

య ం వ ం ద ా త ల ం వ లి కి రి

తా॥ ఓ ప్రభూ! మూడు విధములైన కర్మలను చేయుచున్నట్టి, జీవ సముదాయమును శాసించుచు, కర్మఫలములను ప్రకటించుటకు కారణమైనట్టివారు (ఈ సృష్టియందు) ఎందరు కలరయ్యా! 4

టీ॥ ఎంత మంది ఉన్నారన్నది ఆక్షేప రూప ప్రశ్నము. త్రివిధములైన కర్మలనాచరించు వారి కర్మలకు (జీవులకు) త్రివిధములైన ఫలముల నిచ్చు కారణులైన శాసకులు ఎందరు కలరయ్యా? ఇది కూడ ఆక్షేపణమునకు ప్రశ్నమే. ॥4॥

అవ॥ యదీత్యాది శ్లోకమున ఎక్కువ మంది ఉందురు గాక! బాధ ఏమియున్నది? అను ప్రశ్నమునకు సమాధానము చెప్పబడుచున్నది.

తా॥ లోకమందు దండించు శాసకులు అనేకులున్నచో మృత్యువు, (దుఃఖము) తద్రాహిత్యమును ఎవనికి లభించును? ఎవనికిని లభింపవు అని భావము. 5

శ్రీ॥ మృత్యుర్దుఃఖం. అమృతం సుఖం. తేషాం విప్రతిపత్తౌ. తే ఉభే కస్య స్యాతాం న కస్యాఽపి. పరస్పరవిరోధేనోభయోరపి ప్రతిబన్ధాత్. ఐకమత్యే తు కస్య వా న స్యాతాం ఏకః సుఖం కర్తుమిచ్ఛతి దుఃఖం చాన్యః. ఐకమత్యే చ తయోః పరస్పరకార్యానుమోదనే నోభయోరపి ప్రాప్తే కస్య వా తే ఉభే అపి న స్యాతామిత్యర్థః. (5)

టీ॥ మృత్యువనగా దుఃఖము. అమృతం అనగా సుఖము. సుఖ దుఃఖముల రెండింటి యందు కర్మ బంధమును శాసించు పరస్పర విరుద్ధ స్వభావములు గల శాసకులు ఉన్నపుడు ఒకరు సుఖమును మరొకరు దుఃఖమును కాంక్షిచుచో, పరస్పర విరోధ కారణముగా రెండును ప్రతిబంధింపబడును. ఇరువురిలో ఎవరి శాసనము ఆమోదించవలెను. ఐకమత్యములేని వారి పరస్పర కార్యములను ఆమోదించుటలో ఎవరిని కూడ ఆమోదింప చేయలేము కదా! వారి యందు ఐకమత్యమున్నను, లేకపోయినను సుఖ దుఃఖములు ఎవరికి కలుగ కుందును? ॥5॥

అవ॥ నను బహూనాం కర్మిణాం వ్యవస్థయా బహవః శాస్తారో భవంతు, తథా సతి నాయం దోషః స్యాత్తత్రాహుః కింత్వితి.

అవ॥ కింత్విత్యాది శ్లోకమున కర్మలు చేయువారు పెక్కులైన, వ్యవస్థల యందు శాసకులు పెక్కుమంది ఉండుట దోషము కాదు కదా! అను పూర్వ పక్షముగా చెప్పుచున్నాడు.

శ్లో॥ కింతు శాస్తృబహుత్వే స్యాద్బహూనామిహ కర్మిణామ్ ।
శాస్తృత్వముపచారో హి యథా మండలవవర్తినామ్ ॥ 6

తా॥ కానిచో, ఈ లోకమందు అనేకులైన కర్మములు చేయు వారిని శాసించువారలనేకులున్నచో సామంతులకు వలె వారి శాసకత్వము ఔపచారికమే (నామమాత్రమే) యగును. 6

శ్రీ॥ బహూనాం కర్మిణాం వ్యవస్థయా తదా శాస్తృ బహుత్వే శాస్తృత్వం స్యాత్ ఘటేత కింతు తదా యతసర్వ శాస్తరి ముఖ్యం శాస్తత్వం తదేకదేశౌ ఉపచార మాత్రమేవ స్యాత్ యథా చక్రవర్తిన ఏవ ముఖ్యం శాస్తృత్వం మండలవర్తినాముపచార మాత్రం నిరంకుశ త్వాభావాత్.(6)

టీ॥ పెక్కు కర్మల వ్యవస్థ యందు పెక్కురు శాసకులున్నను ముఖ్య శాసకుడు ఒకడే యుండి అతని క్రింద మిగిలిన శాసకులు ఊడిగములు చేయువారి వలె, చక్రవర్తి మాత్రమే పూర్తి నిరంకుశాధికారము కలిగి, మండలాధీశులు తమ పరిధిలో మాత్రమే శాసకులైనట్లు, సర్వశాసకుని యాజ్ఞయే పాటించబడును. ॥6॥

శ్లో॥ అతస్త్వ మేకో భూతానాం సేశ్వరాణామధీశ్వరః ।
శాస్తా దండధరో నృణాం శుభాశుభ వివేచనః ॥ 7

తా॥ అందుచేత ప్రాణులకు (మనుష్యులకు) వారి పాప పుణ్యముల నిర్ణయించి దండించు వారలకు ఈశ్వరుడవు, శాసకుడవు, దండ-ధరుడవైన నీవొక్కడవే. 7

శ్రీ॥ యస్మాదేవం శాస్తృబహుత్వం న ఘటతే అతస్త్వమేక ఏవ శాస్తా. శుభాశుభే వివినక్తీతి తథా॥(7)

టీ॥ అందుచేత పెక్కు శాసకులుండుట ఘటించదు. కావున శుభాశుభ వివేచనము కలిగి శిక్షించు శాసకుడవు నీవొక్కడవే! ॥7॥

శ్లో॥ తస్య తే విహతో దండో న లోకే వర్తతేఽధునా ।
చతుర్భిరద్భుతైః సిద్ధై రాజ్ఞా తే విప్రలమ్భితా ॥ 8

తా॥ అట్టి నీ యొక్క దండనము ఇప్పుడు ఈ లోకమునందు ప్రవర్తిల్లుట లేదు. ఆశ్చర్యము కలిగించు నలుగురు సిద్ధ పురుషులచే నీ ఆజ్ఞ ఉల్లంఘించబడినది. 8

శ్రీ॥ విప్రలమ్భితా - వఞ్చితా - లఙ్ఘితేత్యర్థః॥(8)

టీ॥ వంచింపబడినది - ఉల్లంఘింపబడినది యని అర్థము. ॥8॥

అవ॥ తదేవాహుః - నీయమానమితి.

అవ॥ నీయమానిత్యాది శ్లోకమున అదియే (ఉల్లంఘింపబడుటయే) చెప్పబడుచున్నది.

శ్లో॥ నీయమానం తవాదేశాదస్మాభిర్యాతనాగృహాన్ ।
వ్యమోచయన్పాతకినం ఛిత్త్వా పాశాన్ప్రసహ్య తే ॥ 9

తా॥ నీ ఆదేశముననుసరించి మాచే యాతనా గృహమునకు తీసుకొనిరాబడుచున్న పాపిని వారు బలాత్కారముగ విడిపించిరి.॥9॥

శ్లో॥ తాంస్తే వేదితుమిచ్ఛామో యది నో మన్యసే క్షమమ్ ।
నారాయణేత్యభిహితే మాభైరిత్యాయయుర్ద్రుతమ్ ॥ 10

తా॥ (పాపిచే) "నారాయణా" అని పలుకబడగా 'భయపడకుము' అని శీఘ్రముగా వచ్చిన వారిని గూర్చి, మాకు క్షేమకరమని నీవు భావించినచో మీ నుండి తెలుసుకొనగోరుచున్నాము. ॥10॥

శ్రీ॥ తే త్వత్తః యదినోఽస్మాకం క్షమం హితం మన్యసే. అన్యథా అజ్ఞానత్తస్తదవజ్ఞానే తవాప్యనర్థస్స్యాత్. అతర్క్యో హి తేషాం ప్రభావః యతో నారాయణేతి కేవలమభిహితే మాభయం కుర్వితి వదంతః శీఘ్రమాగతాః. (9,10)

టీ॥ వారు మమ్ము తిరస్కరించుట, మిమ్ము తిరస్కరించినట్లేయని, మరొక విధముగా మా అజ్ఞానము వలన వారిని తెలుసుకొనకపోవుట మీకును అనర్థమే. వారి ప్రభువు అయిన నారాయణుని కేవలము స్మరించినంతనే 'భయపడకుము' అని పలుకుచూ శీఘ్రముగా వచ్చిరి, మాకు హితకరమని భావించినచో, మీ నుండి వారిని గూర్చి తెలుసుకో గోరుచున్నాము.॥ 9,10 ॥

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఇతి దేవః స ఆపృష్టః ప్రజా సంయమనో యమః ।
ప్రీతః స్వదూతాన్ప్రత్యాహ స్మరన్పాదామ్బుజం హరేః ॥ 11

శ్రీశుకులు పలికిరి.

తా॥ ఈ విధముగా ప్రజలను శాసించు యమదేవుణ్ణి ప్రశ్నించగా , సంతోషిచినవాడై, హరి యొక్క పాదపద్మములను స్మరించి, తన దూతలతో ఇట్లు పలికెను. 11

శ్రీ॥ ప్రజాః సంయమయతీతి తథా. (11)

టీ॥ ప్రజలను అదుపులో ఉంచువాడు యముడు. ॥11॥

యమ ఉవాచ

శ్లో॥ పరో మదన్యో జగతస్తస్థుషశ్చ
ఓతం ప్రోతం పటవద్యత్ర విశ్వమ్ ।
యదంశతోఽస్య స్థితి జన్మనాశా
నస్యోతవద్యస్య వశే చలోకః ॥ 12

యముడు పలికెను.

తా॥ ఎవని యందు చరాచర జగత్తు పడుగు పేకయై ఎట్లున్నదో, ఎవని యంశ వలన జగత్తు యొక్క సృష్టి స్థితి, లయములు కలుగునో, ముక్కు నందు త్రాడు వేయబడిన ఎద్దువలె ఎవని వశమందు ఈ లోకము కలదో అట్టి మరియొకడు నాకన్నను పరమైనవాడు (సర్వోత్కృష్టుడు) కలడు. 12

శ్రీ॥ మదన్యః మత్తోఽన్యః జగతః జంగమస్య తస్థుషశ్చ స్థావరస్య పరోఽధీశ్వరోఽస్తి. అహం తు జంగమానామేవ. తత్రాపి నృణామేవ. తత్రాపి పాపినా మేవ. తత్కింకరస్సన్ ఈశ్వరః సతు సర్వేశ్వరః కోఽసౌ. యత్ర యస్మిన్ విశ్వం. ఓతం ధీర్ఘ తంతుషు పటవద్గ్రథితం ప్రోతం చ. తిర్యక్తంతుషు. పటవత్గ్రథితం. యస్య చాంశేభ్యోః విష్ణు

టీ॥ స్థావర జంగమముల కతీతుడైన, నా నుండి భిన్నమైనవాడు, జగత్తును తన అధీనంలో ఉంచుకొను ప్రభువు కలడు. నేను కేవలము జంగములకు, అక్కడను మనుష్యులకు, అందునా పాపులకు మాత్రమే శాసకుడను. ఆ ప్రభువునకు కింకరుడను. అతడు సర్వేశ్వరుడు. ఎవని యందు ఈ విశ్వము, పై నుండి క్రిందకు నేయబడిన అడ్డము

బ్రహ్మ రుద్రేభ్యః అస్య జగతః స్థిత్యాదయో భవంతి. యస్య చ వశే లోకో వర్తతే నాసికాయాం. ప్రోత బలీవర్దవత్. ॥12॥

నిలువు దారములవలె (వస్త్రమువలె) నున్నదో, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, ఎవరి యంశములై ఈ లోకమును సృజించి, పరిపాలించి, లయము చేయుచున్నారో, ఎవని శ్వాసనము చేత ఈ లోకములు వర్తిల్లుచున్నవో, ముకుత్రాడు వేయబడిన ఎద్దువలె, ఎవని వశమందు ఈ లోకము కలదో అట్టి పరమేశ్వరుడు కలడు. ॥12॥

అవ॥ ఏతత్ప్రపంచయతి య ఇతి.

అవ॥ య ఇత్యాది శ్లోకమున దీనిని విస్తరించుచున్నాడు.

శ్లో॥ యోనామభిర్వాచి జనాన్నిజాయాం
బధ్నాతి తం త్యామివ ధామభిర్గాః -
యస్మై బలిం త ఇమే నామకర్మ
నిబన్ధబద్ధాశ్చకితా వహన్తి ॥ 13

తా॥ ఎవడు జనులను వాక్కు నందలి నామములతో, త్రాటితో ఎద్దులను బంధిచినట్లు బంధించుచున్నాడో, నామములతో మరియు కర్మములతో బంధించబడి, భీతులైనవారు ఎవరి అధీనులై ఎవని కొఱకు బలిని కొనిపోవుచున్నారో (అట్టిమరియొకడు కలడని) ॥13॥

టీ॥ బ్రాహ్మణాది నామభిః వాచి వాగ్రూపాయాం నిజాయాం తన్త్యాం దామన్యాం జనాన్యో బధ్నాతి ధామభిర్గాః బలీవర్దానివ. త ఇమే జీవాః నామ కర్మభిర్నిబన్ధై దృఢ బన్ధ సాధనైః బద్ధాస్సంతః యస్మై బలిం వహంతి యదధీనాం కర్మ కుర్వన్తీత్యర్థః. ॥13॥

టీ॥ బ్రాహ్మణాది నామములతో వాక్కునందు బంధింపబడిన ఎవరికి వశులై త్రాటి యందు ఎడ్లవలె జీవులు నామ కర్మములను దృఢమైన సాధనములతో బంధింపబడినవారై ఎవని కొఱకు బలిని కొని పోవుదురో అనగా ఎవరికి అధీనులై కర్మ చేయుదురో అని భావము. 13

అవ॥ యస్య చ లీలా దుర్విభావ్యేత్యాహ అహమితి ద్వాభ్యామ్.

శ్లో॥ అహం మహేంద్రో నిరృతిః ప్రచేతాః
సోమోఽగ్నిరీశః పవనోఽర్కోవిరిఞ్చః ।
ఆదిత్య విశ్వే వసవోఽథ సాధ్యా
మరుద్గణా రుద్రగణాః ససిద్ధాః ॥ 14

శ్లో॥ అన్యే చ యే విశ్వసృజోఽమరేశాః
భృగ్వాదయోఽస్పృష్టరజస్తమస్కాః ।
యస్యేహితం న విదుః స్పృష్టమాయాః
సత్త్వప్రధానా అపి కిం తతోఽన్యే ॥ 15

టీ॥ న స్పృష్టం రజస్తమశ్చయైః ఈహితం అభిప్రేతం చేష్టితం వా న విదుః స్పృష్టమాయాః మాయయా స్పృష్టాః. తతస్తేభ్యోఽన్యే న విదురితి కిం పునర్వక్తవ్యమ్. ॥ 14,15 ॥

అవ॥ తన్మాయయా విమోహితత్వాన్న జానంతీత్యుక్తమ్ అవిషయత్వాచ్చ తస్యేత్యాహ - యమితి.

అవ॥ అహమిత్యాది రెండు శ్లోకములలో ఎవని యొక్క లీల(భగవల్లీల) భావింపరానిదో దానిని చెప్పుచున్నాడు.

తా॥ నేను, ఇంద్రుడు, నిరృతి, వరుణుడు, చంద్రుడు, అగ్ని, రుద్రుడు, ఈశానుడు, వాయువు, సూర్యుడు, బ్రహ్మ, ఆదిత్యులు, విశ్వేదేవతలు, వసువులు, సాధ్యులు, మరుద్గణములు, సిద్ధులు, రుద్ర గణములు; రజస్తమో గుణములచే స్పృశింపబడని, సత్త్వ గుణ ప్రధానులగు భృగువు మొదలగు వారు, మాయచేత స్పృశింపబడి, సర్వేశ్వరుని చేష్టలను తెలియకున్నాము. ఇక మిగిలిన వారిని గూర్చి చెప్పవలసినదేమి కలదు? ॥14,15॥

టీ॥ రజస్తమోగుణ స్పర్శలేనివారు కూడా భగవానుని మాయచేత స్పృశింపబడి, ఆతని చేష్టలను, కోరికలను(అభిప్రాయమును) తెలియజాలకున్నారు. అందుచేత అన్యులకు తెలియదని మళ్ళీ ఎందుకు చెప్పవలెను? ॥14,15॥

అవ॥ యమిత్యాది శ్లోకమున పరమేశ్వర మాయా మోహితుడై, విషయము కాని ఆత్మను తెలియడు అని చెప్పుచున్నాడు.

శ్లో॥ యం వై న గోభిర్మనసాఽసుభిర్వా
హృదా గిరా వాఽసుభృతో విచక్షతే ।
ఆత్మానమంతర్హృది సంతమాత్మనాం
చక్షుర్యథైవాకృతయస్తతః పరమ్ ॥ 16

తా॥ జీవుల హృదయమందు ఆత్మరూపుడుగా నున్న వానిని ఇంద్రియాదుల కంటెను అతీతమైన వానిని, ఇంద్రియములతో గాని, మనస్సుతో గాని, వాక్కుతో గాని, హృదయముతో గాని ప్రాణధారులగు జీవులు (రూపమును చూచు కన్ను తనను తాను చూడజాలనట్లు) తెలుసుకొనలేరు. ॥16॥

టీ॥ యం గోభిరింద్రియైః హృదా చిత్తేన న విచక్షతే న పశ్యంతి "యద్వాచాఽనభ్యుదితం యన్మనో న మనుతే" ఇత్యాది శ్రుతేః. ఆత్మనాం జీవానాం ఆత్మానం ద్రష్టారమ్ ఆకృతయో రూపాణి చక్షుర్యథా కర్మభూతం న జానన్తి తతః పరమాకృతీనాం ప్రకాశకం. నహి ప్రమాతా ప్రమాణస్య విషయ ఇతి భావః. ఏవం భూతః పరమేశ్వరో మదన్యోఽస్తీతి పూర్వేణైవ సంబంధః.(16)

టీ॥ యద్వాచాఽభ్యుదితమ్ యన్మనోన మనుతే' అను శ్రుతి ప్రమాణముల చేత ఏది వాక్కు చేత చెప్పబడదో, దేనిని మనస్సు తలచదో - జీవుల యొక్క ఆత్మను (ద్రష్టను) ఆకృతులను రూపములను చూచు కన్ను తనను తాను చూడజాలదు. అలానే పరుని చూడజాలరు. ప్రకాశకుని-ప్రమాతగాని ప్రమాణముగాని ప్రమేయమునకు విషయము కాజాలవు. అందువలన నా కంటె వేరైన పరమేశ్వరుడు కలడని పూర్వ శ్లోకముతో అన్వయము. ॥16॥

అవ॥ భవత్వేవంభూతోఽన్య పరమేశ్వరః యే పునరస్మాన్నిర్భర్త్స్య పాపినం రక్షితవంతస్తే కే తానాహ - తస్యేతి ద్వాభ్యాం.

అవ॥ తస్య ఇత్యాది శ్లోక ద్వయమున భూతములకతీతముగా పరమేశ్వరుడు ఉన్నాడు అని మనలను నిగ్రహించి పాపులను రక్షించిన వారు ఎవరో వారిని గూర్చి చెప్పుచున్నాడు.

శ్లో॥ తస్యాత్మతన్త్రస్య హరేరధీశితుః
పరస్య మాయాధిపతేర్మహాత్మనః ।
ప్రాయేణ దూతా ఇహ వై మనోహరాః
చరంతి తద్రూప గుణ స్వభావాః ॥ (17)

టీ॥ తస్యైవ రూపం మేఘశ్యామలత్వ చతుర్భుజత్వాది గుణాః ప్రభావాదయః స్వభావో భక్తవాత్సల్యాదిర్యేషాం తే – తద్రూప గుణ స్వభావాః. (17)

శ్లో॥ భూతాని విష్ణోః సురపూజితాని
దుర్దర్శలిఙ్గాని మహద్భుతాని ।
రక్షన్తి తద్భక్తిమతః పరేభ్యో
మత్తశ్చ మర్త్యానథ సర్వతశ్చ ॥ (18)

టీ॥ విష్ణోర్భూతాని భృత్యాః దుర్దర్శాని ద్రష్టుమప్యశక్యాని లింగాని రూపాణి యేషాం తాని. తద్భక్తి మతః విష్ణుభక్తాన్ పరేభ్యః శతృభ్యో మత్తః సర్వతోఽగ్న్యాదిభ్యశ్చ రక్షంతి ॥18॥

తా॥ స్వతంత్రుడైనట్టి, సర్వమునకు అధీశుడైనట్టి, మాయాధిపతి, మహాత్ముడు అయినట్టి మనస్సును దోచునట్లున్న ఆ హరి యొక్క రూప గుణ స్వభావములు గలదూతలు ఈ లోకము నందు తరచుగా సంచరించుచుందురు. 17

టీ॥ అతని యొక్క (పరమమాయాధిపతియైన ఆ పరమాత్మ) హరి యొక్క (మేఘశ్యామల చతుర్భుజాదులు ప్రభావాది గుణములు) భక్త వాత్సల్యాది స్వభావముగల వారు ఎవరో వారు తద్రూప గుణ స్వభావులు. ॥17॥

తా॥ దేవతలచే పూజించబడునట్టియు, చూడశక్యము కానట్టి ఆకారము గల, గొప్ప ఆశ్చర్యమును కలిగించు వారును అగు ఆ విష్ణువు యొక్క దూతలు విష్ణుభక్తిగల మానవులను, పరుల నుండియు నా నుండియు మరియు సర్వము నుండియు కూడ రక్షించెదరు. 18

టీ॥ చూడశక్యము గాని ఆకారములు గల విష్ణుసేవకులు, విష్ణు భక్తులను శత్రువుల నుండియు, నా నుండియు అగ్న్యాదులన్నింటి నుండి రక్షించెదరు. ॥18॥

అవ॥ నను విష్ణుభక్తాశ్చేత్కథమధర్మ పక్షపాతం కృతవన్త స్తత్రాహ- ధర్మమితి.

అవ॥ ధర్మమిత్యాది శ్లోకమున విష్ణు భక్తులు ఎట్లు అధర్మ పక్షపాతము చేసిరో అన్నచో చెప్పుచున్నాడు.

శ్లో॥ ధర్మం తు సాక్షాద్భగవత్ప్రణీతం న
వై విదురృషయో నాపి దేవాః ।
న సిద్ధముఖ్యా అసురా మనుష్యాః
కుతశ్చ విద్యాధరచారణాదయః ॥ (19)

తా॥ సాక్షాత్తుగా భగవానునిచే చెప్పబడిన ధర్మమును మహర్షులు, దేవతలు, మరియు సిద్ధులలో ప్రముఖులును తెలియకున్నారు. అసురులు, మనుష్యులు, విద్యాధరులు, చారణులు తెలియగలేరు అనునది చెప్పనక్కరలేదు.(తు అను పదము ధర్మ సూక్ష్మతను చెప్పుచున్నది. అనగా విష్ణుదూతలు చేసిన పని అధర్మముగా కనబడినప్పటికిని అది ధర్మమే. సాక్షాద్భగవంతుని చేత ప్రణీతమైన ధర్మము సూక్ష్మ జ్ఞానము గల వారికి మాత్రమే తెలియును. మీ వంటి అజ్ఞానులకు కాదు) 19

టీ॥ ఋషయో భృగ్వాదయః.

టీ॥ భృగువు మున్నగు ఋషులు. 19

అవ॥ నను కేఽపి చేన్న జానన్తి తస్య సత్త్వే కిం ప్రమాణం తత్రాహ- స్వయంభూరితి.

అవ॥ స్వయంభూరిత్యాది శ్లోకమున ఎవరు తెలియలేరు, అయినచో దాని యొక్క సత్వమునకు ప్రమాణమేమి? అన్నచో చెప్పుచున్నాడు.

శ్లో॥ స్వయమ్భూర్నారదః శమ్భుః కపిలో మనుః ।
ప్రహ్లాదో జనకో భీష్మో బలిర్వైయాసకిర్వయమ్ ॥ (20)

తా॥ ఓ భటులారా! స్వయంభువుడగు బ్రహ్మదేవుడు, నారదుడు, శివుడు (శంభుడు) సనత్కుమారుడు, కపిలుడు, మనువు, ప్రహ్లాదుడు,

శ్లో॥ ద్వాదశైతే విజానీమో ధర్మం భాగవతం భటాః ।
గుహ్యం విశుద్ధం దుర్బోధం యం జ్ఞాత్వామృతమశ్నుతే ॥21
।

జనకుడు, భీష్ముడు, బలిచక్రవర్తి, శుక మహర్షియు, మేము (యముడు) అను పన్నెండుగురము మాత్రమే భగవానునిచే చెప్పబడిన రహస్యమైనట్టియు, విశుద్ధమైనట్టియు (సత్వగుణ ప్రధానమైన) తెలియగానలవిగానిదియు, దేనిని తెలిసి(తెలిసినవారు) అమృతత్వమును పొందుదురో ఆ ధర్మమును తెలియుచున్నాము.॥20,21॥

టీ॥ కుమారః సనత్కుమారః వయమిత్యాత్మానమేవ బహు మన్యమానో నిర్దిశతి. హే భటాః. భటా ఇతి సంబోధనం- భాగవతం ధర్మం భగవత్సంబంధి పరమతత్త్వార్థం. ॥20-22॥

టీ॥ కుమారుడనగా - సనత్కుమారుడు - మేము అనగా యముడు మేము అని తనను గౌరవవాచకముగా సంబోధించుచున్నాడు. ఓ భటులారా అను సంబోధనమును భటా అను పదము తెలుపుచున్నది. భాగవత ధర్మమనగా భగవత్సంబధమైన పరమతత్త్వార్థము. ॥20-22॥

అవ॥ తమేవ ధర్మమాహ - ఏతావానితి.

అవ॥ ఏతావానిత్యాది శ్లోకమున ఆ ధర్మమే చెప్పబడుచున్నది.

శ్లో॥ ఏతావానేవ లోకేఽస్మిన్ పుంసాం ధర్మః పరః స్మృతః ।
భక్తియోగో భగవతి తన్నామగ్రహణాదిభిః ॥ 22

తా॥ ఈ లోకమందు పురుషులకు నామ గ్రహణాదులతో కూడిన భగవంతుని యందలి భక్తి యోగము ఉత్కృష్ట ధర్మముగా తలపబడినది. ॥22॥

అవ॥ న చాత్ర ప్రమాణం వక్తవ్యం. దృష్టత్వాదిత్యాహ- నామోచ్చారణేతి.

అవ॥ నామోచ్చారణేత్యాది శ్లోకమున అజామిళ ముక్తి దృష్టమైనదే అగుట వలన శాస్త్రప్రమాణములు పేర్కొనదగినది కాదు అని చెప్పబడుచున్నది.

శ్లో॥ నామోచ్చారణ మాహాత్మ్యం హరేః పశ్యత పుత్రకాః ।
అజామిళోఽపి యేనైవ మృతపాశాదముచ్యత ॥23॥

టీ॥ యేనైవ కేవలేన సకృదిచ్చారితేన ॥23॥

అవ॥ నను నామాభాసేన కథం సర్వపాపక్షయస్స్యాత్.- శ్రద్ధాభక్త్యా వృత్త్యాదేరపి తథా హి "సాయంప్రాతర్గృణన్ భక్త్యా దుఃఖ గ్రామాద్విముచ్యతే" ఇతి. అనుదినమిదమాదరేణ శ్రుణ్వన్న్ ఇతి శ్రవణం కీర్తనం ధ్యానం హరేరద్భుత కర్మణః. జన్మ కర్మ గుణానాం చ తదర్థేఽఖిల చేష్టితమ్ ఇత్యాద్యస్మిన్నేవ పురాణే తత్ర తత్ర పఠ్యతే. పురాణాంతరే చ "పాపక్షయశ్చ భవతి స్మరతాం తమహర్నిశమ్" ఇతి అత్రైవ చ "తస్మాత్సంకీర్తనం విష్ణోర్జగన్మంగలమంహసాం. మహతామపి కౌరవ్య విద్ధ్యేకాంతిక నిష్కృతమ్ ఇత్యాదినా. సమ్యక్కీర్తనాదేవముచ్యతే కించ తథా సతి కిమితి మన్వాదయో ద్వాదశాబ్దాదీని స్మరేయుః తస్మాదిద మనుపపన్నమివ తత్రాహ-ఏతావతేతి.

తా॥ ఓ బిడ్డలారా! అజామిళుడు కూడ దేనిచే మృత్యుపాశము నుండి విడిపించబడినాడో అట్టి శ్రీహరి యొక్క నామోచ్చారణ మాహాత్మ్యమును చూడుము. 23

టీ॥ దేనిని (శ్రీహరినామమును) ఒక్కసారి ఉచ్చరించినంత మాత్రమున ॥23॥

అవ॥ ఏతావదిత్యాది శ్లోకమున నామాభాసముచే (ప్రకాశము) సర్వ పాపక్షయమెట్లు కలుగును.? నామోచ్చారణ స్మరణాదులలో శ్రద్ధా భక్త్యా వృత్తులు విధింపబడినందున అవిలేని కేవల నామము యొక్క ఆభాసముతో సర్వ పాప క్షయమెట్లు కలుగుచున్నదో చెప్పుచున్నాడు. సాయంప్రాతర్గృణన్, భక్త్యా దుఃఖ గ్రామాద్విముచ్యతే అనుదిన మిదమాదరేణ శ్రుణ్వన్. మరియు కీర్తనం ధ్యానం హరేరద్భుత కర్మణః జన్మ కర్మగుణానాం చ తదర్థేఖిల చేష్టితమ్" వంటి ప్రమాణములచేత ప్రతి నిత్యము ప్రాతఃకాల మందు, సాయంకాల మందు భక్తితో స్తుతించుచున్నవాడు దుఃఖ సమూహము నుండి విముక్తుడగును అనియు హరి యొక్క అద్భుత కర్మలుగల విష్ణువు యొక్క జన్మ విశేషములను (అవతా రములను) గుణ గణములను వినుట, కీర్తించుట, ధ్యానించుట వంటి కర్మల ద్వారా, వీనిని ప్రతిదినము

ఆదరముతో వినుచున్నవాడును, విముక్తుడగును అనియు పాపక్షయశ్చ భవతి స్మరతాం తమహర్నిశమ్ః రాత్రింబగళ్ళు చేయు హరినామస్మరణ వలన పాపక్షయము జరుగుననియు ఇతర పురాణములలో అక్కడక్కడ చెప్పబడినది. ఈ పురాణమందు కూడ తస్మాత్సంకీర్తనం విష్ణోర్జన్మ జగన్మంగలమం హసామ్. మహతామపి కౌరవ్య విద్ధ్యైకాంతిక నిష్కృతి కమ్. అనుప్రమాణము చేత గొప్పనైన దుఃఖముల నుండి తొలగించుటకు జగన్మంగళకారకుడైన విష్ణునామ స్మరణ మొక్కటే కారణము. ఓ కురువంశీయుడా! ఇది ఏకాంత భక్తుల నిశ్చయము. అని తెలుసుకొనుము. అందువలన చక్కని కీర్తనాదులచే ముక్తిని పొందుదురు. మరి మన్వాది మహర్షులు చెప్పిన ద్వాదశాబ్దాది ప్రాయశ్చిత్తములు స్మరించుట ఎందులకు ? మరియు దుఃఖ నాశ మాత్రమునకుపయోగించుట కాదు కదా! అన్నచో చెప్పుచున్నాడు

శ్లో॥ ఏతావతాలమఘ నిర్హరణాయ పుంసాం
సంకీర్తనం భగవతో గుణకర్మనామ్నామ్ ।
విక్రుశ్య పుత్రమఘవాన్యదజామిళోఽపి
నారాయణేతి మ్రియమాణ ఇయామ్ ముక్తిమ్। ॥ 24

తా॥ మానవుల పాపములను నశింపజేయుటకు, భగవానుని గుణ కర్మల కీర్తించుటయే చాలును. పాపియగు అజామిళుడు కూడ మరణించబోవుచున్న వాడై పుత్రుని 'నారాయణా' అని బిగ్గరగా ఆక్రోశించి మోక్షమును పొందెను గదా! ॥24॥

టీ॥ భగవతోగుణానాం, కర్మణాం చ నామ్నాం చ సమ్యక్కీర్తనమితి యదేతావతా పుంసామఘనిర్హరణాయ పాపక్షయమాత్రాయా అలముపయోగో నాస్తి అలం శబ్దోఽత్ర వారణే యథాహామర సింహః "అలం భూషణపర్యాప్తిశక్తివారణవాచకమ్" ఇతి. ఉపయోగాభావ మేవాహ అజామిళో మహాపాతక్యపి నారాయణేతి విక్రుశ్య న తు సమ్యక్కీర్తయిత్వా. తచ్చ పుత్రం విక్రుశ్య న తు హరిన్ అఘవానశుచిరపి మ్రియమాణః అస్వస్థచిత్తోఽపి ముక్తిమవాప న త్వఘనిర్హరణ మాత్రం, అతో నామాభాసేనాపి సర్వం పాపక్షయ ఇత్యేవ తత్తమ్. ఆవృత్తి శ్రద్ధాది విధయస్తు పాపవాసనాక్షయార్థా ఇత్యుక్తమేవ హరేర్గుణానువాదః ఖలు సత్త్వభావనః ఇత్యత్ర. (24)

టీ॥ భగవంతుని గుణకర్మలు, నామములు చక్కగాకీర్తించుట చేత పురుషులకు పాప క్షయమగుట చెప్పబడుచున్నది. అలం శబ్దము ఇక్కడ వారణార్థకముగా చెప్పబడుచున్నది. అలం భూషణోపర్యాప్తి శక్తివారణ వాచకమ్" అలంశబ్దము భూషణము. పర్యాప్తము, వారణములను బోధించునని అమర కోషమున చెప్పబడినది. ఇక్కడ ఉపయోగము లేకపోవుటను చెప్పుచున్నది. అజామిళుడు మహాపాపి, హరిని ఉద్దేశించి కాకపోయినను పుత్రుని పిలిచే నిమిత్తమే అయినను అస్వస్థ చిత్తుడు, అశుచి అయినప్పటికి మరణించు సమయమున 'నారాయణా' యను నామ సంకీర్తనచే ముక్తిని పొందుటచే సర్వపాపక్షయమునకు నామసంకీర్తనమే సాధనమని చెప్పబడుచున్నది. పాప వాసనా నివృత్తి బోధకముల హరి గుణవాదము సత్త్వమును ఆవృత్తి శ్రద్ధ మొదలగు పాప వాసనా క్షయకరములని చెప్పబడినదియే. హరి యొక్క గుణానువాదము సత్త్వమును కలిగించును. ॥24॥

అవ॥ యత్తూక్తం వ్యర్థం తర్హి ద్వాదశాబ్దాదిస్మరణమితి తత్రాహ - ప్రాయేణేతి.

అవ॥ ప్రాయేణేత్యాది శ్లోకమున స్మరణమే శరణ్యమని ద్వాదశాబ్దాది ప్రాయశ్చిత్త కర్మలు వ్యర్థము లగును కదా అన్నచో చెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రాయేణ వేద తదిదం న మహాజనోఽయం
దేవ్యా విమోహితమతిర్బత మాయయాఽలమ్ ।
త్రయ్యాం జడీకృతమతిర్మధు పుష్పితాయాం
వైతానికే మహతి కర్మణి యుజ్యమానః ॥ 25

టీ॥ మహాజనో మన్వాదిః. అయం భావః యథా మృత సంజీవనౌషధి మజానన్తో వైద్యా రోగనిర్హరణాయ త్రికటుక నింబాదీని స్మరంతి తథా స్వయంభూ శంభు ప్రముఖ ద్వాదశ వ్యతిరేకేణాయం మహాజనః అతి గుహ్యమిదమజ్ఞాత్వా ద్వాదశబ్దాదికం స్మరతీతి. కించ మాయయా దేవ్యా అలం విమోహితమతిరయం జనో మధు మధురం యథా భవత్యేవం. పుష్పితాయాం పుష్పస్థానీయైరర్థవాదైర్మనోహరాయాం త్రయ్యాం జడీకృతా అభినివిష్టా మతిర్యస్య. అతో మహత్యేవ కర్మణి శ్రద్ధయా యుజ్యమానో నాల్పే ప్రవర్తతే। దృశ్యతే హి ప్రాకృతస్య లోకస్య మహతి మంత్రాదౌ శ్రద్ధా అల్పే చాశ్రద్ధా. తస్మాదస్య గ్రాహకో నాసీతి తైర్నోక్తం. యద్వా స్వాధీనః సింహోఽస్తే్యతావతా శ్వ శృగాలాది నివారణాయ తం యథా న ప్రయుంజతే. తథాఽతి తుచ్ఛత్వాత్ పాపస్య న తన్నిరసనాయ పరమమంగలం హరేర్నామ స్మరంతి. యద్వా నామమాహాత్మ్య జ్ఞానే సర్వముక్తి ప్రసంగాదిత్యేషా దిక్. గ్రంథ విస్తర భయాత్తు నాతి ప్రపఞ్చ్యతే. ॥25॥

తా॥ అయ్యో! మాయాశక్తిచే వ్యామోహితుడైన బుద్ధిగలవాడు, మధురముగా పుష్పించియున్న వేదమునందు దృఢమైన బుద్ధిగలవాడు, గొప్పనైన యజ్ఞములకు సంబంధించిన కర్మలయందు లగ్నమైన ఈ గొప్పవ్యక్తి, ఈ ధర్మమును సాధారణముగా తెలియకున్నాడు. ॥25॥

టీ॥ మన్వాది మహాజనులు చెప్పిన, అనగా ఏ విధముగా వైద్యుడు మృతసంజీవనీ ఔషధమును తెలియక రోగ నివారణమునకు త్రి కటుకాదులు, వేప మొదలగు ఔషధములను చెప్పునో అట్లే అతి గుహ్యమైన పరమాత్మతత్త్వము తెలియక మన్వాది మహాజనులు ద్వాదశాబ్దాది ప్రాయశ్చిత్త కర్మలను పాప నివారణ కోసమై స్మరించు చున్నారు అని చెప్పబడుచున్నది. దైవమాయ చేత విమోహిత బుద్ధి గలవాడు పుష్పముల యందు మధువున్నప్పటికి ఆ మధువును గ్రోలక మనోహరమైన పుష్పముల వంటి మధురార్థవాద స్థానీయములైన వేద వాక్యములచేత జడము చేయగల బుద్ధిగలవాడై కర్మాభినివేశము గొప్ప గొప్ప కర్మలు చేయుదురు. కాని చిన్న కర్మల యందు ప్రవర్తించరు. లోకమందు ప్రాకృతములు అయిననవారు (పామరులు) గొప్ప మంత్రముల యందు శ్రద్ధను, చిన్న మంత్రముల యందు అశ్రద్ధను కలిగియుండుట కనబడుచున్నది కదా! అందువలన నామస్మరణముల యందు శ్రద్ధ ఉండదు కావున మన్వాది మహాజనులు

నామ స్మరణాదుల మహాత్మ్యమును చెప్పలేదు. లేక శ్వశృగాలాది అల్ప జంతువుల నివారణార్థము సింహము ప్రవర్తించినట్లు, మహాజనులైన మన్వాదుల పాప నివారణము వంటి తుచ్ఛకారణములకు, దానిని నిరసించుటకు మంగళతమమైన హరి యొక్క నామమును స్మరించ లేదు. (చెప్పలేదు) లేక నామ మహాత్మ్య జ్ఞానమున సర్వులకు ముక్తి కలుగవలసి వచ్చును. ప్రస్తుతమున కీ వివరణము సరిపోవును. గ్రంథ విస్తరణ భయమున విస్తరించి చెప్పబడుట లేదు. ॥25॥

శ్లో॥ ఏవం విమృశ్య సుధియో భగవత్యనంతే
సర్వాత్మనే విదధతే ఖలు భావయోగమ్ ।
తే మే న దండమర్హన్త్యథ యద్యమీషాం
స్యాత్పాతకం తదపి హన్త్యురుగాయవాదః ॥26

తా॥ బుద్ధిమంతులైన వారు ఈ విధముగా ఆలోచించి, అనంత భగవానుని యందు అన్ని విధముల భావ(భక్తి) యోగమును కలిగి యుందురు కదా! వారు ఒకప్పుడు పాపము చేసి యున్నను గొప్పగా కీర్తించుటచే భగవానుని కీర్తనము దానిని పోగొట్టును. వారు నా దండనమునకు అర్హులుకారు. 26

టీ॥ భావ యోగం భక్తియోగం. అమీషాం పాతకం న స్యాదేవ. యది స్యాత్ ఉరుగాయస్య వాదః కీర్తనమ్. 26

టీ॥ భావయోగమును అనగా భక్తియోగమును ఆశ్రయించిన వారికి పాతకము ఉండనే ఉండదు. ఒకవేళ ఉన్నచో ఉరుగాయవాదః అనగా విష్ణువు (గొప్పనామము కలవాడు, వేగమైన నడకకలవాడు) యొక్క కీర్తనచేత అది తొలగిపోవును.॥26॥

అవ॥ తదేవం ధర్మతత్త్వం నిర్ణీయ భృత్యాననుశాస్తి త ఇతి.

అవ॥ త ఇత్యాది శ్లోకమున ఇట్లు ధర్మమును నిర్ణయించి, భృత్యులను శాసించుచున్నాడు.

శ్లో॥ తే దేవ సిద్ధ పరిగీత పవిత్ర గాథా
యే సాధవః సమదృశో భగవత్ప్రపన్నాః ।
తాన్నోపసీదత హరేర్గదయాభిగుప్తా
న్నైషాం వయం న చ వయః ప్రభవామ దణ్డే ॥27॥

తా॥ సమదృష్టి గలిగి, భగవానుని శరణు పొందిన సత్పురుషులు, దేవతలచే, సిద్ధులచే కీర్తించబడు పావన చరిత్రకల వారలు శ్రీహరి యొక్క గదచే అన్ని విధములుగా రక్షించబడుదురు. అట్టివారి కడకు మీరు పోకూడదు. వారిని శిక్షించుటకు మనము సమర్థులము కాము. కాలము కూడ సమర్థము కాదు. 27

టీ॥ యే భగవంతం ప్రసన్నాఃతే దేవైస్సిద్ధైశ్చ పరిగీత పవిత్ర గాథాః వర్ణిత పుణ్య కథాః అతస్తాన్నోపసీదత తత్సమీపమపి న గచ్ఛత. వయః కాలోఽపి న ప్రభవతి ॥27॥

టీ॥ ఎవరు భగవంతుని శరణుపొందియున్నారో, దేవతల చేత, సిద్ధుల చేత, కీర్తించబడు పవిత్రకథలు గలవారో వారి సమీపమునకు మీరు పోవలదు. కాలము కూడ వారిని ఏమీ చేయజాలదు. ॥27॥

అవ॥ కే తర్హి దండార్థమానేయా ఇత్యత్రాహ- తానితి ద్వాభ్యాం

అవ॥ తానిత్యాది శ్లోక ద్వయమున శిక్షకు తేదగిన వారెవరో చెప్పబడుచున్నది.

శ్లో॥ తానానయ ధ్వమసతో విముఖాన్ముకున్ద
పాదారవిందమకరందరసాదజస్రమ్ ।
నిష్కించనైః పరమహంసకులై రసజ్ఞై
ర్జుష్టాద్గృహే నిరయవర్త్మని బద్ధ తృష్ణాన్ ॥28॥

తా॥ రసజ్ఞులయి, అపరిగ్రహులైన పరమహంసల గుంపులచే గూడి సేవించబడు ముకుంద పాదపద్మ మకరంద రసము నుండి విముఖులైన వారిని, నరకమార్గమైన ఇంటియందే ఆశతో ఎల్లప్పుడు బంధింపబడిన, దుర్మార్గులైన వారిని తీసుకొనిరండు. 28

టీ॥ అసతో దుష్టాన్. తానేవాహ. ముకుంద పాదారవిందయోర్యో మకరంద రూపో రసః తస్మాద్విముఖాన్. కథంభూతాత్. నిష్కించనైః అపరిగ్రహైః పరమహంసకులైః రసజ్ఞైః సారాసారా వివేక నిపుణైః అజస్రం జుష్టాత్. తేషాం జ్ఞాపకమాహ. నిరయవర్త్మని స్వధర్మ శూన్యే గృహే బద్ధా తృష్ణా యైస్తాన్. ॥28॥

టీ॥ దుర్మార్గులను తీసుకొని రమ్ము. స్వధర్మమును నిరసించి నరకమార్గమైన ఇంటి యందు బంధింపబడిన ఆశగల దుర్మార్గులైన వారిని, పరమహంసలతో గూడియున్న ముకున్ద పాదానవిన్ద మకరన్దమునకు విముఖులైన వారిని తీసుకొనిరండు. ॥28॥

శ్లో॥ జిహ్వా న వక్తి భగవద్గుణనామధేయం
చేతశ్చ న స్మరతి తచ్చరణారవిందమ్ ।
కృష్ణాయ నో నమతి యచ్ఛిర ఏకదాపి
తానానయ ధ్వమసతోఽకృత విష్ణుకృత్యాన్ ॥ 29

తా॥ ఎవరి నాలుక భగవానుని గుణముల, నామముల కీర్తించదో, మనస్సు ఆ పాదపద్మముల స్మరించదో, శిరస్సు ఒక్కసారియైనను కృష్ణుని కొఱకు నమస్కరించదో, విష్ణు పూజలు చేయని వారెవరో, అట్టి దుష్టులైన వారిని తీసుకొనిరండు. 29

టీ॥ కించ జిహ్వేత్యాది। యద్వేషాం జిహ్వేత్యాద్యన్వయః. న కృతం విష్ణు కృత్యం భగవద్వ్రతం యైః. ॥29॥

టీ॥ ఇంకను ఎవరిని తీసుకొనిరావలెనో చెప్పుచున్నాడు. భగవంతుని కీర్తించని వారిని భగవానుని వ్రతములను చేయని వారిని తీసుకొనిరావలయును. ॥29॥

అవ॥ భగవంతం క్షమాపయతి–తదితి.

అవ॥ తదిత్యాదిశ్లోకమున భగవంతుని క్షమించుమని వేడుకొను చున్నాడు.

శ్లో॥ తత్ క్షమ్యతాం స భగవాన్పురుషః పురాణో
నారాయణః స్వపురుషైర్యదసత్కృతం నః ।
స్వానామహో న విదుషాం రచితాంజలీనాం
క్షాంతిర్గరీయసి నమః పురుషాయ భూమ్నే ॥ 30

తా॥ అయ్యో! అజ్ఞానులగు నా యొక్క అనుచరలచే చేయబడిన ఏ దోషము గలదో దానిని, చేతులు జోడించిన నన్ను, మా వారిని, కాలాతీతుడు (పురాణుడు) పూర్ణచైతన్యస్వరూపుడు (పురుషుడు) అగునారాయణుడు క్షమించుగాక! గొప్పవారి యందు క్షమాగుణముండును సర్వవ్యాపకుడు, పరమపురుషుడు అగువాని కొఱకు నమస్కారము. 30

టీ॥ నః స్వపురుషైరస్మదీయత్వేన స్థితైః స్వీయైరేవ పురుషైర్యదస్మాత్ అసత్ అన్యాయ్యం కృతం తతస్మాత్ స్వయమేవ క్షమ్యతాం సహతాం. స్వానాం స్వీయానాం భక్తానాం నోऽస్మాకం న విదుషాం అజ్ఞానామ్. అహో గరీయసి తస్మిన్ క్షాంతిరుక్తైవ. మహ ఇతి పాఠే స్వీయానాం మహాత్మ్యమవిదుషాం నః క్షమాం కరోత్విత్యర్థః. ॥30

టీ॥ మావారుచేసిన యపరాధమును తెలియని (అజ్ఞానులమగు) మమ్ములను స్వయముగా క్షమించుగాక! మహా అను పాఠమున మా వారిని, మాహాత్మ్యమును కలిగిన వారిని క్షమించవలసినది అని వేడుకొను చున్నాడు. అహో గొప్ప వారి యందు క్షమాగుణము యుక్తమే కదా! ॥30॥

అవ॥ తస్మాదిత్యాది శుకోక్తిః.

అవ॥ తస్మాదిత్యాది శ్లోకములు శుకునిచే చెప్పబడుచున్నవి.

శ్లో॥ తస్మాత్సంకీర్తనం విష్ణోర్జగన్మంగళమంహసామ్ ।
మహతామపి కౌరవ్య విద్ధైకాంతిక నిష్కృతిమ్ ॥ 31

తా॥ కురువంశమునందు జన్మించినవాడా! (కౌరవ్యా) కావున ప్రాణులకు కల్యాణము నిచ్చు విష్ణు సంకీర్తనము పెద్ద పాపములను కూడ సమ్మూలముగా నిర్మూలించు సర్వోత్తమ ప్రాయశ్చిత్తముగా తెలియుము. 31

టీ॥ జగతోఽపి మంగళరూపమ్. ॥31

టీ॥ విష్ణు నామ సంకీర్తనము జగత్తునకు కూడ మఙ్గలము (శుభకరము) 31

అవ॥ ఐకాన్తికత్వమేవాహ శ్రుణ్వతామితి.

అవ॥ శ్రుణ్వతామిత్యాది శ్లోకమున ఏకాంతికత్వమును చెప్పుచున్నాడు.

శ్లో॥ శ్రుణ్వతాం గృణతాం వీర్యాణ్యుద్దామాని హరేర్ముహుః ।
యథా సుజాతయా భక్త్యా శుద్ధ్యన్నాత్మా వ్రతాదిభిః ॥ 32

తా॥ శ్రీహరి యొక్క మిక్కిలి గొప్పనైన మహా కార్యములను మాటి మాటికి విను వారలకు, కీర్తించు వారలకు చక్కని భక్తి ఉదయించును. చక్కగా కలిగిన భక్తితో అంతఃకరణము శుద్ధి కలిగినట్లు వ్రతాదుచే కలుగదు. ॥32

టీ॥ వ్రతాదిభిస్తథా నశుద్ధ్యేత్. ॥32॥

టీ॥ వ్రతాదులతో అట్లు (విష్ణునామ స్మరణము వలన అయినట్లు) శుద్ధము కాదు. 32

అవ॥ ఏతదుపాదయతి కృష్ణాంఘ్రీతి.

అవ॥ కృష్ణాంఘ్రీత్యాది శ్లోకమున దీనినే సమర్థించుచున్నాడు.

శ్లో॥ కృష్ణాంఘ్రిపద్మ మధులిణ్న పునర్విసృష్ట
మాయా గుణేషు రమతే వృజినావహేషు
అన్యస్తు కామహత ఆత్మరజః ప్రమార్ష్టుమీహేత
కర్మ యత ఏవ రజః పునః స్యాత్ ॥ 33

తా॥ శ్రీకృష్ణుని పాదపద్మముల మకరందము నాస్వాదించువారు దుఃఖములను కలిగించే మాయా గుణముల కార్యము లందు మరల మరల రమించరు. దీనికి భిన్నముగా కోరికలచే పరాభూతుడైన, భక్తుడు కానివాడు అంతఃకరణ దోషమును తుడిచి వేయుటకు చేయుకర్మలను

టీ॥ కృష్ణాంఘ్రి పద్మయోః మధులేఢి ఆస్వాదయతీతి తథా మధులిహా తాఇతి తుచ్ఛత్వేన విసృష్టా యే మాయాగుణా విషయాః తేషు పునర్నరమతే. అన్యస్తు తన్మధ్వాస్వాదరహితః అత ఏవ కామాభిభూత స్సన్ ఆత్మనో రజః పాపం ప్రమార్ష్టుమపి కర్మైవ ప్రాయశ్చిత్తరూపం ఈహేత. యతః కర్మణః పునరపి రజః పాపం స్యాదేవ కుంజర శౌచవత్. సత్త్వ శోధకత్వాభావాత్. ॥33॥

మరల రజస్సును (మాలిన్యమును) కలిగించు కర్మలను చేయగోరడు. (33)

టీ॥ దీనినే సమర్థించుచున్నాడు. విష్ణు పాదపద్మముల యందలి మధువును గ్రోలు మహాపురుషులు తుచ్ఛమైన మాయా గుణ విషయము లందు రమించరు. విష్ణు పదములను స్మరించుచుందురు కాని, కోరికతో కొట్టబడినవారు, ఇతరులు ఆ పరమపురుషుని పాదపద్మముల మధువును గ్రోలక వివిధ కర్మలనాచరించి పాపముల నంటించుకొని ప్రాయశ్చిత్తములతో పాపముల తొలగించుకొంటూ మరల మరల పాపమును ఆచరిస్తూ సత్త్వశోధకము లేకుండుట వలన గజ శౌచము వలె (ఏనుగు స్నానమువలె) పాపములను పొందుచున్నారు ॥33॥

శ్లో॥ ఇత్థం స్వభర్తృగదితం భగవన్మహిత్వం
సంస్మృత్య విస్మతధియో యమకింకరాస్తే ।
నైవాచ్యుతాశ్రయజనం ప్రతి శఙ్కమానా
ద్రష్టుం చ బిభ్యతి తతః ప్రభృతి స్మరాజన్ ॥34॥

తా॥ ఓ రాజా! ఆశ్చర్యపడిన యమ కింకరులు తమ ప్రభువుచే బోధించబడిన భగవానుని మహిమను చక్కగా స్మరించి, అప్పటి నుండి అచ్యుతుని ఆశ్రయించిన జనులను (శంకించువారై) చూచుటకును భయపడుచుండిరి. 34

టీ॥ నైవ విస్మితధియో బభూవుః కింతు సత్యముక్తమిత్యేవ మేనిరే తతః ప్రభృతి శంకమానా అస్మానేవైష హన్యాదితి శంకాం వహంతః

టీ॥ ఆశ్చర్య బుద్ధిగలవారు కాకుండిరి. కాని సత్యమే చెప్పబడినదని తలచిరి. అప్పటి నుండిమమ్ములను వీడు చంపునేమోయని

తం ద్రష్టుమపి బిభ్యతి పాఠాంతరే తు విస్మిత ధియో జాతాః. తే చ తతః ప్రభృతి బిభ్యతి స్మ ఇత్యర్థః. ॥34॥

శంకించువారై అచ్యుతుని ఆశ్రయించిన వారిని చూచుటకును భయపడుచుండిరి. తే చ అను పాఠాంతరమున వారు ఆశ్చర్యపడిన బుద్ధి గల వారైరి. అప్పటి నుండి వారును భయపడుచుండిరి.॥34॥

శ్లో॥ ఇతిహాసమిమం గుహ్యం భగవాన్ కుమ్భసంభవః ।
కథయామాస మలయ ఆసీనో హరిమర్చయన్ ॥35॥

తా॥ మలయపర్వతము నందు శ్రీహరిని పూజించుచున్న భగవానుడు అగు అగస్త్యమహర్షి (కుంభసంభవుడు) ఈగుహ్యమైన ఇతిహాసమును చెప్పినాడట. 35

టీ॥ కుమ్భసంభవోఽగస్త్యః మలయే పర్వతే ఆసీనోఽవ్యగ్రః హరిమర్చయన్ పునః పునర్విశ్వాసార్థం హరేః పాదౌ స్పృశన్నిత్యర్థః ॥35॥

టీ॥ కుంభసంభవుడైన అగస్త్యుడు మలయపర్వతము నందు అవ్యగ్రుడై (ఏకాగ్రతతో) హరిని పూజించుచు, పుజా సమయమున విశ్వాసము కొఱకు మరల మరల భగవంతుని పాదపద్మములను తాకుచు (ఈ రహస్యమైన ఇతిహాసమును) చెప్పెనని భావము. ॥35॥

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే
తృతీయోఽధ్యాయః

శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆఱవ స్కంధమున
మూడవ అధ్యాయము సమాప్తము

## చతుర్థోధ్యాయః

### గోపాలకృష్ణాయ నమః

అవ॥ చతుర్థాది త్రిభిర్విశ్వ రూప జన్మ వివక్షయా. ప్రచేతః సుతదక్షస్య వంశస్తావత్ర్పతన్యతే. (1)

చతుర్థేతు ప్రజాసృష్ట్యై దక్షేణారాధనం హరేః ।
తపసా హంసగుహ్యాఖ్య స్తోత్రేణ చ నిరూప్యతే ॥ (2)

ప్రసక్తానుప్రసక్తేన స్వాయంభువ సుతాన్వయే ।
నామప్రభావమాకర్ణ్య వంశవ్యాసం బుభుత్సతే ॥ (3)

అవ॥ దేవాసురేతి ద్వాభాం.

**రాజోవాచ.**

శ్లో॥ దేవాసుర నృణాం సర్గోనాగానాం మృగపక్షిణామ్ ।
సామాసిక స్త్వయా ప్రోక్తో యస్తు స్వాయంభువేఽన్తరే ॥ 1

## నాల్గవఅధ్యాయము

### గోపాలకృష్ణునికి నమస్కారము

నాలుగవ అధ్యాయముతో ప్రారంభించి, మూడు అధ్యాయముల చేత (ఆరవ అధ్యాయము వరకు) విశ్వరూపుని జన్మమును చెప్పు తలంపుతో ప్రచేతసుని కొడుకైన దక్షుని వంశము విస్తరింపబడు - చున్నది. (1)

నాలుగవ అధ్యాయము నందు ప్రజాసృష్టి కొఱకై దక్షప్రజాపతి హరిని తపస్సు తోడను, హంస గుహ్యమను స్తోత్రము తోడను ఆరాధించుట నిరూపింప బడుచున్నది. (2)

సందర్భానుసారముగా నామ ప్రభావమును వినిన తరువాత స్వాయంభువ సుత వంశము నందు వంశ విస్తారమును తెలుసు కోగోరుచున్నాడు. (3)

అవ॥ దేవాసుర ఇత్యాది రెండు శ్లోకములతో.

**రాజు పలికెను.**

తా॥ స్వాయంభువ మన్వంతరములోని దేవాసుర మనుష్య, నాగ, మృగ, పక్షుల సృష్టి విషయము సంక్షిప్తముగా మీరు చెప్పినారు. (1)

శ్లో॥ తస్యైవ వ్యాస మిచ్ఛామి జ్ఞాతుం తే భగవన్యథా ।
అనుసర్గం యయా శక్త్యా ససర్జ భగవన్పరః ॥ 2॥

తా॥ ఓ భగవంతుడా ! ఆ సృష్టి యొక్క విస్తారమును, అనుసర్గమును గూర్చియు, ప్రకృతికి అతీతుడైన ఆ భగవానుడు ఏ శక్తిచే సృజించెనో, మీ నుండి తెలియ గోరుచున్నాను. (2)

టీ:- సామాసికః సంక్షిప్తోయః ప్రోక్తస్తృతీయ స్కన్ధే. వ్యాసం-విస్తారం. తే త్వత్తః. యయాశక్త్యా యథా ససర్జ తాంశక్తిం తత్ప్రకారం చ జ్ఞాతుమిచ్ఛామి అనుసర్గం అనువృత్తం సర్గమ్ ॥1,2,3॥

టీ॥ తృతీయస్కంధమున సంక్షిప్తముగా చెప్పబడిన దాని ( సృష్టి ) విస్తారమును (పరబ్రహ్మ) ఏ శక్తితో ఎట్లు సృజించెనో ఆ శక్తిని ఆ ప్రకారమును దానిననుసరించి జరిగిన వృత్తాంతమును మీ నుండి తెలుసుకోగోరుచున్నాను. ॥1,2,3॥

**సూత ఉవాచ**

శ్లో॥ ఇతి సంప్రశ్నమాకర్ణ్య రాజర్షేర్బాదరాయణిః ।
ప్రతినన్ద్య మహాయోగీ జగాద మునిసత్తమాః ॥ 3

**సూతుడు ఇట్లు పలికెను**

తా॥ ఓ మునిశ్రేష్ఠులారా! రాజర్షియగు పరీక్షిత్తు యొక్క ఈ మంచి ప్రశ్నను విని అభినందించి మహాయోగీ, బాదరాయణుని కుమారుడు అగు శ్రీశుకులు ఇట్లు పలికిరి. 3

అవ॥ దక్షాది రూపేణ ససర్జేతి వక్తుం దక్షజన్మ ప్రకారమాహ-యదేతి.

అవ॥ యదేత్యాది శ్లోకమున దక్షాదుల రూపముగా సృజించెనని చెప్పుటకు దక్షజన్మ వృత్తాంతము చెప్పబడుచున్నది.

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ యదా ప్రచేతసః పుత్రాదశ ప్రాచీనబర్హిషః ।
అన్తః సముద్రాదున్మగ్నా దద్రుశుర్గాంద్రుమైర్వృతామ్ ॥ 4

**శ్రీశుకులు పలికిరి**

తా॥ ప్రాచీనబర్హి యొక్క పుత్రులగు ప్రచేతసులు పది మంది సముద్రము లోపలి భాగము నుండి పైకి తేలిన వారై చెట్లతో నిండి యున్న భూమిని చూచిరి. ॥4॥

టీ॥ ప్రాచీనబర్హిషః పుత్రా యదా సముద్రమధ్యాదున్మగ్నా నిర్గతాస్తదా గాం పృథ్వీం ద్రుమైర్వృతాం దదృశుః. నారదోపదేశితః ప్రాచీనబర్హిషో నివృత్త్యా అరాజకే సతి కృష్యాద్యభావాత్. ॥4॥

టీ॥ ఎప్పుడు ప్రాచీనబర్హిషుని కుమారులు తపస్సు చాలించి సముద్ర మధ్యమము నుండి భూమి పైకి వచ్చిరో అప్పుడు వృక్షములతో నిండిన భూమిని చూచిరి. నారదుని ఉపదేశమున పూర్వము నివృత్తిని పొందుటచే రాజులేకపోవుటచే, వ్యవసాయాది వృత్తులు లేనందున భూమి చెట్లతో నిండిపోయెను. ॥4॥

శ్లో॥ ద్రుమేభ్యః కృధ్యమానాస్తే తపోదీపిత మన్యవః ।
ముఖతో వాయుమగ్నించ సస్పృజుస్తద్దిధక్షయా ॥ 5

తా॥ తపస్సుచే ప్రజ్వలితమైన క్రోధము కలవారై ఆ చెట్లను దహించు కోరికతో ముఖము నుండి వాయువును అగ్నిని సృజించిరి. ॥5॥

టీ॥ తపసా దీపితో మన్యురేషాం తే – తపోదీపిత మన్యవః. తేషాం ద్రుమాణాం దగ్ధుమిచ్ఛయా. ॥5॥

టీ॥ తపస్సుచేత ప్రజ్వలితమైన కోపముగలవారు ఎవరో వారు తపోదీపిత మన్యువులు. ఆ ద్రుమములను దహించు కోరికతో? 5

శ్లో॥ తాభ్యాం నిర్దహ్యమానాం స్తానుపలభ్య కురుద్వహ ।
రాజోవాచ మహాన్సోమో మన్యుం ప్రశమయన్నివ ॥ 6

తా॥ కురువంశోద్ధారకుడవగు ఓ రాజా! వానిచే (అగ్నివాయువులచే) దహించివేయబడుచున్న ఆ వృక్షములను చూచి ఓషధులకు రాజగు

మహాత్ముడైన చంద్రుడు ప్రచేతసుల కోపము చల్లారునట్లు ఇట్లు పలికెను. ॥6॥

టీ॥ తాభ్యాం వాయ్వగ్నిభ్యాం దహ్యమానాం స్తాన్ ద్రుమాన్.॥6॥

టీ॥ వాయ్వగ్నులచే దహించబడుచున్న వృక్షములను చూచి. ॥6॥

అవ॥ వనసృతీనాం రాజా సోమ ఉవాచమాద్రుమేభ్య ఇతి నవభిః.

అవ॥ వనస్పతులకు రాజైన సోముడు "మాద్రుమేభ్య"ఇత్యాది తొమ్మిది శ్లోకములతో చెప్పుచున్నాడు.

శ్లో॥ మాద్రుమేభ్యో మహాభాగా దీనేభ్యోద్రోగ్ధుమర్హథ ।
వివర్ధయిషవో యూయం ప్రజానాం పతయః స్మృతాః ॥ 7

తా॥ మహానుభావులారా! ప్రజలను వర్ధిల్లజేయగోరు పాలకులుగా చెప్పబడు మీరు ప్రజాపతులై ఉన్నారు. దీనములగు చెట్లకు ద్రోహము చేయుట తగదు. ॥7॥

టీ॥ హే మహాభాగాః.వివర్ధయిషవో విశేషేణ వర్ధయితుమిచ్ఛవః7

టీ॥ ఓ మహానుభావులారా! విశేషముగా పెంచుటకు కోరికగల మీరు. 7

అవ॥ ప్రజాపతీనాం తద్భక్షభోజ్యదాహోఽనుచిత ఇత్యాహ – అహో ఇతి. త్రిభిః.

అవ॥ అహో ఇత్యాది మూడు శ్లోకములచేత ప్రజాపతులగువారికి భక్ష్యభోజ్యాదుల దహించుట అనుచితము అని చెప్పబడుచున్నది.

శ్లో॥ (ఆదౌ) అహో! ప్రజాపతిపతిర్భగవాన్హరిరవ్యయః ।
వనస్పతీనోషధీశ్చ ససర్జోర్జమిషం విభుః ॥ 8

తా॥ అహో! ప్రజాపతులకు పతి, అవ్యయుడు, ప్రభువు అగు హరి వృక్షములను, ఓషధులను బలమునిచ్చు ఆహారముగా సృజించెను. ఆదౌ అను పాఠాంతరమున మొదట అని అర్థము. ॥8॥

శ్లో॥ అన్నం చరాణా మచరా హ్యపదః పాదచారిణామ్ ।
అహస్తా హస్తయుక్తానాం ద్విపదాం చ చతుష్పదః ॥ 9

తా॥ కదలు వానికి కదలనివి; పదములతో నడచు వానికి పదములు లేనివి, హస్తములుగల వానికి హస్తములు లేనివి, ద్విపాదులకు చతుష్పాదములు కలవి అన్నము (ఆహారము) ॥9॥

శ్లో॥ యూయం చ పిత్రాఽన్వాదిష్టా దేవదేవేన చానఘాః ।
ప్రజాసర్గాయ హి కథం వృక్షాన్నిర్దగ్ధు మర్హథ ॥ 10

తా॥ పాపరహితులారా! మీరు తండ్రిచేతను, దేవదేవుని చేతను ప్రజాసర్గము(సంతానము సృష్టించుటకు)నకు ఆదేశించబడిన వారు కదా! అట్టివారికి వృక్షములను దహించుటకు ఎట్లు తగుదురు? 10

టీ॥ ఊర్జం భక్ష్యమ్. ఇషమ్ అన్నమ్. (8,9,10)

టీ॥ తినదగిన అన్నము. (8,9,10)

శ్లో॥ ఆతిష్ఠిత సతాం మార్గం కోపం యచ్ఛత దీపితమ్ ।
పిత్రా పితామహేనాపి జుష్టం వః ప్రపితామహైః ॥11॥

తా॥ మీ తండ్రి, తాత, ముత్తాతలచే కూడాసేవించబడిన సత్పురుషుల మార్గమును ఆశ్రయించుడు ప్రజ్వరిల్లిన కోపమును నిగ్రహింపుడు. 11

టీ॥ అత ఆతిష్ఠత ఆశ్రయత. సతాం మార్గముపశమమ్. ప్రితాది భిర్జుష్టమ్. 11

టీ॥ తండ్రి మొదలగు పిత్రాదులచే(పూర్వులచే) ఆశ్రయించబడిన సత్పురుషుల మార్గమును ఆశ్రయించుడు. 11

అవ॥ ప్రజానాం ప్రజాపతిరేవ బన్ధురతస్తజ్జీవికా నాశో న కర్తవ్య ఇతి దృష్టాంత పంచకేనాహ.

శ్లో॥ తోకానాం పితరౌ బన్ధుర్దృశాం పక్ష్మ స్త్రియాః పతిః ।
పతిః ప్రజానాం భిక్షూణాంగృహ్యజ్ఞానాం బుధః సుహృత్ ॥12

టీ॥ తోకానాం బాలానాం మాతా పితరౌ. అజ్ఞానాం జ్ఞానదో బుధ ఏవ సుహృత్. 12

అవ॥ ఈశ్వరాధిష్ఠానత్వాచ్చ భూతద్రోహో న యుక్త ఇత్యాహ - అన్తర్దేహేష్వితి.

శ్లో॥ అన్తర్దేహేషు భూతానామాత్మాస్తే హరిరీశ్వరః ।
సర్వం తద్ధిష్ణ్యమీక్షధ్వమేవం వస్తోషితో హ్యసౌ ॥ 13

అవ॥ దృష్టాంత పంచకముతో ప్రజాపతి ప్రజలకు బంధువు అందుచేత వారి జీవితము నాశముచేయరాదని చెప్పుచున్నాడు.

తా॥ పిల్లలకు తల్లిదండ్రులు; కన్నులకు ఱెప్ప; స్త్రీకి భర్త; ప్రజలకు రాజు; భిక్షుకులకు గృహస్థుడు; అజ్ఞానులకు మిత్రుడైన పండితుడు; బంధువులు. 12

టీ:- పిల్లలకు తల్లిదండ్రులు, అజ్ఞానులకు జ్ఞానమునిచ్చు మంచి హృదయము గల పండితుడు బంధువు. ॥12॥

అవ॥ అంతర్దేహేష్వితి ఆ శ్లోకమున, చరాచరములన్నీ ఈశ్వరాధి - ష్ఠానములు, చరాచరములన్నింటిలో ఈశ్వరుడు వ్యాపించియున్నాడు. కావున అందరును ఈశ్వరునకు నివాసములే. అందుచేత భూత - ద్రోహము కూడదు. అని చెప్పుచున్నాడు.

తా॥ భూతముల దేహములందు ఈశ్వరుడు (హరి) ఆత్మయై యున్నాడు. సర్వమును ఆయన స్థానముగా చూడుడు. ఈ విధముగా శ్రీహరి మీకు ప్రీతుడగును. ॥13॥

టీ॥ వోయుష్మాభిః . ధిష్ణ్యమ్ - అధిష్ఠానమ్. 13

టీ॥ మీకు-మీయందు: నివాసము. ॥13॥

శ్లో॥ యః సముత్పతితం దేహ ఆకాశాన్మన్యు ముల్బణమ్ ।
ఆత్మ జిజ్ఞాసయా యచ్ఛేత్స గుణానతివర్తతే ॥ 14

తా॥ ఎవడు ఆకాశము నుండి దేహమునందు వచ్చి పడునటువంటి భయంకరమైన కోపమును ఆత్మజ్ఞాన వాంఛతో నియమించునో అతడు గుణములను అతిక్రమించును. ॥14॥

టీ॥ ఆకాశాద్దేహే సముత్పతితమాకస్మికమిత్యర్థః. ఆత్మ విచారేణ యో నియచ్ఛేత్. 14

టీ॥ ఆకాశము నుండి వచ్చిపడుట అనగా ఆకస్మికముగా అని అర్థము(కారణము లేకుండగ) ఆత్మవిచారమున ఎవడు నియమించునో! ॥14॥

శ్లో॥ అలం దగ్ధైర్ద్రుమైర్దీనైః ఖిలానాం శివమస్తు వః ।
వార్క్షీ హ్యేషా వరా కన్యా పత్నీత్వే ప్రతి గృహ్యతామ్ ॥ 15

తా॥ దీనములైన చెట్లను దహించుట చాలును. మిగిలిన వానికిని (చెట్లకును) మీకును శుభమగుగాక ! వృక్షములకు చెందిన ఈ శ్రేష్ఠమైన కన్య (మా) పత్నిగా (భార్యగా) స్వీకరింపబడుగాక ! ॥15॥

టీ॥ ఖిలానాం శేషాణాం వో యుష్మాకం చ శివమస్తు వృక్ష రక్షణార్థం తదీయం కన్యాం దదాతి. వార్క్షీ వృక్షైః పాలితా. ॥15॥

టీ॥ మిగిలిన చెట్లకును, మీకును, శుభమగుగాక ! వృక్షములను రక్షించుటకు, వానికి చెందిన వానిచే పోషించబడిన కన్యను ఇచ్చు చున్నారు. ॥15॥

శ్లో॥ ఇత్యామంత్ర్య వరారోహాం కన్యామాప్సరసీం నృప ।
సోమోరాజా యయౌదత్వాతే ధర్మేణోపయేమిరే ॥ 16

తా॥ ఓ రాజా! ఈ విధముగా ఓషధి వనస్పతులకు రాజైన చంద్రుడు వారిని ఊరడించి సుందరియైన అప్సరససంభవ కన్యను ఇచ్చి వెళ్ళి పోయెను. వారు ఆమెను ధర్మముగా వివాహమాడిరి. ॥16॥

టీ॥ ఆమంత్ర్య స్వాన్తయిత్వా అప్సరసీమప్సరసః ప్రమ్లోచాయాః సుతామ్. ॥16॥

టీ॥ (వారిని) ఊరడించి, ప్రమ్లోచాయనెడి అప్సరస కుమార్తెను (వారికి ఇచ్చెను) ॥16॥

శ్లో॥ తేభ్యస్తస్యాం సమభవద్దక్షః ప్రచేతసః కిల ।
యస్య ప్రజావిసర్గేణ లోకా ఆపూరితాస్త్రయః ॥17॥

తా॥ వారిచేత ఆమె యందు దక్షుడు సంభవించెను. ముల్లోకములు ఎవని యొక్క ప్రజా సృష్టితో నింపబడినవో. అతడు ప్రాచేతసుడు (ప్రచేతసుల పుత్రుడు) గదా ! ॥17॥

శ్లో॥ యథా ససర్జ భూతాని దక్షో దుహితృ వత్సలః ।
రేతసా మనసా చైవ తన్మమావహితః శ్రుణు ॥18॥

తా॥ పుత్రికల యందు ప్రేమగల దక్షుడు రేతస్సుతో, మనస్సుతో ఏ విధముగా భూతములను (ప్రాణులను) సృజించెనో దానిని జాగరూకుడవై వినుము . ॥18॥

టీ॥ దుహితృ వత్సల ఇతి తస్య కన్యావంశ ఏవేత్యుక్తం. మమ మత్తః. ॥17,18॥

టీ॥ ఆయనకు కన్యా సంతానమే ఉండుట చేత దుహితృ వత్సలుడు అని చెప్పబడినది అనుటకు మమ, (నా యొక్క) అనుపదము వాడబడినది. (మత్తః-నానుండి) ॥17,18॥

శ్లో॥ మనసైవాసృజత్పూర్వం ప్రజాపతిరిమాః ప్రజాః ।
దేవాసుర మనుష్యాదీన్నభ స్థల జలౌకసః ॥19॥

తా॥ ప్రజాపతి దక్షుడు 'ఆకాశము,భూమి,నీరు నివాస స్థలములుగా గల దేవ, అసుర మనుష్యాది ప్రాణులను మనస్సుతోనే ముందుగా సృజించెను. ॥19॥

టీ॥ ప్రజాపతిర్దక్షః. 19

టీ॥ ప్రజాపతి దక్షుడు. 19

శ్లో॥ తమ బృంహిత మాలోక్య ప్రజా సర్గం ప్రజాపతిః ।
విన్ధ్య పాదాను ప్రవ్రజ్య సోఽచరద్దుష్కరం తపః ॥ 20

తా॥ ఆ ప్రజాపతి, వర్ధిల్లని ప్రజాసృష్టిని చూచి, వింధ్యపర్వత పాద ప్రదేశమును చేరుకొని దుష్కరమైన తపస్సును చేసెను. 20

టీ॥ అబృంహితమసంవృద్ధమ్. విన్ధ్యస్యపాదాన్సంన్నిహిత పర్వతాన్. 20

టీ॥ అభివృద్ధి చెందని వింధ్య పర్వతమునకు దగ్గరగా గల పర్వతమునకు చేరి. 20

శ్లో॥ తత్రాఘమర్షణం నామ తీర్థం పాపహారం పరమ్ ।
ఉపస్పృశ్యానుసవనం తపసా తోషయద్ధరిమ్ ॥ 21

తా॥ అచ్చట పాపరహితమైన అఘమర్షణమను ప్రసిద్ధి గల తీర్థ మందు మూడు పూటల స్నానమాచరించుచు తపస్సుతో శ్రీహరిని ప్రసన్నుని చేసుకొనెను. ॥21॥

శ్లో॥ అస్తౌషీద్ధంస గుహ్యేన భగవంతమధోక్షజమ్ ।
తుభ్యం తదభిధాస్యామి కస్యాతుష్యద్యతో హరిః ॥ 22

తా॥ అధోక్షజుడైన భగవానుని హంసగుహ్యమను స్తోత్రముతో స్తుతించెను దేనిచే ఆ హరి ప్రసన్నుడయ్యెనో దానిని నీకు చెప్పెదను. ॥22॥

టీ॥ హంసగుహ్యాఖ్యేన స్తోత్రేణ. కస్య దక్షస్య. ॥ 21,22॥

టీ॥ అధోక్షజుని యొక్క హంసగుహ్య నామకమైన స్తోత్రము చేత; ఆ దక్షుని యొక్క. ॥21,22॥

ప్రజాపతిరువాచ

శ్లో॥ నమః పరాయావితథాను భూతయే
గుణత్రయాభాస నిమిత్త బన్ధవే ।
అదృష్టధామ్నే గుణతత్వ బుద్ధి
భిర్నివృత్తమానాయ దధేస్వయంభువే ॥ 23

టీ॥ పరాయ సర్వోత్తమాయ నమోదధే నమనం కరోమి. పరత్వే హేతుః – అవితథా అనుభూతిశ్చిచ్ఛక్తిర్యస్య. అతో గుణత్రయాభాసో జీవో నిమిత్తం మాయా చ తయోర్బంధవే నియన్త్రే. ఏవమపి గుణేషు తత్త్వబుద్ధి ర్యేషాం. తైర్జీవైరదృష్టం ధామ స్వరూపం యస్య. తత్ర హేతుః– నివృత్తం మానం యస్మాత్. పాఠాంన్తరే నివృత్తం నిరస్తం మానమవధిశ్చ యస్మాత్. తర్హికథం తస్య సిద్ధిరత ఆహ . స్వయంభువే స్వప్రకాశాయ. 23

ప్రజాపతియైన దక్షుడు పలికెను.

తా॥ అమోఘమైన చైతన్య శక్తి కలదియు, మూడు గుణముల ఆభాసముచే నిమిత్తమైన మాయను నియమించు నట్టిదియు, త్రి గుణ తత్త్వ బుద్ధిగల వారలచే తెలియబడని స్వరూపము కలదియు, నివృత్తి కలదియు, స్వయం ప్రకాశకుడు అయినట్టి పరునికి (పరమేశ్వరున్ని) నమస్కరించుచున్నాను. ॥23॥

టీ॥ పరుని– సర్వోత్తమునికి నమస్కరించుచున్నాను పరత్వమునకు హేతువు– అవితథా అనుభూతిః– వ్యర్థముగాని సత్యమైన చిచ్ఛక్తి ఎవనికో అతనికి నమస్కారము గుణత్రయాభాసుని అనగా జీవుని గుణత్రయాభాస నిమిత్తమైన మాయను నియమించు చున్నవానికి అట్లే గుణములందు తత్త్వ, (విచారించు) బుద్ధిగల ఆ జీవుల చేత తెలియబడని స్వరూపము గలవానికి అందులకు హేతువు. నివృత్తమాన మెవరికో అనగా నలుదిక్కులు సంక్షిప్తమైన కొలత ఎవరికో, నిరస్తమానః అను పాఠాంతరమున తొలగిన ఆయువు యొక్క కొలత అను అర్థము చెప్పవలయును అనగా అవధి లేని వానిని అయినచో అట్టివాని యొక్క సిద్ధి యెట్లు? స్వయంభువునకు స్వప్రకాశకునకు నమస్కారము. 23

అవ॥ అదృష్ట ధామత్వం దర్శయన్నాహ- నేతి.

అవ॥ చూడరాని నివాస స్థానముగల దానిని చూపించుచు చెప్పుచున్నాడు న ఇత్యాది శ్లోకమున.

శ్లో॥ నయస్య సఖ్యం పురుషో౽వైతి సఖ్యుః
సఖా వసన్సంవసతః పురే౽స్మిన్ ।
గుణో యథా గుణినో వ్యక్తదృష్టేస్తస్మై
మహేషాయ నమస్కరోమి ॥24॥

తా॥ ఈ దేహమందు నివసించుచున్నట్టియు, మిత్రుడైనట్టియు, కలిసి నివసించుచున్నట్టియు, జగత్తునకు దృగ్స్వరూపుడగు ఏ మిత్రుని మైత్రిని, గుణములు గుణినివలె తెలియకున్నవో అట్లున్న మహేశ్వరునికి నమస్కరించుచున్నాను. ॥24॥

టీ॥ పురుషః సఖా జీవో౽స్మిన్పురే దేహే వసన్నప్యత్రైవ సంవసతః సఖ్యుర్యస్య సఖ్యం కరణ ప్రవర్తకత్వాదికం నావైతి న జానాతి తస్మై. కుతః. వ్యక్త దృష్టేః ప్రపంచ ద్రష్టుః. న హి ద్రష్టా దృశ్యో భవతీతి. ప్రథమాన్త పాఠే వ్యక్తే ప్రపంచ ఏవ దృష్టిర్యస్య సగుణో విషయో గుణినో విషయిణ ఇంద్రియాదేః సఖ్యం ప్రకాశకత్వం యథా న వేత్తి తద్వత్॥24॥

టీ॥ జీవులు తమ దేహములలో వసియించుచున్న సఖునిగా ఉన్న ఇంద్రియములను ప్రవర్తింప జేయుచున్న పురుషుడు సఖుడు అయిన పురుషుని తెలియకున్నారు. ఎందువలన? వ్యక్తదృష్టి వలన ప్రపంచమునే చూచుటచేత ద్రష్ట దృశ్యము కాకపోవుట వలన. వ్యక్త దృష్టిః అను ప్రథమాన్త పాఠమున ప్రపంచమందే దృష్టిగల వారలు విషయమైన గుణమును ప్రకాశింపజేయుదురే కాని గుణము గుణిని ఎట్లు తెలియదో అట్లు తెలియకున్నారు. ॥24॥

అవ॥ నను గుణో జడత్వాన్న జానాతీతి జీవస్తు చేతనః కిమితి న జానాత్యత ఆహ - దేహ ఇతి.

అవ॥ దేహ ఇత్యాది శ్లోకమున గుణము జడము కావున తెలుసుకొన జాలదు. కాని జీవుడు చేతనుడు అయినను ఎందుకు (పరమాత్మను) తెలియడో అన్నచో చెప్పుచున్నాడు.

శ్లో॥ దేహోஉసవోஉక్షామనవో భూతమాత్రా
నాత్మానమన్యం చ విదుః పరం యత్ ।
సర్వం పుమాన్వేద గుణాంశ్చ తజ్ఞో
న వేద సర్వజ్ఞ మనన్త మీడే ॥ 25

టీ॥ దేహశ్చాసవశ్చ ప్రాణా అక్షాణీంద్రియాణి మనవశ్చాన్తః కరణాని భూతాని చ మాత్రాశ్చ తన్మాత్రాణ్యాత్మానం స్వరూపం దృశ్యమన్య మింద్రియ వర్గం తయోః పరం దేవతావర్గం చ న విదుః. పుమాన్ జీవస్తు సర్వమేతత్త్రయం వేద గుణాంశ్చ తన్మూల భూతాన్వేద. తజ్ఞోపి సన్ యం సర్వజ్ఞం న వేద. తమనన్తమీడే స్తౌమి. ॥25॥

శ్లో॥ యదోపరామో మనసో నామరూప
రూపస్య దృష్టస్మృతిసం ప్రమోషాత్ ।
య ఈయతే కేవలయా స్వసంస్థయా
హంసాయ తస్మై శుచి సద్మనే నమః ॥ 26

తా॥ దేహము ప్రాణములు, ఇంద్రియములు, మనస్సులు, పంచ భూతములు మరియు తద్గుణములు, తమకన్యమైన జీవుని, త్రిగుణములను మరియు సర్వమును జీవుడు తెలియుచున్నాడు. వాటిని తెలిసికొనిన జీవుడు సర్వజ్ఞుడైన అనంతున్ని తెలియకున్నాడు. అట్టి అనంతుని స్తుతించుచున్నాను. ॥25॥

టీ॥ దేహమును, ప్రాణములను, ఇంద్రియములను, మనో బుద్ధ్యహంకార చిత్తములను, అంతఃకరణములు, పృథివ్యాది పంచ భూతములును, వాని తన్మాత్రలును (శబ్ద,స్పర్శ, రూప,రస, గంధములు) జీవుడు త్రిగుణములయిన ఈ మొత్తమును వాని స్వరూపమును తెలిసి, పరమైన దేవతావర్గమును తెలియకున్నవి కాని, మూలభూతములను తెలియుచున్నారు. తెలిసినవాడైనను సర్వజ్ఞుడెవరో వానిని తెలియ కున్నారు. అట్టి అనంతుని స్తుతించుచున్నాను. ॥25॥

తా॥ ఎప్పుడు మనస్సునకు ఉపరతి కలుగునో, అప్పుడు (తన యందులీనమైనప్పుడు) నామరూపముల యొక్క తెలివి అపహరించ–బడుట వలన (నాశనమొందుటవలన)జీవుడు కేవల స్వరూపజ్ఞానముచే ఈశ్వరుని పొందును. అగ్నియే (శుద్ధాంతరంగమే) స్థానముగాగల పరమాత్మకు (హంసకు) నమస్కారము. ॥26॥

టీ॥ అదృష్టధామత్వముక్త్వా స్వప్రకాశత్వమాహ. యదా మనస ఉపరామః సమాధిర్నతు సుఘుప్తావివ లయో న చ జాగ్రత్స్వప్నయోరివ విక్షేపః. తదాహ – నామరూపే రూప్యేతే యేన తత్తథా తస్య. ఉపరామో హేతుః – దృష్టం దర్శనం స్మృతిశ్చ తయోః సంప్రమోషాన్నాశాత్. తదా యః కేవలేన స్వరూన జ్ఞానేన ప్రతీయతే తస్మై హంసాయ శుద్ధాం యశుచి శుద్ధం మనః సద్మ ప్రతీతి స్థానం యస్య తస్మై నమః ॥26॥

టీ॥ కనిపించని స్థానమును కలిగిన వానినిగా చెప్పిన తరువాత స్వయముగా ప్రకాశించుటను చెప్పుచున్నాడు. మనస్సు ఉపరమించుట సమాధి. ఇది నిద్ర యందలి లయమును, జాగ్రత్ స్వప్నము లందలి విక్షేపమును కాదు. ఆ విషయమును చెప్పుచున్నాడు, అనుభవ స్మృతుల యొక్క నాశము వలన నామ రూపములందు ప్రకాశించు మనస్సు ఉపరమించును. అప్పుడు ఎవడు కేవల స్వరూప జ్ఞానమున ఏ పరమాత్మను తెలుసుకొనుచున్నాడో అట్టి శుద్ధాంతరంగమే నివాసముగా గల (హంసకు) పరమాత్మకు నమస్కారము. ॥26॥

అవ॥ ఏవం భూతః కేశాం ప్రతీయత ఇత్యపేక్షాయమాహ – మనీషిణ ఇతి ద్వాభ్యాం.

అవ॥ మనీషిణ ఇత్యాది రెండు శ్లోకములలో ఇటువంటి పరమాత్మ ఎవరికి తెలియబడునో చెప్పుచున్నాడు.

శ్లో॥ మనీషిణోఽన్తర్హృది సంనివేశితం
స్వశిక్తిభిర్నవభిశ్చ త్రివృద్భిః ।
వహ్నిం యథా దారుణి పాంచదశ్యం
మనీషయా నిష్కర్షన్తి గూఢమ్ ॥ 27

తా॥ బుద్ధిమంతులైనవారు త్రిగుణములుగల తన తొమ్మిది శక్తులచే హృదయము లోపలచేరి యున్న దారుణి యందు (కఱ్ఱ) పది హేను మంత్రములతో ప్రకాశింపచేయబడు అగ్నివలె వివేకముతో గూడిన బుద్ధితో గూఢుని(పరమాత్ముని) వివేచించుచుదురు. ॥27॥

టీ॥ వివేకినో యం నిష్కర్షంతి వివిచ్య ధ్యాయంతి స నిర్వాణ సుఖానుభూతిర్మమ ప్రసీదతామితి ద్వయోరన్వయః. ఏవం నిష్కర్షతాం ప్రతీయత ఇతి భావః. కిమితి నిష్కర్షంతి. స్వశక్తిభిర్గూఢమ ప్రకాశ

టీ॥ వివేకియైనవాడు ఎవరిని వివేచించి ధ్యానించునో అట్టి మోక్ష సుఖానుభూతి నాకు ప్రసన్నమగునుగాక అని రెండు శ్లోకములకు అన్వయము ఇట్లు వివేచించు, ధ్యానించు వివేకి తెలిసికొనును.

మానం. కతిభిర్నవభిః పునశ్చ త్రివృద్భిః త్రిగుణాభిః సప్తవింశత్యు పాధిభిర్గూఢమష్టావింశం నిష్కర్షంతీత్యర్థః. యద్వా నవభిః ప్రకృతి పురుష మహదహంకార పంచతన్మాత్ర రూపాభిః. త్రివృద్భిస్త్రిగుణాత్మికాభిః. చకారాత్షోడశ వికార రూపాభిశ్చ. కథం భూతం నిష్కర్షన్తి మనీష యాన్తర్హృది సంనివేశితం నిశ్చలీకృతం పాన్చదశ్యం పంచదశ సామిధేనీ మంత్రైః ప్రకాశ్యమలౌకికం వహ్నిమివాహంకారాస్పదాదాత్మనోఽన్యం పరమాత్మానం నిష్కర్షంతీత్యర్థః. ॥27॥

ఏమని వివేచించుదురు? అనగా స్వశక్తితో రహస్యముగా ప్రకాశించు ,ఎన్నింటిచేత? తొమ్మిదింటిచేత మరల త్రిగుణితముగా మూడు రెట్లతో మొత్తము ఇరువదిఏడు ఉపాధుల చేత దాగి యున్న ఇరువది ఎనిమిదవ వానిని వివేచించుచుదురు కానిచో ప్రకృతి పురుష మహదహంకార పంచతన్మాత్ర రూపములచేత త్రిగుణాత్మకమగు వానిని మరియు పదహారు వికారములు గల వానిని వివేచించు చుదురు. ఎట్టి వానిని వివేచించుదురు? హృదయమున ప్రవేశించియున్న వానిని, వివేక బుద్ధితో నిశ్చలముగా చేయబడిన పదిహేను సౌమిధానీ మంత్రములతో ప్రకాశింపదగిన అలౌకిక అగ్నిని వలె అహంకారమైన పదమునకు భిన్నుడైన పరమాత్మయైన వానిని వివేచించుదురు. ॥27॥

శ్లో॥ స వై మమాశేష విశేష మాయా
నిషేధ నిర్వాణ సుఖానుభూతిః ।
స సర్వనామ స చ విశ్వరూపః
ప్రసీదతామనిరుక్తాత్మశక్తిః ॥ 28

తా॥ సకల భేదములతో కూడిన మాయా కార్యమగు జగత్తును నిషేధించగా దుఃఖ స్పర్శలేని ఆనందానుభవమే పరమేశ్వరుడు. సకల నామములు గల వాడు. విశ్వరూపుడు అయిన నిర్వచించరాని ఆత్మశక్తి గల ఆఈశ్వరుడు నాకు ప్రసన్నుడగుగాక ! ॥28॥

టీ॥ అశేషా విశేషా యస్యాస్తస్యా మాయయా నిషేధేన నిర్వాణ సుఖేఽనుభూతిర్యస్య అప్రసక్త నిషేధా సంభవా ప్రసక్తిమాహ. స ఏవ సర్వనామా స ఏవ విశ్వరూప ఇతి. తద్రూపత్వేపి వాస్తవత్వా

టీ॥ అశేష విశేషములు గల మాయ యొక్క నిషేధము చేత మోక్ష సుఖమునందు అనుభూతిగల, అప్రసక్తమునకు నిషేధము లేకపోవుటచే ప్రసక్తి చెప్పబడుచున్నది. అతడే అన్ని నామములు గలవాడు. అన్ని

భావాన్నిషేధః సంభవతీత్యాహ. అనిరుక్తా ఆత్మనిశక్తిర్మాయా యస్య సః. ॥28॥

రూపములుగలవాడు. (విశ్వరూపుడు) విశ్వరూపుడైనను, ఆ విశ్వ - రూపమునకు వాస్తవత్వము లేకపోవుట వలన నిషేధము కలుగు - చున్నది. అతడు అనిరుక్తుడు- నిర్వచించరాని - ఆత్మశక్తి - మాయకలవాడు అట్టి వానిని వివేచించుదురు. అనిరుక్తా ఆత్మని శక్తిర్మాయా యస్య సః. అనిరుక్తాత్మ శక్తిః - నిర్వచించరాని ఆత్మ శక్తి మాయా శక్తి ఎవరికో వాడు అనిరుక్తాత్మ శక్తి. ॥28॥

అవ॥ నను యది కేవలయా స్వసంస్థయా ప్రతీయతే తర్హి సర్వ నామత్వం విశ్వరూపత్వం చానుపపన్నం వాగాద్యగోచరత్వాది త్యాశఙ్క్య సర్వైర్నామభిర్వాచ్యం ప్రత్యక్షాది దృశ్యం చ తస్య స్వరూపం వస్తుతో మాభూత్తదాపిమాయయా ఘటత ఇతి శ్లోక త్రయేణోప పాదయన్న మస్కరోతి - యద్యదితి.

అవ॥ యద్యదిత్వాది శ్లోకత్రయముతో ఒకవేళ కేవల ఆత్మజ్ఞానముతో డనే తెలియబడునన్నచో అప్పుడు సర్వనామత్వము, విశ్వరూపత్వము వాగాదులకు అగోచరములు అగుట వలన అయుక్తములు అని ఆశకించి వాస్తవముగా అతని స్వరూపము అన్ని నామములతో చెప్పదగిన వాచ్యమైనది గాను, ప్రత్యక్షాదులతో దృశ్యమైనదిగాను కాకూడదు, కాని మాయతో అవి రెండును ఘటిల్లును కుదురును. అని చెప్పుచు నమస్కరించుచున్నాడు.

శ్లో॥ యద్యన్నిరుక్తం వచసా నిరూపితం
ధియాఽక్షభిర్వా మనసా వోత యస్య ।
మాభూత్స్వరూపం గుణరూపం హి తత్త
త్సవై (గుణైర్వర్థితమ్) గుణాపాయ విసర్గ లక్షణః ॥ 29

తా॥ ఏది వాక్కుతో చెప్పబడినదో, బుద్ధితో గాని ఇంద్రియములతో గాని మనస్సుతో గాని తెలియబడినదో, ఏది ఏది ఎవని స్వరూపము కాదో అది గుణరూపమే (ప్రళయోత్పత్తులు లక్షణముగా గలది గుణ రూపము) ఆ పరమాత్మ కాదు. అతడు మాత్రము గుణాభావము విసర్గము లక్షితుడుగా అగుచున్నాడు. ॥29॥

టీ॥ యద్యత్వచసా నిరుక్తం అభిహితం ధియా నిరూపితం వ్యవస్థిత మక్షభిర్వాఇన్ద్రియైర్నిరూపితం గృహీత ముత అపి మనసాపి నిరూపితం సంకల్పితం యస్య స్వప్రకాశత్వం తస్య తత్స్వరూపం మాభూత్. స్వరూపత్వాభావే హేతుః- హి యస్మాత్తస్మాత్తద్గుణానామేవ రూపమ్. పాఠాంతరే గుణైర్వర్ధితం సతు గుణ వ్యతిరిక్తః. యతో గుణానామపాయ విసర్గాభ్యాం ప్రలయోత్పత్తిభ్యాం లక్ష్యత ఇతి తథా. చేతనాధిష్ఠానాం వినా తయోరసంభవాత్. యద్వా యస్య స్వరూపం మాభూన్నభవతి తస్మై నమ ఇతి తృతీయే నాన్వయః. ॥29॥

టీ:- వాక్కుతో చెప్పుటకుగాని మనస్సుతో సంకల్పించుటకు గాని బుద్ధితో నిరూపించుటకు గాని ఇంద్రియములతో గ్రహించుటకు గాని, అవకాశముగ గుణములతో ప్రకాశించునది గాని కాదు. స్వరూపా భావమునకు హేతువు. ఎవనికి ఏది గుణమో అదియే అతని రూపము పాఠాన్తరమున గుణములచేత వర్ధిల్లబడినది అని అర్థము. అతను గుణములకు వ్యతిరిక్తుడు (భిన్నుడు) అతని యందే అన్ని గుణములును అన్ని రూపములును జన్మించి వృద్ధి చెంది వర్తించుచున్నను లయమవు చున్నను అతను నిర్గుణుడు అతీతుడు చేతన లేకుండగా ప్రళయో త్పత్తులు సంభవించవు కావున ఆ రెండును అతని స్వరూపము కాజాలవు అని తృతీయాంతముతో అన్వయము చెప్పదగినది. ॥29॥

శ్లో॥ యస్మిన్యతో యేన చ యస్య యస్మై
యద్యో యథా కురుతే కార్యతే చ ।
పరావరేషాం పరమం ప్రాక్ ప్రసిద్ధం
తద్బ్రహ్మ తద్ధేతురనన్యదేకమ్ ॥ 30

తా॥ ఎవని యందు? ఎవని వలన? ఎవని చేత? ఎవని యొక్క? ఎవని కొఱకు? ఏది? ఎవడు? ఏవిధముగా చేయునో మరియు చేయించునో కారణ కార్యములకు పూర్వమే ప్రసిద్ధమైనట్టి వానికి కారణమైనట్టి, వానికి అతీతమైనట్టి మరియొకటి లేనట్టి అఖండమైనది (ఏకమైనది) ఏదియో అదియే పరబ్రహ్మము. ॥30॥

టీ॥ తదేవం వస్తుతో గుణస్వరూపత్వా భావమంగీకృత్యా నిరుక్తాత్మ శక్తిరిత్యనేనద్యోతితం మాయయా సర్వ వాచ్యత్వేన విశ్వరూపత్వమాహ. యస్మిన్నధికరణే. యతోఽపాదానాత్. యేనకరణేన. యస్య సంబంధి.

టీ:- ఇట్లు స్వభావ సిద్ధముగా గుణస్వరూపత్వము లేకపోవుటను అంగీకరించి నిర్వచించరాని ఆత్మశక్తియైన మాయచేత ప్రకాశింప చేయబడిన సర్వశబ్దములచే చెప్పబడు విశ్వరూపత్వమును చెప్పు

యస్మై సంప్రదానాయ యదీప్సిత తమం. యః కర్తా. కురుతే స్వతంత్రః కార్యతేచాన్యేన ప్రయోజ్యకర్త్రా. తద్బ్రహ్మేతి ప్రత్యేకం సంబంధః. అత్ర చ సప్తభిర్యచ్ఛబ్దైః సప్తవిభక్త్యర్థాదర్శితాః యథేతి చ క్రియాకార సంబంధ ప్రకారవాచినామవ్యయానా మర్థాః. కురుతే కార్యతే చేతిస్వార్థ పరార్థ క్రియాన్వయశ్చ సర్వేషాం దర్శితః. చ శబ్దేన భావ కర్మాది విహిత ప్రత్యయార్థాః సంగృహితాః. తద్బ్రహ్మైవేతి కుతస్తత్రాహ. తద్ధేతుస్తేషాం కారణం. తత్కుతః. సర్వేభ్యః ప్రాక్ప్రసిద్ధం. నను బ్రహ్మాదయస్తద్ధేతవః శ్రూయన్తేఽవరే చ దృశ్యన్తే తత్కథం బ్రహ్మైవ తద్ధేతుస్తత్రాహ. పరేషామవరేషాం చ హేతూనాం పరమం కారణం. నను సర్వ కారణత్వే తస్య కిం నామ సహకారి భవేత్తదానీమన్యస్యాభావాత్ సత్యం నిర పేక్షమేవ తత్కారణమిత్యాహ. అనన్య ద్విజాతీయ శూన్యమ్. ఏకం స జాతీయ శూన్యంచ. తస్మై నమ ఇత్యుత్తరేణాన్వయః. 30

చున్నాడు. ఏది అధికరణమో, ఏది ఉపాదానమో, ఏది కరణమో, ఏది సంప్రదానమో, ఏది సంబద్ధమో, ఏది కర్మయో, ఎవడు కర్తయో ఈ వీనిని స్వతంత్రముగా ఎవడు చేయునో ప్రయోజ్య కర్తతో చేయుంచునో, అది అంతయు బ్రహ్మమే. ఏడు విభక్తులంతమందు గల ఏడు యత్ శబ్దములచేత అర్థములు చూపబడినవి. యథా అనునది యత్ శబ్దము నుండి ఏర్పడిన అవ్యయము. అవ్యయములకు క్రియ, కారక, సంబంధము, ప్రకారము, మొదలయిన అవ్యయార్థములు చెప్పబడినవి. కురుతే–చేయునో కార్యతే–చేయించునో అనునవి స్వార్థ పరార్థ క్రియాన్వయములు అన్నింటికీ చూపబడినవి. చ శబ్దముచే భావకర్మాదులతో విధింపబడిన ప్రత్యయార్థములు సంగ్రహింపబడినవి. ఎందు వలన అది బ్రహ్మమే అన్నచో చెప్పబడుచున్నది అది వాటికి హేతువు. దానితో చేయబడినది అన్నింటికంటే పూర్వమే ప్రసిద్ధమైనది బ్రహ్మాదులు కదా! దీనికి హేతువులు తర్వాత వారు వినబడుచున్నారు మరియు చూడబడుచున్నారు అందువలన ఎట్లు బ్రహ్మమే దీనికి హేతువుగా చెప్పబడుచున్నది అన్నచో – పరములు (పూర్వులు) అపరములు (తరువాత వారు) అయిన హేతువులకు పరమ కారణము బ్రహ్మము. అది సర్వకారణమైనచో అపుడు మఱొక వస్తువు లేక పోవుటచే సహకారియగునది ఏది యన్నచో సత్యమే – నిరపేక్షమే ఆకారణము అని చెప్పుచున్నాడు. అనన్యము విజాతీయము లేనిది

శ్లో॥ యచ్ఛక్తయో వదతాం వాదినాం
వై వివాద సంవాద భువోభవన్తి ।
కుర్వంతి చైషాం ముహురాత్మమోహం
తస్మై నమోఽనంత గుణాయ భూమ్నే ॥31॥

టీ॥ తన్వేవం బ్రహ్మ చేద్విశ్వస్య హేతుస్తర్హి న కదాచిదనీదృశం జగదితి వదంతో మీమాంసకాః కుతోఽత్ర వివదన్తే. తైశ్చాన్యే స్వభావ వాదినః సంవదన్తే తే చ తే చ తత్త్వవిద్భిర్బోధితా అపి కుతః పునః పునర్ముహ్యంతి తత్రాహ – యస్య మాయా విద్యాయాః శక్తయో వివాదస్య క్వచిత్సంవాదస్య భువః స్థానాని భవన్తి తస్మై నమః. ॥31॥

ఏకం సజాతీయ శూన్యమైనది తస్మై నమః అట్టి దానికి నమస్కారము అని ఉత్తర శ్లోక పదములతో అన్వయము. ఈ ప్రపంచము అధికరణ, అపాదాన,కరణ, సంప్రదాన, సామాన్య కర్తృరూపము కాని ప్రపంచము మిథ్యయగుట వలన అధికరణాది ప్రపంచ రూపము లన్నియు బ్రహ్మమే అట్టి వానికి నమస్కారము అని తర్వాత శ్లోకముతో అన్వయము.॥30॥

తా॥ ఎవని శక్తులు వాదులకు, ప్రతివాదులకు, వివాదములకు, సంవాదములకు కారణములు అగుచున్నవో మరియు వీరికి మరల ఆత్మ వ్యామోహమును కలిగించుచున్నవో అట్టి అనంత గుణములు కలిగినట్టి సర్వవ్యాపకుడగు వానికి నమస్కారము.॥31॥

టీ॥ విశ్వమునకు హేతువు ఆ పరబ్రహ్మమే అయినచో ఈ జగత్తును ఇట్టిదని వివరించు మీమాంసకులు వీరితో సమానముగా చెప్పబడు స్వభావవాదులు ఎందుకు వివాదము చేయుదురు ఇతరులు మరికొందఱు ఈ ఉభయులను సమానముగా చెప్పుదురు. తత్త్వవేత్తలతో ఇట్లు బోధించబడినను మాటి మాటికి ఈ విషయమున మోహమును ఏల పొందుదురు. అన్నచో ఈ విషయమును చెప్పు చున్నాడు. ఎవని మాయా విద్య యొక్క శక్తులు ఒకప్పుడు వివాదమునకు ఒకప్పుడు సంవాదమునకు స్థానములగునో అట్టి పరమాత్మకు నమస్కారము. 31

అవ॥ నను కింతద్బ్రహ్మ యస్య శక్తయో వివాదాది భువో భవన్తి- తత్రాహ - అస్తీతి.

శ్లో॥ అస్తీతి నాస్తీతి చ వస్తునిష్ఠయో
రేకస్థయోర్భిన్న విరుద్ధ ధర్మయోః ।
అవేక్షితం కించ న యోగ సాంఖ్యయోః
సమం పరంహ్యనుకూలం బృహత్తత్ ॥ 32

టీ॥ యోగ ఉపాసనా శాస్త్రమ్. తత్రహి విరాడ్రూపేణోపాసనాయాం పాతాల పాదాదిక మస్తీ త్యుపాస్యత్వే న విధీయతే. నాస్తీతి సాంఖ్యం జ్ఞానశాస్త్రం. తత్ర 'అపాణిపాదః' 'అచక్షురశ్రోత్రమ్' ఇతి చ పాదాది నాస్తీతి నిషిధ్యతే. తయోర్యోగ సాంఖ్యయోర్యత్కించిత్సమమనువర్తమాన మవేక్షితం ప్రతీతం తద్బృహద్బ్రహ్మ. వివాదాస్పదం బ్రహ్మేత్యర్థః వివాదం స్ఫుటయతి. భిన్నావస్తి నాస్తీ త్యేవం భూతౌ విరుద్ధౌ ధర్మౌ యయోః. తయోర్భిన్న విషయత్వేఽపి విరోధో నస్యాదిత్యేకస్థయో రిత్యుక్తమేక విషయోః కుతః వస్తు నిష్ఠయోః పాదాది విధిప్రతిషేధయోరేక వస్తునిష్ఠత్వాత్. సమత్వే హేతుః పరమ్. హి యతః. విధిప్రతిషేధయో రవిషయస్తయోః పాదాది విషయత్వాత్. తథా తర్హ్య విషయస్య సద్భావే కిం ప్రమాణం తదాహ. అనుకూలమధిష్ఠానం వినా పాదాది కల్పనా యోగాత్, అవధిం వినా తన్నిషేధా యోగాచ్చ తయోరుపపాదకత్వేన

అవ॥ అస్తీతీత్యాది శ్లోకమున ఏ పరబ్రహ్మ శక్తులు వివాదాదులకు కారణమైనవో - చెప్పుచున్నాడు.

తా॥ ఉన్నది అనియు, లేదు అనియు పరస్పర విరుద్ధ ధర్మములుగల వస్తు ధర్మముల యందు, ఒకే దానిని ప్రతిపాదించు యోగ సాంఖ్యము లకు ఒకానొక ప్రతికూలమైన, (సమమైన) అనుకూలమైనదిగా దర్శించ బడినదియే బ్రహ్మము. ॥32॥

టీ॥ యోగమనగా ఉపాసనాశాస్త్రము. పరబ్రహ్మమును విరాడ్రూప ముగా ఉపాసించుటలో పాతాళ పాదాదికమున్నదని ఉపాస్యముగా విధించబడుచున్నది. అటువంటి పాదాదికం లేదని చెప్పు సాంఖ్యము జ్ఞానశాస్త్రము "అపాణిపాదః అక్షురశ్రోత్రం" అను శ్రుతి పదములచే లేదని నిషేధించుచున్నది ఆ యోగ సాంఖ్యముల రెంటియందు ఏదో ఒక అంశము సమానముగా అనువర్తించి చూడబడిన ప్రతీతమే బ్రహ్మము. వివాదమునకు బ్రహ్మమే స్థానమైనది వివాదమును స్పష్టపరచుచున్నాడు. ఉన్నది, లేదు అను పరస్పర విరుద్ధములెవరి యందు గలవో వానికి అవి రెండు భిన్నవిషయములు అయినను విరోధముండదు. కాని ఒకే వస్తువు నందు ఉన్న పాదాది వస్తు నిష్ఠయైన సత్తాసత్తులకు విరోధముండును గదా! సమత్వమునకు హేతువు- పరమైనదికదా! హి- ఎందువలననగా విధి ప్రతిషేధములు పాదాది

సిద్ధమిత్యర్థః. తస్మైనమః ఇతి పూర్వస్యానుషంగః. ॥32॥

విషయములే అగుట వలన అట్టి విషయము కాని బ్రహ్మమున్నదనుటకు ప్రమాణమేమి? అన్నచో చెప్పుచున్నాడు. అధిష్ఠానము లేకుండా పాదాదికల్పనము కుదరదు కదా! అవధి లేకపోవుటచే నిషేధింపబడు అవకాశమును లేదు. ఆ రెండింటికీ ఉపపాదకములుగా బ్రహ్మము సిద్ధము. అట్టి ఏకస్థునకు నమస్కారము అని పూర్వముతో అన్వయము. ॥32॥

అవ॥ ననూదాసీనస్య సమస్య నమస్కారో కోలాభస్తత్రాహ–య ఇతి.

అవ॥ యు' ఇత్యాది శ్లోకమున, ఉదాసీనుడు, సముడు అయిన పరమాత్మునకు నమస్కరించినచో ఏమి లాభమో వివరించబడుచున్నది.

శ్లో॥ యోనుగ్రహార్థం భజతాం పాదమూల
మనామరూపో భగవాననన్తః ।
నామాని రూపాణి చ జన్మ కర్మభిర్భేజే
స మహ్యం పరమః ప్రసీదతు ॥ 33

తా॥ తన పాదములను సేవించు భక్తులననుగ్రహించుటకు నామ రూపములులేని వాడును, అనంతుడును అగు ఎవరు జన్మల చేతను, కర్మల చేతను (లీలలచే) నామములను, రూపములను పొందెనో అట్టి పరముడు (భగవానుడు) నాకు ప్రసన్నుడగుగాక! ॥33॥

టీ॥ పాదమూలం భజతామనుగ్రహార్థం ప్రాకృత నామరూప రహితోఽపి జన్మభిరవతారైర్విశుద్ధోర్జిత సత్త్వాని రూపాణి కర్మభిర్నామాని చ యోభేజే. తత్కృతః. భగవానచిన్త్యైశ్వర్యః. స మహ్యం ప్రసీదతు. ॥33॥

టీ॥ పాదముల భజించువారి అనుగ్రహము కొఱకు పురాతనుడు, నామ రూప రహితుడు అయినను విశుద్ధ ఊర్జితమైన సత్త్వములైన రూపములతోడను, కర్మల తోడను నామముల తోడను ఎవడు ప్రకటించుకొనెనో, అది ఎందుకు అన్నచో చింతించరాని ఐశ్వర్యముగల (ఊహాతీతమైన) ఆ ఈశ్వరుడు నాకు ప్రసన్నుడు అగుగాక ! ॥33॥

అవ॥ నను తాదృశః సకామా గణేశాదీన్ ప్రార్థయంతే కింతు తాన్విహాయ కిమతి భగవంతమేవ ప్రార్థయసే తత్రాహ య ఇతి .

శ్లో॥ యః ప్రాకృతైర్ జ్ఞాన పథైర్జనానాం
మథాశయం దేహగతో విభాతి ।
యథాఽనిలః పార్థివమాశ్రితో గుణం
స ఈశ్వరో మే కురుతాన్మనో రథమ్ ॥34॥

టీ॥ ప్రాకృతైరర్వాచీనైర్ జ్ఞాన పథైరుపాసనా మార్గైర్యథాశయం తత్తద్వాసనాను సారేణ యోదేహగతోఽన్తర్యామీతి తత్తద్దేవతా రూపేణ వివిధో భాతి. యథా వాయుః పార్థివం గుణం చంపకాది గంధ భేద మాశ్రిత్య నానా గంధ వాన్విభాతిరేణోర్గుణం ధూసరత్వాదికమాశ్రిత్య నానారూపవాన్ ప్రతీయతే తద్వత్తస్యైవ తత్తద్దేవతా రూపేణ ఫల దాతృత్వాత్స ఈశ్వర ఏవమేమనోరథం సత్యం కరోతు కిమంతర్గ తైర్దేవతాంతరైరిత్యర్థః. తదుక్తం గీతాసు యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి. తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహం. స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధన మీహతే . లభతే చ తతః కామాన్మయైవ విహితాన్ హితాన్ ఇతి. యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్ ఇతి చేతి. ॥34॥

అవ॥ య ఇత్యాది శ్లోకమున సకాములు గణేశాదులను ప్రార్థించెదరు. కాని నీవు అటువంటి వారిని వదిలి భగవానునే ఎందుకు ప్రార్థించుచున్నావు? అన్నచో చెప్పుచున్నాడు.

తా॥ ఎవడు ప్రాకృతుల, జ్ఞాన పథుల భావనలకు (ఆశ్రయములకు) తగినట్లుగా జనుల దేహముల యందు, భూగుణమును ఆశ్రయించిన వాయువువలె ప్రకాశించునో అట్టి ఈశ్వరుడు నా మనోరథమును తీర్చునుగాక ! ॥34॥

టీ॥ నీ యథార్థ స్వభావమును వేద వాక్కుల ద్వారా తెలుసుకొనిన జ్ఞానులు జ్ఞానము కొఱకు చెప్పిన ఉపాసనా మార్గములలో, వారివారి వాసనానుసారము అంతర్యామివైన నీవు ఆయా దేవతల రూపములతో భాసించుచున్నావు. ఏ విధముగా వాయువు చంపకాది పుష్పముల గంధ భావములను ఆశ్రయించి అనేక గంధములుగను, వివిధరేణువులను, వర్ణములను ఆశ్రయించి వివిధ రూపములుగ ప్రకాశించు-చున్నదో ఆ విధముగనే వివిధ రూపములతో కొలుచు వారికి ఆయా రూపములతో ఫలముల అనుగ్రహించు ఆ పరమేశ్వరుడు నా మనోరథమును సిద్ధింపచేయుగాక ! (దేవతలలో భేదమున్నను పరమాత్మ ఒక్కడే అని భావము) ఈ విషయమును భగవద్గీతయందు అంతర్గతుడనై దేవతాంతరముల ద్వారా నేనే వారి కోర్కెలను తీర్చుచున్నాను. అని

పరమాత్మ స్పష్టము చేసి యున్నాడు. ఎవరెవరు ఏ ఏ శరీరములతో నన్ను శ్రద్ధగా అర్చించుటకు ఇష్టపడుదురో వారికి ఆ శ్రద్ధనే కల్పించు చున్నాను వారు అచంచలమైన శ్రద్ధతో ఆరాధించి ఆ యా ఫలములను, కోరికలను తీర్చుకొనుచున్నారు. ఎవరు ఏ విధముగా నన్ను కొల్చుచున్నారో వారిని ఆ విధముగానే అనుగ్రహించుచున్నాను. ॥34॥

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ ఇతి స్తుతః సంస్తువతః సతస్మిన్నఘమర్షణే ।
ఆవిరాసీత్కురుశ్రేష్ఠ భగవాన్భక్త వత్సలః ॥ 35

**శ్రీశుకులు చెప్పుచున్నారు.**

తా॥ కురువంశ శ్రేష్ఠుడవైన ఓ రాజా! ఆ అఘమర్షణ తీర్థమందు చక్కగా స్తుతించుచున్న దక్షునకు, స్తుతించబడినట్టి భక్తవత్సలుడగు భగవానుడు సాక్షాత్కరించెను. ॥35॥

టీ॥ సంస్తువతో దక్షస్య స భగవాన్ ప్రత్యక్షోऽభూత్. ॥35॥

టీ॥ దక్షుని యొక్క చక్కని స్తోత్రమునకు ఆ భగవానుడు ప్రత్యక్షమయ్యెను. ॥35॥

అవ॥ తం వర్ణయతి సార్ధైశ్చతుర్భిః.

అవ॥ నాలుగున్నర శ్లోకములలో అతనిని (భగవానుని) వర్ణించు చున్నాడు.

శ్లో॥ కృతపాదః సుపర్ణాంసే ప్రలంబాష్ట మహాభుజః ।
చక్రశంఖాసి చర్మేషు ధనుః పాశ గదాధరః ॥ 36

తా॥ గరుత్మంతుని భుజముపై పాదములుంచినవాడు, పొడవైన ఎనిమిది గొప్ప బాహువులు కలవాడు, చక్రము, శంఖము, ఖడ్గము, డాలు, బాణము, ధనుస్సు, పాశము, గదలను ధరించినవాడు. ॥36॥

టీ॥ సుపర్ణాస్యాంసే స్కంధేకృతౌ పాదౌ యేన. ప్రలంబా అష్టౌ మహాంతో భుజా యస్య. చక్రద్యష్టాయుధ ధరః. ॥36॥

టీ॥ చక్కని రెక్కలుగల గరుత్మంతుని మూపుపై పాదములు మోపి ఎనిమిది మహాభుజములందు చక్రాది అష్టాయుధముల ధరించినాడు. ॥36॥

శో॥ పీతవాసా ఘనశ్యామః ప్రసన్నవదనేక్షణః ।
వనమాలానివీతాంగో లసచ్ఛ్రీవత్స కౌస్తుభః ॥ 37

తా॥ పీతాంబరుడు, మేఘమువలె నల్లనివాడు, ప్రసన్న వదనము (చూపులను) కలవాడు, వనమాలచే ఆవరింపబడిన అవయవములు కలవావాడు. ప్రకాశించుచున్న శ్రీవత్స కౌస్తుభము కలవాడు.॥37॥

టీ॥ ప్రసన్నం వదనమీక్షణేచ యస్య. వనమాలయా నివీతం కంఠాది పాదాంత వ్యాప్తమఙ్గం యస్య. లసన్తౌ శ్రీవత్స కౌస్తుభౌ యస్య. ॥37॥

టీ॥ ప్రసన్న వదనము, ఈక్షణము కలవాడు, కంఠము నుండి పాదముల వఱకు వ్యాపించిన వనమాల కలవాడు శ్రీవత్సమనెడి పుట్టుమచ్చతో కౌస్తుభ మణితో ప్రకాశించుచున్నవాడు. ॥37॥

శ్లో॥ మహాకిరీట కటకః స్ఫురన్మకర కుండలః ।
కాంచ్యంగులీయ వలయ నూపురాంగద భూషితః ॥ 38

తా॥ గొప్పకిరీటము, కంకణములు, ప్రకాశించు మకర కుండలములు, మొలనూలు, వడ్డాణము, ఉంగరములు, హారము, అందెలు, భుజ కీర్తులచే అలంకరింపబడినవాడు. ॥38॥

టీ॥ మహాన్తికిరీట కటకాని యస్య. స్ఫురతీ మకరకుండలే యస్య కాఞ్చ్యాదిభిర్వి భూషితః వలయమత్ర పాద భూషణం ద్రష్టవ్యమ్ కటక స్యోక్త త్వాత్. ॥38॥

టీ॥ మహాకిరీటమును, మెఱయు మకర కుండలములు, బంగారు ఉంగములతో కడియములతో (పాదభూషణములతో) ప్రకాశించు చుండెను. ॥38॥


ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ త్రైలోక్య మోహనం రూపం బిభ్రత్త్రిభువనేశ్వరః ।
వృతో నారద నన్దాద్యైః పార్షదైః సురయూథపైః ॥ 39

తా॥ ముల్లోకమును మోహింపజజేయు రూపమును ధరించిన వాడు త్రిభువనాధీశుడు, నారదుడు, నందుడు మున్నగు అనుచరుల తోడను దేవనాయకుల తోడను పరివృతుడై. ॥39॥

శ్లో॥ స్తూయమానోఽను గాయద్భిః సిద్ధ గంధర్వ చారణైః ।
రూపం తన్మహదాశ్చర్య విచక్ష్యాగత సాధ్వసః ।
ననామ దండవద్భూమౌ ప్రహృష్టాత్మా ప్రజాపతిః ॥ 40

తా॥ సిద్ధుల, గంధర్వుల, చారణుల చేత స్తుతించబడుచున్నవాడును, ఆశ్చర్యము కలిగించు రూపముగలవాడును అగు భగవానుని చూచి తత్తరపాటుచే హృదయమందు గొప్ప సంతోషమును పొందినవాడై (భూమిపై) దండమువలె పడి నమస్కరించెను. ॥40॥

టీ॥ త్రైలోక్య మోహనం శ్రీపురుషోత్తమాఖ్యమ్. సురయూథపైర్లోకపాలైః ॥39॥ ॥40॥

టీ॥ ముల్లోకములను మోహింపజేయు పురుషోత్తమ నామకమైన పేరుగలవాడు లోకపాలకులతో కూడి (యున్న వానిని చూచి ఆశ్చర్యపోయెను) ॥39,40॥

శ్లో॥ న కించనో ధీరయితుమశకత్తీవ్రయా ముదా ।
ఆపూజిత మనోద్వారైర్హ్రాదిన్య ఇవ నిర్ఝరైః ॥41

తా॥ ప్రవాహములచే నింపబడిన నదులనువలె, తీవ్ర తీవ్రమైన ఆనందముతో నిండిన మనోద్వారములచే దేనిని పలుకుటకు శక్తుడు కాలేదు. ॥41॥

టీ॥ ఆపూరితాని మనోద్వారాణి ఇంద్రియాణి తైః. యథా హ్రాదిన్యో నద్యో నిర్ఝరైరాపూర్యన్తే తథా మహానందాపూర్ణత్వేనావృత్తికత్వాద్వాగాదినా న కించిద్వక్తుం శక్తోఽభూదిత్యర్థః. ॥41॥

టీ॥ ప్రవాహముల చేత నింపబడిన నదులవలె తీవ్ర సంతోషముతో నింపబడిన ఇంద్రియములతో కూడినందున వాగాది ఇంద్రియములన్నియు వృత్తిరహితములైనందున మాట్లాడలేకపోయెను.॥41॥

శ్లో॥ తం తథాఽవనతం భక్తం ప్రజాకామం ప్రజాపతిమ్ ।
చిత్తజ్ఞః సర్వభూతానామాదిమాహ జనార్దనః ॥ 42

తా॥ ఆ విధముగా నమస్కరించినట్టి, భక్తుడైనట్టి, సంతానమును కోరుచున్న ప్రజాపతిని గూర్చి సర్వ భూతముల చిత్తములు తెలిసిన జనార్దనుడు ఇట్లు పలికెను.॥42॥

టీ॥ యద్యప్యసౌనావో చత్తథాపి చిత్తజ్ఞ ఇదం వక్ష్యమాణమాహ॥42॥

టీ॥ ఏమీ మాట్లాడలేక పోయినప్పటికిని చిత్తములు తెలిసిన వాడు కావున ఈ విధముగా పలుకుచుండెను. ॥42॥

శ్రీ భగవానువాచ

భగవానుడు పలికెను

శ్లో॥ ప్రాచేతసా మహాభాగ సంసిద్ధస్తపసా భవాన్ ।
యచ్ఛ్రద్ధయా మత్పరయా మయిభావం పరమ్ గతః ॥ 43

తా॥ ప్రాచేతసా ! మహానుభావా ! నీవు తపస్సుచే చక్కని సిద్ధిని పొందితివి. నేను మాత్రమే విషయముగాగల శ్రద్ధచే నా యందు అతిశయమయిన భావమును పొందితివి. ॥43॥

టీ॥ భావం భక్తిం. గతః ప్రాప్తః ॥43॥

టీ॥ భావమనగా భక్తి – ప్రాప్తః – పొందబడినది. ॥43॥

శ్లో॥ ప్రీతోఽహం తే ప్రజానాథ యత్తేఽస్యో ద్బృంహణం తపః।
మమైషకామో భూతానాం యద్భూయాసుర్విభూతయః ॥ 44

తా॥ ఓ ప్రజాపతి ! నేను నీ తపస్సుచే సంతోషించితిని. ఏలననగా నీ తపస్సు ఈ సృష్టికి వృద్ధికరము. ప్రాణులకు సంపదలు కలుగుగాక అనునది నా కోరిక. ॥44॥

టీ॥ టీ॥ యద్యతస్తే తపోఽస్య విశ్వస్యోద్బృంహణం వృద్ధికర

టీ॥ విశ్వము యొక్క వృద్ధి కొఱకు నీచే చేయబడిన తపస్సునకు

మతస్తేఽహం ప్రీతః మత్తపసో లోక సమృద్ధర్థత్వేత్వత్ప్రీతేః కింకారణం తత్రాహ – మమేతి. భూతానాం విభూతయః సమృద్ధయో భూయాసురితి యదేశ ఏవ మమకామః. అతో మత్కామపూరణాదేవాహం ప్రీతోస్మీత్యర్థః ॥44॥

నేను ప్రీతిని పొందితిని. మమేతి పాఠమున లోక సమృద్ధి కొఱకు తపస్సు చేయుటకు ప్రీతికరమెందులకో కారణము చెప్పుచున్నాడు. సమస్త జీవరాసులకు ఐశ్వర్యము కలుగుట అను నా యొక్క కోరికయే వ్యక్త పరచబడినది. అందుచేత నా కోరిక తీరినందున ప్రీతుడనైతిని అని అర్థము. ॥44॥

అవ॥ భూతివిస్తార ప్రయత్నశ్చ తవోచిత ఏవేత్యాహ – బ్రహ్మేతి.

అవ॥ బ్రహ్మేత్యాది శ్లోకమున నీకు భూతవిస్తార ప్రయత్నము తగినదే అని చెప్పుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మాభవో భవన్తశ్చ మనవో నిబుధేశ్వరాః ।
విభూతయో మమహ్యేతాభూతానాం భూతహేతవః ॥ 45

తా॥ బ్రహ్మయు, శివుడును, మీరును (ప్రజాపతులు) మనువులును, దేవతాపతులును, నా యొక్క విభూతులే. వీరు భూతముల యొక్క సంపదకు హేతువులు. ॥45॥

టీ॥ భవన్తః – ప్రజాపతయః భూతేరుద్భవస్య హేతవః. ॥45॥

టీ॥ ప్రజాపతులైన మీరు భూతముల సృష్టికి కారణులు. ॥45॥

శ్లో॥ తపో మే హృదయం బ్రహ్మన్ స్తనుర్విద్యా క్రియాకృతిః ।
అంగాని క్రతవో జాతా ధర్మ ఆత్మాసవః సురాః ॥ 46

తా॥ ఓ బ్రహ్మా ! తపస్సే నా హృదయము. శరీరమే విద్యా (ఉపాసనా) క్రియయే ఆకారము (ఆకృతి) చక్కగా అనుష్ఠింపబడిన క్రతువులు అంగములు (అవయవములు) ధర్మము మనస్సు, (ఆత్మ) దేవతలు ప్రాణములు. ॥46॥

టీ॥ విశ్వవృద్ధ్యర్థేన త్వత్తపసా౽హం ప్రీత ఇత్యుక్తం తదేవ తపః స్తువన్ప్రసంగాదన్యాన్యపి లోక వృద్ధి కరాణి విద్యాదీని స్తౌతి. తపో యమ నియమాది సహితం ధ్యానం మే హృదయం. విద్యా సాంగ మంత్ర జపః సా. ధ్యానం తనోతేతి తనుర్ధేహః. క్రియా ధ్యానాది విషయః పుం వ్యాపారో భావనాశబ్దవాచ్యస్తేన హి ధ్యానాదికమాక్రియత ఇత్యాకృతిః. జాతాః సునిష్పన్నాః క్రతవో౽ంగాని. "శిరోవా ఏతద్య త్ప్రవర్గ్యః గ్రీవా ఉపసదశ్చక్షుషీ ఆజ్య భాగౌ"ఇత్యాది శ్రుతేః. ధర్మః క్రత్వాద్యపూర్వమాత్మా మనః హృదయాశ్రయత్వాత్. సురాయజ్ఞభుజస్త ఏవాసవః ప్రాణాః. సంతర్పణీయత్వాత్. ॥46॥

టీ॥ విశ్వవృద్ధి కొఱకు నీవు చేసిన తపస్సు చేత నేను సంతృప్తిని పొందితిని అని చెప్పుటకు అనుకూలముగా లోకవృద్ధికరములైన అన్య విద్యాదులను స్తుతించుచున్నాడు. యమ నియమములతో గూడిన ధ్యానమే తపస్సు. అదే నా హృదయము. సాంగ మంత్ర జపము విద్యా, అంగన్యాస కరన్యాసములతో కూడిన మంత్ర జపము, ధ్యానములు విస్తరించును. కావున నాకు తనువు(శరీరము) ధ్యానాది విషయములుగల పురుష వ్యాపారము భావనాశబ్దవాచ్య మగుట వలన ధ్యానాదులు చేయబడును కావున అదినా ఆకృతి. క్రతువులు అంగములైనవి హృదయమునాశ్రయించుటవలన మనస్సు, దేహము ఇంద్రియములతో కూడిన ధర్మమే నా ఆత్మ యజ్ఞ భోక్తలైన దేవతలు వారిని సంతోషపరచుట చేత వారు ప్రణములు ప్రవర్గ్యమే యజ్ఞము యొక్క శిరస్సు, ఉపసదము కంఠము, ఆజ్య భాగములే కన్నులు అని వేద ప్రమాణము, క్రత్వాదుల వలన ఏర్పడు అపూర్వములు ధర్మము. ॥46॥

అవ॥ తపసః సంతాన వృద్ధి హేతుత్వం దర్శయితుం ద్వితీయ తృతీయోక్తమితిహాసమాహ – చతుర్భిః అహమేవ – ఇతి.

అవ॥ అహమేవా ఇత్యాది నాల్గు శ్లోకములలో తపస్సు సంతానవృద్ధి హేతువని చూపించుటకు రెండవ, మూడవ స్కంధములలో చెప్పబడిన ఇతిహాసములని చెప్పుచున్నారు.

శ్లో॥ అహమేవా సమేవాగ్రే నాన్యత్కించాంతరం బహిః ।
సంజ్ఞానమాత్రమవ్యక్తం ప్రసుప్తమివ విశ్వతః ॥ 47

తా॥ సృష్టికి పూర్వము నేను మాత్రమే ఉంటిని బయట గాని లోపల గాని మఱొకటి (రెండవది) ఏదియును లేదు. అవ్యక్తమైన చైతన్యము మాత్రమే విశ్వమంతటా నిద్రించి నట్లుండెను. ॥47॥

టీ॥ అహమేవేతి వస్త్వంతర వ్యావృత్తిః. ఆసమేవేతి క్రియాంతర వ్యావృత్తిః. అంతరం గ్రాహకమ్. బహిర్గ్రాహ్యమ్. సంజ్ఞానమాత్రం చైతన్యమాత్రమ్. అవ్యక్త మింద్రియ వృత్తిభిరనభి వ్యక్తమ్. అతఏవ ప్రసుప్తమివ విశ్వతః సర్వత్ర. ॥47॥

టీ॥ నేనే అనుటచే వస్త్వంతరము లేదనుట. ఉంటిని అనుటచేత మరొక క్రియ లేదనుట. లోపల ఉండి గ్రహించుటకాని బయట ఉండి గ్రహించునవికాని అవ్యక్తమైన చైతన్యము మాత్రమే, ఇంద్రియ వృత్తులచేత తెలియబడనిది. అందుచేత నిద్రించినట్లు విశ్వమంతటా (ఉండునది) ॥47॥

శ్లో॥ మయ్యనంత గుణేఽనన్తే గుణతో గుణ విగ్రహః ।
యదాసీత్తత ఏవాద్యః స్వయంభూః సమభూదజః ॥ 48

తా॥ అనన్త గుణములు కలిగినట్టి, అనన్తుడనగు నా యందు గుణముల వలన గుణకార్యమగు బ్రహ్మాండము ఎప్పుడైతే ప్రకటిత మయ్యెనో (ఏర్పడెనో) అప్పుడే మొదటివాడు స్వయంభువుడు అగు అజుడు(బ్రహ్మ) ప్రకటితమయ్యెను. ॥48॥

టీ॥ గుణతో మాయాతః. గుణమయో విగ్రహో బ్రహ్మాండమ్. తతస్తదైవ. అజోఽయోనిజః. ॥48॥

టీ॥ గుణతః - మాయ నుండి, గుణమయమైన బ్రహ్మాండము (శరీరము) దాని నుండే అయోనిజుడైన చతుర్ముఖ బ్రహ్మ పుట్టెను.॥48॥

శ్లో॥ స వై యదా మహాదేవో మమవీర్యోప బృంహితః ।
మేనేఖిలమివాత్మాన ముద్యతః సర్గ కర్మణి ॥ 49

తా॥ మహాదేవుడు, నా యొక్క వీర్యముచే(శక్తిచే) వర్ధిల్లచేయబడిన వాడు అగు ఆ బ్రహ్మ ఎప్పుడైతే సర్గ(సృష్టి)కార్యమందు ఉద్యుక్తుడయ్యెనో అప్పుడు తనను తాను అసమర్థుని వలె తలచెను. ॥49॥

టీ॥ ఖిలమసమర్థమివ. ॥49॥

టీ॥ ఖిలం – అసమర్థునివలె. ॥49॥

శ్లో॥ అథ మేఽభిహితో దేవ స్తపోఽతప్యత దారుణమ్ ।
నవ విశ్వసృజో యుష్మాన్యేనాదావసృజద్విభుః ॥ 50

తా॥ అప్పుడు నాచే ఉపదేశింపబడినవాడై ఆ దేవుడు (బ్రహ్మ) తీవ్రమైన తపస్సును ఆచరించెను. దానిచే (ఆ తపస్సుచే) ప్రభువు మొట్ట మొదటగా జగత్తును సృష్టించు ప్రజాపతులగు మిమ్ము తొమ్మిది మందిని సృష్టించెను. ॥50॥

టీ॥ మే మయా తపతపేత్యభి హితః సన్. యేన తపసా. ॥50॥

టీ॥ నా చే తపస్సు చేయమని చెప్పబడినవాడై ఆ తపస్సుచే (సృజించెను) ॥50॥

అవ॥ సంతతివృద్ధ్యుపాయమాహ – ఏషేతి.

అవ॥ ఏష ఇత్యాది శ్లోకమున సంతతిని వృద్ధిపొందించు ఉపాయము చెప్పబడుచున్నది.

శ్లో॥ ఏషా పఞ్చజనస్యాఙ్గ దుహితా వై ప్రజాపతేః ।
అసిక్నీనామ పత్నీత్వే ప్రజేశ ప్రతిగృహ్యతామ్ ॥ 51

తా॥ ఓ ప్రజాపతీ! ఈమె పంచజన ప్రజాపతి యొక్క పుత్రిక. అసిక్ని అనుపేరుగల ఈమెను భార్యగా స్వీకరించుము. (వలసినది)॥51॥

టీ॥ అఙ్గ హే దక్ష ! పఞ్చజనాఖ్యస్య ప్రజాపతేః. ॥51॥

టీ॥ ఓ దక్షా! పంచజనుడనుపేరుగల ప్రజాపతియొక్క (పుత్రిక)51

శ్లో॥ మిథున వ్యవాయ ధర్మస్త్వం ప్రజాసర్గమిమం పునః ।
మిథున వ్యవాయ ధర్మిణ్యాం భూరిశో భావయిష్యసి ॥ 52

తా॥ భార్యతో కలసియుండుటయను ధర్మము గల నీవు, భర్తతో కలిసి యుండుటయను ధర్మముతో గల ఈమె యందు మరల ప్రజా సర్గమును అధికముగా చేయగలవు. ॥52॥

టీ॥ మిథునస్యయో వ్యవాయోరతిః స ఏవ ధర్మో యస్య స త్వమ్. తథా భూతాయాం తస్యామ్. ॥52॥

టీ॥ మిథున సంభోగము - అధియే ధర్మముగాగల నీవు అట్టి ధర్మమే గల ఆమె యందు. ॥52॥

శ్లో॥ త్వత్తోఽధస్తాత్ప్రజాః సర్వామిథునీభూయ మాయయా ।
మదీయయా భవిష్యంతి హరిష్యంతి చ మే బలిమ్ ॥ 53

తా॥ నీ కంటే క్రిందగల (నీ తరువాత) ప్రజలందరు నా మాయచేత మిథునములుగా (జంటలుగా) ఏర్పడి ఉండగలరు. మరియు నాకు ఆహారమిచ్చి నన్ను ఆరాధించుచుందురు. ॥53॥

టీ॥ మాయయా నిమిత్త భూతయా. స్త్రియాసహ మిథునీ భూయ భవిష్యంతి పుత్రాది రూపేణోత్పత్స్యన్తే, ॥53, 54॥

టీ॥ నిమిత్తభూతులయి, స్త్రీలతో గూడి జతయై పుత్రాదుల రూపమున ఉత్పాదనము చేయగలరు. ॥53,54॥

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ ఇత్యుక్త్వా మిషతస్తస్య భగవాన్విశ్వభావనః ।
స్వప్నోపలబ్ధార్థ ఇవ తత్రైవాన్తర్దధే హరిః ॥ 54

**శ్రీశుకులు పలికెరి.**

తా॥ ఈ విధముగా దక్షప్రజాపతితో పలికి విశ్వభావనుడైన (భగవానుడు) నారాయణుడు కలలో కనిపించిన వస్తువు వలె అచ్చటనే అంతర్ధానమయ్యెను. ॥54॥

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే చతుర్థోఽధ్యాయః**

**శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆరవ స్కంధమున నాల్గవ అధ్యాయము సమాప్తము**

## పంచమోஉధ్యాయః

### గోపాలకృష్ణాయనమః

అవ॥ పంచమే నారదేనాథ వాచః కూటైస్తు నాశితాన్. సుతానాకర్ణ్య దక్షోஉముం శశాపేతి నిరూప్యతే.

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ తస్యాం స పాంచజన్యాం వై విష్ణుమాయోప బృంహితః ।
హర్యశ్వ సంజ్ఞానయుతం పుత్రానజనయద్విభుః ॥ 1

శ్లో॥ అపృథగ్ధర్మ శీలాస్తే సర్వే దాక్షాయణా నృప ।
పిత్రా ప్రోక్తాః ప్రజాసర్గే ప్రతీచీం ప్రయయుర్దిశమ్ ॥ 2

టీ॥ అపృథగ్ధర్మశీలా ఏకాచార స్వభావాః. ॥1,2॥

శ్లో॥ తత్ర నారాయణ సరస్తీర్థం సిన్ధు సముద్రయోః ।
సంగమో యత్ర సుమహన్ముని సిద్ధనిషేవితమ్ ॥ 3

## ఐదవ అధ్యాయము

### గోపాలకృష్ణునికినమస్కారము

అవ॥ ఐదవ అధ్యాయమునందు, నారదుని నిగూఢార్థముతో కూడిన మాటల కూటముల కారణముగా నశించిన పుత్రులను గూర్చి విని దక్షుడు నారదుని శపించెను, అనువృత్తాంతము నిరూపింపబడినది.

**శ్రీశుకులు పలికిరి.**

తా॥ విష్ణుమాయతో వర్ధిల్లిన ప్రభువైన దక్షుడు, పంచజనుని పుత్రిక (పాంచజని) అసిక్ని యందు దాంపత్య ధర్మమున హర్యశ్వులని పిలువబడు పదివేల మంది పుత్రులను కనెను.॥1॥

తా॥ ఓ రాజా! ఒకే ఆచార స్వభావము కలిగిన ఆ పదివేల మంది దాక్షాయణులు (దక్షపుత్రులు) తండ్రిచేత ప్రజాసర్గమునకై ఉపదేశింప బడినవారై పశ్చిమ దిశకు బయలుదేరిరి. ॥2॥

టీ॥ ఒకే ఆచార స్వభావము గలవారు.॥1,2॥

తా॥ సింధునది, సముద్ర సంగమ స్థలములో అతి విస్తారమైన, సిద్ధులచే, మునులచే సేవించబడు పవిత్రమైన నారాయణ సరస్సు - యను తీర్థము కలదు.॥3॥

టీ॥ తత్ర ప్రతీచ్యాం దిశి సిన్ధోర్నద్యాః సముద్రస్య చ యత్ర సంగమస్తత్రస్థం నారాయణ సరోనామ తీర్థం ప్రయయురిత్యన్వయః. సుమహదతివిస్తీర్ణమ్ ॥3॥

టీ॥ అక్కడ పశ్చిమదిక్కున ఎక్కడ సింధునది యొక్కయు, సముద్రము యొక్కయు, సంగమము కలదో అక్కడ నారాయణ సరమను పేరుగల తీర్థము గలదని అన్వయము. అతి విస్తీర్ణము కలది. ॥3॥

శ్లో॥ తదుపస్పర్శనాదేవ వినిర్ధూత మలాశయాః ।
ధర్మేపారమ హంస్యే చ ప్రోత్పన్నమతయోఽప్యుత ॥ 4

తా॥ దాని స్పర్శ వలన మలాశయము తొలగిన వారై పరమహంస ధర్మమందు మనస్సు పుట్టిన వారగుదురు.॥4॥

టీ॥ వినిర్ధూతో మలోరాగాదిర్యస్మాత్స ఆశయో యేషామ్. ॥4॥

టీ॥ తొలగిన రాగాది మలములు ఆశయము ఎవరియందో వారు. వినిర్ధూత మలాశయులు. ॥4॥

శ్లో॥ తేపి రేతప ఏవోగ్రం పిత్రాదేశేన యంత్రితాః ।
ప్రజావివృద్ధయే యత్తాన్ దేవర్షిస్తాన్దదర్శహ ॥ 5

తా॥ తండ్రి యొక్క ఆదేశముతో ప్రజావృద్ధి కొఱకు ఉగ్రమైన తపస్సు నాచరించిరి. అట్టి హర్యశ్వులను దేవర్షి నారదుడు చూచెను. ॥5॥

టీ॥ తాన్ శుద్ధసత్వానపి పిత్రాదేశ జాడ్యేన ప్రజావివృద్ధయే యత్తాన్ ఉద్యుక్తాన్దదర్శ. ॥5॥

టీ॥ శుద్ధసత్త్వ సంపన్నులే అయినను తండ్రియొక్క ఆదేశ జాడ్యమున ప్రజావృద్ధి కొఱకు ప్రయత్నించుచున్న వారిని చూచెను.॥5॥

అవ॥ అహో కష్టం మోక్షమార్గాధి కారిణః సంత ఏతే ప్రవృత్తి నిష్ఠైః కర్మభిర్నశ్యేరన్నితి కృపయా తాన్నిగూఢార్థైర్వాక్యైరుపదిశతి స్మ. తదాహ – ఉవాచేతి చతుర్భిః.

అవ॥ ఉవాచ ఇత్యాది నాలుగు శ్లోకములచేత, అయ్యో! కష్టము మోక్షమార్గాధికారము గల వీరు ప్రవృత్తి నిష్ఠచేత (కర్మల చేత) నశించెదరని, దయతో వారికి నిగూఢార్థ వాక్యములతో ఉపదేశము చేయుచుండెను అని చెప్పబడుచున్నది.

శ్లో॥ ఉవాచ చాథ హర్యశ్వాః కథం స్రక్ష్యథ వై ప్రజాః ।
అదృష్ట్వాఽన్తం భువో యూయం బాలిశాబత పాలకాః ।।6

టీ॥ పాలకాః సంతోపి బాలిశా అజ్ఞా యూయం కథం ప్రజా స్రక్ష్యథ. బలేతి ఖేదే. బాలకా ఇతి పాఠే బాలిశత్వే హేతుః ॥6॥

తా॥ ఓ హర్యశ్వులారా! సొంతముగా భూమిని చూడకుండగనే ప్రజాసృష్టిని ఎట్లు చేయుదురు? పాలకులయ్యును మీరు అజ్ఞానులుగా (బాలకులుగా) ఉన్నారు. ॥6॥

టీ॥ ప్రజాపతులు (పాలకులు) ఐనప్పటికి అజ్ఞులు (అమాయకులు) ఐన మీరు ప్రజలను ఎట్లు సృష్టించెదరు? బత శబ్దము ఖేదార్థము. బాలకాః అను పాఠమున బాలకత్వమునకు అనగా అమాయకత్వము నకు హేతువు. ॥6॥

శ్లో॥ తథైక పురుషం రాష్ట్రం బిలం చాదృష్ట నిర్గమమ్ ।
బహురూపాం స్త్రియంచాపి పుమాంసం పుంశ్చలీపతిమ్ । ।7

టీ॥ ఏక ఏవ పురషో యస్మింస్తద్రాష్ట మదృష్టేత్యనుషంగః. బిలం చేత్యాది ద్వితీయాంతా నామావిజ్ఞాయ కథం సర్గం కరిష్యథేతి తృతీయే నాన్వయః. ॥7॥

తా॥ ఒకానొక పురుషుని ఒక రాష్ట్రమును మరియు బయటకు వచ్చు దారి కనపడని బిలమును, బహు రూపములు గల స్త్రీని, వ్యభిచారిణికి భర్తయగు పురుషుని చూడకుండగా. ॥7॥

టీ॥ ఒకే ఒక పురుషుడు ఏ రాష్ట్రమందు గలడో ఆ రాష్ట్రమును చేరకుండగ దాని మార్గమును తెలియకుండగనే, ద్వితీయాంతముతో చెప్పబడిన బిలమును, మున్నగు వానిని తెలియకుండగనే సృష్టిని ఎట్లు చేయుదురు? అని తృతీయముతో అన్వయము. ॥7॥

శ్లో॥ నదీముభయతో వాహం పంచపంచాద్భుతం గృహమ్ ।
క్వచిద్ధంసం చిత్రకథం క్షౌరపవ్యం స్వయంభ్రమిమ్ ॥ 8

తా॥ రెండు వైపులకు ప్రవహించు ఒకనది, ఐదు ఐదులచే అనగా ఇరువది ఐదింటిచే నిర్మించబడిన అద్భుత గృహమును చిత్రమైన కథలు గల హంసను, చురకత్తులతో, వజ్రములతో నిర్మింపబడిన స్వయముగా తిరుగుచున్న చక్రమును. (చూడకుండగానే) ॥8॥

టీ॥ పంచ పంచానాం పంచ వింశతేరద్భుతం గృహం. క్షౌరసవ్యం క్షురైః పవిభిర్వజ్రైశ్చ నిర్మితమివాతితీక్ష్ణం ద్రుఢంచేత్యర్థః. స్వయం స్వతంత్ర్యం భ్రమిం భ్రమణ స్వభావం. ॥8॥

టీ॥ ఐదు ఐదులు గల అనగా ఇరువదియైదు తత్త్వములు గల అద్భుత గృహము, చురకత్తులతో వజ్రములతో నిర్మింపబడిన దానివలె ధృఢమైనది అని అర్థము. స్వయముగా తిరుగు స్వభావము గలది.।8।

శ్లో॥ కథం స్వసితురాదేశమవిద్వాంసో విపశ్చితః ।
అనురూపమవిజ్ఞాయ అహోసర్గం కరిష్యథ ॥ 9

తా॥ విద్వాంసుడగు మీ తండ్రి గారిచే ఆదేశింపబడి అజ్ఞానులైన మీరు, తగినది అని తెలియక సృష్టిని ఎట్లు చేయుదురు. ॥9॥

టీ॥ విపశ్చితః సర్వజ్ఞస్య స్వపితురాదేశ మాత్మనోఽనురూపమ విద్వాం సోఽజానన్తఃపూర్వోక్తం చైకపురుషం రాష్ట్రమిత్యాద్య విజ్ఞాయాహో కథం సర్గం కరిష్యథేత్యన్వయః. ॥9॥

టీ॥ సర్వజ్ఞుడైన (స్వంత) తండ్రి ఆదేశము యొక్క అనురూపమును తెలియకుండగనే అనగా పూర్వములో చెప్పబడిన ఏక పురుషుడు, రాష్ట్రము మున్నగు వానిని, అహో! ఎట్లు సృష్టి చేయగలరు అని అన్వయము. ॥9॥

**శ్రీ శుక ఉవాచ.**

శ్లో॥ తన్నిశమ్యాథ హర్యశ్వా ఔత్పత్తిక మనీషయా ।
వాచః కూటన్తు దేవర్షేః స్వయం విమమృశుర్ధియా ॥10॥

**శ్రీశుకులు వలికిరి.**

తా॥ హర్యశ్వులు దేవర్షి నారదుని యొక్క గూఢార్థముతో (దాపరికము) కూడిన ఆ మాటలను విన్న తరువాత స్వయముగా సహజమైన బుద్ధితో విమర్శించిరి. ॥10॥

టీ॥ వాచః కూటం పరోక్షవాదేనార్థాంతరమివ ప్రతీయమానం వచనం. ఔత్పత్తికీ సహజామనీషా విచార శక్తిర్యస్యాస్తయా ధియా స్వయమేవ విమమృశుర్విచారితవంతః ॥10॥

టీ॥ పరోక్షవాద రూపమున దాగియున్న అర్థముగల మాటలను సహజమైన విచార శక్తి గల హర్యశ్వులు స్వయముగా విమర్శించిరి. ॥10॥

అవ॥ నారదోక్త దశ వాక్యానాం తైర్విమృశ్య నిర్ణీతానర్థానాహ దశభిః అదృష్టా౽ంతంభువ ఇత్యత్ర భూశబ్దార్థమాహ - భూరితి.

అవ॥ నారదునిచే చెప్పబడిన పదివాక్యములను వారి (హర్యశ్వుల) చేత విమర్శించబడి నిర్ణయించబడిన అర్థములను పదిశ్లోకములలో చెప్పుచున్నాడు. భూరితి శ్లోకమున అదృష్టాంతం భువ అనుదానికి ఇచ్చుట భూశబ్దార్థము చెప్పబడుచున్నది.

శ్లో॥ భూః క్షేత్రం జీవసంజ్ఞం యదనాది నిజ బంధనమ్ ।
అదృష్ట్వాతస్య నిర్వాణం కిమసత్కర్మభిర్భవేత్ ॥11॥

తా॥ ఏది ఆదిలేనిదో, తనను బంధించునదియో ఆ జీవుడను పేరు గల క్షేత్రము (భూమి) యొక్క అంతమును చూడకుండగనే చేయు అసత్కర్మల వలన ఫలితమేమి? (ఏమి జరుగును) ॥11॥

టీ॥ క్షేత్రం తచ్చాత్ర జీవసంజ్ఞం లింగశరీరమ్. యన్నిజ బంధన మాత్మనో బంధకారణమ్. అంతశబ్దార్థమాహ నిర్వాణం నాశమ్. అసద్భిర్మోక్షానుపయోగిభిః కర్మభిః కిం భవేన్న కిమపి. ॥11॥

టీ॥ క్షేత్రమనగా ఇక్కడ జీవుడను సంజ్ఞగల లింగశరీరము. ఏది తనకు నిజమైన బంధనమో అనగా బంధ హేతువో, (దానిని చూడకుండగా) అంత అను శబ్దమునకు అర్థము చెప్పుచున్నారు. నిర్వాణం- నాశము. అసత్తు అసత్తును మోక్షమునకు ఉపయోగింప బడని కర్మలతో ఏమి జరుగును? ఏమియు జరుగదు. ॥11॥

అవ॥ ఏక పురుష మిత్యస్యార్థమాహ - ఏక ఏవేతి.

అవ॥ ఏక ఏవేత్యాది శ్లోకమున ఒకే ఒక పురుషుని అనగా దాని అర్థము చెప్పబడుచున్నది.

శ్లో॥ ఏక ఏవేశ్వరస్తుర్యో భగవాన్స్వాశ్రయః పరః ।
తమదృష్ట్వాఽభవం పుంసః కిమసత్కర్మ భిర్భవేత్ ॥ 12

తా॥ ఈశ్వరుడు ఒక్కడు మాత్రమే తురీయుడు (నాలుగవవాడు) స్వాశ్రయమునకు (తనకు తానే) పరమునకు ఆశ్రయమైన నిత్యముక్తుని (భగవానుని) చూడకుండగా చేయు అసత్కర్మల వలన ఏమి ప్రయోజనము? ॥12॥

టీ॥ తుర్యః సర్వసాక్షి. స్వాశ్రయః స్వాధారః. అభవం నిత్యముక్తం. అసద్భిరీశ్వరాసమర్పితైః కర్మభిః. ॥12॥

టీ॥ తుర్యః సర్వమునకు సాక్షి అయినవాడు, స్వాశ్రయః తనకు తానే ఆధారము (ఆశ్రయము) గలవాడు అభవుడు, నిత్యముక్తుడు అయిన ఈశ్వరునికి సమర్పించబడని కర్మల వలన (ఏమి జరుగును) ॥12॥

అవ॥ బిలం చాదృష్ట నిర్గమమిత్యస్యార్థమాహ - పుమాన్ ఇతి.

అవ॥ పుమాన్ ఇత్యాది శ్లోకమున బయటకు వచ్చు దారి కనబడని బిలము యొక్క అర్థమును చెప్పుచున్నాడు.

శ్లో॥ పుమాన్నైవైతి యద్గత్వా బిలస్వర్గం గతో యథా ।
ప్రత్యగ్ధామాఽవిద ఇహ కిమసత్కర్మభిర్భవేత్ ॥ 13

తా॥ పురుషుడు దేనిని పొంది బిలస్వర్గమును (పాతాళమును) చేరి నశించు వానివలె తిరిగిరాడో, అట్టి జ్యోతిరూప బ్రహ్మను తెలియని వానికి నశ్వరమగు స్వర్గాదులకు సాధనములైన కర్మలచే ఏమి ప్రయోజనము? ॥13॥

టీ॥ పుమాన్ యద్గత్వాప్రాప్య బిలస్వర్గం పాతాలం గత ఇవ నైవైతి నావర్తతే తత ప్రత్యగ్ధామ జ్యోతీరూపం బ్రహ్మ. అవిదోఽవిదుషః. అస్మద్భిర్నశ్వర స్వర్గాది సాధనైః కర్మభిః ॥13॥

టీ॥ పురుషుడు దేనిని పొంది బిలస్వర్గమును (పాతాళమును) చేరి నశించు వానివలె తిరిగిరాడో, అట్టి జ్యోతిరూప బ్రహ్మను తెలియని వానికి నశ్వరమగు స్వర్గాదులకు సాధనములైన కర్మలచే ఏమి ప్రయోజనము? ॥13॥

అవ॥ బహురూపాం స్త్రియమిత్యస్యార్థమాహ - నానా రూపేతి.

అవ॥ నానా రూప ఇత్యాది శ్లోకమున నానా రూపములు గల స్త్రీయను దానికి అర్థము చెప్పుచున్నాడు.

శ్లో॥ నానా రూపాత్మనో బుద్ధిః స్వైరిణీవ గుణాన్వితా ।
తన్నిష్ఠామగతస్యేహ కిమసత్కర్మ భిర్భవేత్ ॥ 14

తా॥ స్వేచ్ఛగా తిరుగు స్త్రీవలె నానా రూపములతో కూడిన గుణములుగల బుద్ధి యొక్క అంతమును పొందని వానికి అసత్కర్మల వలన ఏమి ఫలితము?॥14॥

టీ॥ స్వైరిణీవ పుంశ్చలీవ విమోహాకై రజ ఆది గుణైరన్వితా. తన్నిష్ఠాం తస్యా అవసానం వివేకమగతస్యా ప్రాప్తస్య. అసద్భిరశాంతైః ॥14॥

టీ॥ వ్యభిచారిణివలె రజము మొదలైన గుణములతో కూడిన బహురూపములు గల బుద్ధియొక్క అంతమును అనగా వివేకమును పొందక అశాంతి చేత (ఫలితమేమి) శమించని కర్మల వలన ప్రయోజనమేమి యని భావము. ॥14॥

శ్లో॥ తత్సంగభ్రం శితైశ్వర్యం సంసరంతం కుభార్యవత్ ।
తద్గతీరబుధస్యేహ కిమసత్కర్మ భిర్భవేత్ ॥15॥

తా॥ వ్యభిచారిణి సంగముచేత, శీలాది ఐశ్వర్యము కోల్పోయిన భార్య గలవాని వలె, ఆమె కదలికలను తెలిసుకొనని వానికి (మిథ్యా స్వాతంత్ర్యముగల వానికి) అసత్కర్మల వలన ప్రయోజనమేమి?॥15॥

టీ॥ పుమాంసం పుశ్చలీపతిమిత్యస్యార్థమాహ. తస్యాః సంగేన భ్రంశిత మైశ్వర్యం స్వాతంత్ర్యం యస్య. కుత్సితాభార్యా యస్య తద్వత్ తస్యాః గతీః సుఖదుఃఖ లక్షణాః. సంసరంతం గచ్ఛంతం జీవమబుధస్యా జానతః. అసద్భిర్బుధ్యవివేక ప్రాప్తైః. ॥15॥

టీ॥ పుమాంసం - పుంశ్చలీపతిం అను దానికి అర్థము చెప్పు చున్నాడు. దాని సంగమున కోల్పోయిన స్వాతంత్ర్యముగల చెడ్డ భార్యగల వాని వలె, దాని వలన సుఖ దుఃఖములు పొందుచున్న జీవుని తెలియని వానికి అవిద్యా అవివేకముగల కర్మములతో ఏమి పని? ప్రయోజనమేమి అని అర్థము. ॥15॥

శ్లో॥ సృష్ట్యప్యయకరీం మాయాం వేలాకూలాంత వేగితామ్ ।
మత్తస్య తామ విజ్ఞస్య కిమ సత్కర్మ భిర్భవేత్ ॥16॥

తా॥ ఆగట్టు ఈగట్టుకు ప్రవహించే చివరతో వేగముగల సృష్టి లయముల చేయు మాయా శక్తినియతుడై అసలు విషయం తెలియని- వానికి అసత్కర్మల వలన ప్రయోజనమేమి? ॥16॥

టీ॥ నదీమభయతో వాహామిత్యస్యార్థ మాహ. సృష్ట్యప్యయౌ కరోతీత్యుభయతః ప్రవాహో దర్శితః. వేలా కూలం ప్రవాహ వవసతితీనాం నిర్గమ స్థానం తపో విద్యాది తస్యాంతే సమీపే వేగితాం నిర్గమ ప్రతిబంధాయ క్రోధాహంకారాదిభిః కృతవేగాం. మత్తస్య తద్వేగేన వివశస్య. అత ఏవ తాం తథాభూతామవిజ్ఞనస్య అవిచారయతః. అసద్భిర్మాయికైః. యద్వా వేలాకులం సముద్రస్య వ్యవహారస్థానం తస్య సమీపే సముద్రవృద్ధిర్హ్రాసాభ్యాం యథో భయతోఽన్తర్బహిః కృతవేగా నదీ భవత్యేవం సముద్ర తుల్యస్యాత్మనో వ్యవహారస్థానే దేహే జన్మ మరణాదిభిః కృతవేగామిత్యర్థః. వేగినీమితి పాఠే వేగవతీమ్. ॥16॥

టీ॥ నదీముభయతో వాహం–ఇరువైపుల ప్రవహించునది ఉన్నది. అనుదానికి అర్థము చెప్పుచున్నాడు. సృష్టిప్యయో అనుపదముతో చెప్పబడిన సృష్టిప్రళయములు రెండు ప్రవాహములుగా చూపబడ్డాయి. వేలాకూలం(ఒడ్డు)అనగా ప్రవాహములో పడిన వానికి తపో విద్యాదులు, నిర్గమ స్థానములు. ఆ కూల సమీపమునందే యున్న ప్రవాహవేగముతో నిర్గమ స్థాన ప్రతిబంధకమునకు క్రోధాహంకారాదులు వేగమును పెంచును. వేగముచేత వివశులైన మత్తకు వానిని తెలియకుండగనే మాయికమయ కర్మలచే లేదా సముద్రమునకు గల చెలియలి కట్ట యొక్క సమీపమున నదీ సంగమ సమయమున నీరు, లోనికి, బయటకు ప్రవేశించునటుల సముద్ర తుల్యమైన ఆత్మ స్వయముగా జనన మరణములకు వ్యవహార స్థానమైన దేహమును పొందును. వేగినీ అను పాఠాంతరమున వేగమును కల దానిని అని అర్థము. అప్పుడు అసత్కర్మముల వలన ప్రయోజనమేమి? అనగా జనన మరణాదులచే వేగము పెరుగునని భావము. ॥16॥

శ్లో॥ పంచవింశతి తత్త్వానాం పురుషోఽద్భుత దర్పణమ్ ।
అధాత్మమబుధస్యేహం కిమసత్కర్మభిర్భవేత్ ॥ 17

తా॥ ఇరువదిఐదు తత్వములకు పురుషుడు అద్భుత దర్పణము వంటివాడు. తన లోపలి తత్వములను తెలుసుకొనని వానికి అసత్కర్మల వలన ప్రయోజనమేమి? ॥17॥

టీ॥ పంచపంచేత్యస్యార్థమాహ. పంచవింశతితత్వానాం పురుషో న్తర్యామీ. అద్భుతదర్పణమాశ్చర్యరూప ఆశ్రయః. అధ్యాత్మం కార్యకారణ సంఘాతాధిష్ఠాతారం. తమబుధస్య అసద్భిః మిథ్యాస్వాతంత్ర్య కృతైః ॥17॥

టీ॥ 'పంచపంచేతి' అనుదానికి అర్థము చెప్పుచున్నాడు. ఇరువది ఐదు తత్త్వముల యొక్క ఆశ్చర్యకరమైన ఆశ్రయుడు, అంతర్యామియైన పురుషుడు. కార్యకారణ సమూహమును అధిషించి యుండు వానిని తెలియక మిథ్యాస్వాతంత్ర్యము చేత చేయబడు కర్మల వలన ఏమి ఫలము? అసత్కర్మల వలన ఏమి జరుగును? ॥17॥

శ్లో॥ ఐశ్వర్యం శాస్త్రముత్సృజ్య బంధమోక్షానుదర్శనమ్ ।
వివిక్త పదమజ్ఞాయ కిమసత్కర్మభిర్భవేత్ ॥ 18

తా॥ ఈశ్వరుని ప్రతిపాదించు నట్టియు, బన్ధ మోక్షముల చూపించు నట్టియు, (తెలియచేయునట్టి) శాస్త్రమును విడిచి, వివేచించబడిన తత్వమును తెలిసికొనక చేయు అసత్కర్మల వలన జరుగునదేమి?॥18॥

టీ॥ క్వచిద్ధంసమిత్యస్యార్థమాహ. ఐశ్వరమీశ్వర ప్రతిపాదకం వివిక్తం పదం చిజ్జడరూపం వస్తు ఏవేతి హంసపద వ్యాఖ్యానం. బంధమోక్షావను దర్శయతీతి తథా. అనేన చిత్రాః కథాయస్యేతి వాఖ్యాతం. తదుత్సృజ్యా నభ్యస్య అజ్ఞాయావిదుషః. అసద్భిర్బహిర్ముఖైః. ॥18॥

టీ॥ 'క్వచిద్ధంసం' ఒకానొక చోటగల హంస అను దానికి అర్థము చెప్పుచున్నాడు. ఐశ్వర్యమను పదము ఈశ్వర ప్రతిపాదనము. వివిక్తం పదం ఏకాంత ప్రదేశమున చిత్(పాలు) జడ(నీరు) వస్తువుల అనగా బంధ మోక్షముల దర్శించునది కావున హంస అని చెప్పబడినది. చిత్ జడ వస్తువులను దర్శింపచేయు అనేక చిత్ర కథలు కలది ఏదియో దానిని చెప్పు శాస్త్రమును త్యజించి అనగా అభ్యాసము చేయక, దానిని తెలియక చేయు బహిర్ముఖ కర్మల వలన ప్రయోజనమేమి? ॥18॥

అవ॥ క్షౌరపవ్యమిత్యస్యార్థమాహ. కాలచక్రమితి.

అవ॥ కాలచక్రమిత్యాది శ్లోకమున 'క్షారపవ్యమ్' అను దానికి అర్థము చెప్పుచున్నాడు.

శ్లో॥ కాలచక్రం భ్రమస్తీక్షణం సర్వం నిష్కర్షయజ్జగత్ ।
స్వతంత్రమబుధస్యేహ కిమసత్కర్మభిర్భవేత్ ॥ 19

తా॥ స్వతంత్రముగా తిరుగుటయే స్వభావముగాగల జగత్సర్వమును నిష్కర్షించు తీక్ష్ణమైన కాలచక్రమును తెలుసుకొనక చేయు అసత్కర్మల వలన ప్రయోజనమేమి? ॥19॥

టీ॥ భ్రమర్భ్రమణాత్మకం. తీక్ష్ణమితి నిష్కర్షయదితి చ క్షౌరపవ్యపదం వ్యాఖ్యాతం. తదబుధస్యాత్ ఏవ ఫలస్య నిత్యబుధ్యా కామ్యకర్మానుష్ఠానే వైగుణ్యబాహుభ్యాదసద్భి. ॥19॥

టీ॥ భ్రమణార్థము, భ్రమించునది (నాశనమొందించునది) అను రెండు అర్థములను క్షారపవ్యమను పదము చెప్పుచున్నది. అట్టి కాల చక్రమును తెలసుకొనక అనగా కాలస్వభావమును తెలుసుకొనక వైగుణ్య బాహుల్యముచే, వైషమ్యము గల కామ్యకర్మలచే ఏమి ప్రయోజనము? ॥19॥

శ్లో॥ శాస్త్రస్య పితురాదేశం యో న వేద నివర్తకమ్ ।
కథం తదనురూపాయ గుణవిశ్రమ్భ్యుపక్రమేత్ ॥ 20

తా॥ నివృత్తి హేతువును తెలియక, తన తండ్రి వంటి శాస్త్రము యొక్క ఆదేశమును దానికి తగినట్లుగా గుణమయ ప్రవృత్తి మార్గమును ఎట్లు ఆరంభించుదురు? ॥20॥

టీ॥ స్వపితురాదేశ మిత్యస్యార్థమాహ. శాస్త్రస్య స్వపితుః ద్వితీయ జన్మహేతోః. తదనురూపాయ నివృత్త్యనురూపాయ. నివర్తకమాదేశం యో న వేద సకథం గుణవిశ్రంభీగుణమయ ప్రవృత్తిమార్గ విశ్వాసవాన్

టీ॥ 'స్వపితురాదేశం'- తన తండ్రి యొక్క ఆదేశము అనుదాని యొక్క అర్థమును చెప్పుచున్నాడు. ద్వితీయ జన్మ హేతువైన తండ్రియైన శాస్త్రము యొక్క నివృత్త్యనురూపమును, నివర్తకమని తెలియక

సన్నుపక్రమే త్సృష్ట్యాదౌ ప్రవర్తేత. మోక్షేశ బ్రహ్మబుద్ధీనాం జీవ మాయా న్తరాత్మనాం శాస్త్ర కాలోపదేశానామజ్ఞానే కిముకర్మభిః. ఇతి వాచః కూట సంగ్రహాశ్లోకః. ॥20॥

గుణమయ ప్రవృత్తి మార్గమున సృష్ట్యాదుల యందు ఎవడు ఎట్లు ప్రవర్తించును? జీవ, మాయ, అంతరాత్మల యందు బ్రహ్మ బుద్ధి గల వానికి మోక్షము,శాస్త్ర, కాల, ఉపదేశములను, తెలియని వానికి కర్మల వలన ప్రయోజనమేమి?ఈ వాక్కులు కూటసంగ్రహ శ్లోకములు. 20

శ్లో॥ ఇతివ్యవసితా రాజన్ హర్యశ్వా ఏక చేతసః ।
ప్రయయుస్తం పరిక్రమ్య పంథానామనివర్తనమ్ ॥ 21

తా॥ ఓ రాజా! ఒకే మనస్సుగల హర్యశ్వులు ఈ విధముగా నిశ్చయించుకొన్నవారై నారదునికి ప్రదక్షిణముచేసి తిరిగి వచ్చుట లేని మార్గమును గూర్చి (మోక్షము) వెళ్ళిరి. ॥21॥

టీ॥ ఇతి వ్యవసితా ఏవం నిశ్చితవన్తః. ఏక చేతసః ఐకమత్యాయుక్తాః తం నారదం ప్రదక్షిణీకృత్య అపునరావృత్తి మార్గం ప్రయయుః. ॥21॥

టీ॥ ఈ విధముగా నిశ్చయించు కొని హర్యశ్వులు ఐకమత్యముతో ఆ నారదుని మాటలు స్వీకరించి, అతని చుట్టు ప్రదక్షిణము చేసి మరల తిరిగిరాని నివృత్తి మార్గమున వెళ్ళిరి. ॥21॥

శ్లో॥ స్వర బ్రహ్మణి నిర్భాత హృషీకేశ పదాంబుజే ।
అఖండం చిత్తమావేశ్య లోకాననుచరన్మునిః ॥ 22

తా॥ సాక్షాత్కరించిన స్వర బ్రహ్మరూపమైన హృషీకేశుని పాద పద్మముల యందు అఖండమైన చిత్తము నుంచి నారదముని లోకములందు సంచరించెను. ॥22॥

టీ॥ నిర్భాతః సాక్షాత్కృతో యో హృషీకేశస్తస్య పదాంభుజే. నుచరత్ అన్వచరదిత్యర్థః. ॥22॥

టీ॥ సాక్షాత్కరించిన హృషీకేశుని పదకమలముల యందు సంచరించెను. ॥22॥

శ్లో॥ నాశం నిషమ్య పుత్రాణాం నారదాచ్ఛీలశాలినామ్ ।
అన్వతప్యతకః శోచన్ సుప్రజాస్త్వం శుచాం పదమ్ ॥ 23

టీ॥ నాశమదర్శనం స్వధర్మ భ్రంశం వా. శీలేనశాలన్తే శోభన్త ఇతి తథా తేషాం. కోదక్షః. సుప్రజాస్త్వం సుపుత్రవత్త్వం శుచాం శోకానాం స్థానం.॥23॥

తా॥ నారదముని వలన, శీలవంతులైన పుత్రుల యొక్క నాశమును విని దక్షుడు మిగుల దుఃఖించెను. మంచి సంతానము కలిగి యుండుట దుఃఖమునకు ఆలవాలమే కదా! (స్థానము) ॥23॥

టీ॥ నాశమనగా కనబడకపోవుట లేదా స్వధర్మము నుండి తొలగి పోవుట. శీలముచే శోభించువారు ఎవరో వారి యందు కః ఎవడు దక్షుడు. మంచి సంతానము కలిగి యుండుట శోకములకు స్థానము. ॥23॥

శ్లో॥ స భూయః పాంచజన్యాయా మజేన పరిసాన్త్వితః ।
పుత్రానజనయద్దక్షః శబలాశ్వాన్సహస్రశః ॥ 24

తా॥ దక్షుడు బ్రహ్మచేత ఊరడించబడి, మరల పాంచజన్య యందు శబలాశ్వులను వేయి మంది పుత్రులకు జన్మనిచ్చెను. ॥24॥

శ్లో॥ తేஉపి పిత్రా సమాధిష్టాః ప్రజాసర్గే ధృత వ్రతాః ।
నారాయణ సరో జగ్ముర్యత్ర సిద్ధాః స్వపూర్వజాః ॥ 25

తా॥ వీరు కూడ తండ్రిచేత ఆదేశించబడి, ప్రజాసర్గము యందు ధృఢమైన వ్రతము కలవారై తమకన్న ముందు పుట్టినవారు ఎక్కడ సిద్ధిని పొందిరో ఆ నారాయణ సరోవరమునకు వెళ్ళిరి. ॥25॥

టీ॥ అజేన బ్రహ్మణా. సహస్రశః సహస్ర సంఖ్యాన్. ॥24,25॥

టీ:- బ్రహ్మచేత. వేయిమందిగల. ॥24,25॥

శ్లో॥ తదుపస్పర్శనాదేవ వినిర్ధూతమలాశయాః ।
జపన్తో బ్రహ్మ పరమంతేపుస్తేఽత్ర మహత్తపః ॥ 26

తా॥ ఆ పవిత్ర నారాయణ తీర్థములను స్పృశించుటచే పరమ పవిత్రులై పరబ్రహ్మమును జపించుచు మహత్తరమైన తపమును ఆచరించిరి. ॥26॥

టీ॥ పరమం బ్రహ్మ ప్రణవం వక్ష్యమాన మంత్రం వా. ॥26॥

టీ॥ పరబ్రహ్మమైన ప్రణవమును లేదా చెప్పబోవు మంత్రమును అని అర్థము. ॥26॥

శ్లో॥ అబ్భక్షాః కతిచిన్మాసాన్కతిచిద్వాయు భోజనాః ।
ఆరాధయన్మంత్రమిమ మభ్యస్యంత ఇడస్పతిమ్ ॥ 27

తా॥ నీరే ఆహారము గలవారై కొన్ని మాసములును, వాయువే ఆహారముగా కొన్నిమాసములును, (ఈ) మంత్రమును (క్రింది శ్లోకములోని) అభ్యసించుచూ విష్ణువును (ఇడస్పతిని) ఆరాధించిరి. ॥27॥

టీ॥ ఇడస్పతిం వాచాం మంత్రాణాం పతిం విష్ణుమారాధయాసుః ॥27॥

టీ॥ మాటలకును, మంత్రములకును పతియైన విష్ణువును ఆరాధించుచుండిరి. ॥27॥

శ్లో॥ ఓం నమోనారాయణాయ పురుషాయ మహాత్మనే ।
విశుద్ధ సత్త్వాధిష్ణ్యాయ మహాహంసాయ ధీమహి ॥ 28

తా॥ మహాత్ముడైన, పురుషుడైన, నారాయణునకు నమస్కారము. విశుద్ధ సత్త్వమే స్థానముగాగల పరమహంసను ధ్యానించుచున్నాము. (28)

టీ॥ విశుద్ధ సత్త్వాశ్రయాయ పరమహంసాయ నమో ధీమహి. 28

టీ॥ విశుద్ధసత్త్వమే ఆశ్రయముగాగల పరమహంసకు నమస్కారము. ఆయననే ధ్యానించుచున్నాము. ॥28॥

శ్లో॥ ఇతి తానపి రాజేంద్ర ప్రతిసర్గధియో మునిః ।
ఉపేత్య నారదః ప్రాహ వాచః కూటాని పూర్వవత్ ॥ 29

తా॥ ఓ రాజా ! పూర్వము వలెనే మరల నారదుడు ప్రతిసర్గము యందు బుద్ధిగల శబలాశ్వుల వద్దకు పోయి, హర్యశ్వులకు చెప్పిన విధముగనే కూట శ్లోక వాక్కులను బోధించెను.॥29॥

టీ॥ ప్రతిసర్గే ధీర్యేషాం తాన్. వాచః కూటాని 'అదృష్ట్వాంతం భువ" ఇత్యాదీని పూర్వోక్తాని ప్రాహ. ॥29॥

టీ॥ ప్రతిసర్గమునందు బుద్ధి ఎవరికో వారిని (శబలాశ్వులను) గూర్చి పూర్వము చెప్పిన 'అదృష్ట్వాంతంభువం' ఇత్యాది వాక్కూటమును ఉపదేశించెను. ॥29॥

శ్లో॥ దాక్షాయణాః సంశ్రుణుత గదతో నిగమంమమ ।
అన్విచ్ఛతాను పదవీం భ్రాతౄణాం భ్రాతృవత్సలాః ॥ 30

తా॥ (దాక్షాయణాః) దక్షప్రజాపతి సుతులారా! నా ఉపదేశమును చక్కగా వినుడు, తెలుసుకొనుడు. సోదరులపై ప్రేమగల సోదరులారా! ॥30॥

టీ॥ హే దాక్షాయణాః సంశృణుతేత్యాది పునరన్యదపి ప్రాహ. నిగమముపదేశమ్. అన్విచ్ఛతావలోకయతి. ॥30॥

టీ॥ ఓ దాక్షాయణులారా! చక్కగా వినుడు అని మరల అదియే చెప్పెను. ఉపదేశమును అవలోకింపుము. ॥30॥

శ్లో॥ భ్రాతౄణాం ప్రాయణం భ్రాతా యోఽనుతిష్ఠతి ధర్మవిత్ ।
స పుణ్య బంధుః పురుషో మరుద్భిః సహ మోదతే ॥ 31

తా॥ సోదరుల మార్గమును అనుసరించినవాడు ధర్మమును తెలిసిన వాడుగా భావింపబడును. అతడే పుణ్యాత్ముడైన బంధువు. ఆ పురుషుడు మరుత్తులతో కూడి సంతోషమును పొందును.॥31॥

టీ॥ ప్రాయణం ప్రకృష్టం గమనమ్. పుణ్యమేవ బంధుర్యస్య మరుద్భి ర్భ్రాతృవత్సలైర్దేవైః. ॥31॥

టీ॥ శ్రేష్ఠగమనము, పుణ్యమే బంధువుగా గలవాడు. భ్రాతృ వాత్సల్యము గల దేవతలచే. ॥31॥

శ్లో॥ ఏతావదుక్త్వా ప్రయయౌ నారదోఽమోఘ దర్శనః ।
తేఽపి చాన్వగమన్మార్గం భ్రాతృణామేవ మారిష ॥ 32

తా॥ ఓ మారిష! అమోఘ దర్శనము గల నారదుడు ఈ విధముగా చెప్పి వెళ్ళిపోయెను, శబలాశ్వులు గూడ తమ సోదరులు అనుసరించిన మార్గమునే అనుసరించిరి. (మోక్షమునందిరి) ॥32॥

టీ॥ అమోఘం దర్శనం యస్య. హే మారిష ఆర్య. ॥32॥

టీ॥ ఓ ఆర్యా! ఎవరి యొక్క దర్శనము అమోఘమో వాడు అమోఘ దర్శనుడు. ॥32॥

శ్లో॥ సధ్రీచీనం ప్రతీచీనం పరస్యాను పథం గతాః ।
నాద్యాపి తే నివర్తంతే పశ్చిమాయామినీరివ ॥ 33

తా॥ శబలాశ్వులు పరిశుద్ధమైన వృత్తిని, పరమేశ్వరుని పొంది పశ్చిమదిశలోని రాత్రులవలె ఎప్పటికి తిరిగిరాని మార్గమును గూర్చి వెళ్ళిరి. (ఎప్పటికి తిరిగి రారు) ॥33॥

టీ॥ ఏతస్మిన్కాల ఉత్పాతాన్బహూన్పశ్యన్ప్రజాపతిః ।
పూర్వవన్నారదకృతం పుత్రనాశముపాశ్రుణోత్ ॥ 34

తా॥ ఈ కాలమున దక్షుడు అనేక ఉత్పాతములను, (అపశకునములను, చూచుచు, పూర్వము నారదుడొనర్చిన విధముననే జరిగిన పుత్రనాశమును గూర్చి వినెను. (34)

టీ॥ సధ్రీచీనం సమీచీనం. ప్రతీచీనాం ప్రత్యగ్వృత్తి లభ్యమ్. అనుపథమమగుణ పంథానం. పశ్చిమా యామినీర్గతా రాత్రయ ఇవ ॥33,34॥

టీ॥ మంచి అంతరంగమున కలుగు, తగిన మార్గమును, పడమట దిశగా వెళ్ళిన రాత్రులవలె. (33,34)

శ్లో॥ చుక్రోధ నారదాయాసౌ పుత్రశోక విమూర్ఛితః ।
దేవర్షిముపలభ్యాహ రోషాద్విస్ఫురితాధరః ॥ 35

తా॥ పుత్ర శోకముతో విమూర్ఛితుడై, తన వద్దకు వచ్చిన నారదునిపై కోపించి, రోషముతో పెదవులు అదరుచుండగా దక్షుడు ఇట్లు పలికెను. ॥35॥

టీ॥ పుత్రాణాం పారమహంస్య నిష్ఠాముపశ్రుత్య దక్షోఽపి ప్రాయశో విరక్తః స్యాదితి తదనుగ్రహార్థం దేవర్షిః తత్పార్శ్వం గతస్తదా తముపలభ్య దక్ష ఆహ. ॥35॥

టీ॥ తన పుత్రులు పరమహంస నిష్ఠ యందు (నివృత్తిమార్గమందు) వెళ్ళిరని తెలిసికొని దక్షుడు కూడ విరక్తుడై యుండునని భావించిన నారదుడు దక్షుని వద్దకు వెళ్ళగా కోపముతో పెదవులు అదురుచుండగా దక్షుడు ఇట్లు పలికెను. ॥35॥

**దక్ష ఉవాచ**

శ్లో॥ అహో అసాధో సాధూనాం సాధులింగేన నస్త్వయా ।
అసాధ్వ కార్యర్భకాణాం భిక్షోర్మార్గః ప్రదర్శితః ॥ 36

**దక్షుడు పలికెను**

తా॥ అహో! ఓ చెడ్డవాడా! సాధువేషమున నీవు తిరుగుచు అమాయకులైన నా పిల్లలకు చెడుచేసితివి, నా పుత్రులను ఉచితముకాని హానికరమైన సన్యాసి మార్గమున ప్రవర్తింపచేసితివి. ॥36॥

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

టీ॥ సాధోరివ లింగం వేశో యస్య తేన త్వయానోఽస్మదీయానాం అర్భకాణాం అసాధ్వకారికృతం. తదేవాహ-సాధూనాం స్వధర్మే ప్రవృత్తానాం భిక్షోర్యోమార్గః సప్రదర్శితః. ॥36॥

అవ॥ నను సన్యాసినో మార్గః సాధురేవ మోక్షహేతుత్వాత్. సత్యం ఋణత్రయాపాకరణం వినా తు మహానర్థఏవేత్యాహ ఋణైరితి. ॥

శ్లో॥ ఋణైస్త్రిభిరముక్తానామమీమాంసిత కర్మణామ్ ।
విఘాతః శ్రేయసః పాపలోకయోరుభయోః కృతః ॥37॥

టీ॥ జాయమానో వై బ్రాహ్మణస్త్రిభిర్ఋణవాఞ్జాయతే బ్రహ్మచర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః ఏష వా అనృణోయః పుత్రీయజ్వా బ్రహ్మచారీ వాసి. ఇతి శ్రుతేః ఋణైరముక్తానాం. న మీమాంసితాని విచారితాని కర్మణి యైః తేషాం తావదృణ విమోకో నాస్తి. తదుత్తరకాల భావిత్వాచ్చ పుత్రోత్పాదన యజ్ఞానుష్ఠానయో రభావేన పితృ దేవర్షి ఋణ విముక్తిశ్చ నాస్తి అతో హే పాప విషయ భోగత్యాగాదిహ లోకే శ్రేయసో విధాతః కృతః. మోక్షానధికారత్వాశ్చ

టీ॥ సాధువువలె వేషముగల నీ చేత నా పిల్లలకు చెడు చేయబడినది. అని చెప్పుచున్నాడు. స్వధర్మమందు ప్రవర్తించుచున్న వారికి భిక్షువునకు (సన్యాసికి) మార్గము ఏదియో ఆ
మార్గము చూపబడినది. ॥36॥

అవ॥ మోక్షహేతువు కావున సన్యాసుల మార్గము మంచిదే, నిజమే, కాని ఋణత్రయమును తీర్చుకొననిచో మహానర్థము తప్పక కలుగునని ఋణైరిత్యాది శ్లోకమున చెప్పబడుచున్నది.

తా॥ మూడు ఋణములనుండి ముక్తులుకాని, కర్మలను విచారించని వారి శ్రేయస్సునకు. ॥37॥

టీ॥ పుట్టిన ప్రతివానికి మూడు ఋణములు ఏర్పడుచున్నవి. బ్రహ్మచర్యముచేత ఋషి ఋణమును, యజ్ఞముచేత దేవతల ఋణమును, సంతానముచేత పితృఋణమును, తీర్చు కొనవలయును. ఈ ఋణములు లేనివాడు బ్రహ్మచర్యము నందు ఉండునని శ్రుతి. ఋణములను తీర్చుకొననివాడు కర్మలవలన మోక్షమును పొందలేదు. పుత్రోత్పాదన, యజ్ఞానుష్ఠానము లేక పోవుటచే దేవ ఋషి, పితృ ఋణముల నుండి ముక్తుడు కాదు. అందుచేత ఓ పాపి, విషయభోగ,

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

పరలోకేఽపి శ్రేయసో విఘాతః కృత ఇత్యర్థః. తథా చ మనుః ఋణాని త్రీణ్యపాకృత్య మనోమోక్షో నివేశయేత్. అనుపాకృత్య మోక్షం తు సేవమానో వ్రజత్యఘః ఇతి. ॥37॥

త్యాగాదుల వలన ఈ లోకమున శ్రేయస్సునకు, విఘాతము కలుగును. ఋణ విముక్తిని పొందకపోవుట వలన పరలోక శ్రేయస్సునకు విఘాతము కలిగించితివి. మనుధర్మ శాస్త్రముననుసరించి మూడు ఋణములను తీర్చుకొని మోక్షము నందు మనస్సు పెట్టవలెను. ఋణములను తీర్చుకొననిచో అధోలోకములను పొందుదురు. అని భావము. ॥37॥

శ్లో॥ ఏవం త్వం నిరనుక్రోశో బాలానాం మతిద్ధరేః
పార్షదమధ్యే చరసి యశో హా నిరపత్ర పః॥38॥

తా॥ దయలేని నీవు ఈ విధముగా పిల్లల బుద్ధిని భేదింపచేసినావు. విష్ణు అనుచరుల మధ్య తిరుగుచూ అతని (విష్ణువు యొక్క) కీర్తిని చెడగొట్టువాడవు. సిగ్గులేని వాడవు. ॥38॥

టీ॥ బాలానాం మతిం పుత్రాది విషయాం భినత్తీతి తథా। ఏవం నిరనుక్రోశో నిర్ఘృణః । హరేర్యశోనాశకః సన్ తత్పార్షదానాం మధ్యే కథంచరసి॥38॥

టీ॥ పుత్రాది విషయకమైన బుద్ధిని బాలుర యందు భేదింప చేసినావు. అందుచేత నీవు దయలేని వాడవు. హరియొక్క యశస్సును నాశము చేసినవాడవు, పార్శదుల భాగవతోత్తముల మధ్య ఎట్లు సంచరించుదువు? ॥38॥

అవ॥ నిర్లజ్జత్వమేవాహ – నన్వి

అవ॥ 'నను' ఇత్యాది శ్లోకమున నిర్లజ్జత్వమే చెప్పబడుచున్నది.

శ్లో॥ నను భాగవతా నిత్యం భూతానుగ్రహకాతరాః ।
ఋతే త్వాం సౌహృదఘ్నం వై వైరంకరమవైరిణామ్ ॥39॥

టీ॥ నను త్వామృతే భాగవతాః సర్వే భూతానుగ్రహ పరవశాస్త్వం తు భూత విప్రియం కుర్వన్ కథం న లజ్జ స ఇతి భావః. ॥39॥

అవ॥ నను వైరాగ్యా దుపశమ ఉపశమాచ్చ భూతస్నేహ పాశచ్ఛేదనం భవతి న చ విరక్తస్య ఋణత్రయాపాకరణ మావశ్యకమ్"యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్" యది వేతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్ ఇత్యాది శ్రుతేః అతో వైరాగ్యోపదేశేన తేషాం మయానుగ్రహ ఏవ కృత ఇతి చేత్తత్రాహ నేతి.

తా॥ నీవు తప్ప, భగవద్భక్తులు ఎల్లప్పుడు ప్రాణులను అనుగ్రహించుటకై వ్యాకులపడుదురు. మంచి హృదయము (స్నేహమును) పాడుచేయునట్టి నీవు వైరములేని వారి యందు వైరమును కల్పించినావు.॥39॥

టీ॥ నీవు తప్ప భగవద్భక్తులందరు భూతముల యందు అనుగ్రహ పరవశులై యుందురు. కాని నీవు భూత ద్రోహము చేయుచూ కూడా ఎట్లు (ఎందుకు) సిగ్గు పడుటలేదు అని భావము. ॥39॥

అవ॥ న ఇత్యాది శ్లోకమున, వైరాగ్యము వలన ఉపశమము, ఉపశమము వలన భూతస్నేహ పాశముల ఛేదనము జరుగుననియు, మరియు విరక్తునకు ఋణత్రయమును తొలగించుకొనుట ఆవశ్యకము కాదు. ఏ దినము (పగలు) వైరాగ్యము కలుగునో ఆ దినముననే సన్యసించి పోవలయును. లేక మరొక విధముగా బ్రహ్మ చర్యము నుండియు సన్యసించి పోవలయును అను శ్రుతి ప్రమాణముగా వైరాగ్యోపదేశమున మోసపు అనుగ్రహమే చేయబడినది. అన్నచో చేయబడినది.

శ్లో॥ నేత్థం పుంసాం విరాగః స్యాత్త్వయా కేవలినామృషా ।
మన్యసే యద్యుపశమం స్నేహపాశ నికృన్తనమ్ ॥ 40

టీ॥ యద్యపి త్వమేవం మన్యసే తథాపి మృషా కేవలినా జ్ఞానం వినాఽవధూత వేశేణ త్వయేత్థం మతి చాలనే కృతేఽపి పుంసాం విరాగో నైవస్యాత్ న చ విరాగం వినోపశమః న చ తేన వినా స్నేహపాశ నికృన్తనమిత్యర్థః. ॥40॥

అవ॥ ఇత్థం విరాగో న స్యాదిత్యత్ర హేతుమాహ. ॥

శ్లో॥ నానుభూయ న జానాతి పుమాన్విషయతీక్ష్ణతామ్ ।
నిర్విద్యేత స్వయం తస్మాన్నతథా భిన్నధీః పరైః ॥ 41

తా॥ పురుషుల యొక్క విరాగము ఇట్లుండదు. ఒక్కడవైన నీ చేత వైరాగ్యము అసత్యము చేయబడినది. నీవు దేనిని ఉపశమనమనుకొను చున్నావో అది స్నేహపాశమును కత్తిరించుటయే అయినది.॥40॥

టీ॥ నీవు ఈ విధముగా భావించినను అది వృథాయే. జ్ఞానము లేకుండగా అవధూత వేషమున నీవు ఈ విధముగా బుద్ధిని కలిగించినను పురుషులకు విరాగము ఏర్పడదు. విరాగము లేకుండగా ఉపశమనము (శాంతి) ఉపశమము లేకుండగా స్నేహపాశ ఛేదనము జరగదని అర్థము. ॥40॥

అవ॥ ఈ విధముగా విరాగులు కాలేరనుటకు హేతువు చెప్పబడుచున్నది.

తా॥ విషయముల ననుభవించకుండగనే విషయముల తీక్ష్ణతను పురుషుడు తెలుసుకొనలేడు. అందుచేత ఇతరులచే మతిభేదము చేయబడుట వలన కాక, స్వయముగా వైరాగ్యమును పొందవలయును. (41)

టీ॥ నానుభూయ అననుభూయ విషయాణాం తీక్ష్ణతాం దుఃఖ హేతుత్వం న జానాతి తస్మాద్విషయానుభవేన తీక్షత్వజ్ఞానాత్.॥41॥

టీ॥ విషయములను అనుభవించనిదే వాటి యొక్క తీక్ష్ణత్వము మరియు అవి దుఃఖ హేతువులని తెలియదు. అందుచేత విషయాను–భవముచేత కలిగిన వాటి తీక్ష్ణత్వజ్ఞానము వలన వైరాగ్యమును పొందవలెను. ॥41॥

అవ॥ అతస్త్వయాస్మాకమప్రియమేవ కృతం తథాపి వయం న కుర్మ ఇత్యాహ – యదితి.

అవ॥ యదిత్యాది శ్లోకమున, నీ వలన మాకు అప్రియమే చేయ బడినది. అయినను మేము అప్రియము చేయము అని చెప్పబడు చున్నది.

శ్లో॥ యన్నస్త్వం కర్మ సంధానాం సాధూనాం గృహమేధినామ్ ।
కృతవానసి దుర్మర్షం విప్రియం తవమర్షితమ్ ॥ 42

తా॥ కర్మ మర్యాదలు తెలిసిన సాధువులైన, గృహస్థాశ్రమస్థులమైన మాకు అప్రియము కలిగించితివి, దానిని సహించుచున్నాము.॥42॥

టీ॥ కర్మసన్ధానాం కర్మమర్యాదానాం. కర్తుమన్ధానామితి పాఠే విప్రియం కర్తుమజానతామిత్యర్థః. దుఃసహం యత్త్వం కృతవానపి తన్మర్షితం సోఢుమ్. ॥42॥

టీ॥ కర్మమర్యాదల యొక్క కర్తుమంధానమితి, పాఠాంతరమున తెలియకుండగా చేయు అప్రియమునకు అని అర్థము. ఏ అప్రియమును (భరించుట కష్టమైన దానిని) చేసి యున్నవో దానిని సహించు చున్నాము. ॥42॥

శ్లో॥ తన్తు కృన్తన యన్నస్త్వమభద్రమచరః పునః ।
తస్మాల్లోకేషు తే మూఢ న భవేద్భ్రమతః పదమ్ ॥ 43

తా॥ ఓ మూఢుడా! సంతాన ఛేదనముచే అభద్రతను మాకు కల్పించితివో అందుచేత నీకు లోకములందు స్థానము లేకుండా తిరుగుచుందువు గాక! ॥43॥

టీ॥ తథాపి తవాభద్రం భవిష్యత్యేవేత్యాహ. తన్తుకృన్తన సన్తానం ఛేదక తస్మాదభద్రం పుత్రాణాం స్థానభ్రంశమచరస్తతస్మాత్తవ లోకేషు భ్రమతః పదం స్థానం న భవేదితి మృదుచ్ఛలేన శాపః. ॥43॥

టీ॥ అయినప్పటికి నీకు అభద్రము కలుగ గలదు అని చెప్పు-చున్నాడు. సంతానఛేదకా! మా పుత్రులకు స్థానభ్రంశమును కల్పించి, మాకు అభద్రమును కల్పించితివి. అందువలన నీవు లోకముల యందు స్థిరమైన స్థానం లేకుండగా తిరుగుచుందువు గాక యని మృదువైన శాపము నొసంగెను. ॥43॥

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ ప్రతి జగ్రాహతద్బాఢం నారదః సాధుసమ్మతః ।
ఏతావాన్సాధువాదోహి తితీక్షేతేశ్వరః స్వయమ్ ॥ 44

**శ్రీశుకులు పలికిరి.**

తా॥ సాధు స్వభావము గల నారదుడు దానికి అంగీకరించి వెళ్ళి పోయెను. ఇటువంటి శాంత స్వభావము గలవాడే స్వయముగా ఈశ్వరుడు. ॥44॥

టీ॥ బాఢం తథేతి స్వీకృతవాన్ ఈశ్వరోపి ప్రతిశప్తుం సమర్థోఽపి. తతక్షేత సహేతేతి యదేతావానేవ. ॥44॥

టీ॥ ఈశ్వరుడు ప్రతిశాపము నిచ్చు సమర్థుడు అయినను అట్లే అని అంగీకరించి శాపమును స్వీకరించెను. ఈ విధముగా సహించు వాడే ఈశ్వరుడు. ॥44॥

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే పంచమోఽధ్యాయః**

**శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆరవ స్కంధమున నారద శాపమను పేరుగల ఐదవ అధ్యాయము సమాప్తి.**

**షష్ఠోఽధ్యాయః**

**గోపాలకృష్ణాయ నమః**

అవ॥ షష్ఠే దక్షేణ సృష్టాయాం కన్యా షష్ట్యాం ప్రకీర్తితాః . పృథక్ వంశా యతో జాతో విశ్వరూపో దితేః సుతామ్

**ఆఱవ అధ్యాయము**

**గోపాలకృష్ణునికి నమస్కారము**

అవ॥ ఆఱవ అధ్యాయమునందు దక్షప్రజాపతి చేత సృష్టింపబడిన అఱువదిమంది కన్యకల వృత్తాంతము కీర్తించబడినది. వేరు వేరు వంశములు, దితిసుతుడు విశ్వరూపుడు (త్వష్ట నుండి) ఎందువలన కలిగెనో వివరింపబడినది .

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ తతః ప్రాచేతసోఽసిక్నియా మనునీతః స్వయంభూవా ।
షష్టిం సంజనయామాస దుహితౄః పితృ వత్సలాః ॥ 1

**శ్రీశుకులు వలికిరి.**

తా॥ ఆ తరువాత ప్రచేతసుల పుత్రుడగు దక్షుడు బ్రహ్మదేవునిచే అనునయింప బడినవాడై అసిక్ని యందు, తండ్రిపట్ల ప్రేమగల 60 మంది పుత్రికలను కనెను.॥1॥

టీ॥ నారదాత్పుత్రాణాం నాశమాశఙ్కమానో దుహితౄర్జన - యామాస. 1

టీ॥ నారదుని వలన పుత్రుల వినాశమును శంకించినవాడై పుత్రికలను కనెను.॥1॥

శ్లో॥ దశ ధర్మాయ కాయేన్ద్రోర్ద్విషట్ త్రిణవదత్తవాన్ ।
భూతాఙ్గిరః కృశాశ్వేభ్యో ద్వే ద్వే తార్క్ష్యాయ చాపరాః ॥ 2

తా॥ పదిమందిని ధర్మునికి, పదముగ్గురిని కశ్యపునకు, ఇరువదియేడు మందిని చంద్రునికి, భూతునకు, అంగీరునకు, కృశాశ్వునకు ఇద్దరిద్దరి చొప్పున ఆరుగురిని, మిగిలిన వారిని తార్క్షునకు ఇచ్చెను. ॥2॥

టీ॥ కాయ కాశ్యపాయ. ద్విషట్ ద్విగుణాః షట్ ద్వాదశ యా సుతాః త్రయోదశేత్యర్థః. ఇందోః సోమాయ త్రిణవ సప్త వింశతిమ్. తార్క్ష్యాయ నామాంతరం ప్రాప్తాయ కశ్యపాయైవ అపరా అవిష్టా శ్చతస్రః.॥2॥

టీ॥ కశ్యపుని కొఱకు, ఆఱుకురెట్టింపు- పన్నెండుమందిని, పదమూడు అని అర్థమున పన్నెండు అని వాడబడినది. ఇరువది యేడు మందిని చంద్రుని కొఱకు, తార్క్షుడను నామాంతరము పొందిన కశ్యపునకు, మిగిలిన నలుగురిని. ॥2॥

శ్లో॥ నామధేయాన్యమూషాం త్వం సాపత్యానాం చమే శ్రుణు ।
యాసాం ప్రసూతి ప్రసవైర్లోకా ఆపూరితాస్త్రయః ॥ 3

తా॥ ఎవరి సంతానముతో ముల్లోకములు నిండినవో వారి పేర్లు, వారికి కలిగిన సంతానమును గూర్చి (నేను చెప్పెదను) వినుము. 3

శ్లో॥ భానుర్లంబా కుకుబ్జామిర్విశ్వాసాధ్యా మరుత్వతీ ।
వసుర్ముహూర్తా సంకల్పా ధర్మ పత్న్యః సుతాన్ శ్రుణు ॥ 4

తా॥ భాను, లంబ, కకుప్, జామి, విశ్వా, సాధ్యా, మరుత్వతి వసువు, ముహూర్తా, సంకల్పా అనువారు ధర్ముని పత్నులు. వారికి కలిగిన సంతానమును గూర్చి వినుము. ॥4॥

టీ॥ సాపత్యానామపత్యా సహితానామ్. మే మత్తః శ్రుణు. ప్రసూతి ప్రసవైః పుత్ర పౌత్రాదిభిః. ॥3,4॥

టీ॥ పుత్ర పౌత్రాది సంతానముతో కూడిన వారిని గురించి వినుము. ॥3,4॥

శ్లో॥ భానోస్తు దేవఋషభ ఇంద్రసేనస్తతో నృప ।
విద్యోత ఆసీల్లంబాయాస్తతశ్చ స్తనయిత్నవః ॥ 5

తా॥ ఓ రాజా! భాను పుత్రుడు దేవఋషభుడు,(వేద ఋషభుడు పాఠాంతరమున) వాని నుండి ఇంద్రసేనుడు, లంబకు విద్యోతుడు, అతనికి స్తనయిత్నులను కొడుకులు కలిగిరి. (మేఘముల యందు అభిమానముగల దేవతలు) ॥5॥

టీ॥ తతో దేవఋషభాత్. ॥5॥

టీ॥ దేవఋషభుని నుండి. ॥5॥

శ్లో॥ కకుభః సంకటస్తస్య కీకటస్తనయోయతః ।
భువో దుర్గాణి జామేయః స్వర్గో నన్దిస్తతోఽభవత్ ॥6॥

తా॥ కకుభ(ప్పు)కు సంకటుడు, అతనికి కీకటుడు పుత్రుడు, కీకటునకు భువుడు, భువునకు దుర్గములు కలిగిరి. జామి యొక్క పుత్రుడు స్వర్గుడు, అతని నుండి నంది ఏర్పడిరి. ॥6॥

టీ॥ యతః కీకటాద్భువో దుర్గాణి దుర్గాభిమానోదేవాః. జామేయో జామ్యాః పుత్రః స్వర్గఃస్తతః స్వర్గాన్నందిః పుత్రోఽభవేత్. ॥6॥

టీ॥ కీకటుని నుండి భువుడు, భువునికి దుర్గములు, దుర్గాభిమానులైన దేవతలు ఏర్పడిరి. జామి యొక్క పుత్రుడు స్వర్గుడు, స్వర్గుని నుండి నంది అనువారు కలిగిరి.॥6॥

శ్లో॥ విశ్వేదేవాస్తు విశ్వాయా అప్రజాంస్తాన్ప్రచక్షతే ।
సాధ్యోగణస్తుసాధ్యాయా అర్థసిద్ధిస్తుతత్సుతః ॥7॥

తా॥ విశ్వకు విశ్వేదేవతలు కలిగిరి. వారికి సంతానము లేదు. సాధ్యకు సాధ్యగుణములు, వారికి అర్థసిద్ధి కలిగెను. ॥7॥

శ్లో॥ మరుత్వాంశ్చ జయంతశ్చ మరుత్వత్యాం బభూవతుః ।
జయంతో వాసుదేవాంశ ఉపేంద్ర ఇతి యం విదుః ॥8॥

తా॥ మరుత్వతి యందు మరుత్వంతుడు, మరియు జయంతుడు కలిగిరి. ఆ జయంతుడు వాసుదేవుని అంశకలవాడు. (ఎవనినిఉపేంద్రుడని తెలియుదుమో!) ॥8॥

శ్లో॥ మౌహూర్తికా దేవగణా ముహూర్తాయాశ్చజ్ఞిరే ।
యే వైఫలం ప్రయచ్ఛంతి భూతానాం స్వ స్వ కాలజమ్ ॥9॥

తా॥ ముహూర్తయను నామెకు మౌహూర్తికులు అను దేవగణములు పుట్టిరి. వీరు జీవరాసులకు ఆ యా కాలములను నిర్ణయించి, కాలానుగుణ ఫలములను ఇచ్చుచుందురు.॥9॥

టీ॥ తత్సుతః సాధ్యానాం సుతః ॥7,8,9॥

టీ॥ సాధ్యుల యొక్క పుత్రుడు. ॥7,8,9॥

శ్లో॥ సంకల్పాయాశ్చ సంకల్పః కామః సంకల్పజః స్మృతః ।
వసవోఽష్టౌ వసోః పుత్రాస్తేషాం నామాని మే శ్రుణు ॥ 10

తా॥ సంకల్పయను నామెకు సంకల్పుడు, వానికి కాముడు పుట్టిరి. వసువు అనునామెకు ఎనిమిది మంది వసువులు పుట్టిరి. వారి పేర్లను నా నుండి వినుము.॥10॥

టీ॥ వసోర్వంశస్య భూయస్త్వాదన్తే నిర్దేశః. మే మత్తః. ॥10॥

టీ॥ వసువు యొక్క వంశము అధికమగుట వలన చివరగా చెప్పబడినది. (నా నుండి) ॥10॥

శ్లో॥ ద్రోణః ప్రాణో ధ్రువోఽర్కోఽగ్నిర్దోషో వసుర్విభావసుః ।
ద్రోణస్యాభిమతేః పత్న్యా హర్షశోకభయాదయః ॥ 11

తా॥ ద్రోణుడు, ప్రాణుడు, ధ్రువుడు, అర్కుడు, అగ్ని, దోషుడు, వసువు, విభావసువు (అనువారు అష్టవసువులు) ద్రోణునకు అభిమతి అను భార్యయందు హర్ష శోక భయము మున్నగు పుత్రులు కలిగిరి. 11

టీ॥ అభిమతిర్నామ పత్నీ తస్యా హర్షాదయః పుత్రాః. ॥11॥

టీ॥ (దోణునకు) అభిమతి యను పేరుగల భార్య – ఆమెకు హర్షాదులు పుత్రులు. ॥11॥

శ్లో॥ ప్రాణస్యోర్జస్వతీ భార్యా సహ ఆయుః పురోజవః ।
ధ్రువస్య భార్యా ధరణిరసూత వివిధాః పురః ॥ 12

తా॥ ప్రాణుని భార్య ఊర్జస్వతీ, ఆమె యందు సహుడు, ఆయువు, పురోజవుడు అను కొడుకులు కలిగిరి. ధ్రువునకు భార్య ధరణి ఆమెకు పుర నామక పుత్రులు కలిగిరి.॥12॥

శ్లో॥ అర్కస్యవాసనా భార్యా పుత్రాస్తర్షాదయః స్మృతాః ।
అగ్నేర్భార్యా వసోర్ధారా పుత్రా ద్రవిణకాదయః ॥ 13

తా॥ అర్కుని యొక్క భార్య వాసనా వారి పుత్రులు తర్షాదులని చెప్పబడినది. అగ్నియొక్క భార్య వసోర్ధారా పుత్రులు ద్రవిణకాదులు. 13

టీ॥ సహశ్చ ఆయుశ్చ పురోజవశ్చ పుత్రాః పురః పురాణి. ॥12,13॥

టీ॥ సహుడు, ఆయువు మరియు పురోజవుడు పుత్రులు. పురః అను పదము పురములను (పట్టణములను) తెలియచేయును.॥12,13।

శ్లో॥ స్కన్దశ్చ కృత్తికా పుత్రో యే విశాఖాదయస్తతః ।
దోషస్య శర్వరీ పుత్రః శింశుమారో హరేః కలా ॥ 14

తా॥ స్కందుడు కృత్తికల పుత్రుడు. అతని నుండి విశాఖాదులు కలిగిరి. దోషుని యొక్క పుత్రుడు శర్వరీ. హరి యొక్క అంశమున శింశుమారుడు. జన్మించెను. ॥14॥

టీ॥ స్కన్దశ్చ కృత్తికా సుతోఽగ్నేః పుత్రః. షాణ్మాతుర ఇత్యగ్నిభూరితి చ ప్రసిద్ధేః. తతః స్కందాత్. ॥14॥

టీ॥ అగ్నికి కృత్తికల యందు స్కందుడు కలిగెను. ఆరుగురు తల్లులు (షాణ్మాతుర) అను ప్రసిద్ధత కలవారు. తరువాత స్కన్దుని నుండి.॥14॥

శ్లో॥ వసోరాఙ్గిరసీ పుత్రో విశ్వకర్మాఽఽకృతేః పతిః ।
తతోమనుశ్చాక్షుషోఽభూద్విశ్వే సాధ్యామనోః సుతాః ॥ 15

తా॥ వసువునకు ఆంగీరస యందు శిల్పాచార్యుడైన విశ్వకర్మ పుట్టెను. అతనినుండి చాక్షుషమనువు పుట్టెను. చాక్షుష మనువునకు విశ్వులు, సాధ్యులు అనువారు పుట్టిరి.॥15॥

టీ॥ ఆకృతేః పతిః శిల్పాచార్యః తతో విశ్వకర్మణ చ్చాక్షుషో మనురాసీత్. ।15॥

టీ॥ శిల్పాచార్యుడు, విశ్వకర్మ నుండి చాక్షుష మనువు కలిగెను.।15।

శ్లో॥ విభావసోరసూతోషా వ్యుష్టిం రోచిష మాతపమ్ ।
పఞ్చయామోఽథ భూతాని యేన జాగ్రతి కర్మసు ॥ 16

టీ॥ విభావసో రుషానామ భార్యా. అథ ఆతపతాత్ పఞ్చయామో దివసో జాతః. అత ఏవ రాత్రిస్త్రియామా ప్రదోష ప్రత్యుష యోర్దివ సస్యావయవత్వాత్. ॥16॥

అవ॥ భూతస్య ద్వే భార్యే తయోర్వంశమాహ స రూపేతి.

శ్లో॥ సరూపాఽసుత భూతస్య భార్యా రుద్రాంశ్చ కోటిశః ।
రైవతోఽజో భవో భీమోవామ ఉగ్రో వృషాకపిః ॥ 17

తా॥ విభావసునకు ఉషాయను పేరుగల భార్య యందు వ్యుష్టి, రోచిషుడు, ఆతపుడు అను ముగ్గురు కొడుకులు కలిగిరి. అతనికి ఎవనిచే ప్రాణులు కర్మలయందు మేల్కొని యుందురో అట్టి పంచయాముడు అను కొడుకు కలిగెను. ॥16॥

టీ॥ విభావసునకు ఉషాయను పేరుగలది భార్య, ఆతపునకు పంచయాముడు అను దివసుడు పుట్టెను. అందుచేత రాత్రి మూడు యామములు కలది. ప్రదోష, ప్రత్యూష, దివసము యొక్క అవయవములు. వానిని ఒక యామముగా గ్రహించిన పగలు ఐదు యామములు కలదగును. ॥16॥

అవ॥ స రూపేత్యాది శ్లోకమున, భూతునకు ఇరువురు భార్యలు. వారివంశమును చెప్పుచున్నాడు.

తా॥ భూతుని యొక్క భార్యయైన సరూప కోట్ల కొలది రుద్రులను కనెను. వారిలో ముఖ్యులు రైవతుడు, అజుడు, భవుడు, భీముడు, వాముడు, ఉగ్రుడు, వృషాకపి. ॥17॥

శ్లో॥ అజైకపాదహిర్బుధ్న్యో బహురూపో మహానితి ।
రుద్రస్య పార్షదాశ్చాన్యే ఘోరా భూత వినాయకాః ॥ 18

తా॥ అజైకపాదుడు, అహిర్బుధ్న్యుడు బహురూపుడు, మహానుడు అనువారు, రుద్రుని పార్షదులు. ఇంకను ఘోర భూతములైన ప్రేతాదులు, మరియు వినాయకులు కలిగిరి. ॥18॥

టీ॥ మహానిత్యేవమేకాదశ రూపస్య రుద్రస్య. పార్షదాః ప్రేతాదయః అన్యేఽన్యస్యాం జాతాః.॥18॥

టీ॥ అనువారు రుద్రుని ఏకాదశ రూపులు ఘోర భూతములైన ప్రేతాదులు ఇంకా అనేకులు కలిగిరి. ॥18॥

అవ॥ అఙ్గిరసః స్వధా సతీ చేతి ద్వే భార్యే తయోర్వంశమాహ ప్రజాపతేరితి.

అవ॥ ప్రజాపతేరిత్యాది శ్లోకమున అంగీరసుని (స్వధా, మరియు సతీ అను) ఇరువురు భార్యలు. వారి వంశములు వివరించబడుచున్నవి.

శ్లో॥ ప్రజాపతేరఙ్గిరసః స్వధా పత్నీ పితౄనథ ।
అథర్వాఙ్గిరసం వేదం పుత్రత్వేచాకరోత్సతీ ॥ 19

తా॥ ప్రజాపతియైన అంగీరసుని భార్యలలో స్వధా, పితృదేవతలను, సతి వేదమును అభిమానించు పుత్రుని కనెను.॥19॥

టీ॥ స్వధానామ పత్నీ పితౄన్పుత్రత్వేఽకరోత్. అథసతీ చాథర్వాఙ్గిరసం నామవేదమ్. ॥19॥

టీ॥ స్వధాయను భార్య పితరులను, సతీ అను భార్య అథర్వాంగిరస అను పేరుగల, వేదమును అభిమానించు పుత్రులను కనెను.॥19॥

అవ॥ కృశాశ్వస్యార్చిర్ధిషణేతి ద్వే భార్యే తయోర్వంశమాహ – కృశాశ్వ ఇతి.

అవ॥ కృశాశ్వ ఇత్యాది శ్లోకమున కృశాశ్వుని అర్చి, ధిషణా అను ఇద్దరు భార్యలు. వారి వంశము చెప్పబడుచున్నది.

శ్లో॥ కృశాశ్వోఽర్చిషి భార్యాయాం ధూమ్రకేశ మజీజనత్ ।
ధిషణాయాం వేదశిరో దేవలం వయునం మనుమ్ ॥ 20

తా॥ కృశాశ్వుడు అర్చియను భార్యయందు ధూమ్రకేశుని, ధిషణా యను భార్యయందు వేదశిరుని, దేవలుని, వయునుని, మనువును కనెను. ॥20॥

శ్లో॥ తార్క్ష్యస్య వినతా కద్రూః పతఙ్గీ యామినీ ఇతి ।
పతఙ్గ్య సూత పతగాన్ యామినీ శలభానథ ॥ 21

తా॥ తార్క్ష్యునకు వినత, కద్రువ, పతంగీ, యామినీ అని నలుగురు భార్యలు. పతంగీ-పతంగములను (పక్షులను)యామినీ, శలభములను (మిడుతలను) కనిరి. ॥21॥

శ్లో॥ సుపర్ణా సూత గరుడం సాక్షాద్యజ్ఞేశ వాహనమ్ ।
సూర్య సూతమనూరుంచ కద్రూర్నాగానసేకశః ॥ 22

తా॥ వినత యజ్ఞేశుని వాహనమైన గరుడుని, సూర్యునికి రథ సారథియైన అనూరుని, మరియు కద్రువ అనేక మంది సర్పములను కనిరి. ॥22॥

టీ॥ సుపర్ణా వినతా. అనూరమరుణం ॥20-22॥

టీ॥ సుపర్ణాయనగా వినతా, అనూరుడనగా అరుణుడు. ॥20-22॥

శ్లో॥ కృత్తికాదీని నక్షత్రాణీన్దోః పత్న్యస్తు భారత ।
దక్షశాపాత్సోఽనపత్యాస్తాసు యక్ష్మగ్రహార్దితః ॥ 23

తా॥ ఓ పరీక్షిన్మహారాజా! కృత్తికాది నక్షత్రములు చంద్రుని యొక్క భార్యలు. దక్షశాపముచేత యక్ష్మగ్రహముచే (క్షయవ్యాధిచే) పీడింపబడి వారి యందు సంతానము లేనివాడయ్యెను.॥23॥

టీ॥ రోహిణ్యామేవ ప్రేమాతిశయేనాస్యాముపేక్షణా త్కుపితస్య దక్షస్య శాపాద్యక్ష్మగ్రహార్దితః క్షయరోగ పీడితః సన్ తాస్వనపత్యోఽభూత్.॥23॥

టీ॥ రోహిణి యందేగల ప్రేమాతిశయము చేత ఇతర భార్యలను ఉపేక్షించుట వలన దక్షుని చేత శాపమును పొంది క్షయ రోగ పీడితుడయ్యెను. వారి వలన సంతానములేని వాడయ్యెను.॥23॥

శ్లో॥ పునః ప్రసాద్య తం సోమః కలాలేభే క్షయేదితాః ।
శ్రుణు నామాని లోకానాం మాతౄణాం శంకరాణి చ ॥ 24

తా॥ మరల అతనిని(దక్షుని) ప్రసన్నునిగా చేసుకొని క్షయవ్యాధిచే ఖండింపబడిన కళలను పొందెను. లోకములకు (జాతుల) తల్లులైన వారి యొక్క మంగళకరములైన పేర్లను గూర్చి వినుము.॥24॥

టీ॥ తం దక్షం ప్రసాద్య కేవలం కలా ఏవ లేభే న త్వపత్యాని. కథం భూతాః. క్షయే కృష్ణపక్షే దితాః ఖండితాః సతీః. పాఠాన్తరే క్షయేసతి పునరేధితాస్తేనైవ వర్ధితాః సతీః. ॥24॥

టీ॥ దక్షుని అనుగ్రహమున కేవలము కళల వృద్ధిని మాత్రమే పొందెనుగాని సంతానమును పొందలేదు. ఎటువంటి కళలను పొందెను? అన్నచో కృష్ణపక్షంలో ఖండించబడిన కళలు శుక్లపక్షంలో పెంపొందింపబడెను. క్షయేసత్ అనుపాఠాంతరమున క్షయము కలుగగా అని అర్థము. ॥24॥

శ్లో॥ అథ కశ్యప పత్నీనాం యత్ప్రసూత మిదం జగత్ ।
అదితిర్దితిర్దను కాష్ఠా అరిష్టా సురసా ఇలా ॥ 25

శ్లో॥ మునిః క్రోధవశా తామ్రా సురభిః సరమా తిమిః ।
తిమేర్యాదోగణా ఆసన్ శ్వాపదాః సరమా సుతాః ॥ 26

తా॥ ఎవరివలన ఈ జగత్తు పుట్టినదో అట్టి కశ్యప ప్రజాపతి భార్యలైన వారి యొక్క 13(పదముగ్గురి) పేర్లనువినుము. అదితి, దితి, దనువు, కాష్ఠా, అరిష్ఠా, సురసా, ఇలా, ముని, క్రోధవశా, తామ్రా, సురభి, సరమా, తిమి. తిమి వలన జల జంతు గణములు ఏర్పడెను. సరమకు శ్వాపదములు (తోడేలు, కుక్కలు) పుత్రులు. ॥25,26॥

టీ॥ అల్పత్వేన సుగమత్వాద్యథా యథం వ్యుత్క్రమేణ తాసాం వంశానాహ - తిమేరిత్యాదినా. ॥25,26॥

టీ॥ తిమేరిత్వాది పాదము నుండి సంగ్రహముగా చెప్పిన, సులభముగా నుండునని వ్యుత్క్రమముగా (చివరనుండి) వారి వంశములను చెప్పుచున్నాడు. ॥25,26॥

శ్లో॥ సురభేర్మహిషా గావో యే చాన్యే ద్విశఫా నృప ।
తామ్రయాః శ్యేన గృధ్రాద్యా మునేరప్సరసాం గణాః ॥ 27

తా॥ ఓ రాజా! సురభికి మహిషములు, గోవులు మున్నగు రెండు గిట్టలుగల పశువులు, తామ్రకు డేగలు, గద్దలు మొదలగు పక్షులు, ముని అను నామెకు అప్సరస గణములు కలిగెను. ॥27॥

శ్లో॥ దన్దశూకాదయః సర్పా రాజన్ క్రోధవశాత్మజాః ।
ఇలాయా భూరుహాః సర్వే యాతుధానాశ్చ సౌరసాః ॥ 28

తా॥ ఓరాజా! క్రోధవశా యనునామెకు, దందశూకాదులు అను సర్పములు కలిగెను. ఇల అనునామెకు వృక్షములు మరియు సురసకు, యాతుధానులలను వారు(రాక్షసులు) కలిగిరి. ॥28॥

టీ॥ సౌరసాః సురసాయాః పుత్రాః. ॥27,28॥

టీ॥ సురస యొక్క పుత్రులు సౌరసులు. ॥27,28॥

శ్లో॥ అరిష్టాయాశ్చ గన్ధర్వాః కాష్ఠాయా ద్విశఫేతరాః ।
సుతాదనో రేకషష్టిస్తేషాం ప్రాధానికాన్ శ్రుణు ॥ 29

తా॥ అరిష్టకు, గంధర్వులు కాష్ఠకు రెండు గిట్టలులేని పశువులు, దనువునకు, అఱువది ఒక్కమంది దానవులు పుట్టిరి. వారిలో ముఖ్యులైన వారిని గూర్చి వినుము. ॥29॥

టీ॥ ప్రాధానికాన్ముఖ్యానష్టాదశ శ్రుణు. ॥29॥

టీ॥ ముఖ్యులైన పదునెనిమిది మందిని గూర్చి వినుము.॥29॥

శ్లో॥ ద్విమూర్ధాశంభరోఽరిష్టో హయగ్రీవో విభావసుః ।
అయోముఖః శఙ్కుశిరాః స్వర్భానుః కపిలోఽరుణః ॥ 30

శ్లో॥ పులోమాం వృష పర్వాచ ఏకచక్రోఽను తాపనః ।
ధూమకేశో విరూపాక్షో విప్రచిత్తశ్చ దుర్జయః ॥ 31

తా॥ వారు ద్విమూర్ధుడు, శంబరుడు, అరిష్టుడు, హయగ్రీవుడు, విభావసువు, అయోముఖుడు, శంఖుశిరుడు, స్వర్భానువు, కపిలుడు, అరుణుడు, పులోముడు, వృషపర్వుడు, ఏకచక్రుడు, అనుతాపనుడు, ధూమకేశుడు, విరూపాక్షుడు, విప్రచిత్తి, దుర్జయుడు. ॥30,31॥

శ్లో॥ స్వర్భానోః సుప్రభాం కన్యామువాహ నుముచిః కిల ।
వృష పర్వణస్తు శర్మిష్ఠాం యయాతిర్నాహుషో బలీ ॥ 32

తా॥ స్వర్భానుని యొక్క కూతురు స్వప్రభాను, నముచిని వివాహమాడెను. వృషపర్వుని కూతురు శర్మిష్ఠను నహుషుని కొడుకైన యయాతి వివాహమాడెను. ॥32॥

శ్లో॥ వైశ్వానర సుతాయాశ్చ చతస్రశ్చారుదర్శనాః
ఉపదానవీ హయశిరా పులోమా కాలకా తథా ॥ 33

తా॥ వైశ్వారునకు ఉపదానవి, హయశిరా, పులోమా, కాలకా అను నలుగురు అందమైన పుత్రికలు కలిగిరి. ॥33॥

టీ॥ వైశ్వానరో దనోః పుత్రస్తస్య సుతాః. ॥31-33॥

టీ॥ వైశ్వానరుడు దనువు యొక్క పుత్రుడు- అతని పుత్రికలు ॥31-33॥

శ్లో॥ ఉపదానవీం హిరణ్యాక్షః క్రతుర్హయశిరం నృప ।
పులోమాః కాలకాం చ ద్వే వైశ్వానర సుతే తు కః ॥ 34

తా॥ ఓ రాజా! ఉపదానవిని హిరణ్యాక్షుడు, హయశిరను క్రతువు, వివాహమాడిరి. కాని వైశ్వానరుని మిగిలిన పుత్రికలయిన పులోమ, కాలకలను ఎవరు వివాహమాడిరి? (అన్నచో) ॥34॥

టీ॥ కః ప్రజాపతిః కశ్యప ఉపయేమ ఇత్యన్వయః. ॥34॥

టీ॥ ఎవరు అనగా ప్రజాపతి అయిన కశ్యపుడు వివాహమాడెను. అని అన్వయము. ॥34॥

శ్లో॥ ఉపయేమేऽథ భగవాన్కశ్యపో బ్రహ్మ చోదితః ।
పౌలమాః కాలకేయాశ్చ దానవా యుద్ధశాలినః ॥ 35

తా॥ బ్రహ్మచేత ప్రేరేపించబడిన కశ్యపప్రజాపతి పులోమయందు పౌలోములు, కాలకయందు కాలకేయులు, అను యుద్ధ స్వభావము గల దానవులను కనెను. ॥35॥

టీ॥ దానవీ పరిణయనే హేతుః బ్రహ్మచోదిత ఇతి. ॥35॥

టీ॥ దనువునకు చెందిన వారిని వివాహమాడుటకు హేతువు బ్రహ్మచే ప్రేరేపించబడుట. ॥35॥

శ్లో॥ తయోః షష్టి సహస్రాణి యజ్ఞఘ్నాంస్తే పితుః పితా ।
జఘాన స్వర్గతో రాజన్నేక ఇంద్ర ప్రియంకరః ॥ 36

తా॥ ఓ రాజా! వీరిలో యజ్ఞములను ధ్వంసము చేయు అఱవై వేల మంది దానవులను, ఇంద్రునకు ప్రియమును కూర్చువాడగు మీ తాతగారు (అర్జునుడు) స్వర్గమునకు పంపెను. (చంపెను) ॥36॥

టీ॥ తయో షష్టి సహస్రాణి నివాత కవచాః పుత్రా జాతాస్తాంశ్చ స్వర్గతః సంస్తే పితామహోऽర్జునో జఘాన. ॥36॥

టీ॥ మీ తాతగారైన అర్జునుడు స్వర్గమునకు పోయి, 60 వేలమంది నివాత కవచులను, స్వర్గమునకు పంపెను. అనగా చంపెను.॥36॥

శ్లో॥ విప్రచిత్తిః సింహికాయాం శతం చైకమజీజనత్ ।
రాహుజ్యేష్ఠం కేతుశతం గ్రహత్వం య ఉపాగతాః ॥ 37

తా॥ విప్రచిత్తి, సింహిక యందు నూటఒక్క మంది సంతానమును కనెను. వారిలో రాహువు జేష్ఠుడు. వందమంది కేతువులను వారు గ్రహత్వమును పొందిరి. ॥37॥

టీ॥ రాహుర్జ్యేష్ఠో యస్య. ॥37,38,39॥

టీ॥ వీరిలో రాహువు పెద్దవాడుగా పేరుపొందెను. ॥37,38,39॥

శ్లో॥ అథాతః శ్రూయతాం వంశో యోఽదితేరను పూర్వశః ।
యత్ర నారాయణో దేవః స్వాంశే నావతరద్విభుః ॥ 38

తా॥ ఇక అదితి గర్భమందు జన్మించిన వారిని గూర్చి వినుము. ఆమె గర్భముయందే ప్రభువైన నారాయణుడు తన అంశము చేత అవతరించెను.॥38॥

శ్లో॥ వివస్వానర్యమా పూషా త్వష్టాథ సవితా భగః ।
ధాతా విధాతా వరుణో మిత్రః శక్రః ఉరుక్రమః ॥ 39

తా॥ వివస్వంతుడు, అర్యముడు, పూషుడు, త్వష్టా, సవిత్రుడు భగుడు, ధాతా, విధాతా, వరుణుడు, మిత్రుడు, ఇంద్రుడు, ఉరుక్రముడు, (వీరు ద్వాదశా దిత్యులు). ॥39॥

శ్లో॥ వివస్వతః శ్రాద్ధదేవం సంజ్ఞాఽసూయత వై మనుమ్ ।
మిథునం చ మహాభాగా యమం దేవం యమీం తథా
సైవభూత్వాథ బడవా నాసత్యౌ సుషువే భువి ॥ 40

తా॥ వివస్వతుడు సంజ్ఞాయను భార్యయందు శ్రాద్ధదేవుడను మనువును కనెను. ఓ మహాభాగా! మిథునముగా (దంపతులుగా) యమదేవుని, యమిని కనెను. ఆమెయే సముద్రమున 'బడబ' అను పేరుతో గుఱ్ఱము రూపము దాల్చగా నాసత్యులను (అశ్వినీదేవతలను) కనెను. ॥40॥

టీ॥ అసూయతా జనయత్ భువి వర్తమానా. ॥40॥

టీ॥ కనెను-భూమియందు-ఉన్నదై. ॥40॥

శ్లో॥ ఛాయా శనైశ్వరం లేభే సావర్ణిం చ మనుం తతః ।
కన్యాం చ తపతీం యా వై వవ్రే సంవరణం పతిమ్ ॥ 41

టీ॥ తతో వివస్వతః. ।41॥

శ్లో॥ అర్యమ్ణో మాతృకా పత్నీ తయోశ్చర్షణయః సుతాః ।
యత్ర వై మానుషీ జాతిర్బ్రహ్మణాచోపకల్పితా ॥ 42

టీ॥ చర్షణయః కృతాకృతత జ్ఞానవన్తః పశ్యతి కర్మత్వేన నిఘణ్టావుక్తేః యత్ర యేషు ఆత్మానుసంధాన విషేషేణ మానుషీ జాతశ్చోపకల్పితా తథా చ శ్రుతిః "పురుషత్వే చావిస్త్రారామాత్మా" ఇతి. ॥42॥

తా॥ (వివస్వతునకు) అతని నుండి ఛాయాదేవి, శనైశ్వరుని, సావర్ణియను మనువును మరియు తపతీయను కన్యకను పొందెను. ఆమె(తపతి) సంవరుణుని పతిగా వరించెను. ॥41॥

టీ॥ వాని నుండి అనగా వివస్వతుని నుండి. ॥41॥

తా॥ అర్యమునకు మాతృకా యను పత్నియందు చర్షణులను, కొడుకులు పుట్టిరి. వారి మూలమున మానవజాతి ఏర్పడునట్లుగా బ్రహ్మదేవునిచే కల్పించబడెను. ॥42॥

టీ॥ చర్షణులు అనగా కృతాకృత జ్ఞానము కలవారు. అనగా చేసిన దానిని, చేయని దానిని తెలిసినవారు.'దృశి' అనుధాతువునకు కర్మ అని నిఘంటువునందు అర్థము చెప్పబడినందున పశ్యతి అను పదము కర్మగా చెప్పబడినది. వీరియందు అనగా చర్షణులయందు ఆత్మానుసంధాన విశేషణముగల మనుష్యజాతి కల్పించబడినది. పురుషత్వేచా విస్త్రారామాత్మా, యను శ్రుతి ననుసరించి పురుషత్వము నందు ఆత్మ అవిస్త్రారము కూడా! ॥42॥

శ్లో॥ పూషానపత్యః పిష్టాదో భగ్నదన్తోఽభవత్పురా ।
యోసౌ దక్షాయ కుపితం జహాస వివృతద్విజః ॥ 43

తా॥ పూర్వము పూషుడు (శివుని చూచి) వికృతముగా నవ్విన కారణముగా దక్ష యజ్ఞమందు (కోపించిన) దంతములు భగ్నమయిన వాడయ్యెను. సంతానము లేనివాడు, పిండి తినువాడు అయ్యెను.॥43॥

టీ॥ కుపితం హరం ఇతి శేషః. వివృత ద్విజః ప్రకటితదన్తస్సన్. 43॥

టీ॥ కోపించిన శివుని(చూచి) ప్రకటింపబడిన దంతములు కల వాడగుట వలన - మిగిలినది అన్వయము.॥43॥

శ్లో॥ త్వష్టుర్దైత్యానుజా భార్యా రచనా నామ కన్యకా ।
సంనివేషస్తయోర్జజ్ఞే విశ్వరూపశ్చ వీర్యవాన్॥ 44

తా॥ దైత్యుల సోదరియైన రచనా యను పేరుగల కన్యక త్వష్టునకు భార్య. వారికి వీర్యవంతులైన విశ్వరూపుడు, సంనివేశుడు అను పుత్రులు కలిగిరి. ॥44॥

శ్లో॥ తం వ వ్రిరే సురగణా దౌహజత్రం ద్విషతామపి ।
విమతేన పరిత్యక్తా గురుణాఙ్గిరసేణయత్ ॥ 45

తా॥ విమనస్కుడైన అంగీరసునిచే (బృహస్పతి) విడువబడిన దేవ గణములు శత్రువుల కూతురు యొక్క కొడుకును (విశ్వరూపుని) పురోహితునిగా వరించిరి.॥45॥

టీ॥ యద్యదా విమతేనావజ్ఞాతేన బృహస్పతినా పరిత్యక్తాస్తదాద్విషతాం శతౄణాం భాగినేయమపి విశ్వరూపంపారోహిత్యే వృతవన్తః ॥44,45॥

టీ॥ ఎప్పుడైతే అవమానింపబడి బృహస్పతి వెడలిపోయెనో అప్పుడు శత్రువుల సోదరికి చెందినవాడైనను విశ్వరూపుని పురోహితునిగా (గురువుగా) కోరిరి. ॥44,45॥

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే షష్ఠోఽధ్యాయః**

**శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆరవ స్కంధమున ఆరవ అధ్యాయము సమాప్తి.**

**సప్తమోఽధ్యాయః**

**గోపాలకృష్ణాయ నమః**

అవ॥ సప్తమే విశ్వరూపోఽసౌ పౌరోహిత్యే వృతస్సురైఃగురుణా సంపరిత్యక్తైః పౌరోహిత్యమథా కరోత్.

**రాజోవాచ.**

శ్లో॥ కస్య హేతోః పరిత్యక్తా ఆచార్యేణాత్మనః సురాః ।
ఏతదాచక్ష్వ భగవన్ శిష్యాణామక్రమం గురౌ ॥ (1)

టీ॥ కస్య హేతోః కస్మాద్ధేతోరాత్మనః శిష్యాః సురాః పరిత్యక్తాః. అక్రమమపరాధమ్. (1)

**శ్రీ శుక ఉవాచ.**

శ్లో॥ ఇంద్రస్త్రిభువనైశ్వర్య మదోల్లఙ్ఘిత సత్పథః ।
మరుద్భిర్వసుభీ రుద్రై రాదిత్యై ర్ఋభుభిర్నృప ॥ (2)

**7వ అధ్యాయము**

**గోపాలకృష్ణునికి నమస్కారము**

అవ॥ ఏడవ అధ్యాయమునందు దేవగురువు (బృహస్పతి) చేత వదిలి పెట్టబడిన దేవతలు పౌరోహిత్యమునకు విశ్వరూపుని వరించినారను కథాంశము వివరింపబడినది.

**పరీక్షిత్తు ప్రశ్నించుచున్నాడు.**

తా॥ హే భగవాన్ శుకమహర్షీ! ఏ అపరాధ కారణముగా దేవతల గురువు(బృహస్పతి)వారిని వదిలిపెట్టెనో ఆ విషయమును వివరింపుడు. ॥1॥

టీ॥ కస్మాద్ధేతో అను పంచమీ విభక్త్యర్థమున కస్య హేతోః అను షష్ఠీ విభక్త్యంత శబ్దము ప్రయోగింపబడినది. శ్లోకమున శిష్యాః అనుపదము, సురాః దేవతలను సూచించును. అక్రమమనగా అపరాధము. ॥1॥

**శ్రీశుకులు పలికిరి.**

తా॥ ఓ రాజా! ఇంద్రుడు త్రిలోకాధిపత్య గర్వముచే సన్మార్గమును వదిలి, మరుత్తులు, వసువులు, రుద్రులు, ఋభువులు, విశ్వేదేవతలు,

శ్లో॥ విశ్వేదేవైశ్చ సాధ్యైశ్చ నాసత్యాభ్యాం పరిశ్రితః ।
సిద్ధచారణ గన్ధర్వైర్మునిభి బ్రహ్మవాదిభిః ॥ (3)

సాధ్యులు, సిద్ధులు, చారణులు, గంధర్వులు, మునులు, వేదముల పఠించువారు, మున్నగువారిచే పరివృతుడై యుండెను. ॥2,3॥

శ్లో॥ విదాధరాప్సరోభిశ్చ కిన్నరైః పతగోరగైః ।
నిషేవ్యమాణోమఘవాన్స్తూయమానశ్చ భారత ॥ (4)

తా॥ ఓ రాజా! విద్యాధరులు, అప్సరసలు (అచ్చరలు) పతంగములు, ఉరగములు, మొదలగు ఉపదేవగుణములచే ఆ ఇంద్రుడు సేవించ బడుచు, స్తుతించబడుచుండెను. ॥4॥

టీ॥ స ఇంద్రో యదా సంప్రాప్తం వాచస్పతిం నాభ్యనందత నా ధృతవాంస్తదా స అఙ్గిరసస్తతో నిర్గత్య తూష్ణీం స్వగృహమాయయా విత్యష్టానామన్వయః॥ అనాదరే హేతుం మదం దర్శయితుం తం విశినష్టి. త్రిభువనైశ్వర్య మదేనోల్లంఘితః సతాం పన్థా యేన సః పరిశితః పరివృతః, ॥2,3,4॥

టీ॥ ఎప్పుడైతే ఆంగిరసుని (బృహస్పతిని) ఆ ఇంద్రుడు అభినందించలేదో, ఆదరించలేదో అప్పుడు బృహస్పతి అక్కడి నుండి వెళ్ళి స్వగృహమున ఊరకనే ఉండిపోయెను అని ఎనిమిది శ్లోకములలో అన్వయము. అనాదరణ చూపుటకు త్రిభువనాధిపత్యముచే ఇంద్రుడు పొందిన మదము హేతువైనది. ఇంద్రుడు ఈవిధముగా విశేషింప బడినాడు. ఎవని చేత త్రిభువనైశ్వర్య మదముచే సత్పురుషుల మార్గము వదిలి పెట్టబడినదో వాడు త్రిభువనైశ్వర్య మదనోల్లంఘిత సత్పథుడు. పరిశ్రితః అనగా పరివృతుడైనవాడు చుట్టబడిన వాడు.(2,3,4)

శ్లో॥ ఉపగీయమానో లలిత మాస్థానాద్యాసనాశ్రితః ।
పాండురేణాత పత్రేణ చంద్రమణ్డల చారుణా ॥ (5)

తా॥ గేయములచే, కీర్తనలచే కొనియాడబడుచు, చంద్రమండలము వలె అందమైన తెల్లని గొడుగుగల సింహాసనమును అధిష్టించి యుండెను. ॥5॥

టీ॥ ఆస్థానం సభా తస్మిన్నధ్యాసనం సింహాసనం తదా స్థితః. ॥5॥

టీ॥ సభ యందలి సింహాసనమున కూర్చొని యున్నప్పుడు. ॥5॥

శ్లో॥ యుక్తాశ్చాన్యైః పారమేష్ఠ్యైశ్చామరవ్యజనాదిభిః ।
విరాజమానః పౌలమ్యా సహార్ధాసనయా భృశమ్ ॥ (6)

తా॥ యుక్తమైన ఇతర రాజాధికార చిహ్నముల చేతను, చామర వ్యజనాదుల చేతను అర్ధాసనము నందు కూర్చునియున్న శచీదేవితోను విరాజిల్లుచుండెను. ॥6॥

టీ॥ పౌరమేష్ఠ్యైర్మహారాజ చిహ్నైః. ఆసనస్యార్ధే స్థితయా పౌలమ్యా సహ విరాజమానః సన్. ॥6॥

టీ॥ మహారాజ చిహ్నముల చేతను, ఆసనము యొక్క సగభాగ మందు కూర్చొని యున్న శచీదేవితో కూడి ప్రకాశించుచుండెను.॥6॥

శ్లో॥ స యదా పరమాచార్యం దేవానామాత్మనశ్చ హ ।
నాభ్యనన్దత సంప్రాప్తం ప్రత్యుత్థానాసనాదిభిః ॥ (7)

తా॥ దేవతలకును, తనకును పరమాచార్యులు అయిన బృహస్పతి విచ్చేయగా లేచి నిలబడుట. ఆసనము నందు కూర్చొనుమని చెప్పుట మొదలగు సత్కారములతో అభినందించలేదు. ॥7 ॥

టీ॥ ప్రత్యుత్థానాదినా నాభ్యనందత నాధృతవాన్. ॥7॥

టీ॥ 'ప్రత్యుత్థానాదినా' యందలి ఆది పదముచేత ప్రత్యుద్గమనము (ఎదురుగా వెళ్ళుట) తోడితెచ్చుట, ఆసనము చూపుట వంటి సత్కారములు సూచింపబడినవి. నాభ్యనందత అనుపదము ఆదరించని వాడు అని తెలియచేయుచున్నది. ॥7 ॥

శ్లో॥ వాచస్పతిం మునివరం సురాసుర నమస్కృతమ్ ।
నోచ్చచాలాసనాదింద్రః పశ్యన్నపి సభాగతమ్ ॥ (8)

తా॥ సభకు విచ్చేసిన సురాసురులచే నమస్కరించబడుచున్న మునివరుడైన వాచస్పతిని (బృహస్పతిని) చూచి కూడ ఇంద్రుడు ఆసనము నుండి లేవ లేదు (కదలలేదు). ॥8॥

టీ॥ న చోచ్చాల ఆసన్ ఏవ స్థితోఽపి కించిన్నచలితవాన్. ॥8॥

టీ॥ ఆసనము యందు కూర్చొని యుండి కూడ ఏ మాత్రము (మర్యాదాపూర్వకముగానైనను) కదలలేదు. ॥8॥

శ్లో॥ తతో నిర్గత్య సహసా కవిరాంగిరసః ప్రభుః ।
ఆయయౌ స్వగృహం తూష్ణీం విద్వాన్ శ్రీమదవిక్రియామ్ ॥ 9

తా॥ ఓ రాజా! ఐశ్వర్య మదముగల ఇంద్రుని అనుచిత ప్రవర్తనను తెలుసుకొని, వెంటనే విద్వాంసుడు, ఆంగిరస పుత్రుడు అయిన బృహస్పతి మౌనముగా (ఊరకనే) ఇంద్రుని కొలువు నుండి స్వగృహమునకు చేరెను. ॥9॥

టీ॥ శ్రీ మదేన యా విక్రియా తాం విద్వాన్ జానన్. ॥9॥

టీ॥ ఐశ్వర్యమదము యొక్క వికారముగల ఇంద్రుని తెలిసికొని ఆ విద్వాంసుడు (మరలి వచ్చెను). ॥9॥

శ్లో॥ తర్హ్యేవ ప్రతిబుధ్యేంద్రో గురుహేలన మాత్మనః ।
గర్హయామాస సదసి స్వయమాత్మాన మాత్మనా ॥ (10)

తా॥ పిమ్మట తానుచేసిన గురు హేళనమును తలచుకొని ఇంద్రుడు (సభయందు) తనను తాను నిందించుకొనుచు గర్హించుకొనుచుండెను. (10)

టీ॥ ప్రతిబుద్ధ్యామానుస్మృత్య. ॥10॥

టీ॥ (గురుహేళనమును) స్వయముగా విమర్శించుకొని.॥10॥

శ్లో॥ అహో బత మమాసాధుకృతం వై దభ్రబుద్ధినా ।
యన్మయైశ్వర్యమత్తేన గురుః సదసికాత్కృతః ॥ (11)

తా॥ అహో! అల్పబుద్ధితో, ఐశ్వర్యమదముచే గురువును సభ యందు తిరస్కరించితిని. నా ఈ చర్య అనుచితము. ॥11॥

టీ॥ మమ కృతం కర్మ అహో అసాధు. యద్యస్మాద్దభ్రబుద్ధినాల్ప మతినా మయా కాత్కృతస్తిరస్కృతః. ॥11॥

టీ॥ అహో! నేను చేసిన పని ఎంతయో అనుచితము. ఐశ్వర్య మదముచే అల్పబుద్ధి కలవాడనై గురువును సభ యందు తిరస్కరించితిని. 11

శ్లో॥ కో గృధ్యేత్పణ్డితో లక్ష్మీం త్రివిష్టప పతేరపి ।
యయాహమాసురం భావం నీతోఽద్య విబుధేశ్వరః ॥ (12)

తా॥ ముల్లోకములకు అధిపతినై, దేవతలకు ఈశ్వరుడనై యుండియు నేను అసుర భావమును పొందితిని. ఏ పండితుడు లక్ష్మిని కోరుకొనును. (పండితుడు మర్యాద మాత్రమే కోరుకొనును) ॥12॥

టీ॥ విబుధానాం సాత్త్వికానాం దేవానామీశ్వరోప్యహమ్. ॥12॥

టీ॥ సత్వగుణముగల దేవతలకు ప్రభువునైయుండి కూడ నేను (అసుర భావమును పొందితిని) ॥12॥

అవ॥ నను సింహాసనస్థో రాజాఽభ్యుత్థానం న కుర్యాదితి వృద్ధా వదన్తి తత్రాహ- య ఇతి ద్వాభ్యాం.

అవ॥ సింహాసనస్థుడు అయిన రాజు ఎవరైన వచ్చినపుడు లేవకూడదని పెద్దలు చెప్పుదురు. అను విషయమును 'య' తో ప్రారంభమైన రెండు శ్లోకములలో వివరించుచున్నాడు.

శ్లో॥ యే పారమేష్ఠ్యం ధిషణమధి తిష్ఠన్నకంచన ।
ప్రత్యుత్తిష్ఠేదితి బ్రూయుర్ధర్మం తే న పరం విదుః ॥ (13)

తా॥ ఎవరైతే అధికారమును (బ్రహ్మస్థానమును) పొందియున్నారో వారు నిలబడనవసరము లేదు. నిలబడకూడదని చెప్పువారు, పరమ ధర్మము తెలిసినవారు కాదు. ॥13॥

టీ॥ ధిషణమాసనమ్. ॥13॥

టీ॥ ధిషణమనగా సింహాసము. ॥13॥

శ్లో॥ తేషాం కుపథదేష్ట్రూణాం పతతాం తమసిహ్యధః ।
యేఽశ్రద్ధధ్యుర్వచస్తే వై మజ్జన్త్యశ్మప్లవా ఇవ ॥ (14)

తా॥ ఇట్టి చెడుమార్గమును చెప్పు వారి మాటలు నమ్మెడి వారు మునిగి పోవుచున్న ఱాతి పడవనుసరించు వారివలె చీకటిలో పడిపోవు వారే. ॥14॥

టీ॥ కుపథ దిశన్త్యుపదిశన్త్యుత్పథదేష్టారస్తేషాం వచః. అశ్మమయః ప్లవో యేషాం తే యథా మజ్జన్తం ప్లవమను మజ్జన్తి తద్వత్. ॥14॥

టీ॥ చెడుమార్గమునుపదేశించు వారి మాటలను నమ్మువారు నీటిలో మునిగిపోవుచున్న ఱాతి పడవ ననుసరించు వారివలె (అజ్ఞానమున) మునిగి పోవుదురు. ॥14॥

శ్లో॥ అథాహ మమరాచార్య మగాధధిషణం ద్విజమ్ ।
ప్రసాదయిష్యే నిషతః శీర్ష్ణా తచ్చరణం స్పృషన్ ॥ (15)

తా॥ అందుచేత నేను, ద్విజుడు, గంభీరుడు, దేవగురువు, శాఠ్యము (మూర్ఖత్వము) లేనివాడైన బృహస్పతి యొక్క చరణములను శిరస్సుచే స్పృశించి ప్రసన్నుని చేసుకొందును. ॥15॥

టీ॥ అగాధ గంభీరా ధిషణా యస్య తమ్ నిశతః శాఠ్యహీనః సన్. ॥15॥

టీ॥ ఎవరి యందు గంభీరమైన బుద్ధిగలదో వాడు అగాధధిషణుడు. నిషతః అనగా శాఠ్యము (మూర్ఖత్వము) లేనివాడు. ॥15॥

శ్లో॥ ఏవం చిన్తయతస్తస్య మఘోనో భగవాన్గృహాత్ ।
బృహస్పతిర్గతోऽదృష్టాం గతి మధ్యాత్మ మాయయా ॥ (16)

తా॥ ఈ విధముగా ఇంద్రుడు చింతించుచుండగనే దేవగురువైన బృహస్పతి తన మాయచేత గృహము నుండి కనపడకుండా పోయెను. ॥16॥

టీ॥ అధికయా ఆత్మ మాయయా. ॥16॥

టీ॥ అధికమైన తన మాయచే ॥16॥

శ్లో॥ గురోర్నాధిగతః సంజ్ఞాం పరీక్షన్భగవాన్స్వరాట్ ।
ధ్యాయన్ ధియా సురైర్యుక్తః శర్మ నాలభతాత్మనః ॥ (17)

తా॥ స్వర్గాధిపతియైన ఇంద్రుడు ఎంత వెదకినను, దేవతలతో కూడి బుద్ధితో పరీక్షించినను గురువు ఉనికిని తెలుసుకొనలేక పోయెను.(17)

టీ॥ గురోః సంజ్ఞాం జ్ఞానోపాయం పరీక్షమాణోऽపి నాధిగతోऽప్రాప్తః సన్. ॥17॥

టీ॥ గురువును తెలుసుకొను మార్గమును ఎంతగా పరీక్షించినను పొందకుండెను. ॥17॥

శ్లో॥ తచ్ఛ్రుత్వైవాసురాః సర్వ ఆశ్రిత్యౌశన సంమతమ్ ।
దేవాన్ప్రత్యుద్యమం చక్రుర్దుర్మదా ఆతతాయినః ॥ (18)

తా॥ ఈ విషయమును విని, దుర్మదము గల రాక్షసులు దానవ గురువైన శుక్రాచార్యుని అభిప్రాయము స్వీకరించి అస్త్ర శస్త్రములు ధరించి దేవతలపై దండెత్తిరి. (18)

టీ॥ ఆతతాయినః ఉద్యతాస్త్రాః. ॥18॥

టీ॥ ఎత్తి పట్టుకొనిన ఆయుధములు కలవారై. ॥18॥

శ్లో॥ తైర్విసృష్టేషుభిస్తీక్ష్ణైర్నిర్భినాఙ్గోరు బాహవః ।
బ్రహ్మాణం శరణం జగ్ముః సహేంద్రానత కన్ధరాః ॥ (19)

టీ॥ నిర్భిన్నాన్యఙ్గాన్యుత్తమాఙ్గాని శిరాంశి ఊరవో బాహవశ్చ యేషామ్. ॥19,20॥

శ్లో॥ తాంస్తథాభ్యర్దితాన్వీక్ష్య భగవానాత్మభూరజః ।
కృపయా పరయా దేవ ఉవాచ పరిసాన్త్వయన్ ॥ (20)

బ్రహ్మోవాచ

శ్లో॥ అహో బత సురశ్రేష్ఠాహ్యభద్రం వః కృతం మహత్ ।
బ్రహ్మిష్ఠం బ్రాహ్మణం దాన్తమైశ్వర్యాన్నాభ్యనన్దత ॥ (21)

టీ॥ వో యుష్మాకం కృతం కరణం మహదభద్రం. తదాహ॥బ్రహ్మిష్ఠ మితి. నాభ్యనన్దత నాభినన్దితవన్తః. ॥21॥

తా॥ వారిచే ప్రయోగించబడిన తీక్ష్ణమైన బాణములచే తలలు, తొడలు, చేతులు మొదలగు అంగములు తెగిన దేవతలు, తలలు వంచుకొని ఇంద్రునితో కూడి బ్రహ్మదేవుని శరణుజొచ్చిరి. ॥19॥

టీ॥ అంగమను పదము శిరోవాచకము, ఎవరి యొక్క శిరస్సులు, ఊరువులు, బాహువులు భిన్నమైనవో వారు నిర్భిన్నాంగోరు బహువులు కలవారు. ॥19,20॥

తా॥ స్వయంభువుడు, పూజనీయుడు, భగవానుడు, అజుడు అయిన బ్రహ్మదేవుడు తనను వేడుకొనుచున్న దేవతలను చూచి వారిని ఓదార్చుచూ దయతో ఇట్లు పలికెను. ॥20॥

బ్రహ్మ పలికెను

తా॥ అయ్యో! దేవతాశ్రేష్ఠులారా! మీరు పెద్ద అమంగళము చేసినారు సుమా! బ్రహ్మనిష్ఠుడు, దాంతుడు, బాహ్యేంద్రియ నిగ్రహము కలవాడు అయిన బ్రాహ్మణుని, మీరు ఐశ్వర్యమదముచే అభినందించ లేదు.॥21॥

టీ॥ మీచే చేయబడిన పని గొప్ప అమంగళకరమైనది అభద్రమైనది. దానిని చెప్పుచున్నాడు. బ్రహ్మిష్ఠుని, సత్కరించవలసిన వానిని అభినందించలేదు.॥21॥

శ్లో॥ తస్యాయమనయస్యాసీత్పరేభ్యో వః పరాభవః ।
ప్రక్షీణేభ్యః స్వవైరిభ్యః సమృద్ధానాం చ యత్సురాః ॥ (22)

తా॥ ఓ దేవతలారా! మీరు చేసిన తప్పు పనికి ఇది ఫలితము. సమృద్ధికలవారై కూడ, మిక్కిలి క్షీణించియున్న మీ శత్రువులచే (రాక్షసులచే) ఓడింపబడి అవమానమును పొందితిరి. ॥22॥

టీ॥ పరేభ్యః శత్రుభ్యో వః పరాభవ ఇతి యదయం తస్యాఽనయస్యాన్యాయస్య సంబంధీ ఫలరూప ఆసీత్. ఉక్తం చ "బ్రాహ్మణం" కులసంపన్నం భక్తం విష్ణోర్మహాత్మనః. ఆయాన్తం వీక్ష్య నోత్తిష్ఠేత్స దుఃఖైః పరిభూయతే" ఇతి స్వయమేవ వైరిణోహన్తారో యేషాం తేభ్యః (22)

టీ॥ శత్రువులచే మీకు కలిగిన ఈ పరాభవము, మీరు చేసిన అకృత్యము యొక్క ఫలమై ఉన్నది. కులసంపన్నుడు, బ్రాహ్మణుడు, విష్ణుభక్తుడు అయినవాడు వచ్చుచున్నప్పుడు చూచి కూడ ఎవడు లేవడో వాడు దుఃఖములను పొందును అని చెప్పబడినది. స్వయముగా ఎవరు మీచే ఓడింపబడిరో వారి చేతనే మీరు పరాభవమును పొందితిరి. ॥22॥

అవ॥ గురు తిరస్కార సత్కారావేవాపచయోపచయ కారణమిత్యసుర దృష్టాన్తేనాహ - మఘవన్నితి.

అవ॥ మఘవన్నిత్యాది శ్లోకమున గురు తిరస్కార, సత్కారములే క్షీణతకు, సమృద్ధికి కారణములుగా, అసురుల దృష్టాంతముగా చెప్పబడుచున్నది.

శ్లో॥ మఘవన్ద్విషతః పశ్య ప్రక్షీణాన్గుర్వతిక్రమాత్ ।
సంప్రత్యుపచితాన్భూయః కావ్యమారాధ్య భక్తితః ।
ఆదదీరన్నిలయనం మమాపి భృగు దేవతాః ॥ (23)

తా॥ ఓ ఇంద్రా! గురువును అతిక్రమించి క్షీణించి పోయిన రాక్షసులు మరల వారి గురువును (శుక్రాచార్యుని) భక్తితో ఆరాధించి బలమును పొందిరి, వారిని (మీ శత్రువులను) చూడుము. భృగువే (శుక్రాచార్యుడే) దైవముగాగల వారు నా లోకమును కూడ అతిక్రమించెదరు.॥23॥

టీ॥ ద్విషతః శత్రూన్. కావ్యం భార్గవం గురుమేవాసేవ్యోపచితాన్ ఉపచతత్వమేవాహ - ఆదదీరన్నిహ్నీయుః. ॥23॥

టీ॥ నీ శత్రువులు గురువునే (శుక్రాచార్యునే) సేవించుట వలన సమృద్ధినిపొందిరి. అందువలన గురుసేవయే సమృద్ధికి, తిరస్కారమే, క్షీణతకు కారణము. ॥23॥

శ్లో॥ త్రివిష్టపం కిం గణయన్త్యభేద్య
మన్త్రాభృగుణామను శిక్షితార్థాః ।
న విప్ర గోవిన్ద గవీశ్వరాణాం
భవన్త్యభద్రాణి నరేశ్వరాణామ్ ॥ (24)

తా॥ భృగు వంశీయులచే శిక్షణను పొంది, అభేద్యమైన మంత్ర బలములను పొందినవారు, స్వర్గమును కూడా లెక్కపెట్టరు. (గణింపరు) విప్రులు, గోవిందుడు, గోవులు ఆరాధ్య దైవములుగా గల రాజులకు అమంగళములు కలుగవు. ॥24॥

టీ॥ అభేద్యో మన్త్రో యేషాం అనుశిక్షితార్థాః శిష్యాః యతో విప్రా గోవిన్దో గావశ్చేశ్వరా అనుగ్రాహక యేషాం తేషామేవాఽభద్రాణి న భవన్త్యన్యేషాం తు భవన్తి. ॥24॥

టీ॥ అభేద్యములయిన, మంత్ర బలములు ఎవరికి గలవో, శిక్షణను పొందిన శిష్యులు ఎవరో, విప్రులు, గోవిందుడు, గోవులు మొదలగు వారి సేవలచే అనుగ్రహింప బడినవారు ఎవరో వారికి అభద్రములు (అమంగళములు) కలుగవు. ఇతరులకు కలుగును.॥24॥

శ్లో॥ తద్విశ్వరూపం భజతాశు విప్రం
తపస్వినం త్వాష్ట్రమథాత్మ వన్తమ్ ।
సభాజితోఽర్థాన్స విధాస్యతే వో
యది క్షమిష్యధ్వముతాస్య కర్మ ॥ (25)

తా॥ అందువలన మీరు తపశ్శాలి, ఇంద్రియములను జయించిన వాడు, వేదవేత్త త్వష్ట సుతుడు అయిన విశ్వరూపుని సేవింపుడు. ఆతని కర్మలను మీరు సహించినచో, ఆతనిని సత్కరించినచో తరువాత ఆతడు మీకు ప్రయోజనము చేకూర్చగలడు. (25)

టీ॥ తత్తస్మాత్. అథానన్తరమేవ భజత. అస్య కర్మా సుర పక్షపాతమ్. ॥25॥

టీ॥ అందువలన వెంటనే సేవింపుడు. అతని కర్మలు అసుర పక్షపాతమైనవి. ॥25॥

**శ్రీ శుక ఉవాచ.**

శ్లో॥ త ఏవ ముదితా రాజన్బ్రహ్మణా విగతజ్వరాః ।
ఋషిం త్వాష్ట్రముపవ్రజ్య పరిష్యజ్యేదమబ్రువన్ ॥ (26)

**శ్రీ శుకులు పలికిరి**

తా॥ ఓ రాజా! బ్రహ్మ ఈ విధముగా చెప్పగా, విన్న దేవతల సంతాపము తొలిగెను. వారు త్వష్ట కుమారుడు, ఋషి అయిన విశ్వరూపుని వద్దకు వెళ్ళి అతనిని కౌగిలించుకొని ఈ విధముగా పలికిరి. (26)

టీ॥ ఉదితా – ఉక్తాః. ॥26,27,28॥

టీ॥ చెప్పబడినవారై ॥26,27,28॥

**దేవా ఊచుః.**

శ్లో॥ వయం తేఽతిథయః ప్రాప్తా ఆశ్రమం భద్రమస్తు తే ।
కామః సంపాద్యతాం తాత పితౄణాం సమయోచితః ॥ (27)

**దేవతలు పలికిరి**

తా॥ ఓ నాయనా! నీకు శుభమగు గాక! మేము మీ ఆశ్రమమునకు వచ్చిన అతిథులము. తల్లిదండ్రులమగు మా సమయోచితమైన కోరికలు తీర్చబడుకాక! ॥27॥

శ్లో॥ పుత్రాణాం హి పరో ధర్మః పితృశుశ్రూషణం సతామ్ ।
అపి పుత్రవతాం బ్రహ్మన్కిముత బ్రహ్మచారిణామ్ ॥ (28)

తా॥ ఓ బ్రాహ్మణుడా! పితరులను సేవించుటయే పుత్రుల యొక్క పరమ ధర్మము గదా! మరి పుత్రవంతులైన పితరులను సేవించుట బ్రహ్మచారులైన పుత్రులకు కర్తవ్యమని వేరుగా చెప్పనవసరము లేదు. ॥28॥

శ్లో॥ ఆచార్యో బ్రహ్మణో మూర్తిః పితామూర్తిః ప్రజాపతేః ।
భ్రాతా మరుత్పతేర్మూర్తిర్మాతా సాక్షాత్ క్షితేస్తనుః ॥ (29)

తా॥ ఆచార్యుడు బ్రహ్మ యొక్క రూపాంతరము (స్వరూపుడు) ప్రజాపతి యొక్క స్వరూపమే తండ్రి. మరుత్పతి (ఇంద్రుని) యొక్క స్వరూపమే సోదరుడు, సాక్షాత్ భూదేవి యొక్క స్వరూపమే తల్లి.(29)

టీ॥ అతిథీనాం పితౄణాం చ ప్రశంసార్థమాహుః ఆచార్య ఉపనీయ వేదాధ్యాపకః బ్రహ్మణో వేదస్యమూర్తిః. ॥29॥

టీ॥ అతిథుల యొక్కయు మరియు పితరుల యొక్కయు ప్రశంస చేయుబడుచున్నది.- ఉపనీతులకు వేదమును బోధించువాడు ఆచార్యుడు. అట్లు ఆచార్యుడే వేదస్వరూపుడు. ॥29॥

శ్లో॥ దయాయా భగినీ మూరిర్ధర్మస్యాత్మాతిథిః స్వయమ్ ।
అగ్నేరభ్యాగతో మూర్తిః సర్వభూతాని చాత్మనః ॥ (30)

తా॥ దయ యొక్క మూర్తియే సోదరి, స్వయముగా ధర్మము యొక్క మూర్తియే అతిథి! అగ్ని దేవుని యొక్క మూర్తి అభ్యాగతుడు. సకల ప్రాణములు ఆత్మ యొక్క మూర్తులు. ॥30॥

టీ॥ ధర్మస్యాత్మామూర్తిరతిథిః స్వయం సాక్షాత్. ఆత్మనః శ్రీవిష్ణోః. యద్వా ఆత్మనః స్వస్య. సర్వభూతేష్వాత్మ దృష్టిః కర్తవ్యేత్యర్థః. ॥॥30॥

టీ॥ అతిథియనగా సాక్షాత్ ధర్మము యొక్క ఆత్మయే లేదా మూర్తియే. ఆత్మనః అనగా శ్రీవిష్ణువు యొక్క లేదా స్వాత్మ యొక్క అని అర్థము. అన్ని భూతములయందు ఆత్మ దృష్టి కలిగియుండ వలయునని భావము. (30)

శ్లో॥ తస్మాత్పితౄణామార్తానామార్తిం పర పరాభవమ్ ।
తపసాఽపనయంస్తాత సందేశం కర్తుమర్హసి ॥ (31)

తా॥ (అందువలన) శత్రువులచేత పరాభవింపబడి ఆర్తులమైన పితరుల యొక్క ఆర్తిని నీ తపస్సుచేత తొలగించుము తండ్రీ! నీవు మా ఆదేశమును పాలించదగినవాడవు. (31)

టీ॥ పరేభ్యః పరాభవ ఏవార్తిస్తామ్. ॥31,32॥

టీ॥ శత్రువుల వలన కలిగిన పరాభవమే ఇచట ఆర్తిగా చెప్పబడినది. అట్టి వారిని. ॥31,32॥

అవ॥ సందేశమాహుః – వృణీమహ ఇతి.

అవ॥ వృణీమహ ఇత్యాది శ్లోకమున సందేశము చెప్పబడుచున్నది.

శ్లో॥ వృణీమహే త్వోపాధ్యాయం బ్రహ్మిష్ఠం బ్రాహ్మణం గురుమ్ ।
యథాఞ్జసా విజేష్యామః సపత్నాంస్తవ తేజసా ॥ (32)

తా॥ బ్రహ్మజ్ఞానివి, వేదవేత్తవు, గురుడవైన నిన్ను ఉపాధ్యాయునిగా వరించుచున్నాము. నీ తేజస్సుచేత మేము తేలికగా శత్రువులను జయించగలము. ॥32॥

అవ॥ ననూపాధ్యాయత్వే కనిష్ఠస్య మమాభి నన్దనమ్. కరిష్యథ తచ్చ గర్హితం తత్రాహుః – నేతి.

అవ॥ నేత్యాది శ్లోకమున నేను ఉపాధ్యాయత్వమును అంగీకరించినచో చిన్నవాడినైన నాకు నమస్కరించుట అను దోషము ఏర్పడునుగదా! అను పూర్వపక్షమునకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ న గర్హయన్తి హ్యర్థేషు యవిష్ఠాఙ్ఘ్ర్యభివాదనమ్ ।
ఛన్దోభ్యోఽన్యత్ర న బ్రహ్మన్వయో జ్యైష్ఠ్యస్య కారణమ్ ॥ (33)

తా॥ ఓ బ్రాహ్మణుడా! ప్రయోజనముల యందు పిన్న వారికి నమస్కరించుటను నిందించరు (తప్పుగా పరిగణింపరు) వేదములు తప్ప ఇతరములైన వయస్సు మున్నగునవి పెద్దరికమునకు కారణములు కావు. (వేదమే పెద్దరికమునకు ప్రమాణము) ॥33॥

టీ॥ అర్థేషు ప్రయోజన నిమిత్తం యవిష్ఠానామభివాదనం న నిన్దన్తి. కించ ఛన్దోభ్యో మన్త్రేభ్యోఽన్యత్ర వయో జ్యైష్ఠ్యస్య కారణం న తు

టీ॥ ప్రయోజన నిమిత్తములైన విషయములలో పిన్నలకు నమస్కరించుటను పెద్దలు నిందించరు. ఇతర విషయములలో వయస్సే

మన్త్రేషు అతోఽస్మభ్యం మన్త్రదాతృత్వేన త్వమేవ జ్యేష్ఠో భవిష్యసి । యద్వా ఛన్దోభ్యోఽన్యత్ర వేదాన్విహాయ వయ ఏవ జ్యైష్ఠస్య కారణం న భవతి, కిన్తు వేదా ఏవ ముఖ్యమ్ కారణమ్. తత్సామ్యేతు వయః. వేద జ్ఞత్వాచ్చ త్వమేవజ్యేష్ఠ ఇత్యర్థః. ॥33,34॥

పెద్దరికమునకు కారణము కాని వేద మంత్రములు కలవారి విషయమున కాదు. అందుచేత మాకు మంత్రములను ఉపదేశించు కారణమున నీవే పెద్దవాడవు కాగలవు. కానిచో వేద విషయములు మినహా ఇతర విషయములలో వేటిలోనైనను వయస్సొక్కటియే. పెద్దరికమునకు కారణముకాదు. వేదజ్ఞానమే ముఖ్యకారణము. వేద జ్ఞానము సమమైనప్పుడు వయస్సు కారణము. వేదజ్ఞానమును బట్టి నీవే జ్యేష్టుడవు. పెద్దవాడవు అని భావము.(33)

**ఋషి ఋవాచ**

శ్లో॥ అభ్యర్థితః సురగణైః పౌరోహిత్యే మహాతపాః ।
స విశ్వరూపస్తానాహ ప్రసన్నః శ్లక్ష్ణయాగిరా ॥ (34)

**ఋషి వలికెను.**

తా॥ పౌరోహిత్య కార్యము కొరకు దేవతలు కోరగా మహాతపస్సంపన్నుడు అయిన ఆ విశ్వరూపుడు ప్రసన్నుడై మెత్తని మాటలతో వారితో నిట్లనెను. ॥34॥

**విశ్వరూప ఉవాచ**

శ్లో॥ విగర్హితం ధర్మశీలైర్బ్రహ్మ వర్చ ఉపవ్యయమ్ ।
కథం ను మద్విధో నాథా లోకేశైరభియాచితమ్ ।
ప్రత్యాఖ్యాస్యతి తచ్ఛిష్యః స ఏవస్వార్థ ఉచ్యతే ॥ (35)

**విశ్వరూపుడు వలికెను**

తా॥ ఓ తండ్రులారా! ధర్మశీలురచేత పౌరోహిత్యము నిందించబడినది. అంతేకాక, అది బ్రహ్మవర్చస్సును క్షీణింపజేయును. అయినను లోకపాలకులైన మీరు కోరగా మీకు శిష్యుడనైన నా వంటివాడు దానిని ఏ విధముగా తిరస్కరించగలడు. అదియే నాకు ప్రయోజనకరముగా చెప్పుచున్నాను. (35)

టీ॥ నిన్దితమపీదం యుష్మద్యాజ్ఞాభఙ్గ భయేన కరిష్యామీత్యాహ సార్థేన నిగర్హితం పౌరోహిత్యం ధర్మశీలైః, అధర్మహేతుత్వాత్. కించ బ్రహ్మవర్చ ఉపవ్యయం పూర్వసిద్ధస్య బ్రహ్మవర్చసో వ్యయకరమ్ ప్రతాఖ్యాతుం చ మాదృశో నార్హతీత్యాహ – కథన్త్వితి. తేషాం శిష్యః శిక్షణార్హః . స ఏవ ప్రత్యాఖ్యానా భావ ఏవహి శిష్యస్య స్వార్థ ఉచ్యతే. ॥35॥

టీ॥ పౌరోహిత్యము చేయుట నిందించబడినదియే అయినను మీ ఆజ్ఞా భంగ భయముచేత పౌరోహిత్యము చేయుదును. అని చెప్పెను. పౌరోహిత్యము చేయుట అధర్మహేతువు కావున ధర్మశీలురచేత నిందించబడినది. పూర్వము సిద్ధించిన బ్రహ్మవర్చస్సును కూడ ఇది క్షయము చేయును. అయినను నావంటివాడు పెద్దలను (మిమ్ములను) తిరస్కరించకూడదు. అందువలన పెద్దలను తిరస్కరించకపోవుటయే శిష్యునకు ప్రయోజనకరమని చెప్పబడుచున్నది. ॥35॥

శ్లో॥ అకించనానాం హి ధనం శిలోఞ్ఛనం
తేనేహ నిర్వర్తిత సాధు సత్క్రియః ।
కథం విగర్హ్యం ను కరోమ్యధీశ్వరాః
పౌరోధసం హృష్యతి యేన దుర్మతిః ॥ (36)

తా॥ ఓ ప్రభువులారా! దరిద్రులకు, పొలములో వదిలివేయబడిన లేదా అంగళ్ళలో క్రిందపడిన ధాన్యపుగింజలే ధనము. వీనితోడనే నేను అనేక సత్క్రియలు (అధ్యయనాదులు) చేయుచుంటిని. దుర్బుద్ధిగలవాడు మాత్రమే నిందించదగిన పౌరోహిత్యమునందు సంతోషము పొందును. అట్టి నిందించదగు వృత్తిని నేనెట్లు చేయుదును. (36)

టీ॥ నను పౌరోహిత్యేన ధన లాభాద్ధర్మః సిద్ధ్యేత్. అన్యథా నిర్ధనస్య కుతో ధర్మః. అత ఏవ తేన లోకో హృష్యతి తత్రాహ అకించనానాం శిలోఞ్ఛనం హి ధనమ్. క్షేత్రే స్వామ్యుపేక్షిత కణిశో పాదానం శిలమ్. హట్టాదౌ పతితవ్రీహ్యాదే రూపాదానముఞ్ఛనమ్. ఇహ గృహాశ్రమే

టీ॥ పౌరోహిత్యము చేత ధనలాభము, దానిచే ధర్మము సిద్ధించును. లేని యెడల నిర్ధనునకు ధర్మమెక్కడిది? అందుచేత దానితో లోకులు సంతోషించెదరు అని చెప్పబడుచున్నది. దరిద్రులకు శిలోఞ్ఛనమే ధనము. క్షేత్రమందు కోతకోసిన తరువాత వదిలివేయ బడిన వెన్నుల

తేనైవ నిర్వర్తితా సాధూనాం సత్క్రియా యేన. ॥36॥

ద్వారా పొందు ధాన్యముతోజీవించుట శిలము. అంగళ్ళలో క్రింద పడిన గింజలుగాని ఏరుకొని జీవించుట ఉంఛవృత్తి. గృహస్థాశ్రమములోనున్న నేను, ఈ లోకములో వీని చేతనే (శిలోంఛనము) సత్పురుషులుచేయు సత్క్రియలు ఆచరించుచూ గడుపుచున్నాను. ॥36॥

శ్లో॥ తథాపి న ప్రతిబ్రూయాం గురుభిః ప్రార్థితం కియత్ ।
భవతాం ప్రార్థితం సర్వం ప్రాణైరర్థైశ్చ సాధయే ॥ (37)

తా॥ అయినప్పటికి గురువులైన మీచే ప్రార్థించబడిన అల్పమైన కోరికను నేను తిరస్కరించను. మీచే కోరబడిన దానినంతయును ప్రాణములకు తెగించి అయినను సాధించెదను. (37)

టీ॥ కియదేతత్ప్రార్థితమల్పమేవ. అభ్యధికమపి కరిష్యామీత్యాహ - భవతామితి. ॥37॥

టీ॥ మీచే ప్రార్థించబడుటచే అది చిన్నదైనను పెద్దదైనను చేసెదను. ॥37॥

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ తేభ్య ఏవం ప్రతిశ్రుత్య విశ్వరూపో మహాతపాః ।
పౌరోహిత్యం వృతశ్చక్రే పరమేణ సమాధినా ॥ (38)

**శ్రీశుకులు పలికిరి.**

తా॥ గొప్ప తపస్సంపన్నుడు అయిన విశ్వరూపుడు ఈ విధముగా దేవతల కొఱకు ప్రతిజ్ఞ చేసి, పౌరోహిత్యమును అంగీకరించి ఏకాగ్రతతో పౌరోహిత్యమును నిర్వర్తించెను. (38)

టీ॥ పరమేణ సమాధినా పరమోద్యమేన. ॥38॥

టీ॥ ఉత్తమ ప్రయత్నముతో. ॥38॥

శ్లో॥ సురద్విషాం శ్రియం గుప్తామౌశనస్యాపి విద్యయా ।
ఆచ్ఛిద్యాదాన్మహేన్ద్రాయ వైష్ణవ్యా విద్యయా విభుః ॥ (39)

తా॥ సర్వసమర్థుడు అగు విశ్వరూపుడు, శ్రీనారాయణ కవచమనెడు వైష్ణవోపాసన విద్యచే శుక్రాచార్యునకు చెందిన విద్యచేత దాచబడిన రాక్షసుల యొక్క సంపదను కూడ తీసుకువచ్చి మహేంద్రునికి ఇచ్చెను. (39)

టీ॥ వైష్ణవ్యా శ్రీనారయణ కవచాత్మికయా. ॥39॥

టీ॥ నారాయణకవచమనెడి వైష్ణవ విద్యచేత ॥39॥

శ్లో॥ యయాః గుప్తః సహస్రాక్షో జిగ్యేఽసుర చమూర్విభుః ।
తాం ప్రాహ సమహేంద్రాయ విశ్వరూప ఉదారధీః ॥ (40)

తా॥ ఉదారబుద్ధిగల విశ్వరూపుడు ఆ విద్యను ఇంద్రునికి చెప్పెను దాని శక్తిచే సహస్రాక్షుడైన ఇంద్రుడు అసుర సైన్యమును జయించెను. (40)

టీ॥ అసుర చమూః దైత్య సేనాః – ఇతి.

టీ॥ రాక్షస సేనలను. ॥40॥

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే సప్తమోఽధ్యాయః**

**శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆరవ స్కంధమున ఏడవ అధ్యాయము సమాప్తి.**

**అష్టమో<u>ఽ</u>ధ్యాయః**

అవ॥ అష్టమే విశ్వరూపస్తు వర్మ నారాయణాత్మకమ్. ఇంద్రాయ ప్రాహ యేనేంద్రో గగుప్తో దైత్యానథాజయత్.

**రాజోవాచ.**

శ్లో॥ యయా గుప్తః సహస్రాక్షః సవాహాన్ రిపు సైనికాన్ ।
క్రీడన్నివ వినిర్జిత్య త్రిలోక్యా బుభుజే శ్రియమ్ ॥ (1)

శ్లో॥ భగవంస్తన్మమాఖ్యాహి వర్మ నారాయణాత్మకమ్ ।
యథాతతాయినః శత్రూన్యేన గుప్తో<u>ఽ</u>జయన్మృధే ॥ (2)

టీ॥ త్రిలోక్యాః సంబంధినీం శ్రియమ్. ॥1,2॥

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ వృతః పురోహితస్త్వాష్ట్రో మహేంద్రాయాను పృచ్ఛతే
నారాయణాఖ్యం వర్మాహ తదిహైకమనాః శ్రుణు ॥ (3)

**ఎనమిదవ అధ్యాయము**

అవ॥ ఎనిమిదవ అధ్యాయము నందు విశ్వరూపునిచే చెప్పబడిన నారాయణ కవచ స్తోత్రము, దాని ప్రభావమున ఇంద్రుడు దైత్యులను జయించిన విధము వివరింపబడినవి.

**రాజు వలికెను.**

తా॥ హే భగవాన్ శుకమహర్షీ! నారాయణుని రూపములో నున్న ఏ కవచ విద్యచే రక్షించబడిన సహస్రాక్షుడు యుద్ధము నందు, ఆట యందువలె శత్రు సైనికులను జయించి త్రైలోక్య సంపదను పొందినాడో ఆ కవచ విద్యను నాకు చెప్పుడు. ఆ కవచము రక్షించుచుండగా యుద్ధమునందు శస్త్రధారులగు శత్రువులను జయించిన విధానమును వివరింపుము. (1,2)

టీ॥ ముల్లోకములకు సంబంధించిన సంపదను. (1,2)

**శ్రీశుకులు వలికిరి**

తా॥ దేవతలచే పురోహితునిగా వరింపబడిన, త్వష్ట పుత్రుడగు విశ్వరూపుడు, ఇంద్రుడు అడుగగా నారాయణ కవచమును చెప్పెను. దానిని నీవు ఇపుడు శ్రద్ధతో ఏకాగ్రమైన మనస్సుతో వినుము. ॥3॥

**విశ్వరూప ఉవాచ**

శ్లో॥ ధౌతాఙ్ఘ్రిపాణిరాచమ్య సపవిత్ర ఉదఙ్ముఖః ।
కృతస్వాఙ్గ కరన్యాసో మన్త్రాభ్యాం వాగ్యతః శుచిః ॥ (4)

టీ॥ మంత్రాభ్యామష్టాక్షర ద్వాదశాక్షరాభ్యాం. కృతః స్వాఙ్గేషు కరయోశ్చ న్యాసో యేన. ॥3,4॥

శ్లో॥ నారాయణమయం వర్మ సంనహ్యేద్భయ ఆగతే ।
పాదయోర్జానునోరూర్వోరుదరే హృద్యథోరసి ॥ (5)

శ్లో॥ ముఖే శిరస్యాను పూర్వ్యాదోంకారాదీని విన్యసేత్ ।
ఓంనమో నారాయణాయేతి విపర్యయమథాపి వా ॥ (6)

టీ॥ నారాయణమయం వర్మ సంనహ్యేద్భధ్నీయాత్. తత్రాష్టాక్షరేణ పాదాద్యష్టాంగేషు న్యాస మాహ పాదయోరితి సార్థేన. ॥5॥

టీ॥ ప్రణవ సంపుటి తమోంకారాద్యేకైకమక్షరం విన్యసేత్.

**విశ్వరూపుడు వలికెను**

తా॥ కాళ్ళు చేతులు కడుగుకొని, పవిత్రను ధరించి, ఉత్తరాభిముఖుడై కూర్చుండి, ఆచమనము చేసి మౌనియై, శుచియై రెండు మంత్రముల చేత అంగన్యాసమును, కరన్యాసమును, చేసెను. (4)

టీ॥ రెండు మంత్రముల చేత అనగా అష్టాక్షర, ద్వాదశాక్షర మంత్రముల చేత అంగములయందును, కరములయందును మంత్రాక్షరముల న్యాసము చేసెను. ॥4॥

తా॥ భయము కలిగినపుడు సాధకుడు నారాయణమయమైన కవచమును ధరించవలయును. పాదములు, మోకాళ్ళు, తొడలు, ఉదరము, హృదయము, వక్షస్థలము, ముఖము, తల అను అంగముల యందు 'ఓంనమోనారాయణాయ' అను మంత్రమును న్యసింపవలయును, విపర్యమున కూడ అట్లే చేయవలయును.॥5,6॥

టీ॥ నారాయణ కవచమును బంధించుకొనవలయును. అక్కడ అష్టాక్షరములచే (అష్టాక్షరీమంత్రముచే) పాదము మొదలుకొని శిరస్సు వఱకు గల ఎనిమిది అంగముల యందు న్యాసమును చెప్పుచున్నాడు. పాదయోరితి పాదమును కలపుకొని, ప్రతి అక్షరమును ప్రణవ

విపర్యమం యథా భవత్యేవం శిర ఆది పాదాన్తమ్ వా విన్యసేత్. ఉత్పత్తి న్యాసం సంహార న్యాసం వా కుర్యాదిత్యర్థః. ॥6॥

సంపుటముగా చేసి న్యసించవలయును. విపర్యయము అనగా శిరాది పాదాన్తముగా న్యసింపవలెను. ఉత్పత్తి న్యాసము (శిరస్సుతో ఆరంభించి పాదాంతముగా) సంహార న్యాసము (పాదముతో ఆరంభించి శిరస్సు వఱకు) చేయవలెనని అర్థము. ॥5,6॥

శ్లో॥ కరన్యాసం తతః కుర్యాద్ద్వాదశాక్షర విద్యయా ।
ప్రణవాది యకారాన్త మఙ్గుల్యఙ్గుష్ఠ పర్వసు ॥ (7)

తా॥ ఆ తరువాత ద్వాదశాక్షరీ మంత్రముచేత కరన్యాసము చేయవలయును. ప్రణవముతో మొదలిడి యకారాంతము వరకు గల అక్షరములచే వేళ్ళు, బొటనవేళ్ళు పర్వముల (కణుపుల) యందు న్యాసము చేయవలయును. ॥7॥

టీ॥ ద్వాదశాక్షరస్యో ద్ధారః ప్రణవాది యకారాన్తమితి. ప్రణవ సంపుటితమేకైకమక్షరం దక్షిణ తర్జనీ మారభ్య వామతర్జనీ పర్యంత మఙ్గులీషు. పరిశిష్టమక్షర చతుష్టయమఙ్గుష్ఠయోరాద్యన్త పర్వసు న్యసేత్. ॥7॥

టీ॥ ప్రణవాది యకారాంతము గల అక్షరములు ద్వాదక్షరీ మంత్రము. ఒక్కొక్క అక్షరమును ప్రణవ సంపుటిచే దక్షిణ (కుడి) తర్జనీ (చూపుడువ్రేలు) తో ఆరంభించి ఎడమ చేతి చూపుడు వ్రేలు వరకు మిగిలిన నాలుగు అక్షరములను అంగుష్ఠము (బొటన వ్రేలు) మొదటి, చివరి కణుపుల యందు న్యాసము చేయవలయును.॥7॥

అవ॥ మంత్రాన్తర న్యాసమాహ -న్యసేదితి.

అవ॥ న్యసేదితి శ్లోకమున మంత్రము యొక్క అంతరన్యాసము చెప్పబడుచున్నది. (ఓం విష్ణవే నమః అను ఆరు క్షరములు)

శ్లో॥ న్యసేద్ధృదయ ఓంకారం వికార మనుమూర్ధనీ ।
షకారంతు భ్రువోర్మధ్యే ణకారం శిఖయాదిశేత్ ॥ (8)

టీ॥ షకారణకారయోర్విశ్లేషణ షడక్షరాణి హృదయాదిషు న్యసేత్. 8

శ్లో॥ వేకారం నేత్రయోర్యుంజ్యాన్నకారం సర్వసంధిషు ।
మకార మంత్రముద్దిశ్య మంత్రమూర్తిర్భవేద్బుధః ॥ (9)

టీ॥ మకార మంత్రముద్దిశ్య ధ్యాత్వా. ॥9॥

శ్లో॥ స విసర్గం ఫడన్తం తత్సర్వ దిక్షు వినిర్దిశేత్. ఓం విష్ణవే నమ ఇతి. ॥10॥

టీ॥ తన్మకారాస్త్రం 'మః అస్త్రాయఫట్" ఇత్యేవం దిగ్బంధే వినిర్దిశేత్. ॥10॥

తా॥ హృదయమందు ఓంకారమును ఉంచవలెను. వికారమును మూర్ధమందు, షకారమును భ్రూమధ్యమందు, ణకారమును శిఖ యందు న్యాసము చేయవలెను. (8)

టీ॥ షకార, ణకారములను వేరు వేరుగా ఆరు అక్షరములను హదయాది అంగములయందు న్యాసము చేయవలెను.॥8॥

తా॥ వేకారమును నేత్రముల యందు, నకారమును అన్ని కీళ్ళ యందును న్యాసము చేయవలెను. మకారమును అస్త్రముగా ఉద్దేశించిన విద్వాంసుడు (ధ్యానించిన) మంత్రమూర్తియగునను. (9)

టీ॥ మకారమును అస్త్రముగా ధ్యానించి. ॥9॥

తా॥ విసర్గతో కలిపి ఫడంతముగా (ఫట్ అంతముగా) అన్ని దిక్కులను నిర్దేశించవలయును. ఓం విష్ణవే నమః అను మంత్రముచే. (10)

టీ॥ ఆ మకారాంతమును విసర్గతో కలిపి "మః అస్త్రాయఫట్" అని చెప్పి దిగ్బంధనమును చేయవలయును. ॥10॥

శ్లో॥ ఆత్మానం పరమం ధ్యాయేద్ధ్యేయం షట్శక్తిభిర్యుతమ్ ।
విద్యా తేజస్తపో మూర్తిమిమం మంత్రముదాహరేత్ ॥ (11)

తా॥ పరముడు (ప్రకృతికి అతీతుడైన) ఆరుశక్తులు కలిగియున్నవాడు ధ్యానము చేయదగినవాడు అగు పరమాత్మను ఆత్మ రూపముగా ధ్యానింపవలెను. విద్యా, తేజ, తపోమూర్తిని ఈ మంత్రముచే పలుకవలయును. (కీర్తించవలెను) (11)

టీ॥ ధ్యేయమీశ్వరరూప మాత్మానం ధ్యాయేత్. షట్శక్తిభిరైశ్వర్యాదిభిర్భగశబ్ద వాచ్యాభిః. విద్యా చ తేజశ్చ తపశ్చ మూర్తిర్యస్యతమ్. ఇమం వక్ష్య మాణం శ్రీమన్నారాయణ కవచాఖ్యం. ॥11॥

టీ॥ ధ్యానము చేయదగిన ఈశ్వర రూపమును ఆత్మ రూపమున ధ్యానించవలెను. భగవశబ్ద వాచ్యములైన ఐశ్వర్యాది ఆరుశక్తులు, అనగా ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము గల, భగవంతునిగా చెప్పబడు ఈశ్వరుని, విద్యామూర్తి, తేజోమూర్తి, తపోమూర్తియైన వానిని ఈ చెప్పబోవు నారాయణ కవచమనెడి మంత్రముతో కీర్తించవలయును. ॥11॥

శ్లో॥ ఓం హరిర్విదధ్యాన్మమసర్వ రక్షాం
న్యస్తాఙ్ఘ్రిపద్మః పతగేంద్ర పృష్ఠే ।
దరారి చర్మాసి గదేషుచాప
పాశాన్దధానోఽష్టగుణోఽష్టబాహుః ॥ (12)

తా॥ ఓం పక్షిరాజు వీపుపై నుంచిన పాదపద్మములు గల శంఖము, చక్రము, డాలు, కత్తి, గద, ధనుస్సు, బాణము, పాశము అను ఎనిమిది ఆయుధములు తన ఎనిమిది బాహువులయందు ధరించిన అష్ట గుణములు కలిగిన హరి అన్ని విధముల నన్ను రక్షింపచేయుగాక. (12)

టీ॥ అష్టగుణోఽణిమాద్యష్టైశ్వర్య యుక్తః. ॥12॥

టీ॥ ఓంకారము మంగళవాచకము. అష్టగుణములు అనగా అణిమాది అష్టైశ్వర్యములు, (అణిమా, లఘిమ, గరిమ, మహిమ, ఈశత్వ, వశిత్వము, ప్రాప్తి, ప్రాకామ్య, అనునవి) ॥12॥

శ్లో॥ జలేషు మాం రక్షతు మత్స్యమూర్తి
ర్యాదో గణేభ్యో వరుణస్య పాశాత్ ।
స్థలేషు మాయా వటు వామనోఽవ్యా
త్రివిక్రమః ఖేఽవతు విశ్వరూపః ॥ (13)

తా॥ జలములయందు జల జంతువుల గణములనియెడి, వరుణ పాశముల నుండి మత్స్యమూర్తి, (మత్స్యావతారుడైన హరి) స్థలముల యందు మాయచే బ్రహ్మచారియైన వామనుడు, ఆకాశమందు విశ్వరూపుడైన త్రివిక్రముడు నన్ను రక్షించుగాక. (13)

టీ॥ యాదసాం గణా ఏవ వరుణస్యపాశాస్తస్మాత్. ॥13॥

టీ॥ జల జంతువుల గణములే వరుణ పాశములు వాని నుండి.(13)

శ్లో॥ దుర్గేష్వటవ్యాజి ముఖాదిషు ప్రభుః
పాయాన్నృసింహోఽసుర యూథ పారిః ।
విముంచతో యస్య మహాట్టహాసం
దిశోవినేదుర్న్యపతంశ్చ గర్భాః ॥ (14)

తా॥ అడవులు, రణరంగములు మొదలగు సంకటస్థానములందు, (రాక్షససేనానాయకులకు శత్రువైనట్టి) ఏ ప్రభువు యొక్క అట్టహాసము చేత దిక్కులు ప్రతిధ్వనించెనో, గర్భములు కూడ (శత్రు కాంతల) జారిపడునో ఆ నృసింహ ప్రభువు రక్షించుగాక! (14)

టీ॥ అటవీ ఆజిముఖం సంగ్రామోపక్రమశ్చ ఆదిర్యేషాం తేషు సంకట స్థానేషు. ॥14॥

టీ॥ అడవులు, సంగ్రామ ఉపక్రమము (ఆరంభము) మొదలగు ఏ ఏ సంకట స్థానములు కలవో వాటియందు.॥14॥

శ్లో॥ రక్షత్వసౌ మాఽధ్వని యజ్ఞకల్పః
స్వదంష్ట్రయోన్నీత ధరో వరాహః ।
రామోఽద్రి కూట్యేష్వథ విప్రవాసే
స లక్ష్మణోఽవ్యాద్భరతాగ్రజోఽస్మాన్ ॥ (15)

తా॥ యజ్ఞములచే నిర్దేశించబడువాడు, (యజ్ఞమూర్తి) తన కోఱలచే భూమిని ఉద్ధరించినవాడును అయిన వరాహమూర్తి నన్ను మార్గము నందు, పరశురాముడు పర్వతకూటములందు, భరతాగ్రజుడు లక్ష్మణు-నితో కూడిన రాముడు పర దేశములందు కాపాడుదురుగాక! (15)

టీ॥ అసౌ ప్రసిద్ధో వరాహో మా మామ ధ్వని రక్షతు. యజ్ఞైరవయవ రూపైః కల్ప్యైలే నిరూప్యత ఇతి తథా. ఉన్నీతా ఉద్ధృతా ధరా యేన సః అద్రి కూటేషు గిరి శిఖరేషు. రామో జామదగ్న్యః. ॥15॥

టీ॥ యజ్ఞములే అవయవములుగా నిరూపించబడిన, భూమిని ఉద్ధరించిన యజ్ఞవరాహమూర్తి మార్గమునందు నన్ను రక్షించుగాక! పర్వత శిఖరములయందు జమదగ్ని కుమారుడైన పరశురాముడు కాపాడుగాక! ॥15॥

శ్లో॥ మాముగ్రధర్మాదఖిలాత్ప్రమాదా
న్నారాయణః పాతు నరశ్చ హాసాత్ ।
దత్తస్త్వయోగాదథ యోగనాథః
పాయాద్గుణేశః కపిలః కర్మబన్ధాత్ ॥ (16)

తా॥ ఉగ్ర ధర్మముల నుండి, సకల ప్రమాదముల నుండి నారాయణుడు, అపహాసము నుండి నరుడు, అయోగము నుండి యోగనాథుడైన దత్తాత్రేయుడు, గుణములకు ప్రభువైన కపిలుడు కర్మబంధముల నుండి నన్ను కాపాడుదురుగాక! (16)

టీ॥ ఉగ్రధర్మాదభిచారాది లక్షణాత్ హాసాద్గర్వాన్నరో౽ ౽తు. దత్తో దత్తాత్రేయః. అయోగాద్యోగ భ్రంశాత్. ॥16॥

టీ॥ ఉగ్ర ధర్మముల నుండి అనగా చేతబడులు మొదలగు అభిచారముల నుండి నారాయణుడు, హాసము నుండి అనగా గర్వము నుండి నరుడు, అయోగము అనగా యోగాన్ని అభ్యసించుచూ సిద్ధిని పొందక మరణించుట. అట్టి అయోగము నుండి, యోగభ్రంశము నుండి దత్తాత్రేయుడు రక్షించుగాక! ॥16॥

శ్లో॥ సనత్కుమారో౽వతు కామదేవా
ద్ధయశీర్షా మాం పథి దేవహేళనాత్ ।
దేవర్షివర్యః పురుషార్చనాన్తరా
త్కూర్మో హరిర్మాం నిరయాదశేషాత్ ॥ (17)

తా॥ కామదేవుడైన మన్మథుని నుండి సనత్కుమారుడు, మార్గమందు దేవతలపట్ల జరుగు అపరాధముల నుండి హయగ్రీవుడు, పురుషోత్తముని ఆరాధనలోని లోపముల నుండి దేవర్షి నారదుడు, సమస్త నరకముల నుండి కూర్మరూపుడైన హరి కాపాడుగాక! (17)

టీ॥ పథి యద్దేవానాం హేళనం నమస్కారమకృత్వాగమనం తస్మాత్. పురుషార్చనస్యాన్తరాద్దేవ పూజాచ్ఛిద్రాద్ద్వాత్రింశదపరాధ రూపాన్నారదః (17)

టీ॥ మార్గము నందు దేవతలకు నమస్కరించకుండా వెళ్ళుట అనెడి దేవ హేళనము నుండి, దేవపూజా ఛిద్రముల (లోపములు) నుండి 32 దోషముల నుండి నారదుడు రక్షించుగాక! ॥17॥

శ్లో॥ ధన్వంతరిర్భగవాన్పాత్వపథ్యా
ద్వంద్వాద్భయాదృషభో నిర్జితాత్మా ।
యజ్ఞశ్చ లోకాదవతాజ్జనాన్తా
ద్బలోగణాత్క్రోధవశాదహీన్ద్రః ॥ (18)

తా॥ భగవంతుడైన ధన్వంతరి అపథ్యము నుండి, మనస్సును జయించిన ఋషభదేవుడు ద్వంద్వ భయముల నుండి, యజ్ఞస్వరూపుడు లోకమునుండి, బలరాముడు జనముల వలన ఏర్పడు కష్టముల నుండి, ఆదిశేషుడు క్రోధవశములైన సర్పగణముల నుండి కాపాడుగాక!(18)

టీ॥ లోకాజ్జనాపవాదాద్యజ్ఞః. జన నిమిత్తో యోన్త ఉపఘాతస్త స్మాద్బల భద్రోఽవతాత్. కృతాన్తాదితి పాఠే కృతాన్తాత్ కాలాద్రక్షతు. క్రోధవశాత్సర్పాణాంగణాత్. అహీంద్రః శేషః. ॥18॥

టీ॥ లోకము నుండి అనగా జనాపవాదముల నుండి యజ్ఞ స్వరూపుడైన హరి, ప్రజల వలన ఏర్పడు హానుల నుండి బలభద్రుడు, కృతాన్తాత్ అనుపాఠమున కాలుని నుండి, క్రోధవశములైన సర్ప గణముల నుండి శేషుడు కాపాడుగాక! ॥18॥

శ్లో॥ ద్వైపాయనో భగవానప్రబోధా
ద్బుద్ధస్తు పాఖండ గణాత్ప్రమాదాత్ ।
కల్కిః కలేః కాలమలాత్ప్రపాతు
ధర్మావనాయోరుకృతావతారః ॥ (19)

తా॥ వ్యాసభగవానుడు అజ్ఞానము నుండి; బుద్ధభగవానుడు పాఖండ గణములనుండి వేద విరుద్ధముగల మతానుయాయుల నుండి; ధర్మము కొఱకు అనేక అవతారములు ధరించిన కల్కి భగవానుడు ధర్మ విషయముల మఱపు నుండి (కలి దోషముల నుండి) కాపాడుదురుగాక! (19)

టీ॥ కాలమల భూతాత్కలేః కల్కిః ధర్మావనాయ ధర్మరక్షణాయో రుర్మహాన్కృతో౽వతారోయేన. ॥19॥

టీ॥ కాల మలరూపుడైన కలి నుండి కల్కిభగవానుడు ధర్మమును కాపాడుటకు అనేక గొప్ప అవతారములు ధరించినవాడు (కాపాడు గాక!) ॥19॥

అవ॥ దినస్య షట్సు భాగేషు క్రమేణ ప్రాతరాది సంజ్ఞేషు రాత్రేశ్చ ప్రదోషాది సంజ్ఞేషు రక్షాప్రార్థనమ్ మాం కేశవ ఇతి త్రిభిః. ॥

అవ॥ మాం కేశవ అను శ్లోకముతో ఆరంభించి మూడు శ్లోకములలో, ప్రాతః కాలము మొదలుకొని క్రమముగా దినము యొక్క ఆఱు భాగములందు, ప్రదోష కాలము మొదలుకొని క్రమముగా రాత్రి యొక్క ఆఱు భాగములందు (కాలవ్యాపకుడైన పరమాత్ముని) రక్షణ కొఱకు ప్రార్థనము చెప్పబడుచున్నది.

శ్లో॥ మాం కేశవో గదయా ప్రాతరవ్యా<br>
ద్గోవింద ఆసంగవమాత్త వేణుః ।<br>
నారాయణః ప్రాహ్ణ ఉదాత్త శక్తి<br>
ర్మధ్యన్దినేవిష్ణురరీంద్రపాణిః ॥ (20)

తా॥ కేశవుడు గద పట్టుకొని ఉదయమందు, మురళిని ధరించి గోవులను పాలించు గోవిందుడు పగటి రెండవ జాము నందు, గొప్ప శక్తి గల నారాయణుడు మూడవ జామునందు, మధ్యాహ్నకాలమున చక్రపాణి అయిన విష్ణువు నన్ను రక్షించుదురుగాక! (20)

టీ॥ ఆసంగవం సంగవ మభివ్యాప్య. ॥20॥

టీ॥ సంగవ కాలమంతయు అనగా సూర్యోదయము నుండి ఏడవ ఘడియ మొదలు పన్నెండవ ఘడియ వఱకు గల కాలము.॥20॥

శ్లో॥ దేవో௨పరాహ్ణే మధుహోగ్రధన్వా
సాయం త్రిధామా௨వతు మాధవో మామ్ ।
దోషే హృషీకేశ ఉతార్ధ రాత్రే
నిశీథ ఏకో௨వతు పద్మనాభః ॥ (21)

తా॥ అపరాహ్ణమున ఉగ్రమైన ధనుస్సును ధరించిన మధుసూదనుడు, సాయంకాలమునందు ప్రదోషకాలమందు త్రిమూర్తి యగు మాధవుడు హృషీకేశుడు, అర్ధరాత్రము వరకు మరియు అర్ధరాత్రి తరువాత అద్వితీయుడు అయిన పద్మనాభుడు నన్ను కాపాడుదురుగాక! (21)

టీ॥ త్రిధామా బ్రహ్మాది త్రిమూర్తిః శ్రీమాధవః. దోషే ప్రదోషే అర్ధరాత్రే అర్ధరాత్రి పర్యన్తే, కాలే నిశీథే చైక ఏవ పద్మనాభో௨వతు॥21॥

టీ॥ త్రిధామా అనగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులనెడి త్రిమూర్తుల రూపము ధరించిన శ్రీమాధవుడు అర్ధరాత్రి పర్యంతము, నిశీథే అర్ధరాత్రి తరువాత అద్వితీయుడైన పద్మనాభుడు కాపాడుగాక! ॥21॥

శ్లో॥ శ్రీవత్సధామా௨పరరాత్ర ఈశః
ప్రత్యూష ఈశో௨సిధరో జనార్దనః ।
దామోదరో௨వ్యాదను సన్ధ్యం ప్రభాతే
విశ్వేశ్వరో భగవాన్కాల మూర్తిః ॥ (22)

తా॥ రాత్రి యందలి చివరి కాలమున శ్రీవత్సమను చిహ్నముగల ఈశ్వరుడు, వేకువజామునందు ఖడ్గము ధరించిన ప్రభువగు జనార్దనుడు, ప్రతి సంధ్యయందు దామోదరుడు, తెల్లవారుఝామున విశ్వేశ్వరుడు, కాలస్వరూపుడు అయిన భగవానుడు కాపాడుదురుగాక! (22)

టీ॥ అపర రాత్రే ఈశః శ్రీవత్స ధామా అవతు. ప్రత్యూష ఈశః శ్రీజనార్దనః శ్రీదామోదరః ప్రభాతే శ్రీవిశ్వేశ్వరో௨నుసన్ధ్యమ్॥22॥

టీ॥ అర్ధరాత్రి తరువాత అరుణోదయమునకు పూర్వము గల కాలము అపరరాత్రము, దీని యందు శ్రీవత్సమనే పుట్టుమచ్చ గల ఈశుడు, వేకువజామున శ్రీజనార్దనుడు, ప్రాతస్సామయం సంధ్యల యందు శ్రీదామోదరుడు, తెల్లవారుజామున కాలస్వరూపుడు అయిన

జగన్నాథుడు దిన రాత్రి మయమైన సర్వ కాలముల యందు కాపాడు గాక! ॥22॥

శ్లో॥ చక్రం యుగాన్తానలతిగ్మ నేమి
భ్రమత్సమన్తాద్భగవత్ప్రయుక్తమ్ ।
దన్దగ్ధిదన్దగ్ధ్యరి సైన్యమాశు
కక్షం యథా వాత సఖో హుతాశః ॥ (23)

తా॥ ప్రళయ కాలాగ్నివలె వాడియైన ధారలు కలిగి భగవంతునిచే ప్రయోగింపబడి, అంతటా తిరుగుచున్న చక్రము, వాయు సఖుడైన అగ్ని గడ్డిని దగ్ధము చేయునట్లు, శత్రుసైన్యమును వెంటనే దగ్ధము చేయుగాక! (23)

టీ॥ యుగాన్తానలవత్తిగ్మా తీక్ష్ణా నేమిర్యస్య తచ్చక్రం భగవతా ప్రయుక్తం సత్ అరి సైన్యం దన్దగ్ధి దన్దగ్ధి అతిశయేన దహతి. తస్యాయం స్వభావ ఏవ, న తు తస్మా త్ప్రార్థనీయమిత్యర్థః యద్వా దన్దగ్ధీతి లోణ్మధ్యమ పురుషః. అత్ర త్వమేవం భూతం చక్రమితి స్వరూపముక్త్వా సంబోధ్య ప్రార్థ్యతేఽ తి శయేన దహేతి. కక్షం శుష్కతృణామ్. ॥23॥

టీ॥ భగవంతునిచే ప్రయోగింపబడిన, ప్రళయకాలాగ్నివలె తీక్ష్ణమైన వేడిమిగల చక్రము శత్రు సైన్యములను మిక్కిలిగా దహించును. ఇది ఆ చక్రము యొక్క స్వభావము. అందుచేత దానిని ప్రార్థించ నవసరము లేదని అర్థము. లేదా దందగ్ధి లోట్ మధ్యమ పురుషక్రియా. అందుచే దహింపుము అని ప్రార్థనముగా ఇక్కడ భావించవచ్చును. చక్రము అనుపదము చక్రధారి సంబోధనముగా భావించిన దహింపుము అను ప్రార్థన ఇచ్చుట తెలియబడుచున్నది. కక్షమనగా శుష్క తృణము, ఎండుగడ్డి. ॥23॥

శ్లో॥ గదేఽశనిస్పర్శన విస్ఫులింగే
నిష్పింఢి నిష్పింధ్య జిత ప్రయాఽసి ।
కూష్మాండ వైనాయక యక్షరక్షో
భూతగ్రహాం శ్చూర్ణయ చూర్ణయారీన్ ॥ (24)

తా॥ పిడుగు వంటి స్పర్శగల నిప్పుకణములుకల ఓ గదా! నీవు పరాజయము లేని వాడి ప్రియురాలవు. కూశ్మాండ, వైనాయక, యక్ష, రక్షో, భూతగణములను నుగ్గు నుగ్గు చేయుము. శత్రువులను చూర్ణము చేయుము. (24)

టీ॥ అశని విష్పర్షో యేషాం తే విస్ఫులింగాయస్యాస్తస్యాః సంబోధనం హే గదే త్వమజితస్య ప్రియాసి. అహమచ్యుతస్య దాసః అతః కూష్మాండాదీన్నిష్పింఢి నిష్పింఢి సంచూర్ణయ సంచూర్ణయ అరీంశ్చ చూర్ణయ చూర్ణయ. సర్వత్ర వీప్సాతి శీఘ్రుత్వాయ.॥24॥

టీ॥ దేని యందు పిడుగుపాటు స్పర్శ వంటి విస్ఫులింగములు కలవో ఆగద యొక్క సంబోధనము. నీవు పరాజయము లేనివానికి (విష్ణువునకు) ప్రియురాలవు నేను అచ్యుతుని యొక్క దాసుడను. అందుచేత కూశ్మాండాది గణములను చూర్ణము చూర్ణము (పిండి పిండి) చేయుము. శత్రువులను చూర్ణము, చూర్ణము చేయుము. వీప్యా అనగా ద్విరుక్తి . భక్తుని కోరికలు తొందరగా తీర్చుటకై క్రియల యొక్క ద్విరుక్తి చేయబడినది. (నిష్పింఢి, నిష్పింఢి,) చూర్ణము, చూర్ణము అనుపదము రెండుసార్లు చెప్పబడుటచే ద్విరుక్తములు.॥24॥

శ్లో॥ త్వం యాతుధాన ప్రమథ ప్రేత మాతృ
పిశాచ విప్ర గ్రహ ఘోరదృష్టీన్ ।
దరేంద్రవిద్రావయ కృష్ణపూరితో
భీమస్వనోఽరే ర్హృదయాని కమ్పయన్ ॥ (25)

తా॥ కృష్ణునిచే పూరింపబడి, గొప్పనైన ధ్వనితో (భయంకర) శత్రు హృదయములను కంపింపచేయుచున్న శంఖమా! నీవు రాక్షసులను ప్రమథగణములను,ప్రేతములను, మాతృగణములను, పిశాచములను, బ్రహ్మరాక్షసులను, క్రూర దృష్టికల వారిని పారద్రోలుము. (25)

టీ॥ హే దరేంద్ర పాంచ జన్య, త్వం యాతుధానాదీన్విద్రావయ. విప్రగ్రహ బ్రహ్మరాక్షసాః యే అన్యే చ ఘోరదృష్టయః తాన్ ॥25॥

శ్లో॥ త్వం తిగ్మధారాసి వరారిసైన్య
మీశప్రయుక్తో మమ ఛిన్ధి ఛిన్ధి ।
చక్షూంషి చర్మన్ శత చంద్ర ఛాదయ
ద్విషామఘోనాం హర పాప చక్షుషామ్ ॥ (26)

టీ॥ తిగ్మాధారా యస్య హే తిగ్మధార అసివర ఖడ్గ శ్రేష్ఠ, త్వం మమారి సైన్యం ఛిన్ధి ఛిన్ధి. శత చంద్రాకారాణి మండలాని యస్మిన్ హే శత చంద్ర చర్మన్ అఘో నామఘవతాం ద్విషాం చక్షూంసి ఛాదయ, పాప చక్షుషాం చోగ్రదృష్టీనా చక్షూంషి హర. ॥26॥

శ్లో॥ యన్నోభయం గ్రహేభ్యోஉభూత్కేతుభ్యో నృభ్య ఏవ చ ।
సరీసృపేభ్యో దంష్ట్రిభ్యో భూతేభ్యోంஉహోభ్య ఏవ వా ॥ (27)

శ్లో॥ సర్వాప్యేతాని భగవన్నామరూపాస్త్ర కీర్తనాత్ ।
ప్రయాంతు సంక్షయం సద్యో యేనః శ్రేయః ప్రతీపకాః ॥(28)

టీ॥ పాంచజన్యమనెడి ఓ శంఖమా! నీవు యాతుదానాది క్రూర గ్రహములను పారద్రోలుము. ఇతర క్రూర దృష్టిగల వారిని తరిమి వేయుము. ॥25॥

తా॥ పదునుగల గొప్పఖడ్గమా! ఈశ్వరునిచే ప్రయోగింపబడిన నీవు నా శత్రు సైన్యములను ఛేదించుము. శతచంద్రుల పోలిన బుడిపగల ఓ డాలూ! నీవు పాపపు చూపుగల శత్రువుల కన్నులను హరించుము. (26)

టీ॥ దేనికి పదునైన అంచుకలదో అట్టి ఖడ్గ శ్రేష్ఠమా! నీవు నా యొక్క శత్రు సైన్యమును శీఘ్రముగా ఛేదించుము. వంద చంద్రుల ఆకారములు గల మండలము దేని యందు కలదో అట్టి శత చంద్ర చర్మమా! డాలూ! పాపాత్ములైన శత్రువుల కళ్ళను కప్పివేయుము. క్రూర దృష్టి గల వారిని కళ్ళను తొలగించుము. ॥26॥

తా॥ గ్రహములు, తోకచుక్కలు, మనుష్యులు, సరీసృపాలు, కోఱలుగల జంతువులు, భూతములు, పాపులు, సమస్త దుష్ట గణముల వలన మాకు గల భయము భగవానుని నామ రూపములనెడు అస్త్రములను కీర్తించుట వలన తొలగిపోవుగాక! మా శ్రేయో మార్గములకు ఆటంకము కల్పించువారు పూర్తిగా నశించి పోయెదరు గాక! ॥27,28॥

టీ॥ అంహోభ్యః-పాపేభ్యః. ॥27॥

టీ॥ యత్ ఏతేభ్యో భయమ్. శ్రేయః ప్రతీపకాఇష్టవ్యాఘాతకాః॥28॥

టీ॥ వేటివలన భయమో అవి, పాపముల నుండి శ్రేయస్సుల వ్యతిరేకించువారి నుండి. ॥27,28॥

శ్లో॥ గరుడో భగవాన్ స్తోత్ర స్తోభశ్ఛన్దో మయః ప్రభుః ।
రక్షత్వశేష కృచ్ఛ్రేభ్యో విశ్వక్సేనః స్వనామభిః ॥ (29)

తా॥ భగవానుడు, ప్రభువు, సామములచేత కీర్తించబడువాడు వేదరూపుడైన గరుడుడు అన్ని కష్టముల నుండి రక్షించుగాక! విశ్వక్సేనుడు ప్రభువు నామముల చేత రక్షించుగాక! (29)

టీ॥ స్తోత్రాణి బృహద్రథంతరాది సామాని తైః స్తోభ్యతే సంస్తూయత ఇతి స్తోత్ర స్తోభః ఛన్దో మయో వేదమూర్తిః సుపర్ణోసి గరుత్మాన్ ఇత్యాది శ్రుతేః ఏకపద్యపాఠే చ స్తోభాగీతి పూరకాక్షరాణి. సోత్ర స్తోమేతి. సామాధారభూత ఋక్సముదాయః స్తోమః. ॥29॥

టీ॥ బృహత్‌రథంతర మొదలగు సామములే స్తోత్రములు. వీనిచే చక్కగా స్తుతించబడువాడు, స్తోత్రస్తోభుడు, శ్రుతులచేత మంచి రెక్కలు గలవాడు. 'గరుడుడు' ఛందోమయుడు వేదమూర్తిగా చెప్పబడు చున్నాడు. స్తోత్ర స్తోమ అను పాఠమునందు సామములకు ఆధారములైన ఋక్కుల సముదాయము స్తోమముగా చెప్పబడును. స్తోత్ర స్తోభమను దానిని ఒక పదముగా స్వీకరించినచో గీతిని పూర్తి చేయుటకు వాడు అక్షరములు స్తోభములనబడును. ॥29॥

శ్లో॥ సర్వా పద్భ్యో హరేర్నామరూపయానాయుధాని నః ।
బుద్ధీన్ద్రియ మనః ప్రాణాన్పాన్తు పార్షద భూషణాః ॥ (30)

తా॥ శ్రీహరి యొక్క నామ రూపములు, వాహనములు, ఆయుధములు, భగవానుని అనుచర ప్రముఖులు మా యొక్క బుద్ధిని, ఇంద్రియములను, మనస్సును, ప్రాణములను, అన్ని ఆపదల నుండి రక్షించుగాక! (30)

టీ॥ నామాని చ, రూపాణి చ, యానాని చ, వాహనాని ఆయుధాని చ నో బుద్ధ్యాదీన్ పాన్తు. పార్షదభూషణాః పార్షద ముఖ్యాశ్చ పాన్తు.॥30॥

టీ॥ (భగవానుని) రూపములు, నామములు, వాహనములు, ఆయుధములు, మా యొక్క బుద్ధ్యాదులను రక్షించుగాక! అనుచర ముఖ్యులు రక్షించుదురు గాక! ॥30॥

శ్లో॥ యథా హి భగవానేవ వస్తుతః సదసచ్చ యత్ ।
సత్యేనానేన నః సర్వే యాన్తు నాశముపద్రవాః ॥ (31)

తా॥ రూపముగల, రూపములేని సర్వము వాస్తవముగా భగవానుడే! ఈ సత్యము చేత మా ఉపద్రవములన్నియును నశించునుగాక! (31)

టీ॥ సచ్చ అసచ్చ మూర్తామూర్తం యత్తత్సర్వం జగత్. ॥31॥

టీ॥ సత్తు మరియు అసత్తులనబడు, జగత్తంతా వ్యాపించబడిన రూపము గల, రూపములేని సర్వము భగవానుడే. ॥31॥

శ్లో॥ యథైకాత్మ్యాను భావానాం వికల్ప రహితః స్వయమ్ ।
భూషణాయుధ లింగాఖ్యాధత్తే శక్తీః స్వమాయయా ॥ (32)

తా॥ (ఏ విధముగానైతే) ఆత్మానుభవము గల వారికి భేదము లేని వాడైనను(భగవానుడు) స్వయముగా తన మాయ చేత భూషణములను, ఆయుధములను, నామములను, శక్తులను ధరించుచున్నాడు. (32)

టీ॥ ఐకాత్మ్యస్యానుభావోఽను ధ్యానం యేషాం తేషాం. వికల్పో భేదస్తద్రహితోఽపి. ॥32॥

టీ॥ ఐకాత్మ్యానుభావము గల వారికి వికల్పము అనగా భేదము లేకున్నను. ॥32॥

శ్లో॥ తేనైవ సత్యమానేన సర్వజ్ఞో భగవాన్ హరిః ।
పాతు సర్వైః స్వరూపైర్నః సదా సర్వత్ర సర్వగః ॥ (33)

తా॥ ఆ 'సత్యమైన ప్రమాణముచే సర్వజ్ఞుడు, సర్వవ్యాపియు, భగవానుడైన హరి తన అన్ని రూపముల చేత ఎల్లప్పుడూ అంతటా మమ్ములను కాపాడుగాక! (33)

టీ॥ సత్యమానేన సత్యభూతేన ప్రమాణేన. ॥33॥

టీ॥ సత్యమైన (యథార్థమైన) ప్రమాణము చేత. ॥33॥

అవ॥ పునరపి శ్రీ నృసింహ ఏవ ప్రార్థ్యతే – విదిక్ష్వితి.

అవ॥ విదిక్ష్విత్యాది శ్లోకమున నృసింహస్వామినే మరల ప్రార్థించుచున్నాడు.

శ్లో॥ విదిక్షు దిక్షూర్ధ్వమధః సమన్తా
దన్తర్బహిర్భగవాన్ నారసింహః ।
ప్రహాపయన్ ల్లోకభయం స్వనేన
స్వతేజసాగ్రస్త సమస్త తేజాః ॥ (34)

తా॥ సమస్తమైన తేజస్సులను తన తేజస్సుచే మ్రింగిన నృసింహ భగవానుడు మూలలందు, దిక్కులయందు, పైనను, క్రిందను, అన్ని వైపుల యందును, లోపలను, బయటను గల జనముల వలన భయములను, తన నాదముచే (గర్జనచే) తొలగించుచున్నాడు. (34)

టీ॥ పాత్విత్యనుషంగః. యద్వా నారసింహః. ప్రహ్లోదః. స్వనేన శ్రీనృసింహనామగర్జనేన స్వతేజసా స్వప్రభావేణ. గ్రస్తాని సమస్తాని దిగ్గజ విషశస్త్ర జల వాయ్వగ్న్యాదీనాం తేజాంసి ప్రభావా యేన సః ॥34॥

టీ॥ (లేదా) నారసింహుడుగా ప్రహ్లోదును రక్షించిన విధముగా రక్షించుగాక అని అన్వయము. స్వనమనగా నృసింహనామ గర్జనము. దానిచేత రక్షించును. తన తేజస్సు చేత దిగ్గజముల, శస్త్రముల, విషము, నీరు, వాయువు, అగ్ని, మొదలగువాని తేజస్సులను (ప్రభావములను) తిరస్కరించువాడు అని అర్థము. ॥34॥

శ్లో॥ మఘవన్నిదమాఖ్యాతం వర్మ నారాయణాత్మకమ్ ।
విజేష్యస్యఞ్జసా యేన దంశితోఽసురయూథపాన్ ॥ (35)

తా॥ ఓ ఇంద్రుడా! నారాయణరూపమగు ఈ కవచము నీకు చెప్పబడినది. దీనిని ధరించినవాడవై నీవు రాక్షససేనా నాయకులను అనాయాసముగా జయించగలవు. (35)

టీ॥ దంశితః కవచితః. ॥35॥

టీ॥ (నారాయణాత్మక కవచమును) ధరించిన. ॥35॥

శ్లో॥ ఏతద్ధారయమాణస్తు యం యం పశ్యతి చక్షుషా ।
పదా వా సంస్పృశేత్సద్యః సాధ్వసాత్స విముచ్యతే ॥ (36)

తా॥ దీనిని ధరించినవాడు ఎవరిని కంటితో చూచునో లేదా పాదముతో (కాలితో) స్పర్శించునో వాని భయములు వెంటనే తొలగింపబడును.(36)

టీ॥ సోఽపి సాధ్వసాద్భయాద్విముచ్యతే. ॥36॥

టీ॥ వాడు కూడ భయము నుండి విముక్తుడగును.॥36॥

శ్లో॥ న కుతశ్చిద్భయం తస్య విద్యాం ధారయతో భవేత్ ।
రాజదస్యు గ్రహాదిభ్యో వ్యాఘ్రాదిభ్యశ్చ కర్హిచిత్ ॥ (37)

తా॥ ఈ విద్యను ధరించిన వానికి రాజులు, బందిపోట్లు, గ్రహములు, పెద్దపులులు మొదలగువాని నుండి మరిదేని వలననైనను, ఎక్కడైనను ఏ కాలమందైనను భయము కలుగదు. (37)

టీ॥ తస్య తు భయం న భవేదేవ. వ్యాధ్యాదిభ్యః ఇతి పాఠే ॥37॥

టీ॥ వానికి భయమనునదియే యుండదు.వ్యాధ్యాదిభ్యః అను పాఠమున వ్యాధుల వలన భయముండదు అని భావము. ॥37॥

అవ॥ ఏతద్విద్యా ప్రభావమితిహాసేనాహ–ఇమామితి సార్ధైస్త్రిభిః.

అవ॥ ఇమామిత్యాది మూడున్నర శ్లోకముల ద్వారా ఈ విద్యా ప్రభావము ఇతిహాస రూపమున చెప్పబడుచున్నది.

శ్లో॥ ఇమాం విద్యాం పురాకశ్చిత్కౌశికో ధారయన్ ద్విజః ।
యోగ ధారణయా స్వాంగం జహౌ స మరుధన్వని ॥ (38)

తా॥ ఈ విద్యను పూర్వము కౌశికుడను ఒకానొక విప్రుడు ధారణ చేసి యోగాభ్యాసముచే తన శరీరమును నీరులేని ప్రదేశమునందు విడిచి పెట్టెను. (38)

టీ॥ మరుధన్వని నిరుదకేదేశే. అనేన విద్యాయాః క్షేత్ర తీర్థా నపేక్షత్వం దర్శితమ్. ॥38॥

టీ॥ మరుధన్వని అనగా నీరులేని ప్రదేశము–మరుభూమి, ఈ విద్య చేత క్షేత్ర, తీర్థాది దర్శనాదులు అపేక్షితములు కావని చెప్పబడు చున్నది. ॥38॥

శ్లో॥ తస్యోపరి విమానేన గన్ధర్వపతిరేకదా ।
యయౌ చిత్రరథః స్త్రీభిర్వృతో యత్ర ద్విజక్షయః ॥ (39)

తా॥ ఆ తరువాత ఒకప్పుడు గన్ధర్వరాజగు చిత్రరథుడు, తన యువతులతో కలిసి విమానమార్గమున, బ్రాహ్మణుడు క్షీణించిన స్థానముపై నుండి వెళ్ళుచుండెను. (39)

టీ॥ యత్ర ద్విజస్యక్షయో దేహత్యాగస్తస్యోపరి. ॥39॥

టీ॥ ఎక్కడైతే ద్విజుడు దేహ త్యాగము చేసెనో ఆ ప్రదేశము మీదుగా. ॥39॥

శ్లో॥ గగనాన్న్యపతత్సద్యః స విమానో హ్యవాక్శిరాః ।
స వాలఖిల్య వచనా దస్థీన్యాదాయ విస్మితః ।
ప్రాస్య ప్రాచీ సరస్వత్యాం స్నాత్వా ధామ సమన్వగాత్ ॥ (40)

తా॥ వెంటనే అతడు ఆకాశము నుండి విమానముతో సహా తల క్రిందులుగా పడి, ఆశ్చర్యపోయెను. వాలఖిల్య మహర్షుల వచనము–లచే, ఆ అస్థికలను తీసుకొని తూర్పు వైపు ప్రవహించు సరస్వతీ నది యందు కలిపి స్నానమాచరించి, తన లోకమునకు వెళ్ళి పోయెను. (40)

టీ॥ సద్యస్తత్ క్షణాదేవ గగనాన్న్యపతత్ పాఠాన్తరే అంగనాభిః సహ సాంగనోన్నపతత్. వాలఖిల్యోపదేశాత్తస్యాస్థీని ప్రాస్య ప్రక్షిప్య విస్మితః సన్ స్వంధామ గంధర్వలోకం జగామ. ॥40॥

టీ॥ ఆ క్షణముననే ఆకాశమునుండి పడిపోయెను. సాంగనాయను పాఠాంతరమున అంగనలతో కూడినవాడు అని అర్థము. అంగనలతో కూడి పడిపోయెను. వాలఖిల్యుల ఉపదేశముచే ఆద్విజుని అస్థికలను నదియందు కలిపి ఆశ్చర్యముతో తనలోకమైన గంధర్వలోకమునకు వెళ్ళెను. ॥40॥

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ య ఇదం శ్రుణుయాత్కాలే యో ధారయతి చాదృతః ।
తం నమస్యన్తి భూతాని ముచ్యతే సర్వతో భయాత్ ॥ (41)

**శ్రీశుకులువలికిరి**

తా॥ ఎవడైతే దీనిని భయమును పొందిన కాలములో వినునో మరియు ఎవడు ఆదరముతో ధరించునో (ధారణ చేయునో) వానికి భూతములు (ప్రాణులంతా) నమస్కరించును. అన్ని విధముల భయముల నుండి విడువబడును. (41)

టీ॥ కాలే భయాగమ కాలే ॥41॥

టీ॥ భయమును పొందినకాలమందు. ॥41॥

శ్లో॥ ఏతాం విద్యామధిగతో విశ్వరూపాచ్ఛతక్రతుః ।
త్రైలోక్య లక్ష్మీం బుభుజే వినిర్జిత్య మృధేఽసురాన్ ॥ (42)

తా॥ ఈ విద్యను విశ్వరూపుని నుండి శతమఖుడు (ఇంద్రుడు) పొంది, యుద్ధమునందు రాక్షసులను విశేషముగా జయించి, ముల్లోకముల సంపదను అనుభవించెను. (42)

టీ॥ అధిగతః ప్రాప్తః సన్. ॥42॥

టీ॥ పొందినవాడై. ॥42॥

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే అష్టమోఽధ్యాయః**

**శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆఱవ స్కంధమున ఎనిమిదవ అధ్యాయము సమాప్తము.**

## నవమోऽధ్యాయః

అవ॥ నవమే విశ్వరూపే తు హతే శక్రేణ కోపితః. త్వష్ట్రా చోత్పాదితే వృత్రే భీతైర్దేవైర్హరేః స్తుతిః.

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ తస్యాసన్విశ్వరూపస్య శిరాంసి త్రీణి భారత ।
సోమపీథం సురాపీథం మన్నాదమితి శుశ్రుమ ॥ (1)

టీ॥ సోమస్య పీథం పానం యస్మిన్ ఏవం సురాపీథమ్. అన్నమత్తీ త్యన్నాదమ్. అత్ర విశ్వరూపో వై త్వాష్ట్రః పురోహితో దేవానామాసీత్ ఇత్యాది శ్రుతిరనుసంధేయా. ॥1॥

అవ॥ తస్య అసుర పక్షపాతమాహ - స వా ఇతి ద్వాభ్యామ్.

## 9వ అధ్యాయము

అవ॥ తొమ్మిదవ అధ్యాయమున కోపమున ఇంద్రునిచే విశ్వరూపుడు హతమగుట, త్వష్టచే ఉత్పత్తి చేయబడిన వృత్రాసురుని వలన భయము కలిగిన దేవతలు హరిని స్తుతించుట వివరించబడినవి.

**శ్రీశుకులవలికిరి.**

తా॥ ఓ భారత వంశీయుడా! ఆ విశ్వరూపునకు సోమరసమును త్రాగు, సురాపానము చేయు, అన్నమును (ఆహారమును) తిను మూడు శిరస్సులు కలవని వినియుంటిమి. (1)

టీ॥ విశ్వరూపో వై త్వాష్ట్రః పురోహితోదేవానామాసిత్ అను శ్రుతి ననుసరించి త్వష్ట యొక్క సుతుడు విశ్వరూపుడు దేవతలకు పురోహితుడై ఉండెను. ఆ విశ్వరూపునకు సోమపీథమ్ (సోమమును త్రాగునది) సురాపీథమ్ (సురను త్రాగునది) మరియు అన్నాదమ్ (అన్నమును తినునది) అను మూడు శిరస్సులు కలవు. ॥1॥

అవ॥ సవా ఇత్యాది రెండు శ్లోకముల ద్వారా అతని యొక్క అసుర పక్షపాత వైఖరి చెప్పబడుచున్నది.

శ్లో॥ స వై బర్హిషి దేవేభ్యో భాగం ప్రత్యక్ష ముచ్చకైః ।
అవదద్యస్య పితరో దేవాః సప్రశ్రయం నృప ॥ (2)

తా॥ ఓ రాజా! ఆతడు యజ్ఞములయందు తన పితరులైన దేవతల కొఱకు ప్రత్యక్షముగా సవినయముగా బిగ్గరగా హవిర్భాగములను ప్రకటించి, సమర్పించెడివాడు. (2)

టీ॥ ప్రత్యక్షం ప్రకటం యథా భవతి తథా సవినయం దేవేభ్యో హవిర్భాగమింద్రాయేదమగ్నయ ఇదమిత్యుచ్చై రవదత్. అత్ర హేతుః యస్య పితరో దేవాః సః. ॥2॥

టీ॥ సవినయముగా బిగ్గరగా హవిర్భాగములను ఇది ఇంద్రుని కొఱకు, ఇది అగ్ని కొఱకు అని దేవతలకు ప్రకటించెను. దీనికి హేతువు ఎవని యొక్క తండ్రులు దేవతలో వాడే విశ్వరూపుడు. ॥2॥

శ్లో॥ స ఏవ హి దదౌ భాగం పరోక్షమసురాన్ప్రతి ।
యజమానోఽవహ ద్భాగం మాతృ స్నేహవశానుగః ॥ (3)

తా॥ ఆతడే పరోక్షముగా (కనపడకుండగా) తల్లి ప్రేమకువశుడై యజ్ఞము చేయుచు హవిర్భాగములను రాక్షసులనుద్దేశించి అంద చేసెను. ॥3॥

శ్లో॥ తద్దేవ హేలనం తస్య ధర్మాలీకం సురేశ్వరః ।
ఆలక్ష్య తరసా భీతస్తచ్ఛీర్షాణ్యచ్ఛినద్రుషా ॥ (4)

తా॥ అతనికి దేవతలపట్లగల అపహాసమును, ధర్మము యందు కపటమును గమనించిన సురేశ్వరుడైన ఇంద్రుడు భయపడి కోపముతో వేగముగా ఆతని శిరములను ఖండించెను. ॥4॥

శ్లో॥ సోమపీథం తు యత్తస్యశిర ఆసీత్కపిఞ్జలః ।
కలవిఙ్కః సురాపీథమన్నాదం యత్సతిత్తిరిః ॥ (5)

తా॥ అతని సోమపీథ శిరస్సు కపిఞ్జల(కౌజుపిట్ట)గను, సురాపానము చేసే శిరస్సు కలవింకగను (ఊరపిచ్చుకగను), అన్నాద శిరస్సు తిత్తిరి(తీతువు) పిట్టగను మారినవి.(5)

టీ॥ అసురేభ్యస్తు పరోక్షం గుప్తం భాగం దదౌ. తదేవాహ- దేవాన్యజమానో౽సావసురాన్ప్రతి భాగమవహత్ కేనాప్యుపాయేన ప్రాపయామాస యతో మాతృస్నేహ వశేనాసురాననుగచ్ఛతి. ॥3,4,5॥

టీ॥ అసురుల కొఱకు పరోక్షముగా (గుప్తముగా) రహస్యముగా భాగములను ఇచ్చెనను విషయమును చెప్పుచున్నాడు. దేవతలను పూజించుచునే అసురులకు భాగములను ఏదో ఒక ఉపాయముచేత ఇచ్చుచుండెను. మాతృ స్నేహవశమున రాక్షసులకు దాసుడయ్యెను. ॥3,4,5॥

శ్లో॥ బ్రహ్మహత్యామఞ్జలినా జగ్రాహ యదపీశ్వరః ।
సంవత్సరాన్తే తదఘం భూతానాం స విశుద్ధయే ॥ (6)

తా॥ ఈశ్వరుడే అయినను ఇంద్రుడు బ్రహ్మహత్యా దోషమును దోసిలితో పట్టుకొనెను. సంవత్సరాంతమున ఆ పాపము నుండి శుద్ధిని పొందుటకు భూతములకు పంచి ఇచ్చెను. (6)

టీ॥ తాం వారయితుం సమర్థస్తథాపి జగ్రాహ. సంవత్సరం తథైవ స్థిత్వా సంవత్సరాన్తే భూతాక్రోశభీతః సన్ భూతానాం మధ్యే విశుద్ధయే లోకాపవాద పరి హర్తాయ స హరిరింద్రో భూమ్యాదిభ్యస్తదఘం వ్యభజద్వి భజ్య దదావిత్యన్వయః. ॥6॥

టీ॥ ఆ పాపమును నివారించుటలో సమర్థుడే అయినప్పటికిని, లోకాపవాద పరిహారమునకై ఇంద్రుడు ఆ పాపమును భాగములుగా చేసి భూమి మొదలగు వానికి విభజించి పంచెను అని భావము. 6

శ్లో॥ భూమ్యమ్బుద్రుమయోషిద్భ్యశ్చతుర్ధావ్యభజద్ధరిః ।
భూమిస్తురీయం జగ్రాహ ఖాతపూరవరేణ వై ॥ (7)

తా॥ ఆ ఇంద్రుడు భూమి, నీరు, చెట్లు మరియు స్త్రీల కొఱకు బ్రహ్మ హత్యా దోషమును నాలుగు భాగములుగా చేసెను. భూమి పూడ్చబడుటయను వరమును పొంది నాలుగవ భాగమును (1/4) గ్రహించెను. (7)

టీ॥ తురీయం చతుర్థం భాగమ్. ఖాతస్య గర్తస్య పూరః పూరణం తేన వరేణ. యది ఖాత పూరణం స్వత ఏవ భవిష్యతి తర్హి గ్రహీష్యామీత్యేవం భాషాబన్ధేన జగ్రాహేత్యర్థః. ॥7॥

టీ॥ నాలుగవభాగమును (1/4) గొయ్యి (గుంట) పూడ్చబడుటయను వరముచే భూమి గ్రహించెను. భూమియందు త్రవ్వకాల వలన ఏర్పడు గుంటలు, మరల స్వయముగా పూరింపబడునట్లుగా వరమును పొంది పాపమును తీసుకొనెను అని అర్థము. ॥7॥

శ్లో॥ ఈరణం బ్రహ్మహత్యాయా రూపం భూమౌ ప్రదృశ్యతే ।
తుర్యం ఛేద విరోహేణ వరేణ జగ్రుహుర్ద్రుమాః ॥ (8)

తా॥ బ్రహ్మహత్యా దోషము భూమి యందు చవిటినేలగా కనబడు చున్నది. ఛేదించబడిన కొమ్మ తిరిగి చిగురించుట అను వరమును పొంది నాలుగవ (1/4) భాగమును వృక్షాలు స్వీకరించినవి. (8)

టీ॥ ఈరణం ఊషరమ్ అత ఏవోఽషరేఽధ్వనాది నిషిధ్యతే. ఛేదేసతి పునర్విరోహః ప్రరోహోభవత్వితి వరేణ. ॥8॥

టీ॥ చవిటినేల యందు బ్రహ్మహత్యా దోషముండుటచే అధ్యయనాది విషయములు నిషేధించబడినవి. ఛేదించినను తిరిగి చిగురించునట్లు వరమును పొంది వృక్షములు దోషమును స్వీకరించినవి. ॥8॥

శ్లో॥ తేషాం నిర్యాసరూపేణ బ్రహ్మహత్యా ప్రదృశ్యతే ।
శశ్వత్కామవరేణాంహస్తురీయం జగృహుః స్త్రియః ॥ (9)

తా॥ చెట్లయందు జిగురు రూపమున బ్రహ్మహత్యా దోషము కనబడును. అధిక కామము అను వరమును పొంది, ఇంకొక నాలుగవ భాగమును (1/4) స్త్రీలు స్వీకరించిరి. (9)

టీ॥ నిర్యాసరూపేణ బ్రహ్మహత్యాయా దృష్టత్వా నిర్యాసో న భక్ష్యః శశ్వత్కామవరేణ యావత్ప్రసవం గర్భానుపఘాతే నైవ సంభోగ వరేణ. 9

టీ॥ (చెట్లయందు) జిగురు రూపమున బ్రహ్మహత్యా దోషము కనబడుట వలన ఆ జిగురు పదార్థము తినదగినది కాదు. ప్రసవము

వరకు సంభోగము వలన గర్భపాతముకాకుండునట్లు వరమును స్త్రీలు పొందిరి. 9

శో॥ రజోరూపేణ తాస్వంహో మాసి మాసి ప్రదృశ్యతే ।
ద్రవ్యభూయోవరేణా పస్తురీయం జగృహుర్మలమ్ ॥ (10)

తా॥ (స్త్రీల యందు) వారి యందు ప్రతిమాసమున రజోరూపమున ఈ పాపము కనపడును. ద్రవత్వమున వృద్ధి (నీరూరుట) అధికముగా పొందుటయను వరము చేత నీరు (పాపము యొక్క) నాలుగవ భాగమును (1/4) స్వీకరించెను. (10)

టీ॥ రజ ఇతి. అత ఏవ రజోదర్శనే తత్సంగాది నకార్యమ్. ద్రవ్య భూయో వరేణ యస్మిన్ ద్రవ్యే క్షీరాదావాపోమిశ్రా భవేయుస్తస్య భూయస్త్వ మాధిక్యం స్యాదితి వరేణ. యద్వా స్వస్యైవ నిర్ఝరోద్గమాదినా భూయస్త్వవరేణ. ద్రవభూయ ఇతి పాఠేఽప్యయమేవార్థః యద్వా ద్రవ భూయస్త్వం సాంసిద్ధిక ద్రవత్వం తేన వరేణ. అస్య విభాగస్య "విశ్వరూపో వై త్వాష్ట్రః ఇత్యస్యాం శ్రుతావుక్తేః. ॥10॥

టీ॥ రజా ఇత్యాది శ్లోకమున అందుచేత రజోదర్శనమందు స్త్రీలతో సంగ ఇత్యాది కార్యములు, అనగా స్త్రీ సంతోష జనక స్పర్శాది కృత్యములు చేయకూడదు. ద్రవ్యము ఎక్కువగుట అను వరముచేత క్షీరాది ద్రవ్యముల యందు నీరు కలియుట వలన అధిక్యము కలుగు వరముచేత ద్రవభూయ అనుపాఠాంతరమునను ఇదే అర్థము సిద్ధించును. లేదా, తన యందే, నీటి యందు ఊటవలె ఆధిక్యము కలుగునను వరము చేత లేదా సహజ సిద్ధమైన ద్రవముచేత అను వరమున అని భావము. ఈ విభాగము విశ్వరూపుడే త్వాష్ట్రుడు అని శ్రుతుల యందు చెప్పబడుట ఇందుకు ప్రమాణము. ॥10॥

శ్లో॥ తాసు బుద్బుద ఫేనాభ్యాం దృష్టం తద్ధరతి క్షిపన్ ।
హత పుత్రస్తతస్త్వష్టా జుహోవేంద్రాయ శత్రవే ॥ (11)

తా॥ ఆ పాపమే నీటియందు బుడగల రూపమునను, నురగ రూపమునను కనబడును. దానిని తొలగించి నీటిని తీసుకొందురు. తరువాత విశ్వరూపుని తండ్రి త్వష్ట తన పుత్రుని చంపిన ఇంద్రుని వధించుట కొఱకు (ఇంద్రుని శత్రువు) హోమము చేసెను. (11)

టీ॥ తద్విభాగఫలమాహ. తత్పాపం హరతి నిరాకరోతి. కః క్షిపన్ బుద్బుదాది జలాద్బహిః ప్రక్షిపన్నిత్యర్థః. యద్వా క్షిపన్ జలం పాపం హరతి ఆ హరతి గృహ్ణాతీత్యర్థః. అయం చ తస్మాదాపోన పరిచక్ష్యా. ఇత్యాది శ్రుత్యర్థ ఉక్తః. పాఠాంతరే హరి కిల్బిషమింద్ర పాపమ్. ఇంద్రాయేంద్రం హంతుమ్. శత్రవే శతృూత్పత్త్యై. ॥11॥

టీ॥ ఆ విభాగఫలములను చెప్పుచున్నాడు. ఆ పాపమును అనగా బుడగలను, నుఱగను జలము నుండి తొలగించి భూమి యందు ప్రక్షేపించి నీటిని గ్రహించెదరు. లేదా జలమును బయటకు వేయుచు, ఆ పాపమును తొలగించి గ్రహించెదరు. అందుచేత నీరు పరిత్యజించ దగినది కాదు. అనగా మలమును తొలగించి తీసుకొనవలయునది కాని వృథా చేయరాదు అని శ్రుర్థము చెప్పబడినది. హరతి క్షిపన్ అనుటకు బదులుగా హరి కిల్బిషమను పాఠాంతరమున ఇంద్ర పాపమని అర్థము. ఇంద్రుని చంపుట కొఱకు, ఇంద్రుని శత్రువు పుట్టుటకై హోమము చేసెను. 11

శ్లో॥ ఇంద్ర శత్రో వివర్ధస్వ మాచిరం జహి విద్విషమ్ ।
అథాన్వాహార్యపచనాదుత్థితో ఘోర దర్శనః ॥ (12)

తా॥ ఇంద్రునకు శత్రువుడవై వర్ధిల్లుము. శీఘ్రముగా శత్రువును సంహరించుము. అనుచు హోమము చేసెను. తరువాత దక్షిణాగ్ని నుండి భయంకర దర్శనము గలవాడు ఒకడు ఉత్పత్తి అయ్యెను.(12)

టీ॥ తదాహ–ఇంద్రశత్రో వివర్ధస్వేతి. అత్ర చేంద్ర శత్రు పదస్యాద్యు దాత్తత్వాత్ బహువ్రీహౌ ప్రకృత్యా పూర్వపదమ్ ఇతిస్మృతేర్బహువ్రీహి లక్షణాపత్త్యా ఇంద్ర ఏవ తస్య శత్రు రభూత్. తదుక్తం శ్రుత్యా యదబ్రవీత్స్వాహేంద్ర శత్రో వర్ధస్వేతి తస్మాదస్యేంద్రః శత్రురభవత్ ఇతి. తథా చ శిక్షాయామ్. మంత్రోహీనః స్వరతోవర్ణతో వా మిథ్యా ప్రయుక్తోన తమర్థమాహ. సవాగ్వజ్రో యజమానం హినస్తి యథేంద్ర శత్రుః స్వరతోఽపరాధాత్ "ఇతి. అన్వాహార్య పచనాద్దక్షిణాగ్నేః. ॥12॥

శ్లో॥ కృతాంత ఇవ లోకానాం యుగాంత సమయే యథా ।
విశ్వగ్వివర్ధమానం తమిషుమాత్రం దినే దినే ॥ (13)

టీ॥ తంవీక్ష్య విత్రస్తా లోక దిశ దిశో విదుద్రువురితి పంచమే నాన్వయః. కథభూతమ్. విశ్వక్ సమంతత్ ఇషు విక్షేప మాత్రం ప్రతి

టీ॥ ఇంద్రు శత్రో వివర్ధస్వ ఇత్యాది శ్లోకమున శత్రు వృద్ధిని చెప్పు చున్నాడు. ఇంద్రశ్శత్రుపదము ఆద్యుదాత్తము కనుక బహువ్రీహి సమాసము. స్మృతిననుసరించి ఇంద్రశ్శత్రు పదమునకు బహువ్రీహి అని లక్షణము చెప్పవలెను. కావున ఇంద్రుని యొక్క శత్రువా వర్ధిల్లుము అని అర్థము సిద్ధించును. శ్రుతి చేత చెప్పబడినట్లుగా "స్వాహేంద్ర శత్రోవర్ధస్వ" అని వుండుట వలన పుత్రునకు ఇంద్రుడు శత్రువైనాడు. అట్లే శిక్షయందు మంత్రో హీనః స్వరతోవర్ణతో వా మిథ్యా ప్రయుక్తో వా తమర్థమాహ. స్వర లోపముగల లేదా వర్ణ లోపముగల మంత్రము మిథ్యాప్రయుక్తము అనగా అసత్యముగా ప్రయోగించబడినదై "తం"ఆ (ఉద్దిష్టమైన) అర్థమును చెప్పును. అటువంటి వజ్రము వంటి వాక్కు యజమానిని చంపును."స్వరాపరాధముగల ఇంద్ర శత్రు పదము" దీనికి దృష్టాంతము. దక్షిణాగ్ని యందు. ॥12॥

తా॥ అలా పుట్టినవాడు ప్రళయకాలమున లోకములనంతముచేయు యమునివలె దిన దినము (ప్రతిదినము) బాణ ప్రమాణమున అన్ని వైపుల పెరుగు చుండెను. (13)

టీ॥ దీని నుండి ఐదవ శ్లోకముతో అన్వయము చెప్పవలయును. వానిని చూచి, జనులు దశ దిక్కులకు పారిపోవుచుండిరి. వారు

దినమ్ వర్ధమానమ్. ॥13॥

ఎటువంటివాడు, విసిరిన బాణము పోవునంత దూరము ప్రమాణముగా అన్ని వైపుల వాడు పెరుగుచుండెను.॥13॥

శ్లో॥ దగ్ధశైల ప్రతీకాశం సన్ధ్యాభ్రానీక వర్చసమ్ ।
తప్తతామ్ర శిఖాశ్మశ్రుం మధ్యాహ్నార్కోగ్ర లోచనమ్ ॥ (14)

తా॥ తగులబడ్డ పర్వతమువలె నల్లగా, సంధ్యాకాలమందలి మేఘ సమూహముల వంటి కాంతిని, కాలిన రాగి రంగు (పుటము పెట్టబడిన రాగివలె) జుట్టు, మీసములు కలిగి మధ్యాహ్నకాలమందలి సూర్యునితో పోలిన ఉగ్రరూపమైన కన్నులు కలిగి వుండెను. (14)

టీ॥ దగ్ధశైల ప్రతీకాశం కృష్ణ వర్ణమ్. సన్ధ్యాభ్రానీకవద్వర్చో దీప్తిర్యస్య తమ్. తప్త తామ్రవచ్ఛిఖాః శ్మశ్రూణి చ యస్య. మధ్యాహ్నార్కవదుగ్రే లోచనే యస్య. (14)

టీ॥ తగుబడ్డ పర్వతము వంటి నల్లనిరంగు, సంధ్యాకాలమందలి మబ్బులవంటి కాంతిని కలిగి వుండి, కాల్చిన రాగి వంటి ఎఱ్ఱని జుట్టు, మీసములు, మధ్యాహ్నకాలమందలి సూర్యుని వలె ఉగ్రమైన కన్నులు కలిగి వుండెను.॥14॥

శ్లో॥ దేదీప్యమానే త్రిశిఖే శూల ఆరోప్య రోదసీ ।
నృత్యంతమున్నదంతం చ చాలయంతం పదా మహీమ్॥ (15)

తా॥ ప్రకాశవంతమైన మూడు కొనలుగల శూలముతో, భూమ్యాకాశముల ఆరోపించి బిగ్గరగా ధ్వనించుచు నర్తనము చేయుచు పదములతో భూమిని కంపింప చేయుచున్నట్టి. (వాడు) (15)

టీ॥ రోదసీ ఆరోప్యేవేత్యర్థః. ॥15॥

టీ॥ రోదసీ అనగా ఆరోపించి అని అర్థము. ॥15॥

శ్లో॥ దరీగంభీర వక్త్రేణ పిబతా చ నభస్తలమ్ ।
లిహతా జిహ్వయర్క్షాణి గ్రసతా భువన త్రయమ్ ॥ (16)

తా॥ గుహవంటి లోతైన నోటితో ఆవలించుచు, ఆకాశ తలమును త్రాకుచున్నట్లున్న నాలుకతో నక్షత్రములను నాకుచున్నట్లు, భువన త్రయములను మ్రింగుచున్నట్లున్న. (వాడు) (16)

టీ॥ దరీవద్గంభీరేణ వక్త్రేణ ముహుర్ముహుర్జృమ్భమాణమిత్యన్వయః కథంభూతేన. నభస్తలం పిబతా, ఋక్షాణి జిహ్వయా లిహతా, భువన త్రయం గ్రసతా. ॥16॥

టీ॥ దరిగంభీరవక్త్రమున (గుహ వంటి గంభీరమైన నోటితో) మాటి మాటికి ఆవలించుచు, వాడెట్లుండెను? ఆకాశతలమును త్రాగు చున్నట్లు, నక్షత్రములను నాలుకతో నాకుచున్నట్లు, భువన త్రయమును మ్రింగుచున్నట్లు.॥16॥

శ్లో॥ మహతా రౌద్ర దంష్ట్రేణ జృంభమాణం ముహుర్ముహుః ।
విత్రస్తాదుద్రువుర్లోకా వీక్ష్యసర్వేదిశోదశ ॥ (17)

తా॥ గొప్పనైన భయంకరమైన దంతములుగల ముఖముతో మాటి మాటికి ఆవులించుచున్నట్టి వానిని చూచి జనులు తీవ్ర భయముతో పది దిక్కులకు పారిపోయిరి. (17)

టీ॥ మహతా విస్తీర్ణేన. రౌద్రాదంష్ట్రా యస్మిన్. ॥17॥

టీ॥ ఎవని ముఖము యందు విశాలమైన భయంకరమైన దంష్ట్రలు కలవో వానిని చూచి.॥17॥

అవ॥ వృత్రనామ నిర్వక్తి – యేనావృతాఇతి.

అవ॥ యేనావృతా అనుశ్లోకమున వృత్రుడు అనుపేరు ఆ త్వాష్ట్రునకు ఎట్లు కలిగెనో చెప్పుచున్నాడు.

శ్లో॥ యేన వృతా ఇమే లోకాస్తమసా త్వాష్ట్రమూర్తినా ।
స వై వృత్ర ఇతి ప్రోక్తః పాపః పరమదారుణః ॥ (18)

తా॥ ఏ త్వష్ట పుత్రుని చీకటి వంటి నల్లని రూపము చేత ఈ లోకములన్నియు ఆవరించబడెనో పాపియు పరమ క్రూరుడు అయిన ఆ త్వాష్ట్రుడు వృత్రుడు అని పిలువబడెను. (చెప్పబడెను) (18)

టీ॥ త్వాష్ట్రో మూర్తిర్యస్య తమసస్తేన. తథా చ శ్రుతిః. "స ఇమాం ల్లోకానావృణోత్తద్వృత్రస్య వృత్ర త్వమ్" ఇతి. ॥18॥

టీ॥ ఏ చీకటికి త్వాష్ట్రుడు ఆకారమో అట్టి చీకటిచే లోకములను ఆవరించుటయే వృత్రత్వము. అట్లే శ్రుతి కూడ."ఆ వృత్రుని యొక్క వృత్రత్వము ఈ లోకములను ఆవరించినది" అని చెప్పుచున్నది. అందువలన త్వాష్ట్రునకు వృత్రుడు అని నామము కలిగెను.॥18॥

శ్లో॥ తం నిజఘ్నుర భిద్రుత్య సగణా విబుధర్షభాః ।
స్వైః స్వైర్దివ్యాస్త్ర శస్త్రౌఘైః సోఽగ్రసత్తాని కృత్స్నశః ॥ (19)

తా॥ దేవవీరులు వారి వారి దివ్యమైన అస్త్రశస్త్రముల సమూహముచే వానిని గట్టిగా కొట్టిరి. వాడు వాటినన్నిటిని పూర్తిగా మ్రింగివేసెను. 19 .

టీ॥ అగ్రసద్భక్షితవాన్. ॥19॥

టీ॥ మ్రింగివేసెను. (తినివేసెను) ॥19॥

శ్లో॥ తతస్తే విస్మితాః సర్వేవిషణ్ణాగ్రస్తతేజసః ।
ప్రత్యంచమాది పురుషముపతస్థుః సమాహితాః ॥ (20)

తా॥ వారి తేజస్సులు నశించబడుటచే ఆశ్చర్య విషాదములతో కూడిన వారై అందరును ప్రత్యగాత్మ స్వరూపుడైన అంతర్యామిని, ఆదిపురుషుని ఏకాగ్రచిత్తముతో స్తుతించిరి. (20)

టీ॥ గ్రస్తంతేజో యేషామ్. ప్రత్యంచమంతర్యామిణమ్. త్రిభువన స్యతేన వ్యాప్తత్వాత్క్వాపి గమనాసంభవాత్తత్రైవ స్థిత్వా తుష్టువురిత్యర్థః మహాభయ పరిత్రాణామన్యతో న భవేదితి. హరిమేవ ప్రపద్యన్తేసురాః శరణమాతురాః. ॥20॥

టీ॥ ఎవరి యొక్క తేజస్సులు నశింప జేయబడినవో వారు గ్రస్త తేజులు. వారు అంతర్యామిని ముల్లోకముల యందు వ్యాపించి యున్నట్టి వాని యొద్దకు వెళ్ళుట అసంభవమగుటచే అక్కడనే యుండి స్తుతించిరి అని అర్థము. మహాభయమందు ఇతరులెవరి చేత రక్షణము లభింపదు. కావున దేవతలు అనన్యుడైన హరినే శరణువేడిరి. (స్తుతించిరి). ॥20॥

**దేవా ఊచుః**

శ్లో॥ వాయ్వమ్బరాగ్న్యప్ క్షితయస్త్రిలోకా
బ్రహ్మాదయో యే వయముద్విజంతః ।
హరామ యస్మై బలియంతకోఽసౌ
బిభేతి యస్మాదరణం తతో నః ॥ (21)

**దేవతలంవలికిరి.**

తా॥ వాయువు, ఆకాశము, అగ్ని, నీరు, భూమి (పంచభూతములు) ముల్లోకములు, బ్రహ్మ మొదలుకొని దేవతలమైన మేమందరము ఎవనికి భయపడుదుమో, ఎవరి కొఱకు ఆహారమును (ఫలమును) సమర్పించు - దుమో, ఎవనికి మృత్యువు (యముడు) కూడా భయపడునో, ఆతడు (ఆశ్రీహరి) మాకు రక్షణము. (మాకు శరణము) (21)

టీ॥ వాయ్వాదీని పంచమహాభూతాని తైర్నిర్మితా స్త్రయోలోకాస్తేషా మధిపతయో బ్రహ్మాదయశ్చ తలోఽర్వాచీనా వయం చ సర్వే యస్మై అంతకాయ కాలాయోద్విజంతః సంతోబలింహరామ. అసావపి యస్మాద్బిభేతి తతః పరమేశ్వరాదేవ నోఽస్మోకమరణం శరణం రక్షణమస్తు. ॥21॥

టీ॥ వాయువు మున్నగు పంచమహాభూతముల, వానిచే నిర్మితమైన ముల్లోకముల, వాని అధిపతులు అయిన బ్రహ్మాదులు మరియు వారి కన్న పిన్నవారమైన మేమందరము కూడా ఏ కాలమునకు భయపడి ఎవరి కొఱకు బలిని సమర్పించెదమో, ఆ కాలుడు(యముడు) ఎవరికి భయపడునో ఆ పరమేశ్వరుడు మాకు శరణము.(రక్షణము) ॥21॥

శ్లో॥ అవిస్మితం తం పరిపూర్ణకామం
స్వేనైవ లాభేన సమం ప్రశాంతమ్ ।
వినోపసర్పత్యపరం హి బాలిశః
శ్వ లాంగులేనాతి తితిర్తి సింధుమ్ ॥ (22)

టీ॥ తత ఏవేత్యవధారణే హేతుమాహ– అవిస్మితం నిరహంకారం. కుతూహలం శూన్యం వా. కుతః ప్రశాంతం రాగాదిశూన్యమ్. తచ్చ కుతః స్వేనైవ లాభేన పరిపూర్ణకామమ్. తచ్చ కుతః సమముపాధి పరిచ్ఛేదశూన్యమ్. ఏవంభూతం పరమేశ్వరం వినాఽపరం యః శరణార్థముపసర్పతి స బాలిశోఽజ్ఞః. యతోఽసౌ శునో లాంగూలేన పుచ్ఛేన సముద్రమతి తితర్తి అతి తర్తుమిచ్ఛతీత్యర్థః. యథా తేన సముద్రతరణం న భవతి తథా నిరీశ్వరాశ్రయణేన వ్యసనార్ణవతరణం న భవతీతి భావః ॥22॥

తా॥ అహంకారము లేనివాడు, స్వరూపలబ్ధి చేత పూర్ణమైన మనోరథములు కలవాడు, సర్వసముడు, ప్రశాంతచిత్తుడు. (రాగ ద్వేషములు లేనివాడు). అయిన పరమేశ్వరుని కాక మరొకనిని మూర్ఖుడు మాత్రమే శరణుపొందుతాడు. అతడు కుక్క తోక పట్టుకొని సముద్రమును తరించగోరుచున్న వానితో సమానుడు. (కుక్క తోకను పట్టుకొని గోదావరిని ఈదినట్లు.) (22)

టీ॥ పరమేశ్వరునే శరణువేడుటకు హేతువు చెప్పబడుచున్నది. ఎవడు నిరహంకారుడో లేదా కుతూహలము లేనివాడో ఎందుచేత ప్రశాంతుడు ? రాగద్వేష శూన్యత్వముచేత. అది ఎట్లు? స్వరూప లబ్ధిచేత పరిపూర్ణమనోథము కలవాడగుటచేత (ఆనంద స్వరూపము చేత) అదియును ఎట్లు? ఉపాధి పరిచ్ఛేద శూన్యమైన, సముడు అయిన పరమేశ్వరుని కాక మరొకరినిని ఎవడు శరణువేడునో వాడు మూర్ఖుడు. తెలియని వాడు. ఎందుచేతననగా వీడు కుక్క తోక సహాయమున సముద్రమును దాట గోరుచున్నాడు అని భావము. ఏ విధముగనైతే కుక్క తోకతో సముద్రము దాటలేమో అట్లే ఈశ్వరేతరుని ఆశ్రయించుట వలన దుఃఖ సముద్రమును దాటలేము. (సంసారమును తరించలేము అని భావము) 22

అవ॥ మహాభయే స ఏవ రక్షక ఇతి దృష్టమిత్యాహుః – యస్యేతి ద్వాభ్యామ్.

శ్లో॥ యస్యోరు శృంగే జగతీం స్వనావం
మనుర్యథాబధ్య తతార దుర్గమ్ ।
స ఏవ నస్త్వాష్ట్ర భయాద్దురంతాత్త్రాతా
శ్రితాన్వారి చరోఽపి నూనమ్ ॥ (23)

టీ॥ యస్య మహాశృంగే జగతీం పృథ్వీమేవ స్వనావం బద్ధ్వామనుః సత్యవ్రతో యథావద్దుర్గం సంకటమ్. తతార స ఏవ వారిచరో మత్స్యమూర్తిర్నోఽస్మాన్ ప్యాశ్రితాన్సతో నూనం త్రాతా రక్షిష్యతి. (23)

శ్లో॥ పురా స్వయంభూరపి సంయమాంభ
స్యుదీర్ణవాతోర్మిరవైః కరాలే ।
ఏకోఽరవిందాత్పతితస్తతార
తస్మాద్భయాద్యేన స నోఽస్తు పారః ॥ (24)

అవ॥ మహాభయమందు వాడే (ఆ పరమేశ్వరుడే) రక్షకుడు అని చెప్పుటకు "యస్య" ఇత్యాది శ్లోక ద్వయమున వివరించుచున్నాడు.

తా॥ ఎవని యొక్క పెద్ద కొమ్మునందు తన పడవయగు భూమిని కట్టి మనువు మహాభయమును (ప్రళయకాలమందు సముద్రమును) ఏ విధముగా దాటెనో అట్లే ఆ వారిచరుడే (మత్స్యావతార ధారియైన విష్ణువే) శరణువేడిన మమ్ములను కూడ, త్వష్ట్ర సుతుని వలన ఏర్పడిన భయము నుండి నిశ్చయముగా రక్షించగలడు. (23)

టీ॥ ఎవని యొక్క మహాశృంగమునందు పృథ్వియను తన నావను కట్టి సత్యవ్రతుడను మనువు ఏ విధముగా మహా విపత్తు నుండి తరించెనో వాడే ఆ మత్స్యావతారధారియైన విష్ణువే, శరణుజొచ్చిన మమ్ములను కూడా నిశ్చయముగా రక్షించగలడు. ॥23॥

తా॥ పూర్వము పద్మము నుండి జారి ఒంటరివాడైన స్వయంభువు (బహ్మ) కూడ ప్రళయ జలములయందు ప్రచండ వాయువుల చేత పుట్టిన తరంగముల శబ్దముచే మహాభయమును పొందగా, ఎవనిచేత ఆ భయము నుండి తరించెనో అతడే మమ్మును తరింపజేయగలడు. అతడే మాకును ఒడ్డువలె (రక్షకుడు) అగుగాక! (24)

టీ॥ సంయమాంభసి ప్రళయోదకే. ఉదీర్ణైరుద్గతై ర్వాత్త్యైర్యే ఊర్మయ స్తేషాం రవైః కరాలే భయంకరే. అరవిందాన్నాభి కమలాత్పతిత ప్రాయ ఏకోఽ సహాయ ఏవతస్మాద్భయాద్యేన తతార స ఏవ నః – పారస్తారకోఽస్తు. ॥24॥

టీ॥ పెనుగాలులచే పైకెగసిపడు తరంగములుగల భయంకర ప్రళయ జలములయందు, నాభి కమలములో ఉన్నప్పటికి, మోహము చేత దాదాపు జారిపడెనోయన్నట్లున్న బ్రహ్మ, అసహాయుడై భయమును పొందగా, ఆ భయము నుండి ఎవని సాయముచేత తరించెనో, అతడే మమ్ములను కూడ తరింపజేయుగాక! (మాకు తారకుడు అగు గాక)24

అవ॥ కించ వయం భగవతైవ సృష్టాః పాలితాశ్చ బహుశోఽ తస్తమేవ శరణం వ్రజామేత్యాషుః–య ఏక ఇతి త్రిభిః.

అవ॥ య ఏక ఇత్యాది మూడు శ్లోకముల ద్వారా మేము భగవంతునిచే సృష్టించబడినవారము మరియు పాలించబడుచున్నవారము. అందుచేత ఆయననే శరణుజొచ్చెదము అని చెప్పబడుచున్నది.

శ్లో॥ య ఏక ఈశో నిజమాయయా నః
ససర్జయేనాను సృజామ విశ్వమ్ ।
వయం న యస్యాపి పురః సమీహతః
పశ్యామ లింగం పృథగీశమానినః ॥ (25)

తా॥ ఒక్కడే అయిన ఏ ఈశుడు తన నిజమాయచే మమ్ములను సృజించెనో, పిమ్మట మేము ఎవని చేత ఈ విశ్వమును సృష్టించు – చున్నామో, అట్టి మేము భిన్నులము ప్రభువులమను అభిమానముకల వారమై మా ఎదుట ఆయనే లీలలు చేయుచున్నను ఈశుని రూపమును తెలియకున్నాము. (చూడకున్నాము) (25)

టీ॥ యేనానుగృహీతాః సంతో విశ్వంసృజాను. నను యూయమేవ స్రష్టారోనాన్యో యుష్మాకమనుగ్రాహ కోఽస్తి తస్యాదర్శనాత్త త్రాహుః – అస్మత్తః పురః పూర్వమేవాంతర్యామితయా సమీహమానస్యాపి యస్య లింగం రూపం న పశ్యామః. తత్రహేతుః –పృథక్పృథగీశా ఇత్యభి

టీ॥ నీచే అనుగ్రహించబడినవారమై విశ్వమును సృజించుచున్నను, నిశ్చయముగా నీవే సృష్టికర్తవు. నీవుగాక అన్యులెవరు పాలించువారు కారు. మీరే సృష్టికర్తలు. మమ్మనుగ్రహించువారు మరొకరు లేరు కదా యన్నచో సమాధానముచెప్పుచున్నాడు. అతని యొక్క (రూపము)

మానినః. ॥25॥

ఆదర్శమును చెప్పుచున్నాడు. మాకంటే పూర్వమే అంతర్యామిగా యుండి, కోరుచున్నను అతని రూపమును చూడకున్నాము. ఆ ఈశుని నుండి వేరైన ప్రభువులమను అభిమానమే అందుకు కారణము. (చూడలేకున్నాము) ॥25॥

శ్లో॥ యో నః సపత్నైర్భృశమర్ద్య
మానాన్దేవర్షి తిర్యఙ్ నృషు నిత్య ఏవ ।
కృతావతారస్తనుభిః స్వ మాయయా
కృత్వాత్మ సాత్పాతి యుగే యుగే చ ॥ (26)

తా॥ నిత్యుడే (కాలాతీతుడే) అయినను ఎవడు యుగ యుగము లందు తన మాయచేత దేవతలు, ఋషులు, మహర్షులు, పశువులు, మానవులుగా అవతరించి శత్రువులచే పీడింపబడుచున్న మమ్ములను తన వారినిగా చేసి రక్షించుచున్నాడో.... (26)

టీ॥ దేవాదిషూపేంద్ర పరశురామ మత్స్య రామాది తనుభిః కృతావతారః సన్నాత్మసాత్కృత్వా పాతి చ. ॥26॥

టీ॥ దేవాదుల యందు ఉపేంద్రుడుగా, ఋషుల యందు పరశు రాముడుగా, జంతువుల యందు మత్స్యమూర్తిగా మనుష్యుల యందు రాముడుగా వివిధములైన శరీరముల చేత అవతరించి తన వారినిగా చేసుకొని రక్షించుచున్నాడు.॥26॥

శ్లో॥ తమేవ దేవం వయమాత్మ దైవతం
పరం ప్రధానం పురుషం విశ్వమన్యమ్ ।
వ్రజామ సర్వే శరణం శరణ్యం
స్వానాం స నో ధ్యాసతి శం మహాత్మా ॥ (27)

తా॥ జగద్రూపుడు తదతీతుడు, ముఖ్యపురుషుడు, శరణు పొంద తగిన వాడు. మా ఆత్మయగు ఆ దేవదేవుని మేమందరము శరణు పొందెదము. మహాత్ముడు అయిన ఆ దేవుడు మాకు సుఖమును కలిగించగలడు. (27)

టీ॥ ఆత్మభూతమ్ దైవతమ్. కుతః. విశ్వం విశ్వాత్మకమ్. తథాపి వికారం వారయంతి అన్యమ్. విశ్వాత్మేహేతుః - పరం కారణమ్. నను ప్రధానం పురుషశ్చ విశ్వస్య కారణం తత్రాహుః - ప్రధానం పురుషం చ. తదాత్మకోఽపి స ఏవేత్యర్థః. స ఏవ నః శం విధాస్యతి. 27

టీ॥ ఆ ఆత్మయే దైవమనుట యెట్లు? విశ్వాత్మకుడు అయినను వికారములేనివాడు. అన్యుడు అనగా విశ్వమునకు అతీతుడు. విశ్వాత్మయనుటకు హేతువు-పరత్వమే! నిశ్చయముగా విశ్వమునకు ప్రకృతియే కారణము. కాగా ఈశ్వరుడు జగత్కారణమగుట ఎట్లు? అన్నచో ఉపాధాన నిమిత్త కారణత్వములును ఆయనయే (అనుట ఉపనిషత్ప్రమాణసిద్ధము) అతడే మాకు సుఖమును కలిగించగలడు. 27

**శ్రీశుక ఉవాచ.**

శ్లో॥ ఇతి తేషాం మహారాజ సురాణాముపతిష్ఠతామ్ ।
ప్రతీచ్యాం దిశ్య భూదావిః శంఖ చక్ర గదాధరః ॥ (28)

**శ్రీశుకులు వలికిరి.**

తా॥ ఓ మహారాజా! ఆ దేవతలు ఇట్లు స్తుతించుచుండగా పడమర దిక్కునందు (హృదయమునందు) శంఖ, చక్ర, గదాధరుడైన శ్రీహరి వారల హృదయమందు ఆవిర్భవించెను. (28)

టీ॥ ప్రతీచ్యాం దిశి హృది ప్రథమమావిరభూత్. (28)

టీ॥ పడమటి దిక్కునయనగా ప్రథమమున హృదయమునందు ఆవిర్భవించెనని అర్థము. ॥28॥

శ్లో॥ ఆత్మతుల్యైః షోడశభిర్వినా శ్రీవత్సకౌస్తుభౌ ।
పర్యుపాసితమున్నిద్ర శరదంబురుహేక్షణమ్ ॥ (29)

శ్లో॥ దృష్ట్వా తమవనౌ సర్వ ఈక్షణాహ్లాద విక్లవాః ।
దండవత్పతితా రాజన్ శనైరుత్థాయ తుష్టువుః ॥ (30)

తా॥ ఓ రాజా! శ్రీవత్సము కౌస్తుభమును విడిచి తనతో సమానమైన పదునార్గురిచే పరివృతుడై సేవించబడుచున్న. శరత్కాలమందు వికసించిన పద్మముల వంటి కన్నులు కల్గిన వానిని(విష్ణువును) చూచి ఆనందపరవశులై అందరును నేలపై దండమువలె సాష్టాంగ దండ ప్రమాణములాచరించి నిలబడిరి. నెమ్మదిగా లేచి స్తుతించిరి. (29,30)

టీ॥ పునశ్చ తం పురో దృష్ట్వా ఈక్షణాహ్లాదేన వివశా అవనౌ దండవత్పతితాః సంతః శనైరుత్థాయ తుష్టువురిత్యన్వయః. కథంభూతమ్. శ్రీవత్స కౌస్తుభౌ వినా స్వతుల్యైః. షోడశభిః సునందాదిభిః సరితః సేవితమ్.ఉన్నిద్ర శరదంబురుహవదీక్షణే యస్య తమ్. ॥29,30॥

టీ॥ మరల ఎదురుగా చూచి, చూచిన ఆనందముచే వివశులై భూమిపై దండమువలె పడిఉన్నవారై నెమ్మదిగా లేచి స్తుతించిరి అని అన్వయము. ఎట్టి వానిని చూచిరి? శ్రీవత్సము కౌస్తుభము లేకుండగా తనతో సమానమైన సునందాదులైన పదహారుమందితో సేవించబడుచుండగా శరత్కాలమందలి వికసించిన పద్మము వంటి కన్నులుగల వానిని చూచిరి. ॥29,30॥

**దేవా ఊచు**

శ్లో॥ నమస్తే యజ్ఞ వీర్యాయ వయసే ఉతతే నమః ।
నమస్తేహ్యస్త చక్రాయ నమః సుపురుహూతయే ॥31॥

**దేవతలంవలికిరి**

తా॥ యజ్ఞ ఫలమునిచ్చువాని కొఱకు నమస్కారము. కాల స్వరూపునకు నమస్కారము. చక్ర ప్రయోగికి మరియు అనేక శుభ నామములుగల వానికి నమస్కారము.॥31॥

టీ॥ యజ్ఞోవీర్యం స్వర్గాది ఫలజననాయ సామర్థ్యం యస్య తస్మై నమః. వయసే ఉత తత్ఫల పరిచ్ఛేదక కాలాత్మనేఽపి.తద్విధాతకేషు దైత్యేష్వస్తం ప్రక్షిప్తం చక్రం యేన ఏవం భూతైః ప్రభావైః సుపురుహూతయే శోభన బహునామ్నే. ॥31॥

టీ॥ యజ్ఞ ఫలములైన స్వర్గాదులను ఇచ్చు సామర్థ్యము ఎవరికి గలదో వాడు యజ్ఞవీర్యుడు. ఇక్కడ వయశ్శబ్దము కాలవాచకము. ఆ ఫలము లభించు కాలము కూడ పరమాత్ముడే. అట్టి కాల స్వరూపునకు నమస్కారము. యజ్ఞములకు వాని ఫలములకు విఘాతము కల్పించు దైత్యుల యందు ప్రయోగించబడిన చక్రముగల వానికి మరియు అనేక శోభన నామములు కలవానికి నమస్కారము.॥31॥

శ్లో॥ యత్తే గతీనాం తిసృణామీశితుః పరమం పదమ్ ।
నార్వాచీనో విసర్గస్య ధాతర్వేదితుమర్హసి ॥ (32)

తా॥ జీవులు పొందు మూడు గతులను శాసించు నీ యొక్క ఏ ఉత్కృష్టమైన పదముగలదో దానిని సృష్టి తరువాత వచ్చినవాడు తెలియుటకు సమర్థుడు కాడు. ॥32॥

టీ॥ నను మమ గుణాతీతం రూపం విహాయ గుణోపాధికం యజ్ఞవీర్యత్వాది కిమితి వర్ణ్యతే తత్రాహుః- యత్తవ గుణ త్రయ స్యేశితుర్నియంతు స్త్రిగుణాత్మికానాం తిసృణాం గతీనాం పరమం పదం నిర్గుణ స్వరూపం తద్విసర్గస్యార్వాచీన ఇదానీం తనో హే ధాతః వేదితుం నార్హతి. అతః కేవలం తస్మై తే నమోఽస్తు. ॥32॥

టీ॥ నిశ్చయముగా నా యొక్క గుణాతీతరూపమును విడిచి గుణోపాధిగల యజ్ఞ ఫలములనిచ్చు నా రూపమును ఎందుకు వర్ణించుదురు? అన్నచో, ఓ పరమాత్మా! నీ యొక్క గుణ త్రయముచే శాసించబడి త్రిగుణ స్వభావ గతులను పొందే సృష్టి తరువాత ఏర్పడిన వారు నీ పరమ పదమును, నిర్గుణ స్వరూపమును ఎట్లు చెప్పగలరు? చెప్పుటకు సమర్థులు కారు అని భావము. అందుచేత కేవలుడవైన నీ కొఱకు నమస్కారము. ॥32॥

అవ॥ మితాక్షరాణి పద్యాని న మీయన్తే హరేర్గుణాః. ఇతి పద్యైర తుష్యంతః సద్యో గద్యేన తుష్టువుః. భక్త్యుద్రేకేణ బహుధా సంబోధయంతో దుర్జ్ఞేయత్వం ప్రపంచయంతి - భగవన్నిత్యాదినా.

అవ॥ పరిమితమైన అక్షరములుగల పద్యముల చేత హరి గుణములు వర్ణింపబడజాలవు. అని పద్యముల వలన అసంతృప్తిచే వెంటనే భక్తి ఉద్రేకముచేత అనేక విధములుగా స్తుతించుచు (సంబోధించుచు) పరమాత్మ యొక్క దుర్జ్ఞేయత్వమును భగవన్నిత్యాది గద్యముల ద్వారా వివరించుచున్నాడు.

శ్లో॥ ఓం నమస్తేస్తు భగవన్నారాయణ వాసుదేవాది పురుష మహాపురుష మహానుభావ పరమమంగల పరమకల్యాణ పరమ కారుణిక కేవల జగదాధార లోకైకనాథ సర్వేశ్వర లక్ష్మీనాథ పరమహంస పరివ్రాజకైః పరమేణాత్మయోగ సమాధినా పరిభావిత పరిస్ఫుట పారమహంస్య ధర్మేణోద్ఘాటిత తమః కవాటద్వారే చిత్తేఽపావృత ఆత్మలోకే స్వయముపలబ్ధ నిజ సుఖానుభవో భవాన్. ॥33॥ (1)

తా॥ ఓం–హే భగవన్ నారాయణా! నీకు నమస్కారము. వాసుదేవా! ఆదిపురుషా! మహానుభావా! పరమమంగళస్వరూపా! పరమకల్యాణ రూపా! పరమకారుణ్యరూపా! కేవల స్వరూపా (అద్వితీయా!) జగత్తునకు ఆధారమైనవాడా! లోకములకు ఏకైక రక్షకుడవైనవాడా! సర్వమును శాసించువాడా! లక్ష్మీనాథా! నీవే పరమహంస పరివ్రాజకుల సర్వ శ్రేష్ఠమైన ఆత్మనిష్ఠచే సమాధియోగము ద్వారా ఏకాగ్రతగల వారి పరిశుద్ధమైన అంతరంగమందు పరమహంస ధర్మముచే వికసించిన చిత్తమునందు ఆత్మస్వరూపుడవుగా స్వయముగా పొందబడు (ఆత్మ సాక్షాత్కార ప్రకటిత) బ్రహ్మానందమువు. 33 (1)

టీ॥ పరమం మంగలం శుద్ధో ధర్మో యస్మిన్. ఆత్మయోగేనాష్టాంగేన యః సమాధిశ్చిత్తైకాగ్ర్యంతేన పరిభావితః సుశీలితః పరిస్ఫుటో యః పారమహంస్య ధర్మో భగవద్భజనం తేనోద్ఘాటితం తమోరూపం కవాటం యస్మిన్ తస్మిన్ ద్వారభూతే చిత్తే అపావృతే ప్రకటే ఆత్మలోకే ప్రత్యగ్రూపే స్వయమేవోపలబ్ధమభివ్యక్తం యన్నిజసుఖం తదనుభవరూపో భవాన్ ॥33॥ (1)

టీ॥ ఎవని యందు శుద్ధమైన ధర్మము కలదో అతడు పరమ మంగళుడు. ఆత్మయోగముచేత అనగా అష్టాంగ యోగ మార్గమున, సమాధియనగా చిత్తైకాగ్రత ద్వారా పరిశీలించి భగవద్భజనముల ద్వారా తన తమోరూప ద్వారమును తెరచుకొని, ఆత్మలోకమందు స్వయముగా ప్రకటించబడు పరమాత్మను అభివ్యక్తముగా చేసికొని, పొందు నిజ సుఖానుభవము నీ స్వరూపమే. ॥33॥ (1)

అవ॥ నను కేవలానుభవ రూపత్వే మమసృష్ట్యాది కర్తృత్వం కథం తత్రాషః – దురవబోధ ఇతి.

అవ॥ దురవబోధ ఇత్యాది గద్యమున కేవలానుభవ (ఆత్మానుభవ రూపము) గల నా (పరమాత్మ) యొక్క సృష్ట్యాది కర్తృత్వము ఎట్లు అన్నచో చెప్పబడుచున్నది.

శ్లో॥ దురవబోధ ఇవ తవాయం విహార యోగో
యదశరణోఽశరీర ఇదమనవేక్షితా ।
స్మత్సమవాయ ఆత్మనైవా విక్రియమాణేన
సగుణమగుణఃసృజసి పాసి హరసి. (34) ॥2॥

తా॥ నీ ఈ క్రీడించు పద్ధతి (బ్రహ్మానుభవమందు క్రీడించు) తెలియశక్యము కానిది. ఏలననగా నీవు అశరణుడవు, ఆశ్రయము లేని వాడవు, అశరీరుడవు, ఎవరి సహాయాన్ని ఆశించనివాడవు, నిర్గుణుడవయ్యు వికారములు పొందని, స్వరూపముగనే గుణములతో కూడినదైన ఈ జగత్తును సృజించి, పాలించి, లయించుచున్నావు.(34)

శ్రీ॥ దురవబోధ ఇవ తవాయం విహార యోగో యద్య స్మాదశరణో నిరాశ్రయః. ఇదం విశ్వమ్. అన వేక్షితోఽస్మాకం సమవాయో మేలనం సాహాయ్యం యేన సః. ॥34॥(2)

టీ॥ ఇది తెలియశక్యముకానిది. నీ ఈ విహారయోగం(క్రీడ) మా యందు ఆశ్రయము లేనిది. మా సహాయ్యమును అపేక్షింపకయే ఈ విశ్వమును సృజించినావు. ॥34॥ (2)

అవ॥ దుర్జ్ఞేయాన్తర మాహుః - అథ తత్రేతి.

అవ॥ అథ తత్రేతి గద్యమున తెలియగరాని పరమాత్మ యొక్క మరొక దుర్జ్ఞేయాంశము చెప్పబడుచున్నది.

శ్లో॥ అథ తత్రభవాన్కిం దేవదత్తవదిహగుణ విసర్గ
పతితః పారతన్త్ర్యేణ స్వకృత కుశలాకుశలమ్ ।
ఫలముపాదదాత్యాహోస్విదాత్మారామ ఉపశమశీలః
సమఞ్జసదర్శన ఉదాస్త ఇతి హ వావ న విదామః ॥ (35)(3)

తా॥ మరియు నీవు దేవదత్తునివలె (ప్రాకృత జీవివలె) (దైవముచే ఈయబడిన వానివలె) గుణవిసర్గమున (త్రిగుణ కార్యకమైన దేహాదుల యందు) పరాధీనుడవై స్వయంకృత పాప పుణ్యములను స్వీకరించు చున్నావా! ఏమి? అట్లుగాక ఆత్మారాముడవై (ఆత్మయందే రమించు వాడవై) శాంతస్వభావుడవై, సమ్యగ్దర్శనముగలవాడవై ఉదాసీనుడవుగా-నున్నావా? (సాక్షిగా ఉన్నావా) అని మేము తెలియక పోవుచున్నాము. 35

టీ॥ యథేహ దేవదత్తో గృహాది నిర్మాయ తత్ర స్వకృత శుభాశుభయోః ఫలం ఉపాదత్తే ఏవం భవాన్ బ్రహ్మస్వరూపో జీవరూపేణ గుణ విసర్గే పతితః సన్నుపాదదాతి. యద్వా సమఞ్జసమప్రచ్యుతం దర్శనం చిచ్ఛక్తిర్యస్య స భవానుదాస్తే ఉదాసీనః సాక్షితయా వర్తత ఇతి. ॥35॥(3)

టీ॥ ఈ ప్రపంచమున ప్రాకృత జీవుడు గృహాదికమయిన ఆశ్రయమును నిర్మించుకొని అక్కడ స్వయంకృత శుభాశుభకర్మల ఫలములను అనుభవించునటుల, నీవు బ్రహ్మస్వరూపుడవయ్యును జీవుడవుగా, గుణత్రయ విసర్గమున దేవ, అసుర రాక్షసాది పరస్పరము కలహించుకొను రూపుల యందు ఫలములను అనుభవించుచున్నావు. లేనిచో సమ్యగ్దర్శనముగల చిచ్ఛక్తి ఎవరి యందు కలదో దాని రూపమున నీవు ఉదాసీనుడవుగా (సాక్షివలె) వర్తించుచున్నావు.॥35॥

అవ॥ తదేవం విరోధేన దుర్జ్ఞేయత్వముక్త్వా తత్పరిహారేణ జ్ఞాన ప్రకారమాహుః - నహీతి.

అవ॥ నహీతి గద్యమున ఆ విధముగా విరుద్ధములైన సగుణ నిర్గుణముల చెప్పి జ్ఞానమార్గమున వానికి పరిహారము చెప్పుచున్నాడు.

శ్లో॥ న హి విరోధ ఉభయం భగవత్యపరిగణిత గుణగణ ఈశ్వరేఽనవ గాహ్యమాహాత్మ్యేఽర్వాచీన వికల్ప వితర్క విచార ప్రమాణాభాస కుతర్కశాస్త్ర కలిలాంతః కరణాశ్రయ దురవగ్రహ వాదినాం వివాదానవసర ఉపరత సమస్త మాయామయే కేవల ఏవాత్మ మాయా మంతర్ధాయ కోన్వర్థో దుర్ఘట ఇవభవతి స్వరూపద్వయాభావాత్ ॥36॥(4)

తా॥ లెక్కపెట్టలేని గుణముల సమూహములు కలవాడైనట్టి, తెలియశక్యముకాని మాహాత్మ్యముకల, సర్వమును శాసించునట్టి, భగవంతుని విషయమున వికల్పములు, వితర్కములు, విచారములు ప్రమాణములుగా కనపడు అప్రమాణములైన కుతర్క శాస్త్రములచే ప్రమాణాభాసములచే కలుషితమైన అంతఃకరణములచే దురవగ్రహ-ముతో అర్థముకాని రీతిలో వాదించు వారికి కలిగే సార్థకత ఏమి? వివాదావసరములేని తిరస్కరించబడిన సమస్త ప్రపంచముకల, కేవలస్వరూపుడైన భగవంతునియందు సగుణత్వ, నిర్గుణత్వములు

అను రెండింటికి విరోధములేదు. స్వరూపమందు ద్వైతభావము లేకున్నచో నీ మాయా శక్తి ఆధారముగా ఘటిల్లనిది ఏముండును! (అన్న ఘటించుననని భావము)॥36॥ (4)

టీ॥ విరుధ్యత ఇతి విరోధః. ఉభయం న విరుద్ధమిత్యర్థః. నహ్యన్య దృష్టాంతేన త్వయి వికల్పోయుజ్యతేఽ తర్క్యైశ్వర్యత్వాదిత్యాహుః– భగవతీతి. అపరిమితా గుణగణా యస్య తస్మిన్నీశ్వరే స్వతంత్రేఽ నవగాహ్యమతర్క్యం మాహాత్మ్యం యస్య తస్మిన్. వికల్ప ఏవం ఏవం వేతి, వితర్కః కిమత్ర యుక్తమితి, విచార ఇత్థమేవేతి. తత్ర ప్రమాణాభాసాస్తదనుగ్రాహకాః. కుతర్కాశ్చార్వాచీనా వస్తు స్వరూపా సంస్పర్శినో యే వికల్పాదయస్తే యేషు శాస్త్రేషు తైః కలిలం వ్యాకుల మంతఃకరణమాశ్రయో యస్య దురవగ్రహస్య తేన వాదినాం వివాద స్యానవసరేఽ గోచరే. నను శ్రద్ధా మాత్రమేతత్, యుక్తి రుచ్యతాం తత్రాహుః– ఉపరతో మాయామయః సంసారో యస్మింస్తస్మిన్కేవలే ఽ స్యాత్మమాయాం మధ్యే నిధాయ కోన్వర్థః కర్తృత్వాదిర్నసంభవతి. యది వస్తుతః కర్తృత్వాది భవేత్తర్హి విరోధః స్యాన్నతు తదస్తీత్యాహుః – స్వరూపద్వయాభావాదితి. ॥36॥ (4)

టీ॥ భగవానుని సగుణత్వ నిర్గుణత్వములు విరోధములుకావు. అన్య (పరమాత్మకు భిన్నమైనసాంసారికధర్మి యొక్క) దృష్టాంతముచేత తర్కములకందని ఐశ్వర్యములవాడు కావున భగవంతునియందు గుణములుండవను వికల్పముకుదరదు. ఎవనియందు అపరిమితమైన గుణముల సమూహము కలదో ఆ స్వతంత్రుడైన ఈశ్వరునియందు, ఎవరి మహాత్మ్యము తర్కములకందదో ఇట్లు ఇట్లుయని వికల్పించరాని వితర్కములకందని ఇక్కడ ఏది యుక్తమని వితర్కించని ఇట్లేయను విచారింపరాని ఇట్లు వితర్క, వికల్ప, విచారములకు ప్రమాణములు అని భావించబడిన ప్రమాణాభాసములు కుతర్కములు. అర్వాచీన వస్తువు స్పృశించని ఏ వికల్పాదులు ఉన్నవో వాటిచేత కలుషితమైన అంతఃకరణమునాశ్రయించిన వారి వివాదములకు అందని (అగోచరమైన) అనవసర విషయ వాదనము చేయుదురు. దానిని అంగీకరించుట విశ్వాసము మాత్రమేయగును. నిశ్చయముగా శ్రద్ధా మాత్రమున కావలసినది యుక్తి మాత్రమే. దానిని చెప్పవలెను కదా! అన్నచో–శమించినసంసారముగల కేవలునియందు ఆత్మమాయను

శ్లో॥ సమ విషమ మతీనాం మతమనుసరసి యథా
రజ్జుఖండః సర్పాదిధియామ్ ॥ (37) (5)

టీ॥ అనుగ్రహ నిగ్రహాదికం తు తత్తన్మతి భేదేన త్వన్మాయయా త్వయి స్ఫురతీత్యాహుః- సమా విషమా చ మతిర్యేషాం తేషాం మతమభిప్రాయమ్. సర్పాది విషయా ధీర్యేషాం తేషాం యథా రజ్జు ఖండస్తథా తథా భాతి. యద్వా తమేవా విరోధం పురుషమతి భేదేన దర్శయతి- సమవిషయేతి. ॥37॥ (5)

శ్లో॥ స ఏవ హి పునః సర్వ వస్తుని వస్తు స్వరూపః
సర్వేశ్వరః సకల జగత్కారణ భూతః సర్వ
ప్రత్యగాత్మ త్వాత్సర్వ గుణా భాసోపలక్షిత
ఏక ఏవ పర్యవశేషితః ॥38॥(6)

మధ్య యుంచినచో తనకేమి ప్రయోజనము సంభవించును. కర్తృత్వా దులు సంభవించవు. ఒకవేళ నిజముగా కర్తృత్వాది విషయములున్నచో విరోధము కలిగెడిది కాని విరోధములేదు. అన్నచో స్వరూప ద్వయము లేదు కదా. ॥36॥ (4)

తా॥ త్రాటిముక్క యందు సర్పాది బుద్ధులు కలుగునట్లు నీవు సమ విషమ బుద్ధుల మతములననుసరించుచున్నావు. ॥37॥ (5)

టీ॥ అనుగ్రహ నిగ్రహాదికములు మాత్రము వారివారి బుద్ధి భేదముల ననుసరించి నీ మాయచేత స్ఫురించునని చెప్పుదురు. సమము, విషమముఅగు మతి ఎవరికో వారు సమ విషమ మతములు. సర్పాది ధియామ్- సర్పము మొదలైన బుద్ధులు ఎవరికో వారికి రజ్జు ఖండము అట్లే భాసించును. లేదా పురుషమతి భేదము ననుసరించి ఆ విరోధమునే మరొక విధముగా కనిపించుచున్నది. ॥37॥ (5)

తా॥ సర్వేశ్వరుడే సకల జగత్తుకు కారణములగు పంచమహా భూతములకు కారణమై సకల ప్రాణులలో, సర్వ వస్తువులలో (అంతర్యామిగా) భాసించినను గుణ కార్యములుగా సర్వేంద్రియ ప్రకాశముచే గుర్తించబడి ఒక్కడుగానే మిగిలియుండును. (38)

టీ॥ తదేవం విరోధం పరిహృత్య నిశ్చితం పరమార్థమాహుః – స ఏవ హి నానారూపేణ ప్రతీతః. వస్తు స్వరూపః సద్రూపః. సర్వేషాం గుణానాం వియాణామాభాసైః ప్రకాశైరుపలక్షితః. ననుతైర్జీవ ఏవోప లక్ష్యతే, న. సర్వ ప్రత్యగాత్మత్వాత్సర్వ జీవాంతర్యామిత్వాత్ . జడతాదాత్మ్యాధ్యాసేన జీవస్యాపి జడప్రాయత్వాన్నతేన వినా ప్రకాశ ఇతి భావః. పర్యవశేషితో. 'నేతినేతి' ఇత్యాది శ్రుతిభిః. ॥38॥ (6)

టీ॥ విరోధమును పరిహరించి నిశ్చితమైన పరమార్థమును చెప్పు చున్నాడు. ఆ సర్వేశ్వరుడే అనేక రూపములచేత భాసించుచున్నాడు. సద్రూపుడై అన్ని విషయ గుణముల ప్రకాశములచే గుర్తింపబడినవాడు, ఇంద్రియముల చేత జీవుడే గుర్తింపబడినాడు అనినచో అట్లుకాదు. సర్వుల ప్రత్యగాత్మగా అంతర్యామియగుటచేతను, సర్వజీవులకు అంతర్యామియగుటచేతను, జడవస్తువులవలె జీవుడు కూడ ప్రకాశించబడును. పరమాత్మ కారణముగా జడతాదాత్మ అధ్యాసము చేత జీవుడును జడప్రాయుడే పరమాత్మలేక ప్రకాశమేలేదు. మిగిలిన ఆ పరమాత్మ ఇది కాదు, ఇది కాదు అని శ్రుతి. ॥38॥ (6)

(సర్వప్రాణుల యందు అంతర్గతమైన ఆత్మస్వరూపముగా, గుణకార్య ములగు ఇన్ద్రియములను ప్రకాశింపజేయుచున్నాడు. కార్య ప్రపంచమును నిషేధించగా పరమాత్మయే భిన్నము కాక, మిగిలి యుండు వాడు అని భావము.)

అవ॥ అతస్త్వద్భక్తిరేవ పరమ పురుషార్థ ఇత్యాహుః – అథ హేత్యాది పర్యావర్త ఇత్యన్తేన.

అవ॥ అథహ అని ప్రారంభింపబడి పర్యావర్తః అని ముగింపబడిన గద్యమునందు. అందుచేత నీ యందు (పరమాత్మ యందు) భక్తియే పరమపురుషార్థము అని చెప్పబడుచున్నది.

శ్లో॥ అథ హవావ తవ మహిమామృత రస సముద్ర విప్రుషా సకృదవ లీఢయా స్వమనసి నిష్యన్దమానానవరత సుఖేన విస్మారిత దృష్ట శ్రుత విషయ సుఖ లేశా భాసాః పరమభాగవతా ఏకాన్తినో భగవతి సర్వభూత ప్రియ సుహృది సర్వాత్మని నితరాం నిరన్తరం నిర్వృత మనసః కథముహవా ఏతే మధు మథన పునః స్వార్థ కుశలాహ్యాత్మ ప్రియ సుహృదః సాధవత్స్వచ్చరణామ్బుజానుసేవాం విసృజన్తి యత్ర పునరయం సంసార పర్యావర్తః. ॥39॥ (7)

తా॥ ఓ మధుమథనా! నీ మహిమ అనెడి అమృతరస సముద్ర బిందువును ఒకసారి గ్రోలగా, తమ మనస్సునందు జాలువారు అఖండానందముచే మరచిన ఇంద్రియ సుఖానులేశాభాసముగల ఏకాంత భక్తులు సకల ప్రాణుల ఆత్మస్వరూప హితకారుడైన భగవానుని యందు ప్రతి క్షణము నిలిచియున్న మనస్సుగలవారై, ఆత్మయే ప్రియమైనదిగా, హితమైనదిగా స్వార్థప్రయోజనము నందు (ఆత్మోద్ధారణయే పరమ ప్రయోజనముగా భావించువారు) కుశలురు అయిన సాధకులు, పరమభాగవతులు మరల మరల సంసార పరివర్తనములేని నీ పాదపద్మముల సేవనెట్లు విడచెదరు? విడువరని భావము. ॥39॥ (7)

టీ॥ యస్మాదేవం భూతస్త్వం పరమేశ్వరః. అథ హ వావ అత ఏవ హి. హే మధుమథన, పరమభాగవతా ఏతే త్వత్పాదామ్భోజానుసేవాం కథం ముహుర్ముహుర్విసృజన్తీత్యన్వయః. హి యస్మాత్స్వార్థే పురుషార్థే కుశలా నిపుణాః. అత ఏవ ఆత్మా త్వమేవ ప్రియః సుహృచ్చ యేషాం తే సాధవో రాగాది శూన్యాః. తత్ర హేతుః – తవ మహిమైవామృత రస సముద్రస్య విప్రుషా బిన్దు మాత్రేణ సకృదవలీఢయా ఆస్వాదితయా స్వమనసి నిష్యన్దమానమతిశయేన స్రవద్యన్నిరన్తరం సుఖం తేన విస్మారితా దృష్ట శ్రుత విషయాః సుఖ లేశాభాసా యేషాం తే. అత

టీ॥ (దేనినుండి ఇటువంటిది (జగత్తు) ఏర్పడుచున్నదో) ఆ నీవే పరమేశ్వరుడవు. ఎందువలన పరమేశ్వరుడవైన నీవు ఇటువంటి వాడవో అందువలన ఓ మధుమథనా! పరమభాగవతులు అయిన వీరు నీ పాదపద్మ సేవను ఎట్లు విడిచెదరు? (విడువరని భావము) ఏలననగా పరమ పురుషార్థ ప్రయోజనమునందు (ఆత్మ జ్ఞానము నొందుటయే పరమ పురుషార్థము) నైపుణ్యముగలవారు ఆత్మయే ప్రియుడు, స్నేహితుడు అని తెలిసిన, రాగాది శూన్యులైన సాధకులు నీ మహిమయను రస సముద్రము యొక్క బిందువు మాత్రమును

ఏవ భగవతి త్వయి నితరాం నిరంతరం నిర్వృతం చ మనో యేషాం తే యత్ర యస్యామనుసేవాయాం సత్యామ్. ॥39॥7

గ్రోలుటచే వారి మనస్సులందు కన్న, విన్న విషయముల ద్వారా పొందు భోగములు మరచినవారై నిరంతరసుఖము పొందుదురు. అందుచేతనే భగవానుడవైన నీ యందు నిరంతర సేవాభావమును (నీ సేవా భావమును) కాంక్షించుదురు. ॥39॥ (7)

అవ॥ ప్రస్తుతం విజ్ఞాపయన్తి – త్రిభువనేత్యాదినా యావత్సమాప్తిః.

అవ॥ త్రిభువననేత్యాది గద్యము నుండి చివరి వరకుగల గద్య భాగ మందు ప్రస్తుతమున త్వాష్ట్ర వధను గూర్చి విన్నవించుకొనుచున్నారు.

శ్లో॥ త్రిభువనాత్మభవన త్రివిక్రమ త్రినయన త్రిలోక మనోహరాను భావ తవైవ విభూతయో దితిజదనుజాదయశ్చాపి తేషామనుపక్రమ సమయోఽయమితిస్వాత్మ మాయయా సుర నర మృగ మిశ్రిత జలచరాకృతిభిర్యథాపరాధం దండం దండధర దధర్థ ఏవమేనమపి భగవన్ జహిత్వాష్ట్రముత యది మన్యసే. ॥40॥(8)

తా॥ ముల్లోకములు నివాసస్థానముగా కలవాడా! త్రివిక్రముడా! మూడు కన్నులు కలవాడా! (ముక్కంటి) ముల్లోకముల మనస్సుల హరించు మహత్త్వము కలవాడా! హే భగవన్ ! దణ్డధరా! దితి సుతులు, దనువు సుతులు మొదలగు రాక్షసులు కూడ నీ యొక్క విభూతులే అయినను వారికి ఉద్యమించుకాలము (అభివృద్ధికాలము) కాదని నీ మాయచే దేవతల, మానవుల, జంతువుల, నర మృగముల కలయికగల జలచరముల రూపములచే వారి అపరాధములకు తగినట్లుగా శిక్షలు విధించితివి. ఇదే విధంగా నీవు ఇష్టపడినచో ఈ త్వష్ట పుత్రుని కూడ సంహరింపుము. ॥40॥ (8)

టీ॥ త్రిభువనమాత్మా స్వరూపం భవనం చ యస్య. త్రిభువనస్యాత్మా భవనం చేతి వా. త్రయో విక్రమా యస్య. త్రీన్‌లోకాన్నయతీతి తథా త్రయాణాం లోకానాం మనోహరోఽనుభావో యస్య. ఏవం చతుర్ధా సంబోధ్యాహుః- తేషామనుపక్రమ సమయ ఉద్యమకాలో న భవతీతిమత్వా హే దండధర పూర్వం యథా దండం దధర్థ ధృత వా నస్యేవమేనం త్వాష్ట్రమపి జహి, యది మన్యసే హంతుం యదీచ్ఛసి. (40) (8)

టీ॥ త్రిభువనమే ఆత్మ స్వరూపముగను మరియు భవనముగను కలవాడా! త్రిభువనములకు ఆత్మయు, నివాసమును అయినవాడా! లేదా ముల్లోకములే ఆత్మస్థానమైనవాడా! మూడు అడుగులతో ముల్లోకముల నిండినవాడా! త్రిభువనముల నడిపించువాడా! త్రిలోక వాసుల మనస్సును హరించు మహత్త్వము కలవాడా! అని నాలుగు విధములుగా సంబోధించి వారి యొక్క (రాక్షసుల) ఉద్యమకాలము కాదని పూర్వము ఏ విధముగా దండించితివో అట్లే నీకు చంప నిష్టమైనచో ఈ త్వాష్ట్రుని కూడ సంహరింపుము. ॥40॥ (8)

శ్లో॥ అస్మాకం తావకానాం పితః పితామహ తవ చరణ నలిన యుగల ధ్యానానుబద్ధ హృదయ నిగలానాం స్వలింగ వివరణేనాత్మ సాత్కృతానామనుకంపానురంజిత విశద రుచిర శిశిర స్మితావ లోకేన విగళిత మధుర ముఖ రసామృత కలయా చాంతస్తాపమనుఘార్హసి శమయితుమ్. ॥41॥ (9)

తా॥ ఓ తండ్రీ! ఓ పితామహా(తాతా)! కర్తృత్వాది వాసనా రూప దోషము లేని వాడా! నీ వారమైనట్టి, నీకు నమస్కరించునట్టి, నీ పాదపద్మముల ధ్యానమనెడి గొలుసుచే బంధింపబడిన మా హృదయము నందు నీ మూర్తిని ప్రకటించుటచే నీ వారినిగా స్వీకరించిన మా యొక్క అంతరంగమునందలి తాపమును దయతో అనురాగముతో కూడిన మధురమైన వాక్కు అనెడి అమృత బిందువుచే శమింపచేయుటకు నీవే తగినవాడవు. ॥41॥ (9)

టీ॥ ప్రథమం తావత్త్వదీయానా మస్మాకం అంతస్తాపం శమయితు మర్హసి. తావకానామిత్యత్ర హేతు :- హే పితః హే పితామహ, తవ

టీ॥ (మొదట) నీవారమైన మా యొక్క మనస్తాపమును శమింప చేయుటకు తగినవాడవు. నీవారమనుటకు హేతువు చెప్పుచున్నాడు.

చరణ నలిన యుగల ధ్యానేనైవానుబద్ధో హృదయే నిగడః శృంఖలా యేషామ్. స్వలింగ వివరణేన నిజమూర్తి ప్రకటనేన స్వీకృతానామ్. కేన. అనుకంపయానురంజితం సానురాగం చ తద్విశదం రుచిరం శిశిరం చ స్మితం తత్సహితేనావలోకేన. తథానుకంపయైవ విగలితో మధురే ముఖరసః ప్రియవాక్ స ఏవామృతకలా తయా చ.॥41॥ (9)

ఓ తండ్రీ! ఓ పితామహా! నీ చరణపద్మముల ధ్యానమనెడి గొలుసుచే బంధింప బడిన హృదయమందు నీ నిజమూర్తి ప్రకటింపబడుట వలన నీవారము ఎట్లు? (దేనివలన?) దయతోను, అనురాగముతోను కూడిన నిర్మలమైన సుందరమైన చిరునవ్వుతో కూడిన చూపులతో అట్లే నిర్మలమైన మధురమైన ప్రేమ వాక్కులనెడి అమృత బిందువులతో ॥41॥ (9)

శ్లో॥ అథ భగవంస్తవాస్మాభిరఖిల జగదుత్పత్తి స్థితి లయ నిమిత్తాయ మాన దివ్యమాయా వినోదస్య సకల జీవనికాయానామంతర్హృదయేషు బహిరపి చ బ్రహ్మ ప్రత్యగాత్మ స్వరూపేణ ప్రధానరూపేణ చ యథా దేశకాల దేహావస్థాన విశేషం తదుపాదానోపలంభకతయాను భవతః సర్వప్రత్యయ సాక్షిణ ఆకాశశరీరస్య సాక్షాత్పరబ్రహ్మణః పరమాత్మనః కియానిహ వా అర్థ విశేషో విజ్ఞాపనీయః స్యాద్విస్ఫులింగాదిభిరివ హిరణ్యరేతసః. ॥42॥ (10)

తా॥ ఓభగవంతుడా! (కావున) సమస్తజగత్తుయొక్క సృష్టి, స్థితి, లయ నిమిత్తమగుచున్న అంతరంగమాయాశక్తిచే వినోదించునట్టియు, సకల ప్రాణిసమూహముల హృదయములందు, అంతరాత్మస్వరూపుడవుగా, బాహ్యమందు ప్రకృతిరూపముగా ప్రకటితమగుచూ, నీవు ఆయా దేశకాలాది (దేహాదులయందు) అవస్థలయందు వాటికి ఉపాధానమగు భోక్తృ చైతన్యస్వరూపముగా ఆయా శక్తులను ప్రకాశింపజేయుచున్నట్టి సకల బుద్ధి ప్రత్యయములసాక్షియైన, ఆకాశ శరీరమువలె నిర్వికారమైన స్వరూపము కలిగినట్టి, సాక్షాత్పరబ్రహ్మమైనట్టి, పరమాత్మవైనట్టి నీకు అగ్నికి మిణుగురులవలె నుండు మేము విశిష్టమగు ప్రయోజనమును ఏమని విన్నవించుకోగలము? (ఏమియులేదనిభావము). ॥42॥ (10)

టీ॥ కించ అస్మదభిప్రాయస్త్వయా జ్ఞాయత ఏవ కిమత్రాస్మాభిర్విజ్ఞాపనీయ మిత్యాహుః- అథ హే భగవన్. తవాస్మాభిరిహ కియాన్స్వార్థవిశేషో విజ్ఞాపనీయః స్యాదిత్యన్వయః యథ హిరణ్యరేతసో ఉగ్నేస్తదంశ భూతై విస్ఫులింగాదిభిః ప్రకాశో న క్రియతే తథా తవాస్మాభిః కార్యార్థ ప్రకాశనం న కార్యమిత్యర్థః. అత్ర హేతుగర్భాణి విశేషణాని. అఖిల జగతాముత్పత్త్యాదిషు నిమిత్తాయమానయా దివ్యమాయయా వినోదో యస్య. అత ఏవ సర్వ జీవనికాయానామంతర్హృదయేషు బ్రహ్మస్వరూపేణ ప్రత్యగాత్మాం తర్యామీతద్రూపేణ చ బహిరపి ప్రధాన రూపేణ దేశకాల దేహావస్థాన విశేషాననుల్లంఘ్యానుభవతః. కథమ్. తేషాముపాదాన తయోపలబ్ధకతయా చ, ఉపాదానస్యోపలంభకత యేతి వా. అత ఏవ సర్వేషాం ప్రత్యయానాం బుద్ధ్యాదీనామపి సాక్షిణః. సాక్షిత్వేహేతుః- ఆకాశ వదలిప్తం శరీరం స్వరూపం యస్య. అలిప్తత్వే హేతు ద్వయమ్, సాక్షాత్పర బ్రహ్మణో నిరుపాధేః పరమాత్మనః శుద్ధ సత్త్వమూర్తేశ్చ. ॥42 (10)

టీ॥ మా అభిప్రాయమును గూర్చి నీకు తెలియును. కావున మాచే ఇంకను చెప్పవలసినది ఏమున్నది? (ఏమియును లేదు) అని చెప్పబడుచున్నది. కావున ఓ భగవంతుడా! మా యొక్క అర్థ ప్రయోజనము గూర్చి చెప్పవలసినది ఏమున్నది? అని అన్వయము. ఏ విధముగానైతే అగ్ని ముందర దాని అంశమైన మిణుగుఱు (అగ్నికణము)లచే ప్రకాశమెట్లేర్పడదో అట్లే మీ ముందు మా యొక్క అర్థవిషయము ఎంతటిది అని అన్వయము. ఇక్కడి విషయములైన హేతు గర్భములు. సమస్త జగత్తు సృష్ట్యాది నిమిత్తమైన దివ్యమాయా వినోదముగల సర్వ ప్రాణుల సమూహమునందు, హృదయములందు, బ్రహ్మస్వరూపముగా అంతర్యామివిగా, అట్లే బాహ్య జగత్తునందు ప్రకృతిగా దేశముకాలము బాల్యాది వివిధ దేహాది అవస్థలను ఉల్లంఘించి, అనుభవించు ఇంద్రియముల ప్రకాశింపజేయుచున్నావు. ఉపాధి హేతువు కారణముగాను అందరి యొక్క బుద్ధ్యాది విషయములకు సాక్షి మాత్రముగా ఉన్నావు. సాక్షిగా ఉన్నావనుటకు హేతువు ఆకాశమువలె అంటని వాడవు. అంటని వాడననుటకు రెండు కారణములు. ఉపాధిలేని పరబ్రహ్మముగా ఉండుట, మఱియు శుద్ధసత్త్వమూర్తివలె ప్రకాశించుట. ॥42॥ (10)

శ్లో॥ అత ఏవ స్వయం తదుపకల్పయాత్మకం భగవతః
పరమ గురోస్తవచరణ శతపలాశచ్ఛాయామ్ ।
వివిధ వృజిన సంసార పరిశ్రమోప శమనీ
ముపసృతానాం వయం యత్కామేనోపసాదితాః. ॥ (43)11

తా॥ కావున పరమగురుడవైన భగవానుడా! నిన్ను శరణు పొందిన వారి వివిధ దుఃఖములతో కూడిన సంసార శ్రమమును ఉపశమింపజేయు నీ పాదపద్మముల నీడను ఏ కోరికతో పొందితిమో దానిని స్వయముగా ప్రసాదించుము. (43) 11

టీ॥ అత ఏవ సర్వజ్ఞత్వాదేవ వయం యత్కామేన యస్య కార్యస్య కామేనోపసాదితాః ప్రాపితాస్తదస్మాకం కార్యం సయమేవోప కల్పయ సంపాదయేతి. చరణమేవ శతపలాశం కమలం తస్య ఛాయాం వివిధైర్వృజినైర్యః సంసార పరిశ్రమస్తస్యోపశమకరీముపసృతానాం ప్రాప్తానామ్. ॥43॥ (11)

టీ॥ నీవు సర్వజ్ఞుడవు కావున అందుచేత మేము ఏ కార్యము నిమిత్తము నిన్ను పొందితిమో, దానిని మాకు స్వయముగా ప్రసాదించు–ము. శరణుపొందిన వారికి నీ చరణములే వంద రేకులు గల కమలము. దాని ఛాయ(నీడ) యందు వివిధ దుఃఖములతో కూడిన సంసారశ్రమ ఉపశమించును. ॥43॥ (11)

శ్లో॥ అథో ఈశ జహి త్వాష్ట్రం గ్రసంతం భువన త్రయమ్ ।
గ్రస్తానియే నః కృష్ణ తేజాంస్యస్త్రాయుధాని చ ॥ (44)

తా॥ అందుచేత ఓ ఈశ్వరా! కృష్ణా! మా తేజస్సులను, అస్త్రములను, ఆయుధములను, లోకములను మ్రింగివేయుచున్నట్టి త్వష్టపుత్రుడైన వృత్రాసురుని సంహరింపుము. ॥44॥

టీ॥ పూర్వం భక్తేరుత్కర్షోక్తేస్తత్కామశంకా మా భూదితి స్వకామం కథయంతి. అథోఽనంతరమేవ. ॥44॥

టీ॥ పూర్వము భక్తి యొక్క ఉత్కర్షను చెప్పుట వలన దానినే కోరుతున్న శంక కాకూడదని అనంతరము తమ కోరికను అనగా వృత్రాసురుని సంహారమునకై విన్నవించారు. ॥44॥

శ్లో॥ హంసాయ దహ్ర నిలయాయ నిరీక్షకాయ
కృష్ణాయ మృష్టయశసే నిరుపక్రమాయ ।
సత్సంగ్రహాయ భవపాంథ నిజాశ్రమాప్తావన్తే
పరీష్ట గతయే హరయే నమస్తే ॥ (45)

తా॥ హంసస్వరూపుడు, హృదయాకాశమందు నివసించువాడు, సర్వసాక్షి, సదా ఆనందస్వరూపుడు, (కృష్ణుని) గొప్పనైన కీర్తికలవాడు, ఉపక్రమములేనట్టి (అనాదియైన) సత్పురుషులచే చక్కగా గ్రహించ బడునట్టి, సంసార మార్గమందలి బాటసారులు శరణు జొచ్చుటచే వారి పాపముల తొలగించునట్టి హరికి నమస్కారము. ॥45॥

టీ॥ శీఘ్రం తద్వధ్వాయ పునః ప్రణమంతి. హంసాయ శుద్ధాయ హరయే ఆర్తిర్హరాయ తే నమః. శుద్ధత్వే హేతవః- దహ్రనిలయాయ హృదయాకాశ నికేతాయ. నిరీక్షకాయ బుద్ధ్యాదిసాక్షిణే. కృష్ణాయ సదానందరూపాయ. కృషిర్భూవాచకః శబ్దోణశ్చ నిర్వృత్తి వాచకః. తయోరైక్యం పరంబ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే. ఇతి నిరుక్తేః. ఆర్తి హరత్వే హేతవః- మృష్టం రుచికరం యశో యస్య నిరుపక్రమాయాది శూన్యాయ. పద్భిః సంగృహ్యాత ఇతి తథా తస్మై. భవపాంథో భవరూపే పథి వర్తమానస్తస్య జనస్య నిరాశ్రమాప్తౌ స్వశరణ ప్రాప్తౌ సత్యాం సంసారస్యాంతే పరీష్టా సర్వతః పూజితా ఉత్తమాగతిః ఫలం యస్తస్మై ॥45॥

టీ॥ వృత్రాసురుని శీఘ్రముగా వధించుట కొఱకు మరల నమస్కరించుచున్నారు. పరమశుద్ధస్వరూపుడవు, ఆర్తిని తొలగించు వాడవగు నీకు నమస్కారము. శుద్ధత్వమునకు హేతువులు (విశేషణములు) ప్రాణుల దహరాకాశమందు అనగా హృదయాకాశ మందు నివసించువాడు. వారి బుద్ధ్యాది ఇంద్రియ వ్యాపారములకు సాక్షియైనవాడు మరియు ఎల్లప్పుడూ ఆనందంలో ఉండువాడు. కృష్ ధాతువు భూ (సత్తా) వాచకము, ణకారము నిర్వృత్తి వాచకము. ఈ రెండింటి కలయిక కృష్ణ శబ్దము పరబ్రహ్మవాచకము అని నిరుక్తి యందు చెప్పబడినది. ఆర్తిని తొలగించువాడనుటకు హేతువు - గొప్పనైన కీర్తికలవాడు అగుట, ఆదిలేనివాడు, సత్పురుషలచే గ్రహించబడువాడు అగుట, సంసారరూప మార్గమందున్న జీవునికి సంసారాంతమందు సర్వత్ర పూజనీయమైన ఉత్తమగతిని అనగా మోక్షమును కలిగించువాడవు. అట్టి నీకు నమస్కారము. 45

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ అథైవమీడితో రాజన్సాదరం త్రిదశైర్హరిః ।
స్వముపస్థానమాకర్ణ్య ప్రాహతానభినందితః ॥ (46)

టీ॥ అభినందితః సంతోషితః ॥46॥

**శ్రీశుకులవారు పలికిరి.**

తా॥ ఓ రాజా! ఈ విధముగా దేవతలచే సాదరముగా స్తుతింపబడిన తరువాత, ఆ హరి స్తోత్రమును విని ప్రసన్నతను పొంది, (సంతోషించిన - వాడై) వారితో నిట్లు పలికెను. (46)

టీ॥ సంతోషపెట్టబడినవాడై. ॥46॥

**శ్రీభగవానువాచ.**

శ్లో॥ ప్రీతోఽహం వః సురశ్రేష్ఠా మదుపస్థాన విద్యయా ।
ఆత్మైశ్వర్యస్మృతిః పుంసాం భక్తిశ్చైవ యయా మయి ॥ (47)

టీ॥ మదీయముపస్థానం స్తోత్రం తత్సహితయా విద్యయా జ్ఞానేన. ఆత్మన్ ఐశ్వర్యమసంసారిత్వం తస్య స్మృతిర్యయా. న హి విరోధ ఉభయమిత్యాదినా కర్తృత్వ భోక్తృత్వాదేర్మాయికత్వోక్తేః. భక్తిశ్చ యయా భవతి. ॥47॥

**శ్రీభగవానుడు పలికెను.**

తా॥ ఓ దేవతోత్తములారా! మీ జ్ఞానముతో కూడిన స్తోత్రముచే సంతోషించితిని. దీని వలన మానవులకు నా యందు భక్తి కలిగి, ఆత్మరూపుడనగు నా ఈశ్వర భావముకూడ స్మృతిలో నుండును.॥47॥

టీ॥ నన్ను గూర్చిన ఈ స్తోత్రము తత్త్వజ్ఞానముతో కూడియున్నది. ఆత్మైశ్వర్యమనగా ఆత్మరూపుడనగు నా ఈశ్వరభావము స్తోత్రము చేయువాని యొక్క స్మృతిలోనికి వచ్చును. పరమేశ్వరుని కర్తృత్వ, భోక్తృత్వములు మాయామయములుగా ఉండుట వలన పరబ్రహ్మ స్వరూపమునకు, ప్రకృతి స్వరూపమునకు, విరోధముండదు. దీనివలన భక్తి కూడ ఏర్పడును. ॥47॥

అవ॥ అథహ భగవన్నిత్యాదినా భక్తేః సర్వోత్కర్షోక్తేర్భక్త మభినందతి–కిమితి.

అవ॥ పిమ్మట కిమిత్యాది శ్లోకమున భగవంతుని సేవించు భక్తుల యొక్క సర్వోత్కర్షమైన భక్తిని అభినందించుచున్నాడు.

శ్లో॥ కిం దురాపం మయి ప్రీతే తథాపి విబుదర్షభాః ।
మయ్యేకాంతమతిర్నాన్యన్మత్తో వాంఛతి తత్త్వవిత్ ॥ (48)

తా॥ ఓ దేవతోత్తములారా! నేను ప్రసన్నుడను అయినప్పుడు(కాగా) పొందశక్యముకానిది ఏముండును? అయినప్పటికి నా యందు ఏకాంత మనస్సుగల తత్త్వజ్ఞుడు నా నుండి భక్తిని తప్ప ఏ ఇతరమును కోరుకొనడు. ॥48॥

అవ॥ యదుక్తం దేవైః స్వయం తదుపకల్పయాస్మాకమిత్యాది తత్సంపాదనం కృపాలోర్మమానుచిత మిత్యాశయేనాహ – న వేదదేతి ద్వాభ్యామ్.

అవ॥ న వేద ఇత్యాది శ్లోక ద్వయమున దేవతలు అడిగిన దానిని తాను స్వయముగా సంపాదించి పెట్టుట తనకు అనుచితము అను ఆశయమును చెప్పుచున్నాడు.

శ్లో॥ న వేద కృపణః శ్రేయ ఆత్మనో గుణ వస్తు దృక్ ।
తస్యతానిచ్ఛతో యచ్ఛేద్యది సోఽపి తథా విధః ॥ (49)

తా॥ వస్తుగుణమయమైన ప్రపంచమందు యథార్థ బుద్ధిగల కృపణుడు(భోగాసక్తిగలవాడు) తన యొక్క హితమును తెలియకున్నాడు. ఆ భోగములను కోరుచున్న వానికి, వానిని ఇచ్చినచో ఆ ఇచ్చువాడు కూడ అట్టివాడే. (కృపణుడే) (అజ్ఞానియే) ॥49॥

టీ॥ గుణేషు విషయేషు తత్వదర్శీ. తాన్విషయాన్ తథావిధోఽజ్ఞ ఏవ. ॥48,49॥

టీ॥ గుణములనగా విషయములు. వానియందు తత్త్వ బుద్ధితో ప్రవర్తించువాడు, ఆ విషయములను ఇచ్చువాడు కూడ అట్టివాడే (అజ్ఞానియే) ॥48,49॥

శ్లో॥ స్వయం నిఃశ్రేయసం విద్వాన్న వక్త్యజ్ఞాయ కర్మ హి ।
నరాతి రోగినోఽపథ్యం వాంఛతోహి భిషక్తమః. ॥ (50)

టీ॥ కర్మ న వక్తి ప్రవృత్తిమార్గం న వక్తి హి. అపథ్యం యథా నరాతి దదాతి. భిషక్తమః సద్వైద్యః. ॥50॥

అవ॥ ఏవం తత్త్వకథనేనౌచిత్యం పరిహృత్య తదభిప్రాయమనుసరన్నాహ- మఘవన్నితి.

శ్లో॥ మఘవన్యాత భద్రం వో దధ్యంచ మృషిసత్తమమ్ ।
విద్యావ్రత తపః సారం గాత్రం యాచత మాచిరమ్ ॥ (51)

టీ॥ విద్యయా వ్రతైస్తపాచ సారం దృఢం గాత్రం శరీరం యాచత యాచధ్వమ్. ॥51॥

తా॥ స్వయముగా మోక్షసాధనమగు ఆత్మజ్ఞానమును తెలుసుకున్న వాడు అజ్ఞాని కొఱకై కర్మను బోధించడు. ఎట్లనగా హితముకాని ఆహారమును రోగి కోరుకున్నను ఉత్తమవైద్యుడు ఇవ్వడు కదా! ॥50॥

టీ॥ రోగి అపథ్య ఆహారమును కోరినను ఏ విధముగా ఉత్తమ వైద్యుడు దానిని ఇవ్వడో అట్లే నివృత్తిమార్గములో నున్నవాడు(జ్ఞాని) అజ్ఞానికి కర్మమార్గమును (ప్రవృత్తిమార్గమును) బోధించడు(చెప్పడు). ॥50॥

అవ॥ ఈ విధముగా తత్త్వవిషయమును చెప్పుటచే గల అనౌచిత్యమును పరిహరించి, మఘవన్నిత్యాది శ్లోకమున వారి అభిప్రాయముననుసరించి చెప్పుచున్నాడు.

తా॥ ఓ ఇంద్రా! మీకు మంగళమగుగాక! శీఘ్రముగా దధీచి మహర్షి కడకు వెళ్ళుడు. తప, ఉపాసన వ్రతములచే ధృఢమైన అతని శరీరమును యాచించుడు. ॥51॥

టీ॥ విద్యచేతను, వ్రతములచేతను, తపస్సుచేతను ధృఢత్వాన్ని పొందిన (దధీచి) శరీరమును యాచించుడు. ॥51॥

అవ॥ తత్ర తదీయం విద్యాతిశయమాహ- సవా ఇతి ద్వాభ్యామ్.

శ్లో॥ స వా అధిగతో దధ్యఙ్ఞశ్విభ్యాం బ్రహ్మ నిష్కలమ్ ।
యద్వా అశ్వశిరోనామ తయోరమరతాం వ్యధాత్ ॥ (52)

టీ॥ ఏవం హ్యత్ర ప్రసిద్ధా కథా. "నిశమ్యాథర్వణం దక్షం ప్రవర్గ్య బ్రహ్మవిద్యయోః. దధ్యంచ సముపాగమ్య తమూ చతురథాశ్వినౌ. భగవన్ దేహినౌ విద్యామితి శ్రుత్వా స చాబ్రవీత్. కర్మణ్యవస్థితోఽద్యాహం పశ్చాద్వక్ష్యామి గచ్ఛతమ్. తయోర్నిర్గతయోరేవ శక్ర ఆగత్య తం మునిమ్. ఉవాచ భిషజోర్విద్యాం మావదీరశ్వినోర్మునే. యది మద్వాక్యముల్లంఘ్య బ్రవీషి సహసైవ తే శిరశ్ఛింద్యాం న సందేహ ఇత్యుక్త్వా. స యమౌ హరిః. ఇంద్రోగతే తథాభ్యేత్య నాసత్యావూచతుర్ద్విజమ్. తన్ముఖాదింద్ర గదితం శ్రుత్వా తావూచతుః పునః. ఆవాం తవ శిరశ్ఛిత్త్వా పూర్వమశ్వస్య మస్తకమ్. సంధాస్యావస్తతో బ్రూహి తేన విద్యాంచ నౌ ద్విజ. తస్మిన్నింద్రేణ సంఛిన్నే పునః సంధాయ మస్తకమ్. నిజం తే దక్షిణాం దత్త్వా గమిష్యావో యథా తథమ్. ఏతచ్ఛ్రుత్వా తథోవాచ దధ్యంఘాథర్వణస్తయోః. ప్రవర్గ్యం బ్రహ్మ విద్యాంచ సత్కృతోఽసత్య శంకితః. ఇతి తతశ్చాయమర్థః - దధ్యఙ్

అవ॥ సవా ఇత్యాదిగా వరుస రెండు శ్లోకములలో ఆయన యొక్క (దధీచి)విద్యాతిశయమును గూర్చి చెప్పుచున్నాడు.

తా॥ శుద్ధపరబ్రహ్మను నిశ్చయముగా తెలుసుకున్నట్టి ఆ దధీచి అశ్వినీ దేవతలకు అశ్వశిరమను పేరుగల జ్ఞానమును ఉపదేశించగా వారు దానిచే జీవన్ముక్తులైరి. (మరణములేనివారైరి) ॥52॥

టీ॥ దీనికి సంబంధించి ఒక ప్రసిద్ధమైన కథ గలదు. అథర్వ వేదమందలి కర్మ జ్ఞాన కాండలయందు దక్షుడు అయిన దధీచిని సమీపించి అశ్వినీదేవతలు హే భగవన్ మాకు విద్యను ప్రసాదించుము. అని అడుగగా ఆ దధీచి ఈ రోజు నేను కర్మను ఆచరించుచున్నాను. తరువాత చెప్పగలను వెళ్ళండి అనెను. వారు సరేయని వెళ్ళగా ఇంద్రుడు మునిని సమీపించి ఓ మునివరా! మీరు ఆ అశ్వినీ దేవతలకు విద్యను బోధించవలదు. ఒకవేళ నా మాటను ఉల్లంఘించి వారికి విద్యను చెప్పినచో నిస్సందేహంగా వెంటనే మీ శిరస్సును ఖండించెదను అని చెప్పి వెళ్ళిపోయెను. ఇంద్రుడు వెళ్ళిన పిమ్మట అశ్వినీదేవతలు మునిని ఉపదేశమును గూర్చి మరల అభ్యర్థించిరి. ఇంద్రుని పలుకుల విషయమును ముని ద్వారా విని వారు మరల ఇట్లనిరి. అయితే మేము మొదట మీ శిరస్సును తొలగించి గుఱ్ఱము ముఖమును అమర్చుదుము. ఆ ముఖముచే మాకు విద్యను బోధించుడు. ఇంద్రుడు

నిష్కలం శుద్ధం బ్రహ్మాధిగతో జ్ఞాతవాన్. పాఠాన్తరే తు నిష్కృతం నితరాం కృతం భవతి ధనం యేన తం ప్రవర్గ్యం చాధిగతో జ్ఞాతవాన్. తతోఽశ్విభ్యాం ప్రాదాదిత్యుత్తరస్యానుషంగః. ఉపదిదేశేత్యర్థః. కథంభూతం బ్రహ్మ. యద్వై అశ్వశిరసా ప్రోక్తత్వాదశ్వశిరోనామ ప్రసిద్ధమ్. తయోరమరతాం జీవన్ముక్తత్వం వ్యధాత్. తథా చ శ్రుతిః. 'అశ్వస్య శీర్ష్ణా ప్రయదీమువాచ' ఇతి.॥52॥

ఆ శిరస్సును ఖండించగా మరల మీ శిరస్సును సంధించెదము అని పలికిరి. ఈ విధముగా మీకు గురుదక్షిణ ఇచ్చి యథా విధిగా వెళ్ళెదము. అట్లే అని ఆ దధీచి అథర్వణ వేదమును బోధించెను. దానితో కర్మకాండతోడను, జ్ఞానకాండతోడను సంపూర్ణ బ్రహ్మవిద్యను వారు పొందిరి. అందువలన శుద్ధమైన బ్రహ్మజ్ఞానముకలవాడుగా దధీచి పేర్కొనబడ్డాడు. అశ్వశిరస్సుతో అశ్వినీ కుమారులకు విద్యనందించుట వలన ఈ విద్య అశ్వశిరనామమున ప్రసిద్ధి పొందినది. దాని వలన అశ్వినీకుమారులు జీవన్ముక్తులైరి. అశ్వస్య శీర్ష్ణా ప్రయధీమువాచ అని శ్రుతి వాక్యము. ॥52॥

శ్లో॥ దధ్యఙ్ఙాథర్వణస్త్వష్ట్రే వర్మా భేద్యం మదాత్మకమ్ ।
విశ్వరూపాయ యత్ప్రాదాత్త్వష్టా యత్త్వమధాస్తతః ॥ (53)

తా॥ అథర్వణవేది అయిన దధీచి దుర్భేధ్యమైన నా స్వరూపమగు కవచమును త్వష్టకు ఇచ్చెను. త్వష్ట దానిని తనకొడుకైన విశ్వరూపునకు ఇచ్చెను. దానిని నీవు విశ్వరూపుని నుండి నీవు (ఇంద్రుడు) పొందితివి. (ధారణ చేసితివి) (53)

టీ॥ మదాత్మకం వర్మ శ్రీనారాయణ కవచం చాధిగత ఇతి పూర్వస్యానుషంగః. తత్ర హేతుః- యస్మాత్త్వష్ట్రే ప్రాదాత్. కింతత్. యత్త్వష్టా విశ్వరూపాయ పుత్రాయ ప్రాదాత్. కీదృశమ్. యత్త్వంతతో విశ్వరూపాదధాః ధృతవానసి. తదేవం విద్యయా సారం గాత్రం యాచ ధ్వమిత్యర్థః. ॥53॥

టీ॥ నా స్వరూపమైన నారాయణ కవచమును పొందబడెను అని పూర్వ విషయముచే అన్వయము. దధీచి నుండి త్వష్టకు త్వష్ట నుండి విశ్వరూపునకు లభించెను. దేనినైతే నీవు విశ్వరూపుని నుండి పొంది యున్నావో, ఆ విద్యచేత దధీచి శరీరము సారవంతమైనది. అట్టి శరీరమును అడుగవలసినది అని భావము. (53)

శ్లో॥ యుష్మభ్యం యాచితోఽశ్విభ్యాం ధర్మజ్ఞోఽంగాని దాస్యతి ।
తతస్తైరాయుధశ్రేష్ఠో విశ్వకర్మ వినిర్మితః ॥ (54)

తా॥ శిష్యులుగా ఉపదేశం పొందిన అశ్వినీదేవతలు కోరినచో, ధర్మజ్ఞుడు అయిన దధీచి మీ కొఱకు తన అవయవములను ఈయగలడు. తరువాత వాటితో విశ్వకర్మ గొప్ప ఆయుధమును తయారు చేయును.॥54॥

టీ॥ నను ప్రేష్ఠం దేహం కథం దాస్యతి తత్రాహ. యుష్మభ్యమంగాన్యస్థీని యాచితః సన్ దాస్యతి. యతో ధర్మజ్ఞః. విశేషతోఽశ్విభ్యాం శిష్యప్రీత్యా దాస్యతి. అస్థీనిత్యననే హేయత్వం దర్శితమ్. తైరస్థిభిర్విశ్వకర్మణా వినిర్మిత ఆయుధ శ్రేష్ఠో వజ్రో భవిష్యతీతిశేషః ॥54॥

టీ॥ నిశ్చయముగా ప్రియమైన దేహమును ఎట్లు ఈయగలడో! చెప్పబడుచున్నది. ధర్మజ్ఞుడగుట వలన మీ కొఱకు అంగములను, ఎముకలనుఈయగలడు. విశేషముగా అశ్వినీదేవతలు కోరినచో శిష్య ప్రీతి కారణముగా ఈయగలడు. అస్థీని అనుపదము వాని హేయత్వమును తెలుపును. విశ్వకర్మచేత ఆ ఎముకలచే సిద్ధము చేయబడు ఆయుధ శ్రేష్ఠము వజ్రము కాగలదు.॥54॥

శ్లో॥ యేన వృత్ర శిరో హర్తానుత్తేజ ఉపబృంహితః।
తస్మిన్వినిహతే యూయం తేజోఽస్త్రాయుధసంపదః।
భూయఃప్రాప్స్యథ భద్రం వో న హింసంతి చ మత్పరాన్॥(55)

తా॥ ఆ ఆయుధముతో, నా తేజస్సుతో వర్ధిల్లబడిన నీవు వృత్రుని శిరస్సును తొలగించగలవు. ఆ వృత్రుడు సంహరింపబడగా మీరు మీ తేజస్సులను, అస్త్రశస్త్రములను సంపదలను మరల పొందగలరు. మీకు భద్రమగుగాక! నా భక్తులను ఎవరూ హింసించరు. (హింసించ జాలరు) ॥55॥

టీ॥ యేన భవాన్వృత్రశిరో హర్తా హరిష్యతి. మమ తేజసా ఉపబృంహితః సన్. తేజశ్చాస్త్రాణి చాయుధాని చ సంపదశ్చభూయః ప్రాప్స్యథ। మహాకాయస్త్రిభువన గ్రాసీ స ఏవాస్మాన్హన్యాదితి శఙ్కాకుల చిత్తాన్ప్రత్యాహ మత్పరాంశ్చ కేఽపి న హింసన్త్యతో యుష్మాకం భద్రమేవేతి. ॥55॥

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే నవమోఽధ్యాయః**

టీ॥ (దేనితో) ఆ వజ్రాయుధముతో నా తేజస్సుతో వర్ధిల్లిన నీవు వృత్రాసురుని శిరస్సును ఖండించగలవు. మీ తేజస్సులను అస్త్రములను ఆయుధములను తిరిగి పొందగలరు. ముల్లోకములను తినివేయుచున్న మహాకాయుడగు ఆ వృత్రాసురుడు మమ్ములను హింసించగలడని వ్యాకుల చిత్తులైనవారి కొఱకు చెప్పుచున్నాడు. నా భక్తులను ఎవరు కూడ హింసించలేరు. మీకు మంగళమగు గాక! (55)

**శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆఱవ స్కంధమున తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.**

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

దశమోధ్యాయః

అవ॥ దశమే కేశవాదిష్ట దధ్యజ్జస్థిజ వజ్ర ధృత్ ।
ఇంద్రోఽయుధ్యత వృత్రేణ సాసురేణ సనిర్జరః ॥

పదవ అధ్యాయము

అవ॥ పదియవ అధ్యాయమున కేశవునిచేత ఆదేశించబడిన ఇంద్రుడు దధీచి ఎముకలచే ఏర్పడిన వజ్రాయుధమును ధరించి, వృత్రాసురునితో యుద్ధము చేసి వృత్రుని సంహరించగా, ఆ రాక్షసుడు పూర్వ గంధర్వ రూపమును పొందెనను విషయము చెప్పబడుచున్నది.

శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఇంద్రమేవం సమాదిశ్య భగవాన్విశ్వభావనః ।
పశ్యతామనిమేషాణాం తత్రైవాంతర్దధే హరిః ॥ (1)

శ్రీశుకులు పలికిరి.

తా॥ జగత్తునకు సుఖమును కలిగించు శ్రీహరి ఇంద్రుని ఈ విధముగా ఆదేశించి, దేవతలు చూచుచుండగా అంతర్ధానమయ్యెను. 1

శ్లో॥ తథాఽభి యాచితో దేవై ఋషిరాథర్వణో మహాన్ ।
మోదమాన ఉవాచేదం ప్రహసన్నివ భారత ॥ (2)

తా॥ ఓ భారతా! ఆ విధముగా దేవతలచే యాచించబడిన అథర్వణ వేదజ్ఞుడు అయిన మహర్షి సంతోషమును పొంది చిరునవ్వుతో ఇట్లు పలికెను. ॥2॥

అవ॥ మోదమాన ఏవ తన్ముఖాద్ధర్మం శ్రోతుకామః ప్రత్యాచక్షణ ఇవోవాచ –అపీతి ద్వాభ్యామ్.

అవ॥ సంతోషము పొందిననూ వారి ముఖము నుండి ధర్మమును విను కుతూహలముతో మరల ఇట్లు పలికెను, అని అపీత్యాదిగా ప్రారంభించబడిన రెండు శ్లోకముల ద్వారా చెప్పుచున్నాడు.

శ్లో॥ అపి వృన్దారకా యూయం న జానీథ శరీరిణామ్ ।
సంస్థాయాం యస్త్వభిద్రోహో దుఃసహశ్చేతనాపహః ॥ (3)

తా॥ ఓ దేవతలారా! ప్రాణులకు (శరీరధారులకు) మరణ సమయమందు చైతన్యమును హరించు సహించరాని పీడకలుగునని మీకు తెలియదా? (3)

టీ॥ హే వృన్దారకాః అపి కిం సంస్థాయాం మృత్యౌ యోఽభిద్రోహో దుఃఖం తం న జానీథ. ॥1,2,3॥

టీ॥ ఓ దేవతలారా! మృత్యు సమయమునందు ఏర్పడు దుఃఖము మీకు తెలియదా ఏమి? ॥1,2,3॥

శ్లో॥ జిజీవిషూణాం జీవానామాత్మాప్రేష్ఠ ఇహేప్సితః ।
క ఉత్సహేత తం దాతుం భిక్షమాణాయ విష్ణవే ॥ (4)

తా॥ జీవించగోరువారికి శరీరము మిక్కిలి ప్రియమైనది. (ఈ లోకమందు) విష్ణువే శరీరమును భిక్షగా కోరుచున్నను, దానిని ఇచ్చుటకు ఎవరు మాత్రం ఇష్టపడుదురు.? ఇష్టపడరని భావము.(4)

టీ॥ ఆత్మా దేహః. వయం జానీమ ఏవ కింతు శ్రీవిష్ణు రస్మాన్ముఖేన యాచత ఇతి చేత్తత్రాహ యాచతే విష్ణవేఽపి దాతుం క ఉత్సహేత.॥4॥

టీ॥ జీవులకు దేహము మిక్కిలి ప్రియమైనది, అని మనకు తెలియును. మేము కూడా ఎరుగుదుము కాని విష్ణువే మా ద్వారా అడుగుచున్నాడన్నచో- చెప్పబడుచున్నది-శ్రీమహావిష్ణువు తన స్వీయ ముఖముతో దేహమును అడిగినను (భిక్షగా కోరినచో) దానిని ఇచ్చుటకు ఎవరు ఇష్టపడుదురు? (ఇష్టపడరని భావము) ॥4॥

దేవా ఊచుః

దేవతలు పలికిరి

శ్లో॥ కిం ను తద్దుస్త్యజం బ్రహ్మన్పుంసాం భూతానుకమ్పినామ్ ।
భవద్విధానం మహతాం పుణ్యశ్లోకేడ్య కర్మణామ్ ॥ (5)

తా॥ ఓమహర్షీ! భూతముల యందు దయ కలవారికి, పవిత్రమైన కీర్తిగలవారికి, వారిచే కొనియాడదగిన కర్మలుగల నీ వంటి మహాత్ములకు విడిచిపెట్టశక్యము కానిది యేముండును. (5)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ॥ పుణ్యశ్లోకైరీడ్యాని కర్మాణి యేషామ్. ॥5॥

శ్లో॥ నను స్వార్థపరో లోకేన వేద పరసంకటమ్ ।
యది వేద న యాచేత నేతి నాహ యదీశ్వరః ॥ (6)

టీ॥ యాచకో యది వేద తర్హి న యాచేత యదీశ్వరో దాన సమర్థశ్చే త్తర్హి సోஉపి నేతి నాహ అతో యథా తవ సంకటం స్వార్థపరా వయం చ న జానీమ ఏవం ప్రత్యాచక్షణస్త్వమస్మత్సంకటం న జానాసీతి భావః. ॥6॥

ఋషిరువాచ.

శ్లో॥ ధర్మం వః శ్రోతు కామేన యూయం మే ప్రత్యుదాహృతాః ।
ఏష వః ప్రియమాత్మానం త్యజన్తం సంత్యజామ్యహమ్ ॥ (7)

టీ॥ మే మయా ప్రత్యుదాహృతాః ప్రత్యుక్తాః మాం త్యజన్తం త్యక్త్వా యాన్తమాత్మానం దేహమ్. ॥7॥

టీ॥ ఎవరి యందు కొనియాడదగిన కర్మలుగలవో వాడు పుణ్యశ్లోక కర్ముడు. ॥5॥

తా॥ స్వార్థపరుడైన జనుడు ఇతరుల కష్టములను గుర్తించడు. ఒకవేళ గుర్తించినచో వాడు యాచించడు. కష్టమును గుర్తించు సమర్థుడైనచో లేదని చెప్పడు. (6)

టీ॥ యాచకుడికి (కష్టము) తెలిసినచో వాడు యాచించడు. దాన సమర్థుడైనవాడు యాచించినచో వారికి లేదని చెప్పడు. అందుచేత ఎట్లైతే నీ కష్టమును స్వార్థపరులమైన మేము తెలియకున్నామో, ఈ విధముగా బదులుగా అడుగుచున్న మా కష్టమును నీవు తెలియకున్నావు అని భావము. ॥6॥

ఋషి (దధీచి మహర్షి) పలుకుచున్నాడు.

తా॥ నేను మీ నుండి ధర్మమును వినగోరి మిమ్ము నిరాకరించితిని. నేను, నా ప్రియమైన దేహమును మీ కొఱకు విడిచిపెట్టుచున్నాను. (7)

టీ॥ దేహమును వదిలిపెట్టుచున్న నన్ను అడిగినవారు, నాచే తిరస్కరించబడిన వారు. ॥7॥

శ్లో॥ యో ధృవేణాత్మనా నాథా న ధర్మం న యశః పుమాన్ ।
ఈహేత భూతదయయా స శోచ్యః స్థావరైరపి ॥ (8)

తా॥ ఓ ప్రభువులారా! ఏ మానవుడు అధృవమగు (శాశ్వతముకాని) ఈ దేహముతో, సర్వ భూతములపట్ల దయ చూపుతూ, ధర్మము నాచరించి కీర్తిని పొందడో అట్టివాడు స్థావరముల (వృక్షముల) కంటే శోకింపదగినవాడు. (తక్కువవాడు) (8)

టీ॥ అధృవేణాత్మనా దేహేన హే నాథాః. ॥8॥

టీ॥ ఓ నాథులారా! అనిత్యమైన దేహముతో. ॥8॥

శ్లో॥ ఏతావానవ్యయో ధర్మః పుణ్యశ్లోకైరుపాసితః ।
యో భూతశోక హర్షాభ్యా మాత్మా శోచతి హృష్యతి ॥ (9)

తా॥ పుణ్యశ్లోకులైన వారి (పవిత్ర చరిత్రగలవారి) చే ఆచరించబడిన, వినాశములేని ధర్మమేమనగా ఇతర ప్రాణుల సుఖ దుఃఖములతో తాను కూడ సుఖ దుఃఖముల పొందుటయే ! (9)

టీ॥ భూతానాం శోకేన శోచతి హర్షేణ హృష్యతి య ఆత్మా స్వయం తస్య యో ధర్మ ఏతావానేవావ్యయః ధర్మః ఇత్యర్థః. ॥9॥

టీ॥ ప్రాణుల దుఃఖముతో దుఃఖించునట్టి సంతోషముతో సంతోషించునట్టి మనస్సు(ఆత్మ) ఎవనికి కలదో వాడాచరించు ధర్మము అవ్యయము. మానవునకు అదియే శాశ్వత ధర్మము అని భావము.॥9॥

శ్లో॥ అహో దైన్య మహో కష్టం పారక్యైః క్షణ భంగురైః ।
యన్నోపకుర్యాదస్వార్థై ర్మర్త్యః స్వజ్ఞాతి విగ్రహైః ॥ (10)

తా॥ అయ్యో! పరులకు మాత్రమే ఉపయోగపడునవి, తనకు ఉపయోగపడనివి అగు క్షణభంగురమైన ధనము, దేహసంబంధులు, దేహము మొదలగు వానిచే పరోపకారము చేయకుండుటయే నిజమైన దైన్యము, కష్టము కదా! (10)

టీ॥ పారక్యైః శ్వ శృగాలాది భక్షైః అస్వార్థైరాత్మోపయోగ శూన్యైః. స్వంవిత్తమ్. జ్ఞాతయః పుత్రాదయః. విగ్రహో దేహః. తైర్నోపకుర్యా దితి యత్. ॥10

టీ॥ కుక్కలు, గ్రద్దలు మున్నగువానికి ఆహారమగునట్టి, క్షణ భంగురమైనట్టి, తనకుపయోగపడని ధనము, పుత్రాదులు, దేహము మున్నగువానితో పరోపకారము చేయకుండుట అనునది ఏది కలదో అది. ॥10॥

శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఏవం కృత వ్యవసితో దధ్యఙ్గాథర్వణ స్తనుమ్ ।
పరేభగవతి బ్రహ్మణ్యాత్మానం సంనయఞ్జహౌ ॥ (11)

శ్రీశుకులవలికెరి

తా॥ ఈ విధముగా కృత నిశ్చయుడు, అథర్వణవేదియయిన దధీచి తన మనస్సును భగవంతునియందు ఉంచుతూ, దేహమును విడిచి పెట్టెను. (11)

టీ॥ కృతం వ్యవసితం నిశ్చయో యేన ఆత్మానం క్షేత్రజ్ఞం సంన యన్నేకీకుర్వం స్తనుం జహౌ. ॥11

టీ॥ కృతనిశ్చయుడైన దధీచి క్షేత్రము నెఱిగిన తనను క్షేత్రజ్ఞుడైన భగవంతునియందు లయింప (ఏకీకృతము) చేయుచు దేహమును విడిచి పెట్టెను. ॥11॥

శ్లో॥ యతాక్షా సుమనో బుద్ధి స్తత్త్వదృగ్ధ్వస్తబన్ధనః ।
ఆస్థితః పరమం యోగం న దేహం బుబుధే గతమ్ ॥ (12)

తా॥ నియంత్రించబడిన ప్రాణేంద్రియ బుద్ధులుగలవాడు, పరమాత్మ తత్త్వమును తెలిసినవాడు, కర్మబంధనము నశించినవాడగు దధీచి స్థిరమైన చిత్తైకాగ్రతను పొంది దేహము గతించిన విషయము తెలియకుండెను. (12)

టీ॥ యతా అక్షాదయో యేన. తత్త్వం పశ్యతీతి తథా. ధ్వస్తాని బన్ధనాని యస్య. ॥12॥

టీ॥ ఎవనిచేత అక్షాదులు (ఇంద్రియాదులు) నియంత్రించబడినవో వాడు యతాక్షుడు. తత్త్వమును చూచుచున్నవాడు (తెలిసినవాడు) నశింపబడిన బంధనములుకలవాడు ఎవడో వాడు ధ్వస్తబంధనుడు. 12

శ్లో॥ అథేంద్రో వజ్రముద్యమ్య నిర్మితం విశ్వకర్మణా ।
మునేః శుక్తిభిరుత్సిక్తో భగవత్తేజసాన్వితః ॥ (13)

శ్లో॥ వృతో దేవగణైః సర్వైర్గజేంద్రో పర్యశోభత ।
స్తూయమానో మునిగణైస్త్రైలోక్యం హర్షయన్నివ ॥ (14)

తా॥ (తరువాత) ఇంద్రుడు భగవంతుని తేజస్సుతో బలమును పొంది, దధీచిమహర్షి యొక్క ఎముకలతో విశ్వకర్మ నిర్మించిన వజ్రాయుధమును ఎత్తి పట్టుకొని, దేవగణములన్నింటితో చుట్టబడి, మునిగణములచే స్తుతించబడుచూ, ముల్లోకములను హర్షింప చేయుచూ, గజేంద్రుడైన ఐరావతముపై శోభిల్లెను. (13,14)

టీ॥ అథేంద్రో౽శోభతే త్యుత్తరేణాన్వయః, మునేః శుక్తిభిరస్థిభిర్నిర్మితం ఉత్సిక్త ఊర్జితః మునేరస్థిభిరితి వా పాఠః. ॥13,14॥

టీ॥ పిమ్మట ఇంద్రుడు శోభను పొందెను అని ఉత్తరశ్లోక పదములతో అన్వయము. ముని యొక్క అస్థికలచే నిర్మించబడిన ఆయుధముచే, బలమును పొంది శోభించెను. శుక్తిభిః అనుపాఠమునకు బదులుగా అస్థిభిః అని పాఠాంతరము. ॥13,14॥

శ్లో॥ వృత్ర మభ్యద్రవచ్ఛేత్తుమసురానీక యూథపైః ।
పర్యస్తమోజసా రాజన్ క్రుద్ధో రుద్ర ఇవాన్తకమ్ ॥ (15)

తా॥ ఓ రాజా! కోపించిన రుద్రుడు యమునిపైకి వెళ్ళినట్లు, ఇంద్రుడు రాక్షసయోధులచే కూడియున్న వృత్రాసురుని సంహరించుటకు వేగముగా వెళ్లెను. (15)

టీ॥ అసురానీకానాం యూథపైః పర్యస్తం పరివృతం. ॥15॥

టీ॥ రాక్షస సేనాపతులతో చుట్టబడిన. ॥15॥

శ్లో॥ తతః సురాణామసురై రణః పరమదారుణః ।
త్రేతాముఖే నర్మదాయామభవత్ప్రథమే యుగే ॥ (16)

తా॥ ఆ తరువాత ప్రథమ మహాయుగమందలి(నాలుగు యుగములు కలిసి ఒక మహాయుగము) త్రేతాయుగ ఆరంభ కాలమున నర్మదానదీ తీరమందు దేవతలకు, రాక్షసులతో భీకరమైన యుద్ధము జరిగెను.(16)

టీ॥ రణః సంగ్రామః ప్రథమే చతుర్యుగే త్రేతాయుగస్య ముఖే ఆరమ్భే.॥16॥

టీ॥ రణమనగా సంగ్రామము (యుద్ధము) మొదటి నాలుగు యుగములందలి త్రేతాయుగ ప్రారంభకాలమున. ॥16॥

శ్లో॥ రుద్రైర్వసుభిరాదిత్యైరశ్విభ్యాం పితృవహ్నిభిః ।
మరుద్భిరృభుభిః సాధ్యైర్విశ్వేదేవైర్మరుత్పతిమ్ ॥ (17)

శ్లో॥ దృష్ట్వా వజ్రధరం శక్రం రోచమానం స్వయాశ్రియా ।
నామృష్యన్నసురా రాజన్మృధే వృత్రపురః సరాః ॥ (18)

తా॥ ఓ రాజా! రుద్రులు, వసువులు, ఆదిత్యులు, అశ్వినీదేవతలు, పితృదేవతలు, అగ్ని, మరుత్తులు, ఋభువులు, సాధ్యులు, విశ్వేదేవతలతో కలిసి, వజ్రాయుధము ధరించి, యుద్ధమునందు తనదైన శోభతో ప్రకాశించుచున్న మరుత్పతియైన ఇంద్రుని చూచి వృత్రుడు మరియు ఆతని రాక్షసయోధులు సహించలేకపోయిరి. (17,18)

టీ॥ నామృష్యన్ నాసహన్త. స్వమాయయా ఇతి పాఠాన్తరమ్. ॥17,18॥

టీ॥ సహించలేక పోయిరి. స్వయా శ్రియా బదులుగా స్వమాయయా - తన మాయచే అని పాఠాంతరము. ॥17,18॥

శ్లో॥ నముచిః శమ్బరోఽనర్వాద్విమూర్ధా ఋషభోఽమ్బరః ।
హయగ్రీవః శఙ్కుశిరా విప్రచిత్త రయోముఖః ॥ (19)

తా॥ నముచి, శంబరుడు, అనర్వుడు, ద్విమూర్ధుడు, ఋషభుడు, అంబరుడు, హయగ్రీవుడు, శంఖుశిరుడు, విప్రచిత్తి, అయోముఖుడు, పులోముడు, వృషపర్వుడు, ప్రహేతి, హేతి, ఉత్కలుడు, దైత్యులు,

శ్లో॥ పులోమా వృషపర్వా చ ప్రహేతిర్హేతిరుత్కలః ।
దైతేయా దానవా యక్షా రక్షాంసి చ సహస్రశః ॥ (20)

శ్లో॥ సుమాలి మాలి ప్రముఖాః కార్తస్వరపరిచ్ఛదాః ।
ప్రతిషిధ్యేన్ద్ర సేనాగ్రం మృత్యోరపి దురాసదమ్ ॥ (21)

శ్లో॥ అభ్యర్ధయన్న సంభ్రాన్తాః సింహనాదేన దుర్మదాః ।
గదాభిః పరిఘైర్బాణైః ప్రాసముద్గరతోమరైః ॥ (22)

శ్లో॥ శూలైః పరశ్వధైః ఖడ్గైః శతఘ్నీభిర్భుశుణ్డిభిః ।
సర్వతోఽవాకిరన్ శస్త్రైరస్త్రైశ్చ విబుధర్షభాన్ ॥ (23)

టీ॥ శతఘ్నీ చ చతుర్హస్తా లోహ కణ్టక సంచితా భుశుణ్డీ సర్వతో లోహకణ్టకాను క్రమోన్నతా ఇత్యభిధానమ్. ॥19-23॥

శ్లో॥ న తే దృశ్యన్త సంఛన్నాః శరజాలైః సమన్తతః ।
పుఙ్ఖానుపుఙ్ఖ పతితైర్జ్యోతీంషీవ నభో ఘనైః ॥ (24)

(దితి సంతానము) దానవులు (దనువు సంతానము) యక్షులు మరియు వేలకొలదిగా రాక్షసులు, సుమాలి, మాలి, మొదలగు ప్రముఖులు. బంగారు ఆభరణములు ధరించి, భయరహితులై, సింహనాదముతో గర్వించియున్న రాక్షసులు, దేవతల సేనల అగ్రభాగాన నిలిచిన, మృత్యువు కూడా సమీపించలేని ఇంద్రుని నిరోధించి గదలు, బాణములు, పరిఘలు, ఈటెలు, సమ్మెటలు, మున్నగువానితోను, శూలములు, గండ్ర గొడ్డళ్ళు, ఖడ్గములు, శతఘ్నులు, ఇనుపముండ్లు గల గోళములతో పీడించిరి. మరియు వారు అన్ని వైపులనుండీ అస్త్రములతో, శస్త్రములతో దేవనాయకులపై ఆయుధ వర్షము కురిపించిరి. (19 -23)

టీ॥ శతఘ్నీ అనగా నాలుగు వైపుల లోహపు ముండ్లుగల ఆయుధము. భుషుంఢీ అనగా అన్ని వైపుల లోహము ముండ్లుగల ఉన్నతిగల ఆయుధము. ॥19 - 23 ॥

తా॥ అన్నివైపుల నుండి పుంఖానుపుంఖములుగా కురియుచున్న శరపరంపరలచే దేవతలు కప్పివేయబడినవారై, ఆకాశమందలి మేఘములచే ఆవరించిన నక్షత్రములవలె కనబడకుండిరి. (24)

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ॥ పుఙ్ఖో మూలదేశః ఏకస్య మూలదేశమనుతత్సంల్లగ్నోఽ పరస్య పుఙ్ఖో యథా భవతి తథా నభస్థైర్ధనైర్జ్యోతీంషీవేత్యనేన తేషాం తదప్రాప్తిః సూచితా. ॥24॥

టీ॥ పుంఖము అనగా మూలభాగము (అగ్రము) ఒకదాని చివర మరొక బాణముండునటుల బాణముల వరుసలచే కప్పివేయబడిన నక్షత్రములవలె వారిని (దేవతలను) కనపడకుండగా చేయుచున్నవని సూచించబడుచున్నది. ॥24॥

అవ॥ తామేవాహ నత ఇత్యాది శ్లోకేన.

అవ॥ న త ఇత్యాది శ్లోకమున వానినే చెప్పుచున్నాడు.

శ్లో॥ న తే శస్త్రాస్త్ర వర్షౌఘాహ్యాసేదుః సుర సైనికాన్ ।
ఛిన్నాః సిద్ధ పథేదేవైర్లఘు హస్తైః సహస్రథా ॥ (25)

తా॥ తమ హస్తలాఘవముచే దేవతలు ఆ శస్త్రాస్త్ర వర్ష పరంపరను వేల కొలది ముక్కలు చేయగా అవి దేవతల దరిదాపులకు రాలేక పోయినవి. (25)

టీ॥ శస్త్రాణా మస్త్రాణాం చ యాని వర్షాణి తేషామోఘాః నాసేదుర్న ప్రాపుః సిద్ధపథే ఆకాశే. ॥25॥

టీ॥ ఏ శస్త్రాస్త్ర పరంపరలు గలవో అవి వారిని చేరలేక పోయినవి. సిద్ధ పథే అనగా ఆకాశమందు. ॥25॥

శ్లో॥ అథ క్షీణాస్త్ర శస్త్రౌఘా గిరి శృఙ్గద్రుమోపలైః ।
అభ్యవర్షన్సురబలం చిచ్ఛిదుస్తాంశ్చ పూర్వవత్ ॥ (26)

తా॥ రాక్షసుల శస్త్రాస్త్ర బలములు క్షీణించిపోగా, వారు గిరి శృంగములను, చెట్లను, రాళ్ళను దేవ బలములపై వర్షించిరి. పూర్వము వలెనే వానిని కూడా దేవతలు భేదించిరి.(ముక్కలుచేసిరి) (26)

టీ॥ క్షీణా అస్త్రాణాంచ శస్త్రాణాంచ ఓఘా యేషామ్ గిరిశృఙ్గైర్ద్రుమై రుపలైశ్చ. ॥26॥

టీ॥ క్షీణించిన అస్త్రశస్త్రములు కలవారు ఎవరోవారు క్షీణాస్త్ర శస్త్రౌఘములు, గిరిశృంగముల, ద్రుమముల, రాళ్ళతోడను, ॥26॥

శ్లో॥ తానక్షతాన్స్వస్తిమతో నిశామ్య శస్త్రాస్త్ర పూగైరథవృత్రనాథాః ।
ద్రుమైర్దృషద్భిర్వివిధాద్రి శృఙ్గైరవిక్షతాంస్తత్ర సురేన్ద్రసైనికాన్॥27॥

తా॥ అప్పుడు వివిధ శస్త్రాస్త్ర వర్షములచే హాని పొందని, పర్వత శిఖరములచేతను, వృక్షములచేతను గాయపడని, క్షేమముగా నున్న, దేవసేనలను చూచి వృత్రాసురుని సైనికులు భయపడిరి.(27)

టీ॥ తానిన్ద్ర సైనికాన్ శస్త్రాణా మస్త్రాణాం చ పూగైః సమూహై రక్షితాన్ క్షత శూన్యాన్స్వస్మితః సుఖినో ద్రుమాదిభిశ్చా విక్షతాన్ని శామ్య దృష్ట్వా వృత్రోనాథో యేషాం తే తత్ర సుర్భీతాః. ॥27॥

టీ॥ శస్త్రాస్త్ర వృక్షాది వర్షములచేత గాయపడని క్షేమముగానున్న ఆ ఇంద్ర సైనికులను చూచి, వృత్రుడు నాథుడుగా గల రాక్షసులు భయపడిరి. ॥27॥

శ్లో॥ సర్వే ప్రయాసా అభవన్విమోఘాః
కృతాః కృతాదే వగణేషు దైత్యైః ।
కృష్ణానుకూలేషు యథా మహత్సు
క్షుద్రైః ప్రయుక్తా రుశతీ రూక్షవాచః ॥ (28)

తా॥ మహాత్ములపై అల్పులు ప్రయోగించు పరుష వాక్యములు ఏ విధముగా వ్యర్థములగునో అట్లే కృష్ణుడు(విష్ణుమూర్తి) అనుకూలుడుగా గల దేవగణములందు రాక్షసులచే మరల మరల ప్రయోగింపబడిన అన్ని ప్రయత్నములు వ్యర్థమయ్యెను. (28)

టీ॥ కృతాః కృతాః పునః పునః కృతాః కృష్ణో<u>ఽ</u>నుకూలో యేషాం తేషు దేవ గణేషు రుశతీః రుశత్యః అకల్యాణ్యో రూక్షాః పరుషావాచో యథా మహత్సు శోభ కర్త్ర్యో న భవన్తి తద్వత్. ॥28॥

టీ॥ మహాత్ములతో రోషముతో అల్పులు పలికిన పరుషవాక్యములు వ్యర్థములయినట్లు, కృష్ణానుకూలత గల దేవగణములపై, రాక్షసులు మరల మరల చేయు ప్రయత్నములు వ్యర్థములయ్యెను. ॥28॥

శ్లో॥ తే స్వప్రయాసంవితథం నిరీక్ష్య
హరావభక్తా హతయుద్ధదర్పాః ।
పలాయనాయాజిముఖే విసృజ్య
పతిం మనస్తేదధురాత్తసారాః ॥ (29)

తా॥ హరి యందు భక్తిలేని ఆ రాక్షసులు యుద్ధములో తమ శ్రమ వ్యర్థమగుటను చూచి, గర్వము తొలగి బలమును కోల్పోయి, తమ ప్రభువగు వృత్రుని విడిచిపెట్టి పారిపోవుటకు నిశ్చయించుకొనిరి.(29)

టీ॥ హతో యద్ధే దర్పో యేషాం తే, ఆత్తః పరైర్గృహీతః సారోధైర్యం యేషామ్ తే అతి ప్రసిద్ధా అపితే దైత్యాః. ఏవం తే ఇత్యస్యా పౌనరుక్త్యమ్ ఆజిముఖే యుద్ధారమ్భే. పతిం విసృజ్య పలాయనాయ మనో దధుః యతో హరావ భక్తాః. ॥29॥

టీ॥ యుద్ధమునందు దర్పమును కోల్పోయిన వారు ఎవరో వారు హత యుద్ధదర్పులు; ధైర్యమును కోల్పోయిన వారు ఎవరో వారు ఆత్తసారులు (ఇతరులచే గ్రహించబడిన ధైర్యముగలవారు ఎవరో) వారు ప్రసిద్ధులైన రాక్షసులే అయినను వారి ప్రయత్నములు ఫలించక పోవుటచే యుద్ధారంభమున, వారి నాయకుడైన వృత్రుని విడిచిపెట్టి పారిపో నిశ్చయించుకొనిరి. హరియందు భక్తిలేనివారు అగుట వలన. (29)

శ్లో॥ వృత్రోఽసురాంస్తాననుగాన్మనస్వీ
ప్రధానతః ప్రేక్ష్యవభాష ఏతత్ ।
పలాయితం ప్రేక్ష్య బలం చ భగ్నం
భయేన తీవ్రేణ విహస్య వీరః ॥ (30)

తా॥ తన అనుచరులగు రాక్షసులు చెల్లాచెదురై తీవ్రమైన భయముతో పారిపోవుచుండగా సైన్యమును చూచి స్వాభిమానముగల, వీరుడైన వృత్రాసురుడు నవ్వి ఇట్లు పలికెను. (30)

టీ॥ ప్రధావతః పలాయమానాన్ప్రేక్ష్య ఆదావేవ తీవ్రేణ భయేన పలాయితం భగ్నంచ తద్బలం సైన్యం తచ్చప్రేక్ష్య ఏతద్వక్ష్యమాణం బభాషే. ॥30॥

టీ॥ యుద్ధారంభముననే పలాయనము చిత్తగించుచున్న తీవ్ర భయముతో చెలాచెదురైన సైనికులను చూచి ఇట్లు పలికెను.॥30॥

శ్లో॥ కాలోపపన్నాం రుచిరాం మనస్వినా
ముువాచవాచం పురుష ప్రవీరః ।
హే విప్రచిత్తే నముచే పులోమ
నర్వన్మయా శమ్బర మే శ్రుణుధ్వమ్॥31॥

తా॥ పురుషులలో గొప్పవీరుడైన స్వాభిమానముగల వృత్రాసురుడు వారి మనస్సులను హరించునట్లుగా సమయోచితముగా ఇట్లు పలికెను – ఓ విప్రచిత్తుడా! నముచీ! పులోముడా! మయా! అనర్వా! శంభరా! నా మాటను వినుడు. (31)

టీ॥ తదేవ విశినష్టి కాలోపపన్నా మవసరోచితామ్. మనస్వినాం రుచిరామ్ హే మయ హే అనర్వన్ మే వాచం శ్రుణుత. ॥31॥

టీ॥ స్వాభిమానముగల, మనోహరమైన, సమయోచితమైన మాటలను వృత్రాసురుడు పలికెను. ఓ మయుడా! ఓ అన్వరా! నా మాటలను వినుడు. ॥31॥

శ్లో॥ జాతస్య మృత్యుర్ధ్రువ ఏష సర్వతః
ప్రతిక్రియా యస్య న చేహ క్లుప్తా ।
లోకో యశశ్చాథ తతో యది హ్యముం
కో నామ మృత్యుం న వృణీత యుక్తమ్ ॥ (32)

తా॥ పుట్టిన ప్రతివానికి మృత్యువు నిశ్చితము. ఈ లోకమందు మృత్యువునకు ప్రతీకారము లేదు. దాని వలన పుణ్యలోకములు, యశస్సును కలుగును. తగినట్లుగా వచ్చినట్టి మృత్యువును ఎవరు వరించకుందురు?(32)

టీ॥ తతో మృత్యోరిహ యశో లోకః స్వర్గశ్చ యది స్యాత్ అథ తర్హి అముం మృత్యుం. యుక్తం సమీచీనం ప్రాప్తం వా. ॥32॥

టీ॥ మృత్యువు వలన ఈ లోకమందు యశస్సు మరియు స్వర్గమును లభించును. అందుచేత తగినట్లుగా వచ్చిన ఈ మృత్యువును ఎవడు కోరకుండును?॥32॥

శ్లో॥ ద్వౌ సంమతా విహ మృత్యూ దురాపౌ
యద్బ్రహ్మ సంధారణాయ జితాసుః ।
కలేవరం యోగరతో విజహ్యా
ద్యదగ్రణీర్వీ రశయేఽనివృత్తః ॥ (33)

టీ॥ బ్రహ్మ సంధారణయా కలేవరం జహ్యాదితి యత్స ఏకో మృత్యుః వీరశయే రణభూమావనివృత్తోఽపరాఙ్ముఖః సన్ జహ్యాదితి యత్స ఏకః తౌ ద్వావిహ శాస్త్రే సంమతౌ మృత్యూ. తథా చ స్మృతిః" ద్వావిమౌ పురుషౌ లోకే సూర్య మణ్డలభేదినౌ పరివ్రాడ్యోగయుక్తశ్చ రణే చాభిముఖో హతః" ఇతి. 33॥

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే
దశమోఽధ్యాయః

తా॥ ఈ లోకమందు పొందశక్యము కానివి రెండు మృత్యువులు. ఒకటి యోగవరుడైనవాడు వాయువును బంధించి బ్రహ్మను సంధానముతో ప్రాణత్యాగము చేయుట, రెండవది. యుద్ధరంగమున వెనుకకు మరలకుండా పొందు వీరమరణము. ఈ రెండును దుర్లభములు. (33)

టీ॥ బ్రహ్మమును ధ్యానించుచూ యోగము ద్వారా దేహమును విడిచిపెట్టుట ఒక మృత్యువు. రణభూమియందు పరాఙ్ముఖుడు కాక వీరుడై దేహమును వదిలిపెట్టుట మరొక మృత్యువు. ఈ రెండు మరణములు శాస్త్ర సమ్మతములు. సూర్యమండలమును భేదించు యోగయుక్తుడైన సన్యాసి పొందు మరణము, రణమందు వీరుడు పొందు వీరమరణము అను ఈ రెండు మరణములు లోకమందు ఉత్తమములు అని స్మృతి. ॥33॥

శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆరవ స్కంధమున
పదియవ అధ్యాయము సమాప్తము.

### ఏకాదశోధ్యాయః

అవ॥ ఏకాదశే తు వృత్రస్య యుధ్యమానస్య వజ్రిణా భక్తి జ్ఞాన బలో దర్కాశ్చిత్రా వాచోఽనువర్ణితాః. ॥

### పదకొండవ అధ్యాయము

అవ॥ పదకొండవ అధ్యాయమునందు వజ్రాయుధమును ధరించిన ఇంద్రునితో యుద్ధము చేయుచున్న వృత్రాసురుని యొక్క భక్తి, జ్ఞాన, బలముల ఊహింపచేయు (సూచింపచేయు) చిత్రములైన వాక్కులు వర్ణింపబడినవి.

శ్రీ శుక ఉవాచ.

శ్లో॥ త ఏవం శంసతో ధర్మం వచః పత్యురచేతసః ।
నైవానుగృహ్ణన్భయత్రస్తాః పలాయన పరా నృప ॥ (1)

శ్రీశుకులు పలికిరి.

తా॥ ఓ మహారాజా! ఈ విధముగా చెప్పుచున్న ప్రభువైన వృత్రాసురుని మాటలను భయకంపితులై, వికలమనస్కులై, పారిపోవుట యందే ఆసక్తిగల రాక్షసులు పట్టించుకొనలేదు. (1)

టీ॥ శంసతః కథయతః పత్యుర్వచః॥1॥

టీ॥ చెప్పుచున్నట్టి ప్రభువు యొక్క మాటలను. ॥1॥

శ్లో॥ విశీర్యమాణాం పృతనామాసురీమసురర్షభః ।
కాలామకూలైస్త్రిదశైః కాల్యమానామనాథవత్ ॥ (2)

తా॥ కాలము కలిసి వచ్చిన (అనుకూల) దేవతల చేత, అనాథలవలె చెదిరిపోవునట్లు, తరిమివేయబడుచూ, చంపబడుచున్న రాక్షస సైన్యములను. (తరువాతి తాత్పర్యముతో అన్వయము) (2)

టీ॥ కాలానుకూలైః కాలానువర్తిభిః కాల్యమానాం విద్రావ్యమాణాం. 2

టీ॥ కాలమునను సరించి వర్తించు వారిచేత తరిమివేయబడుచున్న. (2)

శ్లో॥ దృష్ట్వాఽ తప్యత సంక్రుద్ధ ఇంద్ర శత్రురమర్షితః ।
తాన్నివార్యౌజసా రాజనిర్భర్త్స్యేదమువాచ హ ॥ (3)

తా॥ ఓ రాజా! ఇంద్ర శత్రువు అయిన వృత్రాసురుడు దానిని (రాక్షస సంహారమును) చూచి మిక్కిలి క్రుద్ధుడై, సహించలేక, పరితాపమును పొంది వేగముగా బలముతో దేవసైన్యమును నివారించి ఇట్లుపలికెను. 3

టీ॥ అమర్షితోఽ సహమానస్తాంస్త్రి దశాన్నివార్య నిర్భర్త్స్యచేదం వక్ష్యమాణ మువాచ. ॥3॥

టీ॥ సహించనివాడై దేవసైన్యమును నివారించి, బెదిరించి ఇట్లు మాటలను పలికెను. ॥3॥

అవ॥ తదేవాహ - ద్వాభ్యామ్ కిం వ ఇతి. ॥

అవ॥ కింవా ఇత్యాది రెండు శ్లోకములలో దానినే (వృత్రాసురుని మాటలనే ) వివరించుచున్నాడు.

శ్లో॥ కింవ ఉచ్చరితైర్మాతుర్ధావద్భిః పృష్ఠతో హతైః ।
న హి భీతవధః శ్లాఘ్యో న స్వర్గ్యః శూరమానినామ్ ॥ (4)

తా॥ తల్లిపట్ల ఉద్ధృతముగా వర్తించి శూరులమని (బాలప్రాయులు) భావించు మీకు పారిపోవుచున్న వారిని వెనుకనుండి కొట్టుట వలన ప్రయోజనమేమి? భయపడిన వారిని సంహరించుట మెచ్చుకోతగినది కాదు, స్వర్గకరమును కాదు. (4)

టీ॥ మాతురుచ్చరితైః పురీషప్రాయైః ప్రథమాన్త పాఠే దేవానాం సంబోధనం పృష్ఠతో హతైర్దైత్యైః కిమ్. నకించిత్. నయశో నాపి ధర్మః తదేవాహ నహీతి. ॥4॥

టీ॥ మాతురిచ్చరితైః అనుటకు బదులుగా మాతురిచ్చరితాః సంబోధనముగల ప్రథమాంత పాఠమున తల్లిపట్ల ఉద్ధృతముగా ప్రవర్తించునట్టి ఓ దేవతలారా! అని దేవతల యొక్క సంబోధనము. పురీష ప్రాయైః - అనగా పసిపిల్లల వయస్సుగల అని అర్థము. వెనుక

శ్లో॥ యది వః ప్రథనే శ్రద్ధా సారం వా క్షుల్లకాహృది ।
అగ్రే తిష్ఠత మాత్రం మేన చేద్గ్రామ్యే సుఖేస్పృహా ॥ (5)

టీ॥ ప్రథనే సంగ్రామే సారం ధైర్యం హృది చేత్తర్హి క్షుల్లకాః క్షుద్రాః మాత్రం క్షణమాత్ర మగ్రే తిష్ఠత. నచేదిహ లోక భోగే స్పృహాస్తి.॥5॥

శ్లో॥ ఏవం సురగణాన్క్రుద్ధో భీషయన్వపుషా రిపూన్ ।
వ్యనదత్సు మహాప్రాణోయేన లోకా విచేతసః ॥ (6)

టీ॥ సురగణాన్. సుమహాన్ప్రాణో బలం యస్య. యేన విచేతసో బభూవుః. ॥6॥

నుండి కొట్టబడిన రాక్షసులచేత ఏమి? ప్రయోజనమేమియులేదని భావము. భయపడిన వారిని చంపుట కీర్తికరము కాదు, ధర్మము కూడా కాదు అని నహీత్యాది శ్లోక పాదమున చెప్పుచున్నాడు. ॥4॥

తా॥ ఓ అల్పులారా! ఒకవేళ మీ హృదయము నందు ధైర్యమున్నచో యుద్ధముపై శ్రద్ధ యున్నచో ఇంద్రియ సుఖముల యందు స్పృహ (కోరిక) లేనివారయితే ఒక్క క్షణము నా ముందు నిలువుడు.(5)

టీ॥ ఓ క్షుద్రులారా! యుద్ధము చేయుటకు మీ హృదయమందు ధైర్యమున్నచో, లోకభోగములయందు ఆసక్తిలేనిచో, క్షణకాలము నా ముందు నిలువుడు. ॥5॥

తా॥ ఈ విధముగా క్రుద్ధుడు మహాబలశాలియును అగు వృత్రుడు తన దేహముతో శత్రువులను భయపెట్టుచూ చేసిన నాదముతో ప్రాణులన్నియు మూర్ఛిల్లెను. (6)

టీ॥ సురగణములను; గొప్పనైన బలము, ప్రాణముగల; దేనిచేత తెలివితప్పిన వారైరో(మూర్ఛిల్లిరో) ॥6॥

శ్లో॥ తేన దేవగణాః సర్వే వృత్ర విస్ఫోటనేన వై ।
నిపేతుర్మూర్ఛితా భూమౌ యథైవాశనినా హతాః ॥ (7)

టీ॥ వృత్రస్య విస్ఫోటనేన నాదేన. ॥7॥

శ్లో॥ మమర్ద పద్భ్యాం సురసైన్యమాతురం
నిమీలితాక్షం రణరఙ్గదుర్మదః
గాం కమ్పయన్నుద్యత శూల ఓజసా
నాలం వనం యూథపతిర్యథోన్మదః ॥ (8)

టీ॥ ఉద్యతం శూలం యేన నాలం వనం నలానాం వనం ఉద్గతో మదో యస్యస యూథపతిర్గజో యథామర్దయతి. ॥8॥

శ్లో॥ విలోక్య తం వజ్రధరోఽత్యమర్షితః
స్వశత్రవేఽభిద్రవతే మహాగదామ్ ।
చిక్షేపతామాపతతీం సుదుఃసహాం
జగ్రాహ వామేన కరేణ లీలయా ॥ (9)

తా॥ పిడుగుపాటు వలన హతులైనట్లు వృత్రాసురుని విస్ఫోటనము చేత దేవగణములన్నియు భూమిపై పడి మూర్ఛిల్లెను. (7)

టీ॥ వృత్రాసురుని నాదముచే. ॥7॥

తా॥ ఏనుగుల గుంపునకధిపతియైన మదించిన గజేంద్రమువలె వృత్రాసురుడు యుద్ధరంగమందు, శూలమును పైకెత్తిపట్టుకొని తన బలముతో భూమిని కంపింపజేయుచూ, భయముతో కళ్ళు మూసుకొని యున్న దేవతలను తన కాళ్ళతో త్రొక్కెను. ॥8॥

టీ॥ ఎత్తబడిన శూలము గలవాడు ఎవడో వాడు ఉద్యత శూలుడు. హెచ్చిన మదము ఎవరికో వాడు ఉద్గతమదుడు. ఏనుగుల గుంపునకు రాజైన గజేంద్రుడు ఏ విధముగా పద్మముల లేదా వెదురు వనమును మర్దించునో త్రొక్కునో అట్లే. ॥8॥

తా॥ దానిని చూచి సహించని వజ్రధరుడు(ఇంద్రుడు) తనపైకి పరుగెత్తి వచ్చుచున్న వృత్రునిపైకి పెద్దగదను విసిరివేసెను. తనపైకి దూసుకువచ్చుచున్న సహింపశక్యముకాని ఆగదను వృత్రుడు ఎడమ చేతితో అవలీలగా పట్టుకొనెను. ॥9॥

శ్లో॥ స ఇంద్రశత్రుః కుపితో భృశంతయా
మహేంద్రవాహం గదయోగ్ర విక్రమః ।
జఘాన కుమ్భస్థల ఉన్నదన్మృధే
తత్కర్మసర్వే సమపూజయన్నృప ॥ (10)

తా॥ ఓ రాజా! ఇంద్రునకు శత్రువు, భయంకరమైన పరాక్రమముగల ఆ వృత్రుడు మిక్కిలి కోపించినవాడై బిగ్గరగా నాదము చేయుచూ, గదతో ఇంద్రుని వాహనమైన ఏనుగు(ఐరావతము) యొక్క కుంభ స్థలము నందు మోదెను. ఆ పనిని అందరు ప్రశంసించిరి.॥10॥

శ్లో॥ ఐరావతో వృత్ర గదాభిమృష్టో
విఘూర్ణితోఽద్రిః కులిశాహతో యథా
అపాసరద్భిన్న ముఖః సహేంద్రో
ముఞ్చన్నసృక్సప్తధనుర్భృశార్తః ॥ (11)

తా॥ వృత్రుడు గదతో కొట్టగా ముఖము పగిలిన ఐరావతము అధికమైన బాధను పొంది, వజ్రముచే కొట్టబడిన పర్వతమువలె గిరగిర తిరుగుచూ రక్తమును గ్రక్కుచూ ఇంద్రునితో సహా ఏడు ధనుస్సుల దూరము వెనుకకు పోయెను. ॥11॥

టీ॥ సప్త ధనుః ప్రమాణం దేశం. ॥9,10,11॥

టీ॥ ఏడు ధనుస్సుల ప్రమాణముగల ప్రదేశము. ॥9,10,11॥

శ్లో॥ న సన్న వాహాయ విషణ్ణ చేతసా
ప్రాయుఙ్క్తభూయః సగదాం మహాత్మా
ఇంద్రోఽమృతస్యందికరాభిమర్శ
వీతవ్యథః క్షతవాహోఽవతస్థే ॥ (12)

తా॥ వాహనము మూర్ఛిల్లగా ఖేదమును పొందిన ఇంద్రునిపైకి మహాత్ముడైన వృత్రుడు గదను మరల ప్రయోగించలేదు. ఇంద్రుడు తన అమృతహస్తముతో ఐరావతమును స్పృశించగా దాని వ్యథ తొలిగెను. వాహనమగు ఐరావతము గాయపడుటచే ఇంద్రుడు క్రింద నిలిచెను.॥12॥

టీ॥ సన్నోఽవసన్నో వాహో యస్య తస్మై న ప్రాయుఙ్క్త అమృతస్యన్దీ

టీ॥ విషణ్ణమైన వాహనముగల వానిపై మరల వృత్రుడు గదా

అమృత స్రావీయః స్వకరస్తేనాభిమర్శః స్పర్షస్తేన వీతవ్యథో గత దుఃఖః క్షతో వాహో యస్యేంద్రస్య స తథా భూతోऽవతస్థే. ॥12॥

శ్లో॥ స తం నృపేంద్రాహవ కామ్యయా రిపుం
వజ్రాయుధం భ్రాతృ హణం విలోక్య
స్మరంశ్చ తత్కర్మ నృశం సమంహః
శోకేన మోహేన హసన్ జగాద ॥ (13)

టీ॥ స వృత్రః హే నృపేంద్ర ఆహవ కామ్యయా యుద్ధేచ్ఛయావస్థితమ్ భ్రాతృహణం భ్రాతా విశ్వరూపస్తస్య హన్తారమ్. నృశంసం క్రూరం తదేవాంహః పాపం తస్య కర్మ స్మరన్. ॥13॥

వృత్ర ఉవాచ

శ్లో॥ దిష్ట్యా భవాన్మే సమవస్థితో రిపుర్యో
బ్రహ్మహా గురుహా భ్రాతృహా చ ।
దిష్ట్యాऽనృణోऽద్యాహమసత్తమత్వయా
మచ్ఛూల నిర్భిన్న దృషద్ధృదాऽచిరాత్ ॥ (14)

ప్రయోగము చేయలేదు. అమృతమును కురిపించు తన స్వహస్తములచే ఇంద్రుడు ఐరావతమును నిమరగా దానికి గాయము యొక్క బాధ తొలిగెను. ఇంద్రుడు మరల యుద్ధమునకై నిలిచెను.॥12॥

తా॥ ఓ రాజా! తన సోదరుని చంపిన, యుద్ధకాంక్షతో వజ్రమును ధరించిన, తనకు శత్రువైన ఇంద్రుని చూచి, అతడు చేసిన పాప కర్మములను తలచుకొని, వృత్రుడు శోకముతో, మోహముతో నవ్వుచూ, అతనితో ఇట్లనెను. ॥13॥

టీ॥ ఓ రాజా! ఆ వృత్రుడు యుద్ధకాంక్షతో నిలిచినప్పుడు తన సోదరుడైన విశ్వరూపుని చంపిన, క్రూరుడైన ఇంద్రుని చూచి అతడు చేసిన ఘోర పాపకృత్యములను తలచుకొని అతనితో ఈ విధముగా పలికెను. ॥13॥

వృత్రుండు పలికెను.

తా॥ ఓ! దుర్మార్గుడా! బ్రహ్మహత్య చేసినవానివి, గురుహత్య చేసిన వానివి, నా సోదరుని చంపినవానివగు నీవు దైవవశముచే ఈనాడు నా ఎదుట నిలిచితివి. నా శూలముచే రాతివంటి నీ హృదయమును (శీఘ్రముగా) ముక్కలు ముక్కలుచేసి ఋణ విముక్తుడనగుదును. (14)

టీ॥ యో బ్రహ్మహా బ్రాహ్మణం హతవాన్విశేషతః స్వగురుం మమ చ భ్రాతరం సమమాగ్రత ఉపావస్థితః ఏతద్దిష్ట్యా భద్రం జాతమ్ దిష్ట్యేత్యవ్యయమానన్దార్థే హే అసత్తమ మమ శూలేన నిర్భిన్నం దృషత్తుల్యం హృత్ హృదయం యస్య తేన త్వయా నిమిత్త భూతేనాద్యాచిరాదేవ భ్రాతురనృణోఽహం స్యామేతచ్చదిష్ట్యా. ॥14॥

టీ॥ ఎవడు బ్రాహ్మణుని విశేషించి స్వ గురువును మరియు నా సోదరుని చంపెనో వాడు దైవవశముచే నా ముందఱ నిలిచి ఉన్నాడు. ఇది ఆనందదాయకము. దిష్ట్యా అనుపదము అవ్యయము– ఆనందము అను అర్థమున ప్రయోగించబడినది. ఓ దుష్ట శ్రేష్ఠుడా! నా శూలము చేత ఱాతివలె కఠినమైన నీ హృదయమును శీఘ్రముగా ముక్కలుచేసి సోదరుని ఋణము నుండి విముక్తుడనగుదును. ॥14॥

శ్లో॥ యోనోఽగ్రజస్యాత్మవిదో ద్విజాతే
ర్గురోరపాపస్య చ దీక్షితస్య ।
విశ్రమ్య ఖడ్గేన శిరాంస్య వృశ్చ
త్పశోరివా కరుణః స్వర్గకామః ॥15॥

తా॥ స్వర్గమును కోరువాడవై, దయలేనివాడవై, ఆత్మజ్ఞాని, బ్రాహ్మణుడు, అపాపుడు, దీక్షితుడైన నా సోదరుని నమ్మించి అతని శిరములను కత్తితో పశువు తలనువలె ఖండించితివి. (15)

టీ॥ య ఇతి స్వర్గకామో యో భవాన్ అవృశ్చత స్వర్గకామో యాజ్ఞికః పశోరివేతి వా. ॥15॥

టీ॥ స్వర్గకాముడవైన నీవు యాజ్ఞికుడు పశువు తలనువలె ఖండించితివి. ॥15॥

శ్లో॥ హ్రీ శ్రీ దయా కీర్తిభిరుర్ఘితం త్వాం
స్వకర్మణా పురుషాదైశ్చ గర్హ్యమ్ ।
కృచ్ఛ్రేణ మచ్ఛూల విభిన్న దేహ
మస్పృష్ట వహ్నిం సమదన్తి గృధ్రాః ॥ (16)

తా॥ సిగ్గు, సంపద, దయ, కీర్తి మొదలగు వానిని విడిచిపెట్టినట్టి, రాక్షసులచే సైతము గర్హించతగినట్టి నీ యొక్క దుష్టమైన కృత్యములకు, నీ శరీరము నా శూలముతో ముక్కలుకాగా, అగ్నిచే సంస్కరించబడని నీ దేహమును గ్రద్దలు చక్కగా తినగలవు. (16)

టీ॥ తం త్వామస్పృష్ట వహ్నిమదగ్ధ దేహం సమదన్తి వర్తమాన సామీప్యే వర్తమానవన్నిర్దేశః. ॥16॥

టీ॥ దహనసంస్కారమునకు నోచుకొనని నీ దేహమును చక్కగా భక్షించగలవు. వర్తమానమునకు సమీపమునగల భూత భవిష్యత్తులను వర్తమానమువలె నిర్దేశించుట శాస్త్రసమ్మతము.॥16

శ్లో॥ అన్యేఽనుయే త్వేహ నృశంసమజ్ఞాయే
హ్యుద్యతాస్త్రాః ప్రహరన్తి మహ్యమ్ ।
తైర్భూతనాథాన్సగణాన్నిశాత
త్రిశూల నిర్భిన్న గలైర్యజామి ॥ (17)

తా॥ క్రూరుడవగు నిన్ను అజ్ఞానమున కొందరు అనుసరించి, ఇక్కడ నాపై అస్త్రప్రయోగమునకై సిద్ధపడియున్నారో, వారిని నేను నా వాడియైన శూలముచే ముక్కలుగా చేసి వారి కుత్తుకలతో భూత గణయుక్తులైన నాథులను పూజించెదను. (17)

టీ॥ అన్యేపి యే అజ్ఞా ఇహ త్వా త్వాం నృశంసమనుమహ్యముద్య తాస్త్రాః సన్తాః యాదప్రహరన్తి తైర్భూతనాథాన్భైరవాదీన్యక్ష్యామి కథం భూతైః నిశాతం తీక్ష్ణీ కృతం యన్మమ త్రిశూలం తేన నిర్భిన్నో గలో యేషాం తైః. ॥17॥

టీ॥ నీవు క్రూరుడవని తెలియక నిన్ను అనుసరించుచూ, నాపై ఎత్తిపట్టుకొన్న అస్త్రములుగల ఏ అజ్ఞులు కలరో వారు ఒకవేళ నన్ను కొట్టెదరో, వారిని – ఎట్టివారిని? బాగుగా పదునుపెట్టబడిన ఏ నా త్రిశూలము గలదో దానిచే ఉత్తరింపబడిన కుత్తుకలుగల వారిని భైరవాది భూత నాయకులకు సమర్పించి పూజించగలను. ॥17॥

శ్లో॥ అథో హరేమే కులిశేన వీర
హర్తా ప్రమథ్యైవశిరోయదీహ
తత్రానృణో భూతబలిం విధాయ
మనస్వినాం పాదరజః ప్రపత్స్యే॥18॥

తా॥ ఓ వీరుడా! ఇంద్రుడా! అట్లుగాక నీవే ఇచట నా శిరస్సును నీ వజ్రాయుధముతో ఖండించినచో నా శరీరమును భూతములకు బలిగా (ఆహారముగా) సమర్పించి ఋణ విముక్తుడనై స్వాభిమానము గల వాని యొక్క పాదరజస్సును(ధూళిని) పొందగలను. (18)

టీ॥ అథో అథవా హారేభో ఇంద్ర యది భవానేవ మమశిరో హర్తా హరిష్యతి తత్ర తథా సత్య నృణో విముక్త కర్మబంధః సన్భూతేభ్యో బలిం దేహేన విధాయ మనస్వినాం పాదరజః ప్రపత్స్యే ధీరణాం పదం ప్రాప్స్యామి. ॥18॥

టీ॥ అట్లుకానిచో ఓ ఇంద్రుడా! ఒకవేళ నీవే నా శిరస్సును తొలగించినచో సత్యముగా ఋణ విముక్తుడనై కర్మబంధనమును తొలగించుకొని, భూతములకు నా దేహమును బలినిగా సమర్పించి ధీరులు పొందు పదమును (వీరస్వర్గమును) పొందుదును. ॥18॥

అవ॥ జీవితాదపి మృత్యురేవ మమాభిమత ఇత్యాశయే నాహ సురేశేతి.

అవ॥ సురేశేత్యాది శ్లోకమున "జీవించుటకన్న మరణించుటయే మేలు" అని నా యొక్క అభిప్రాయము అని చెప్పబడుచున్నది.

శ్లో॥ సురేశ కస్మాన్న హినోషి వజ్రం
పురః స్థితే వైరిణి మయ్యమోఘమ్ ।
మాసంశయిష్ఠాగ దేవ వజ్రం
స్యాన్నిష్ఫలం కృపణార్థేవ యాచ్ఞా ॥ (19)

తా॥ ఓ ఇంద్రా! నీ ముందే నిలిచియున్న నీ శత్రువునైన నా యందు అమోఘమైన నీ వజ్రాయుధమును ఏల ప్రయోగించకున్నావు? ఇంతకు పూర్వము ప్రయోగించిన గదవలె, లోభిని యాచించిన ప్రయోజనము లేనట్లు నిష్ఫలమగునని సందేహింపకుము. (19)

టీ॥ నహినోషి నహిక్షిపసి గదేవ విఫలో యాస్యతీతి సంశయం మా కార్షీః కృపణాదర్థః ప్రయోజనం యస్యాః సా యాచ్ఞా యథా నిష్ఫలా తథా నస్యాత్. ॥19॥

టీ॥ ఏల ప్రయోగింపకున్నావు, గదవలె విఫలమగునని సంశయింపకుము. కృపణుని(లోభిని) యాచించుటవలె నిష్ఫలమగు నని భావించుచున్నావా! అట్లు గాదు అనగా వజ్రాయుధ ప్రయోగము నిష్ఫలముగాదని భావము. ॥19॥

అవ॥ అమోఘత్వే హేతుం వదంస్తం ప్రోత్సాహయతి నన్వితి.

అవ॥ అమోఘత్వమునకు హేతువును చెప్పుచూ ఇంద్రుని ప్రోత్సహించుచున్నాడు- న, ఇత్యాది శ్లోకమున.

శ్లో॥ నత్వేష వజ్రస్తవ శక్ర తేజసా
హరేర్దధీచేస్తపసా చ తేజితః ।
తేనైవ శత్రుం జహి విష్ణు యంత్రితో
యతో హరిర్విజయః శ్రీర్గుణాస్తతః ॥ (20)

తా॥ ఓ శక్రా! నీ వజ్రాయుధము శ్రీహరి యొక్క తేజస్సుచేతను దధీచి యొక్క తపస్సు చేతను ప్రకాశవంతమైనది. విష్ణువుతో నియమింపబడినవాడవైన నీవు దానితో నీ శత్రువును సంహరింపుము. ఎటువైపు శ్రీహరి యుండునో అటువైపే విజయము. సంపద, గుణములుండును. (20)

టీ॥ తేజితస్తీక్ష్ణీకృతః శత్రుం మాం జహి విష్ణునా యన్త్రితః ప్రేరితః ॥20॥

టీ॥ తీక్ష్ణము(పదును)చేయబడినది. శత్రువునైన నన్ను జయించుము విష్ణువుచే ప్రేరేపించబడినవాడవై. ॥20॥

అవ॥ హననేన మమ పీడాస్యాదిత్యపి మాసంశయిష్ఠా ఇత్యాహ - అహమితి.

అవ॥ అహమిత్యాది శ్లోకమున నన్ను కొట్టుటచేత నాకు పీడ కలుగునని సంశయింపకుము అని చెప్పబడుచున్నది.

శ్లో॥ అహం సమాధాయ మనో యథాహ
సంకర్షణస్తచ్చరణారవిన్దే ।
త్వద్వజ్రరంహో లులిత గ్రామ్యపాశో
గతింమునేర్యామ్య పవిద్ధలోకః ॥ (21)

తా॥ సంకర్షణుడు చెప్పినట్లుగా నేను ఆయన పాదపద్మములయందు నా మనస్సును నిలిపి నీ యొక్క వజ్రాయుధముచే తెగకొట్టబడిన విషయ భోగపాశములు కలవాడనై, మునులు (ఆత్మజ్ఞానులు) పొందు గతిని పొందెదను.(21)

టీ॥ సంకర్షణో మత్ప్రతిర్యథాహ తథా తదీయ చరణారవిన్దో మనః సమాధాయ మునేర్యోగినో గతిమహం యాస్యామి. తవ వజ్రస్య రంహసాలులితశ్ఛిన్నో గ్రామ్యపాశో విషయ భోగలక్షణో యస్య. అపవిద్ధ లోకస్త్యక్తదేహః. ॥21॥

టీ॥ నా ప్రభువు అయిన సంకర్షణుడు చెప్పినట్లుగా ఆయన చరణారవిందముల యందు నా మనస్సును నిలిపి నీ యొక్క వజ్రాయుధము యొక్క వేగముచే విషయభోగవాసనల పాశములను త్రెంచివేయబడగా ఈ దేహమును త్యజించి యోగులు పొందు గతిని పొందగలను.॥21॥

అవ॥ తర్హి భగవాన్సంకర్షణః స్వభృత్యాయ మహ్యమేవ స్వర్గాది సంపదో దాస్యతీత్యపి మా సంశయిష్ఠా ఇత్యాహ – పుంసామితి.

అవ॥ పుంసామిత్యాది శ్లోకమున అయినచో సంకర్షణడు తన సేవకుడనైన నా కొఱకు స్వర్గాది సంపదలను ఇవ్వగలడని కూడ సంశయించకుము అని చెప్పబడుచున్నది.

శ్లో॥ పుంసాం కిలైకాన్తధియాం స్వకానాం
యాః సంపదో దివి భుమౌ రసాయామ్ ।
నరాతి యద్ద్వేష ఉద్వేగ ఆధిర్మదః
కలిర్వ్యసనం సంప్రయాసః ॥ (22)

తా॥ తన యందు అనన్య భక్తి కలిగిన మానవులకు భగవానుడు భూలోక, స్వర్గలోక మరియు రసాతలములందు గల సంపదలను ఈయడు. వీనివలన ద్వేషము, భయము, మనస్సంతాపము, గర్వము, కలహము, దుఃఖము అను కష్టములు ఏర్పడును. (22)

టీ॥ స్వర్గే భూమౌ రసాతలే చ యాః సంపదస్తాః కిల నిశ్చితం న రాతి న దదాతి. తత్ర హేతుః యద్యా భ్యో ద్వేషాదయో భవన్తి.॥22॥

టీ॥ స్వర్గమందు, భూలోకమందు, రసాతలమునందు ఏ సంపదలు కలవో వానిని నిశ్చయముగా ఈయడు. అందుకు కారణము ఆ సంపదల వలన ద్వేషాది దోషములు ఏర్పడును .॥22॥

శ్లో॥ త్రైవర్గికాయా సవిధాతమస్మ
తృతిర్విధత్తే పురుషస్య శక్ర ।
తతోఽనుమేయో భగవత్ప్రసాదో
యోదుర్లభోఽకించన గోచరోన్యైః ॥ (23)

తా॥ ఓ ఇంద్రా! మన ప్రభువు, పురుషునకు త్రైవర్గికముల (ధర్మార్థ కామముల) కొఱకు గల ఆయాసముల వినాశమును కలిగించును. (మోక్షమునిచ్చును) భగవత్ప్రసాదము (అనుగ్రహము) దుర్లభమైనది. ఇతరులకు ఏ మాత్రమును గోచరము కానిది. (23)

టీ॥ తర్హి స్వభక్తస్య కింవిధత్తే తత్రాహ - త్రైవర్గికో ధర్మార్థ కామ విషయో య ఆయాసస్తస్య విధాతం విధత్తే. తత ఆయాసో పరమాదనుమేయో నత్వైశ్వర్యాదినా. అతః సమ్యగ్భగవత్ప్రసాదాభావాత్తవ సంపదో భవిష్యన్తీతి భావః. ॥23

టీ॥ అయినచో తన భక్తులకు ఏమి చేయును(ఇచ్చును) అన్నచో చెప్పుచున్నాడు. ధర్మార్థ కామ విషయముల యొక్క ఆయాస వినాశమును చేయును. ఆ ఆయాసమును తొలగించుటయే భక్తుని యెడల అనుగ్రహముగా నిశ్చయింపబడినది. కాని ఐశ్వర్యాదులు కలిగించుటచేత కాదు. అందువలన నీకు సంపద కలుగదు అనుట ఉత్తమమైన భగవత్ప్రసాదము యొక్క అభావమునే సూచించునని భావము. ॥23॥

అవ॥ ఏవమింద్రాయ స్వాభిప్రాయం నివేద్య భగవన్తం ప్రార్థయతే అహమితి.

అవ॥ అహమితి శ్లోకమున ఇంద్రునికి ఈ విధముగా తన స్వాభిప్రాయమును నివేదించి భగవంతుని ప్రార్థించుచున్నాడు.

శ్లో॥ అహం హరే తవ పాదైకమూల
దాసాను దాసో భవితాస్మి భూయః ।
మనః స్మరేతాసుపతేర్గుణాంస్తే
గృణీత వాక్కర్మ కరోతు కాయః ॥ (24)

తా॥ శ్రీహరీ! నేను నీ పాదములనే ఆశ్రయించు దాసులకు దాసుడనుగా మరల జన్మించెదను. ప్రాణనాథుడవగు నీ గుణములను నా మనస్సు స్మరించునుగాక! నోరు నీ గుణములను కీర్తించుగాక! శరీరము నీ కర్మనే చేయుగాక! (నీ యజనము చేయుగాక) 24

టీ॥ తవ పాదావేవ ఏకం మూలమాశ్రయో యేషాం తేషాం దాసానామను దాసో భూయో భవితాస్మి భవిష్యామి భవేయమ్ అసుపతేః ప్రాణనాథస్య తవ గుణాన్మమ మనః స్మరతు వాగపి తానేవ కీర్తయ తు కాయ స్త్వైవ కర్మ కరోతు. ॥24॥

టీ॥ నీ పాదములను ఆశ్రయించిన వారికి దాసానుదాసుడను అగుదును గాక! ప్రాణనాథుని యొక్క గుణములనే నా మనస్సు స్మరించుగాక! వాక్కు కూడ ఆ గుణములను స్తుతించుగాక! శరీరము కూడ నీ సంబంధకర్మలనే ఆచరించునుగాక! (24)

శ్లో॥ ననాక పృష్ఠం న చ పారమేష్ఠ్యం
న సార్వభౌమం న రసాధిపత్యమ్ ।
న యోగ సిద్ధీరపునర్భవం వా
సమంజస త్వాం విరహయ్య కాంక్షే ॥ (25)

తా॥ నిన్ను విడిచిపెట్టి స్వర్గ పదమునుగాని, (ధృవలోకము) బ్రహ్మపదమునుగాని, సార్వభౌమపదముగాని, రసాతలాధిపత్యముగాని, సిద్ధులనుగాని, మోక్షమునుగాని కోరను. (25)

టీ॥ నను కిం దాస్యేన తుభ్యం మహాఫలాని దాస్యామి తత్రాహ – నాక పృష్ఠం ధృవపదం బ్రహ్మ లోకాదికం చ హే సమంజస నిఖిల సౌభాగ్య నిధే త్వా త్వాం విరహయ్య పృథక్కృత్య న కాంక్షే నేచ్ఛామి.॥25॥

టీ॥ నిశ్చయముగా దాస్యముచేత ఏమి ప్రయోజనము? మహా ఫలములను ఇవ్వగలను గదా! అన్నచో చెప్పుచున్నాడు. హే సమంజసా! నిఖిల సౌభాగ్యనిధీ! నిన్ను విడిచి ధృవపదమునుగాని, బ్రహ్మలోకాదులను గాని కోరుకొనను. ॥25॥

శ్లో॥ అజాత పక్షా ఇవ మాతరం ఖగాః
స్తన్యం యథా వత్సతరాః క్షుధార్తాః ।
ప్రియం ప్రియేవ వ్యుషితం విషణ్ణా
మనోఽరవిన్దాక్ష దిదృక్షతే త్వామ్ ॥ (26)

తా॥ ఓ అరవిందాక్షా! రెక్కలురాని పక్షులు తల్లికొఱకై, ఆకలిచే పీడింపబడిన లేగదూడలు తల్లిస్తన్యమునకై, ప్రవాసములోనున్న ప్రియునికై ఖిన్నురాలైన ప్రియురాలివలె నా మనస్సు నిన్ను చూడ గోరుచున్నది. (26)

టీ॥ తర్హి కిమిచ్ఛసి తదాహ – అజాత పక్షాః ఖగా ఘూకాదిభిః పీడితా యథా మాతరమ్. యథా చ దామ్నా బద్ధా బాలవత్సాః స్తన్యమ్. యథా చ వ్యుషితం దూరదేశ గతం ప్రియం కామేన విషణ్ణా ప్రియా తథా మే మనస్తాపత్రయ పీడితం కర్మభిర్బద్ధం చ కామాదిభిర్విషణ్ణం చ త్వాం దిదృక్షతే ద్రష్టుమిచ్ఛతీత్యర్థః. ॥26॥

టీ॥ అయితే ఏమి ఇష్టపడెదవన్నచో చెప్పుచున్నాడు. ఱెక్కలురాని పక్షులు, పెద్దపిట్ట, గుడ్లగూబ మున్నగు వానిచే పీడింపబడి తల్లి కొఱకై, త్రాటితో కట్టివేయబడిన దూడ స్తన్యము కొఱకు, దూరదేశంలో ఉన్న ప్రియుని కొఱకు కామపీడితయైన ప్రియురాలివలె తాపత్రయములచే పీడించబడినదై కర్మ బద్ధమైనట్టి కోరికలచే భగ్నమైనట్టి నా మనస్సు నిన్ను చూడగోరుచున్నది అని భావము.॥26॥

శ్లో॥ మమోత్తమశ్లోకజనేషు సఖ్యం
సంసార చక్రే భ్రమతః స్వకర్మభిః ।
త్వన్మాయయాత్మాత్మ జగదార గేహే
ష్వాసక్త చిత్తస్య న నాథ భూయాత్ ॥ (27)

తా॥ ఓ నాథా! స్వకీయ కర్మములచే సంసార చక్రమునందు తిరుగుచున్న నేను ఉత్తమశ్లోకులైన వారితో మైత్రిని పొందుదును గాక! నీ మాయచే ఏర్పడు ఆత్మ దారాదుల యందు చిత్తమున ఆసక్తి లేకుండునుగాక! (27)

టీ॥ ఉత్తమశ్లోకస్య తవ జనేషు భక్తేష్వేవ సఖ్యం భూయాత్ . త్వన్మాయయా దేహాదిష్వాదిష్వాసక్త చిత్తస్య భూయోఽపి తేష్వాసక్తిర్నభూయాత్. ॥27॥

టీ॥ నీ భక్తులైన జనుల యందు సఖ్యము ఏర్పడుగాక! నీ మాయచే దేహాదుల యందు నా చిత్తము ఉన్నప్పటికి మరల వాటియందు ఆసక్తి ఏర్పడకుండునుగాక! ॥27॥

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే
ఏకాదశోఽధ్యాయః

శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆఱవ స్కంధమున
పదకొండవ అధ్యాయము సమాప్తము.

ద్వాదశోऽధ్యాయః

అవ॥ ద్వాదశేతి విషణ్ణేన స్వయముత్సాహితే నతు. మహేన్ద్రేణ మహాయుద్ధే వృత్రస్య వధ ఈర్యతే.

బుంషిరువాచ

శ్లో॥ ఏవం జిహాసుర్నృపదేహమాజౌ
మృత్యుం వరం విజయాన్మన్యమానః ।
శూలం ప్రగృహ్యాభ్యపతత్సురేన్ద్రం
యథా మహాపురుషం కైటభోऽప్సు ॥ (1)

టీ॥ మహాపురుషం శ్రీవిష్ణుమ్ అప్సు ప్రలయోదకే. ॥1॥

శ్లో॥ తతో యుగాన్తాగ్ని కఠోర జిహ్వమా
విధ్య శూలం తరసాసురేంద్రః ।
క్షిప్త్వామహేంద్రాయ వినద్య వీరో
హతోసి పాపేతి రుషా జగాద ॥ (2)

టీ॥ యుగాన్తాగ్నివత్కఠోరా జిహ్వా శిఖా యస్య తత్. ఆవిధ్య భ్రామయిత్వా. ॥2॥

పన్నెండవ అధ్యాయము

అవ॥ ఈ పన్నెండవ అధ్యాయమునందు స్వయముగా ప్రోత్సహించబడిన ఇంద్రునితో జరిగిన మహాయుద్ధమున ఇంద్రునిచేత వృత్రుని యొక్క సంహారము వివరింపబడినది.

బుంషి పలికెను.

తా॥ ఓ రాజా! యుద్ధమునందు దేహమును విడువగోరుచూ, విజయము కన్నా మృత్యువును గొప్పదిగా తలపోయు వృత్రాసురుడు నీటియందు (ప్రళయజలమందు) కైటభుడు (మహాపురుషునిపై) విష్ణువుపై పడినట్లు శూలమును పట్టుకొని ఇంద్రునిపై బడెను. (1)

టీ॥ మహాపురుషుడు, విష్ణువుపై ప్రళయజలమందు. ॥1॥

తా॥ తరువాత వీరుడు, రాక్షస శ్రేష్ఠుడైన వృత్రుడు ప్రళయకాలాగ్ని వలె జ్వలించు నాలుకలు (మొనలు)గల శూలమును వేగముగా త్రిప్పుచూ ఇంద్రునిపై విసిరి సింహనాదము చేస్తూ ఓ పాపీ! చంపబడితివి అని కోపముతో పలికెను. (2)

టీ॥ ప్రళయాగ్నివలె కఠోరమైన నాలుకలు (మొనలు)గలది ఏదో అది ప్రళయాగ్ని కఠోర జిహ్వా. ఆవిధ్యయను పదమునకు పొడిచి అను వాచ్యార్థము ఉన్నను త్రిప్పి అను లక్ష్యార్థముతో వ్యాసుడు ప్రయోగించినట్లు శ్రీధరుడు భావించినాడు.॥2॥

శ్లో॥ ఖ ఆపతత్తద్విచలద్గ్రహోల్క
వన్నిరీక్ష్యదుష్ప్రేక్ష్యమజాతవిక్లవః ।
వజ్రేణ వజ్రీ శతపర్వణాऽచ్ఛిన
ద్భుజం చ తస్యోరగ రాజభోగమ్ ॥ (3)

తా॥ ఆకాశములో తిరుగుచూ వచ్చిపడుచున్న గ్రహమును, ఉల్కను బోలిన, చూడ శక్యముగాని ఆ శూలమును చూచి భయపడని వజ్రముగలవాడు (ఇంద్రుడు)వంద కణుపులుకల తన వజ్రాయుధము-తో శూలమును ఖండించి, సర్పరాజు పడగను బోలిన వృత్రాసురుని భుజమును కూడ ఖండించెను. (3)

టీ॥ తత్ ఖే ఆపతదాగచ్ఛత్ విచలత్పరిభ్రమత్ గ్రహశ్చోల్కాచ గ్రహోల్కంతద్వద్దుష్ప్రేక్ష్యమ్. శతం పర్వాణి యస్య తేన. ఉరగ రాజో వాసుకిస్తస్య భోగో దేహస్తదాకారమ్. ॥3॥

టీ॥ ఆకాశమునందు తిరుగుచూ వచ్చుచున్న గ్రహమును, ఉల్కను బోలి చూడ శక్యముకాని, ఆ శూలమును వంద కణుపులుగల వజ్రాయుధముతో ఖండించి, ఉరగరాజు(వాసుకి)దేహమును బోలిన వృత్రుని హస్తమును కూడా ఖండించెను.॥3॥
(గ్రహమువలె తిరుగుచూ, ఉల్కవలెప్రకాశించుచూ వచ్చిపడుచున్న)

శ్లో॥ ఛిన్నైక బాహుః పరిఘేణవృత్రః
సంరబ్ధ ఆసాద్యగృహీత వజ్రమ్ ।
హనౌ తతాడేన్ద్రమథామరేభం
వజ్రం చ హస్తాన్న్యపతన్మఘోనః ॥ (4)

తా॥ ఒక హస్తము తెగిన వృత్రుడు కోపించి, పరిఘాయుధముతో (ఇనుపగుదియతో) వజ్రాయుధమును పట్టుకొనియున్న ఇంద్రుని చెక్కిలి పై మరియు దేవగజమైన ఐరావతమును కొట్టగా ఇంద్రుని హస్తము నుండి వజ్రాయుధము జారి క్రింద పడిపోయెను.(4)

టీ॥ హనౌ కపోలప్రాన్తే అమరేభమైరావతం చ. ॥4॥

టీ॥ కపోలభాగమును(దవడల) మరియు ఐరావతమును ॥4॥

శ్లో॥ వృత్రస్య కర్మాతి మహాద్భుతం
తత్సురాశ్చారణసిద్ధ సంఘాః ।
అపూజయంస్తత్పురుహూత సంకటం
నిరీక్ష్యహాహేతి విచుక్రుశుర్భృశమ్ ॥ (5)

తా॥ వృత్రుని యొక్క మిక్కిలి అద్భుతమైన ఆపనిని సురాసురులు సిద్ధ చారణ గణములు ప్రశంసించిరి. ఇంద్రుని సంకటమును చూచి హా హా యని ఆక్రోశించిరి. ॥5॥

శ్లో॥ ఇంద్రో న వజ్రం జగృహే విలజ్జిత
శ్చ్యుతం స్వహస్తాదరి సంనిధౌ పునః ।
తమాహ వృత్రోహర ఆత్తవజ్రో
జహి స్వ శత్రుం న విషాద కాలః ॥ (6)

తా॥ తన చేతి నుండి జారి, శత్రువు ఎదుట పడిన వజ్రాయుధమును మరల తీసుకొనుటకు సిగ్గుపడిన ఇంద్రుడు దానిని తీసుకొనలేదు. వృత్రుడు ఇంద్రుని చేరి వజ్రాయుధమును తీసుకొని స్వ శత్రువును సంహరింపుము. ఇది దుఃఖించు సమయము కాదు అని పలికెను.(6)

టీ॥ పునశ్చ తమాహ వృత్రః హే హరే ఇంద్ర. ॥5,6॥

టీ॥ ఓ ఇంద్రా! అని ఇంద్రునితో మరల చెప్పుచున్నాడు. ॥5,6॥

శ్లో॥ యుయుత్సతాం కుత్ర చిదాతతాయినాం
జయస్తదైకత్ర న వై పరాత్మనామ్ ।
వినైకముత్పత్తి లయస్థితీశ్వరమ్
సర్వజ్ఞమాద్యం పురుషం సనాతనమ్ ॥ (7)

తా॥ యుద్ధముచేయగోరు వారికి, ఆయుధములను ధరించిన వారికి క్రూర కర్మలు చేయువారికి ఎక్కడో ఒకచోట విజయము కలుగవచ్చును. అన్నివేళలా విజయము ఒక వైపున మాత్రమే ఉండదు. తనకు గాని ఇతరులకు గాని ఉండవచ్చును. కాని సనాతనుడు సర్వజ్ఞుడు సృష్టి స్థితి లయములకు ఈశ్వరుడు అయిన ఆది పరబ్రహ్మమునకు సర్వత్ర విజయమే సిద్ధించును. (7)

టీ॥ సదాజయోనైవ కిన్తు కుత్ర చిజ్జయ ఏకత్ర కుత్ర చిన్నైవ. యద్వా కుత్ర చిదపి యుయుత్సతాం సదా జయోనైవ కింత్వేకత్రైవ. కదాచిదేవేత్యర్థః పరోదేహ ఆత్మా యేషాం పరాధీనాత్మ నామితి వా, ఆద్య మనాదిమ్, సనాతనమ్ నిత్యమ్. ॥7॥

టీ॥ ఎల్లప్పుడు జయమే ఉండదు. కాని ఏదో ఒక ప్రక్క జయ ముండును. మరొక ప్రక్క జయముండదు. దేహమే ఆత్మగా భావించు వారికి లేదా పరాధీనులైన వారికి, అనగా దేహము గల వారికి, యుద్ధము చేయగోరు వారికి ఎల్లప్పుడూ జయమే సిద్ధించదు. ఒకప్పుడు లభించును. మరొకప్పుడు లభింపదు. ఆదిలేనివాడు, నిత్యుడు అయిన పరమాత్మకు ఎల్లప్పుడు జయమే ఉండును. ॥7॥

అవ॥ పరాధీనతామేవాహ – లోకా ఇతి సప్తభిః.

అవ॥ లోకాదిగాగల శ్లోకము నుండి ఏడు శ్లోకములలో 'పరాధీనత' చెప్పబడుచున్నది.

శ్లో॥ లోకాః సపాలా యస్యే మే శ్వసన్తి వివశావశే ।
ద్విజా ఇవ శిచా బద్ధాః సకాల ఇహ కారణమ్ ॥ (8)

తా॥ వలలో బంధింపబడిన పక్షులవలె, పాలకులతో కూడిన ఈ జీవులు పరాధీనులై ఏ కాలమునకు వశులై శ్వసించెదరో ఆ కాలమే దీనికి కారణము. (8)

టీ॥ యస్యవశేస్థితాః స్వయం వివశాః సన్తః శ్వసన్తి చేష్టన్తే. ద్విజాః పక్షిణః. శిచా జాలేన కాలః కలయతీతి భగవాన్. ఇహ జయాదౌ కారణమ్. ॥8॥

టీ॥ ఎవని వశమందుండి, వలలో బంధింపబడిన పక్షులవలె, స్వయముగా వివశులమై చేష్టలు చేయుచున్నామో (కదులుచున్నామో) అట్టి కాలస్వరూపుడైన భగవానుడే ఈ జయాదులకు అనగా జయాప జయములకు కారణము. ॥8॥

శ్లో॥ ఓజః సహో బలం ప్రాణమమృతం మృత్యుమేవ చ ।
తమజ్ఞాయ జనో హేతుమాత్మానం మన్యతే జడమ్ ॥ (9)

టీ॥ ఓజ ఆదిరూపమ్ కాలం తం హేతుమజ్ఞాయావిజ్ఞాయ జడం సన్తమాత్మానం దేహం హేతుం మన్యతే. ॥9॥

శ్లో॥ యథా దారుమయీ నారీ యథా మన్త్రమయో మృగః ।
ఏవం భూతాని మఘవన్నీశ తన్త్రాణి విద్ధి భోః ॥ (10)

అవ॥ నను స్వారమ్భక ప్రధాన పురుషాది తన్త్రాణీతి యుక్తం తత్రాహ– పురుష ఇతి.

శ్లో॥ పురుషః ప్రకృతిర్వ్యక్తమాత్మా భూతేంద్రియాశయాః ।
శక్నువన్త్యస్య సర్గాదౌ న వినా యదనుగ్రహాత్ ॥ (11)

తా॥ జీవునియందుగల తేజస్సు, సాహసము, బలము, జీవనము, మరణము అన్నియు కాల స్వరూపములని తెలియక జడమగు తన దేహమే వాటికి హేతువుగా జీవుడు తలపోయుచున్నాడు. (9)

టీ॥ ఓజ ఆదులన్నింటికి రూపమైన కాలమే(భగవానుడే) కారణమని తెలియక జడమైన దేహము(శరీరము)కారణమని అనుకొనుచున్నాడు. 9

తా॥ ఓయీ! ఇంద్రుడా! కర్రతో చేసిన స్త్రీవలెను, యంత్రరూపమైన మృగమువలెను, భూతములు ఈశ్వరుని అధీనములోనున్నవని తెలుసుకొనుము. ॥10॥

అవ॥ పురుష ఇత్యాది శ్లోకమున నిశ్చయముగా స్వయంభువుడు అయిన ప్రధానపురుషునికి ఈ సృష్ట్యాదులు లోబడియున్నవి అని యుక్తముగా చెప్పుచున్నాడు.

తా॥ పురుషుడు, ప్రకృతి, మహత్తత్త్వము, అహంకారము,(ఆత్మ) పంచభూతములు, ఇంద్రియములు, అంతఃకరణములు అన్నియు అతని యొక్క అనుగ్రహము లేకుండగా ఈ జగత్తు యొక్క సృష్ట్యాదులు సమర్థములు కావు. ॥11॥

టీ॥ వ్యక్తం మహత్తత్త్వం ఆత్మాఽహంకారః. ॥10,11॥

టీ॥ ఇచట వ్యక్తమనగా మహత్తత్త్వము అనియు ఆత్మయనగా అహంకారమనియు చెప్పబడినవి. ॥10,11॥

శ్లో॥ అవిద్వానేవమాత్మానం మన్యతేఽనీశమీశ్వరమ్ ।
భూతైః సృజతి భూతాని గ్రసతే తాని తైః స్వయమ్ ॥ (12)

తా॥ ఇట్లు తెలియని అజ్ఞాని ఈశ్వరుని అశక్తునిగా భావించుచున్నాడు. ఈశ్వరుడు భూతములను భూతములచేత సృజించుచున్నాడు. వానిని, వాని ద్వారముననే మ్రింగుచున్నాడు.(12)

టీ॥ నను స్వకర్మ ద్వారా జీవ ఏవ సృష్ట్యాది హేతురితి మీమాంసకామన్యన్తే తత్రాహ - ఏవమవిద్వాననీశమేవాత్మానమీశ్వరమ్ స్వతన్త్రం మన్యతే. నను పిత్రాదయః స్రష్టారో దృశ్యన్తే వ్యాఘ్రాదయస్తు హన్తారస్తత్రాహ - భూతైరితి. స్వయమీశ్వరః. ॥12॥

టీ॥ జీవుడే తన స్వకీయ కర్మల కారణముగా సృష్ట్యాదులకు హేతువు అని మీమాంసకులు చెప్పుచున్నారు కదా! అన్నచో, ఈ విధముగా తెలియక అస్వతంత్రుడైన జీవుని ఈశ్వరునిగా భావించుచున్నారు. భూతైరిత్యాది ఉత్తరార్థముతో స్వయముగా ఈశ్వరుడే చేయుచున్నను పిత్రాదులను స్రష్టలుగాను, వ్యాఘ్రాది జంతువులను హంతకములుగాను చూచుచుందురని చెప్పుచున్నాడు.॥12॥

అవ॥ నను త్వయా పరాజితస్య మమ జయాది శఙ్కైవనాస్తి కిమితి బలా ద్యుద్ధే ప్రవర్తయసి తత్రాహ - ఆయురితి.

అవ॥ ఆయుః ఇత్యాది శ్లోకమున నీ చేత ఓడిన నాకు జయాది శంకయే లేదు. ఎందువలన నన్ను బలవంతముగా యుద్ధమునందు ప్రవర్తింపచేయుచున్నావు అన్నచో-చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆయుః శ్రీః కీర్తిరైశ్వర్యమాశిషః పురుషస్యయాః ।
భవన్త్యేవహి తత్కాలే యథాఽనిచ్ఛోర్విపర్యయాః ॥ (13)

తా॥ వ్యక్తి కోరుకొనకున్నను ఆయువు, సంపద, కీర్తి, ఆశీస్సులు మున్నగునవి మరియు వానికి విరుద్ధములు కూడా తగిన కాలమందే కలుగుచున్నవి. (13)

టీ॥ తత్కాలే జయాదికాలే విపర్యయా అకీర్త్యాదయః. ॥13॥

టీ॥ జయాది కాలమందు అనగా అనుకూల కాలమందు ఆయురాదులు, ప్రతికూల కాలమున తద్విరుద్ధములు అనగా అపకీర్త్యాదులు కలుగును.॥13॥

శ్లో॥ తస్మాదకీర్తి యశసోర్జయాపజయయోరపి ।
సమః స్యాత్సుఖ దుఃఖాభ్యాం మృత్యుజీవితయోస్తథా ॥ (14)

తా॥ అందువలన కీర్తి, అపకీర్తులందు, జయాపజయములందు సుఖ దుఃఖముల యందు, జీవన మరణములందు సమముగా నుండ వలయును. (14)

టీ॥ యస్మాదేవం సర్వమీశ్వరాధీనం తస్మాత్సమః స్యాద్ధర్ష విషాద హీనో భవేత్. ॥14॥

టీ॥ ఈ విధముగా అన్నియును (జయాపజయములు సుఖ దుఃఖములు మున్నగునవన్నియును) ఈశ్వరాధీనములగుట వలన అన్నిటి యందు సముడుగా అనగా హర్ష విషాద రహితుడుగా నుండ వలయును.॥14॥

అవ॥ సమదృష్టావుపాయమాహ – సత్త్వమితి.

అవ॥ సత్త్వమిత్యాది శ్లోకమున సమ దృష్ట్యుపాయమును చెప్పు చున్నాడు.

శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి ప్రకృతేర్నాత్మనో గుణాః ।
తత్ర సాక్షిణ మాత్మానం యోవేద న స బధ్యతే ॥ (15)

టీ॥ హర్షాదిభిర్నబధ్యతే. ॥15॥

అవ॥ హర్ష విషాద నివృత్త్యై తవాహమేవ గురురిత్యాహ - పశ్యేతి.

శ్లో॥ పశ్య మాం నిర్జితం శక్ర వృక్ణాయుధ భుజం మృధే ।
ఘటమానం యథాశక్తి తవ ప్రాణ జిహీర్షయా ॥ (16)

టీ॥ వృక్ణమాయుధం భుజశ్చ యస్య ॥ (16)

శ్లో॥ ప్రాణగ్లహోఽయం సమర ఇష్వక్షో వాహనాసనః ।
అత్ర నజ్ఞాయతేఽముష్య జయోఽముష్య పరాజయః ॥(17)

తా॥ సత్త్వరజస్తమో గుణములు ప్రకృతి గతములే కాని ఆత్మ గుణములు కావు. ఎవడైతే తనను సాక్షిగా తెలియునో వాడు వానిచేత (గుణములచే) బంధింపబడడు. (15)

టీ॥ హర్షాదులచే బంధింపబడడు.॥15॥

అవ॥ పశ్యేతి శ్లోకమున హర్ష విషాదాది విషయముల నివృత్తి యందు నీకు నేనే గురువునని వృత్రుడు చెప్పుచున్నాడు.

తా॥ ఓ ఇంద్రా! యుద్ధమునందు ఆయుధము, భుజము తెగగొట్టబడి నీ ప్రాణములను హరింపవలెనను కోరికతో శక్తి కొలది ప్రయత్నించు-చున్న తీరు చూడుము. (16)

టీ॥ ఎవని యొక్క ఆయుధము, భుజము ఛేదింపబడినదో వాడు వృక్ణాయుధ భుజుడు.॥16॥

తా॥ ప్రాణములే పందెముగా, బాణములే పాచికలుగా, వాహనములే పలకగాగల ఈ సమర ద్యూతమునందు (జ్యూదమందు) వీనికి జయము వీనికి పరాజయము అని తెలియదు. (సమరమనెడిజూదమందు) (17)

టీ॥ అనియతత్త్వం ద్యూతరూపకేణోపసంహరతి ప్రాణ ఏవగ్లహః పణో యస్మిన్. ఇషవ ఏవాక్షాః పాశకా యస్మిన్ . వాహనాన్యేవేతస్తత శ్చాల్య మానాన్యాసనాని ఫలకా యస్మిన్. ॥17॥

టీ॥ జయాపజయముల అనియతత్వమును ద్యూతరూపముగా చెప్పుచూ ఉపసంహరించుచున్నాడు. ఈ సమరమనెడి ద్యూతములో (జూదంలో) ప్రానములే పణము, బాణములే పాచికలు, వాహనములు గడుల పలక. ॥17॥

శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఇంద్రో వృత్ర వచః శ్రుత్వా గతాలీకమపూజయత్ ।
గృహీత వజ్రః ప్రహసంస్తమాహ గత విస్మయః ॥ (18)

శ్రీశుకులు పలికిరి.

తా॥ కపటములేని (యథార్థమైన)వృత్రుని మాటలను విన్న ఇంద్రుడు ఆశ్చర్యమును వీడి అతనిని ప్రశంసించెను. వజ్రాయుధమును స్వీకరించి వానినుద్దేశించి ఇట్లు పలికెను. (18)

టీ॥ గతాలీకం నిష్కపటమ్.॥18॥

టీ॥ కపటంలేని.॥18॥

ఇంద్ర ఉవాచ.

శ్లో॥ అహోదానవ సిద్ధోఽసి యస్య తే మతిరీదృశీ ।
భక్తః సర్వాత్మనాత్మానం సుహృదం జగదీశ్వరమ్ ॥ (19)

ఇంద్రుడు పలికెను.

తా॥ ఓ రాక్షసా! ఇట్టి బుద్ధి (వివేకము) గల నీవు సిద్ధపురుషుడవు. హితకరుడు ఆత్మస్వరూపుడు అయిన జగదీశ్వరుని సేవించినవాడవు. (19)

టీ॥ భక్తః సేవితవానసి. ॥19॥

టీ॥ సేవించినవాడవు.॥19॥

శ్లో॥ భవానతార్షీన్మాయాం వై వైష్ణవీం జన మోహినీమ్ ।
యద్విహాయాసురం భావం మహాపురుషతాం గతః ॥ (20)

తా॥ జనులను మోహములోనుంచు వైష్ణవ మాయను నిశ్చయముగా తరించితివి. అసుర భావమును (లక్షణములను) విడిచిపెట్టి(త్యజించి) మహాపురుషుల స్థితిని పొందితివి.॥20॥

శ్లో॥ ఖల్విదం మహదాశ్చర్యం యద్రజః ప్రకృతేస్తవ ।
వాసుదేవే భగవతి సర్వాత్మని దృఢామతిః ॥ (21)

తా॥ రజోగుణ ప్రధానమగు నీ బుద్ధి సత్త్వగుణ ప్రధానుడైన వాసుదేవుని యందు దృఢముగా నిలిచియుండుట మహదాశ్చర్యము గదా! ॥21॥

శ్లో॥ యస్య భక్తిర్భగవతి హరౌ నిఃశ్రేయసేశ్వరే ।
విక్రీడతోఽమృతామ్భోధౌ కింక్షుద్రైః ఖాతకోదకైః ॥ (22)

తా॥ మోక్షమునకు అధిపతియైన శ్రీహరియందు భక్తి కలిగిన నీకు ఇతరులతో (క్షుద్ర ప్రసంగములతో) పని ఏమి? అమృత సముద్రములో క్రీడించు వానికి ఖాదకోదకములతో (మురికి గుంట మొదలగు వాని నీటితో) పని ఏమి? ॥22॥

టీ॥ తస్య తవ ఖాదకోకైర్గర్తాది జలోపమైః స్వర్గాదిభిః కిమ్.(20-22)

టీ॥ అట్టి నీకు క్షుద్రమైన గుంట మొదలగు వాని యందలి నీటివలె స్వర్గాదులతో పని ఏమి? (20-22)

శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఇతి బ్రువాణా వన్యోన్యం ధర్మం జిజ్ఞాసయా నృప ।
యుయుధాతే మహావీర్యా రీంద్రవృత్రౌ యుధాంపతీ ॥ (23)

శ్రీశుకులు పలికిరి

తా॥ ఓ మహారాజా! ఇంద్ర వృత్రులు యుద్ధమునకు ప్రభువులైన, గొప్ప పరాక్రమముగలవారు. ధర్మమును తెలుసుకొనవలెనను కోరికతో సంగ్రామమున పరస్పరము మాటలాడుచున్నవారై పోరాడిరి. (23)

టీ॥ యుధాం సంగ్రమాణాం పతీముఖ్యౌ. ॥23॥

టీ॥ యుద్ధమునకు ప్రభువులు. ॥23॥

శ్లో॥ ఆవిధ్య పరిఘం వృత్రః కార్ష్ణాయసమరిన్దమః ।
ఇంద్రాయ ప్రాహిణోద్ఘోరం వామహస్తేన మారిష ॥ (24)

తా॥ హే మారిష! ఓ శ్రేష్ఠ రాజా! శత్రువులను శాసించు వృత్రుడు లోహముతో చేయబడిన ఘోరమైన (భయంకరమైన) పరిఘను ఎడమ చేతితో త్రిప్పి ఇంద్రునిపై విసిరెను. (24)

టీ॥ హే మారిష శ్రేష్ఠ రాజన్. ॥24॥

టీ॥ ఓ గొప్పరాజా! ॥24॥

శ్లో॥ స తు వృత్రస్య పరిఘం కరం చ కరభోపమమ్
చిచ్ఛేద యుగపద్దేవో వజ్రేణ శత పర్వణా ॥ (25)

తా॥ కాని ఇంద్రుడు వృత్రుని పరిఘను, ఏనుగు తొండమును బోలిన అతని చేతిని వంద కణుపులుగల వజ్రాయుధముతో ఒకేసారి ఖండించెను. ॥25॥

శ్లో॥ దోర్భ్యాముత్కృత్తమూలాభ్యాం బభౌ రక్త స్రవోஉసురః ।
ఛిన్నపక్షో యథా గోత్రః ఖాద్భ్రష్టో వజ్రిణా హతః ॥ (26)

తా॥ వజ్రధరుడైన ఇంద్రునిచేత రెండు బాహువులు మొదళ్ళ వఱకు నరుకబడగా, రక్తము ఓడుచూ, ఱెక్కలు తెగి ఆకాశము నుండి నేల కూలిన పర్వతములవలె వృత్రుడు శోభించెను. (26)

టీ॥ ఉత్కృత్తం మూలం యయోస్తాభ్యామ్. రక్తం స్రవతీతి తథా గోత్రః పర్వతః.॥25,26॥

టీ॥ రెండు చేతులు మొదళ్ళ వరకు నరకబడగా ఱెక్కలు తెగిన పర్వతమువలె రక్తము ఓడుస్తూ వృత్రుడు శోభిల్లెను. ॥25,26॥

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్లో॥ కృత్వాఽధరాం హనుం భూమౌ దైత్యో దివ్యుత్తరాం హనుమ్।
నభో గమ్భీర వక్త్రేణ లేలిహోల్బణ జిహ్వయా ॥ (27)

తా॥ ఆ వృత్రుడు క్రింది దవడను భూమిమీదను, పై దవడను స్వర్గము నందు ఉంచి ఆకాశమువంటి పెద్దదైన నోటితో, పామువలె భయంకరమగు నాలికతో... (27)

టీ॥ కృత్వాఽధరామిత్యాదేర్జగ్రాసేతి తృతీయేనాన్వయః. నభోవద్గంభీరేణ వక్త్రేణ. లేలిహః సర్పస్తద్వదుల్బణయా జిహ్వయా. ॥27॥

టీ॥ లేలిహ జిహ్వయా అను పాఠాంత పదము 29వ శ్లోకమందలి జగ్రాస యను పదముతో అన్వయము. ఆకాశమువంటి గంభీరమైన పెద్ద వక్త్రముతో(నోటితో) లేలిహః-సర్పం సర్పమువలె భయంకరమైన నాలుక. ॥27॥

శ్లో॥ దంష్ట్రాభిః కాలకల్పాభిర్గ్రసన్నివ జగత్త్రయమ్ ।
అతి మాత్ర మహాకాయ ఆక్షిపన్ తరసా గిరీన్ ॥ (28)

తా॥ మిక్కిలి పెద్దదైన శరీరముగలవాడై, మృత్యువును బోలిన కోఱలతో ముల్లోకములను మ్రింగుచున్న వానివలె పర్వతములను కదిలించుచు... (28)

టీ॥ కాలకల్పాభిః కాలతుల్యాభిర్దంష్ట్రాభిర్గ్రసన్నివ ఆక్షిపన్ చాలయన్. ॥28॥

టీ॥ కాలము (మృత్యువు) వంటి కోఱలచే మ్రింగుచున్న వానివలె పర్వతములను కదిలించుచు. ॥28॥

శ్లో॥ గిరిరాట్ పాదచారీవ పద్భ్యాం నిర్జరయన్ మహీమ్
జగ్రాస ససమాసాద్య వజ్రిణం సమవాహనమ్॥29॥

తా॥ కాళ్ళపై నడచు పర్వతరాజువలె పాదములతో భూమిని చూర్ణము చేయుచూ, (దగ్గఱగా వచ్చి) వజ్రధరుడైన ఇంద్రుని, వాహనముతో సహా మ్రింగెను. (29)

టీ॥ నిర్జరయన్ చూర్ణయన్. ॥29॥

శ్లో॥ మహాప్రాణో మహావీర్యో మహాసర్ప ఇవ ద్విజమ్ ।
వృత్ర గ్రస్తం తమాలక్ష్య స ప్రజాపతయః సురాః ॥ (30)

టీ॥ మహాప్రాణో మహాబలః మహావీర్యో మహాప్రభావః. ॥30॥

శ్లో॥ హాకష్టమితి నిర్విణ్ణాశ్చుక్రుశుః సమహర్షయః
నిగీర్ణో౽ప్యసురేంద్రేణ నమమారోదరం గతః
మహాపురుష సన్నద్ధో యోగమాయా బలేన చ ॥ (31)

టీ॥ మహాపురుషేణ కవచ రూపేణ శ్రీనారాయణేన సన్నద్ధో దంశితః యోగబలేన మాయాబలేన చ. ॥31॥

శ్లో॥ భిత్వా వజ్రేణ తత్కుక్షిం నిష్క్రమ్య బలభిద్విభుః
ఉచ్చకర్తశిరః శత్రోర్గిరిశృఙ్గమివౌజసా ॥ (32)

టీ॥ చూర్ణము చేయుచూ. ॥29॥

తా॥ మహాబలముగల, గొప్పనైన పరాక్రమముగల మహాసర్పము ఏనుగును మ్రింగినట్లు వృత్రునిచే మ్రింగివేయబడిన ఇంద్రుని చూచి ప్రజాపతులతో కూడిన దేవతలు. (30)

టీ॥ గొప్ప బలముగల, గొప్ప ప్రభావముగల. ॥30॥

తా॥ మహర్షులతో కూడినవారై అయ్యో! కష్టము అని నిర్విణ్ణులై ఆక్రోశించిరి. వృత్రునిచే మ్రింగివేయబడి ఉదరమునందుచేరిన ఇంద్రుడు మహాపురుషుడైన నారాయణుని కవచ ప్రభావమున, యోగమాయా బలముచే మరణించలేదు. (31)

టీ॥ దోమవలె మ్రింగబడిన ఇంద్రుడు, మహాపురుషుడైన నారాయణుని కవచ ప్రభావముచేత కలిగిన యోగబలముచే మాయా బలముచే జీవించియే యుండెను. ॥31॥

తా॥ (బలాసురుని సంహరించిన) ఇంద్రుడు అసురుని పొట్టను చీల్చుకొని బయటకు వచ్చి, తన వజ్రాయుధముచేత పర్వత శిఖరము వంటి వాని తలను (పరాక్రమముతో) ఖండించెను. (32)

టీ॥ బలభిదిన్ద్రః ఉచ్చకర్తచిచ్ఛేద. ॥32॥

టీ॥ ప్రభువైన ఇంద్రుడు (బాణాసురుని సంహరించిన ఇంద్రుడు) ఖండించెను. ॥32॥

శ్లో॥ వజ్రస్తు తత్కన్ధరమాశు వేగః
కృన్తన్సమన్తాత్పరివర్తమానః ।
న్యపాతయత్తావదహర్గణేన
యో జ్యోతిషామయనే వార్త్ర హత్యే ॥ (33)

తా॥ అధిక వేగముతో ఆ వజ్రాయుధము వృత్రుని సంహరించుట యందు అన్ని వైపుల తిరుగుచున్నది. వాని మెడను నఱకుచు కొన్ని రోజులలో పడవేసెను. ఆ కాలములో అనగా వృత్రాసురుని వధకు తగిన కాలమున నక్షత్రమార్గమున దక్షిణ-ఉత్తర అయనముల గతిని (ఒక సంవత్సరకాలమును) పూర్తిచేసెను. (33)

టీ॥ తస్య కన్ధరం ఆశువేగోతివేగాన్ జ్యోతిషామ్ సూర్యాదీనామ్ అయనే దక్షిణోత్తర గతిరూపే సంవత్సరే యోఽహర్గణః షష్ట్యుత్తర శత త్రయాత్మకస్తావతాఽహర్గణేన్మవార్త్రహత్యే వృత్ర హత్యా యోగ్యే కాలే న్యపాతయత్. యద్వాస్వార్థే తద్ధితః వృత్రహత్యాయాం వృత్ర హననార్థం పరివర్తమాన ఇత్యర్థః. ॥33॥

టీ॥ అతి వేగముగా తిరుగుచున్న వజ్రము వాని మెడను కత్తిరించుచు, సూర్యాది నక్షత్రముల యొక్క దక్షిణోత్తరగత రూపమున మూడు వందల అఱువది రోజుల వ్యవధి గల సంవత్సరమందు, వృత్రాసురుని చంపుటకు అనువైన కాలము కొఱకు తిరుగుచూ ఖండించెను. ॥33॥

శ్లో॥ తదా చ ఖే దుందుభయో వినే
దుర్గన్ధర్వ సిద్ధాః స మహర్షి సంఘాః ।
వార్త్రఘ్ను లిఙ్గైస్తమభిష్టువానాః
మన్త్రైర్ముదా కుసుమైరభ్య వర్షన్ ॥ (34)

తా॥ అప్పుడు ఆకాశమందు దుందుభులు మ్రోగెను. మహర్షి సమూహములచే కూడిన గంధర్వులు, సిద్ధులు వృత్రాసురుని సంహరించిన ఇంద్రుని పరాక్రమమును వెల్లడిచేయు మంత్రములతో అభిముఖముగా స్తుతించుచూ, ఆనందముతో పుష్పవర్షము కురిపించిరి. (34)

టీ॥ వార్త్రఘ్ను లింజ్గైర్వ ృత్రహన్తుర్వీర్య ప్రకాశకైఃవార్త్రహత్యాయ శవసే పృతనాషాహ్యా చ ఇత్యాధ్యైస్తమిన్ద్ర మభిష్టువానా అభిష్టువన్తః ॥34॥

టీ॥ వృత్రుని సంహరించుటకు ఏ బలముకలదో, ఆ బలముగల వాని కొఱకు సంగ్రామమందుగల సేనా బలమును, ఏ బలము నాశము చేయగలదో ఆ బలముగల వాని కొఱకు అను అర్థమునిచ్చు మంత్రమును ఓ ఇంద్రుడా! నిన్ను ఎల్లప్పుడూ స్తుతించుచుందుము. ॥34॥

శ్లో॥ వృత్రస్య దేహాన్నిష్క్రాన్తమాత్మజ్యోతి రరిన్దమ ।
పశ్యతాం సర్వలోకానామలోకం సమపద్యత్ ॥ (35)

తా॥ ఓ అరిందమా! శత్రువుల శాసించువాడా! వృత్రుని దేహము నుండి వెలువడిన ఆత్మజ్యోతి సర్వ లోకస్థులు చూచుచుండగా లోకహితుడైన పరమాత్మను చేరుకొనెను. (35)

టీ॥ అలోకం లోకాతీతం భగవన్తమ్. ॥35 ॥

టీ॥ లోకాతీతుడైన భగవంతుని. (35)

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే
ద్వాదశోఽధ్యాయః

శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆఱవ స్కంధమున
పన్నెండవ అధ్యాయము సమాప్తము.

త్రయోదశోఽధ్యాయః

అవ॥ త్రయోదశే తు వృత్రస్య బ్రహ్మహత్యా మహాభయాత్ చిరం నష్టోఽవితః శక్రో విష్ణునేతి నిరూప్యతే.

శ్రీశుక ఉవాచ

శ్లో॥ వృత్రేహతే త్రయోలోకా వినా శక్రేణ భూరిద ।
సపాలా హ్యా భవన్సద్యో విజ్వరా నిర్వృతేన్ద్రియాః ॥ (1)

శ్లో॥ దేవర్షి పితృ భూతాని దైత్యాదేవానుగాః స్వయమ్ ।
ప్రతిజగ్ముః స్వధిష్ణ్యాని బ్రహ్మే శేన్ద్రాదయస్తతః ॥ (2)

టీ॥ అనిర్వృతం శక్రమపృష్ట్వా స్వయమేవ ప్రతిజగ్ముః. ॥1,2॥

పదమూడవ అధ్యాయము

అవ॥ పదమూడవ అధ్యాయము నందు వృత్రుని సంహరించుటచే ఏర్పడిన బ్రహ్మహత్యా మహాభయము నుండి విష్ణువనుగ్రహమున ఇంద్రుడు ముక్తిని పొందిన విషయము నిరూపించబడుచున్నది.

శ్రీశుకులు పలికిరి.

తా॥ ఓ మహారాజా! వృత్రుడు సంహరింపబడగా, ఇంద్రుడు తప్ప, పాలకులతో కూడిన ముల్లోకములు తాపములు తొలగి, దుఃఖములు లేనివారును, సంతోషించబడిన ఇంద్రియములను (మనస్సుల) కలవారైరి. ॥1॥

తా॥ తరువాత దేవర్షులు, పితృదేవతలు, భూతగణములు, దేవతలు వారి అనుచరులు, దైత్యులు స్వయముగా బ్రహ్మ, ఈశుడు, ఇంద్రుడు మన్నగువారు వారి వారి స్వస్థలములకు తిరిగి వెళ్ళిరి. ॥2॥

టీ॥ ఇంద్రుని అడుగకయే స్వయముగా ఎవరికివారే తిరిగి వెళ్ళిరి. (1,2)

రాజోవాచ.

శ్లో॥ ఇంద్రస్యానిర్వృతేర్హేతుం శ్రోతుమిచ్ఛామి భో మునే ।
యేనాసన్సుఖినో దేవా హరేర్దుఃఖం కుతోఽభవేత్ ॥ (3)

రాజు వలికెను.

తా॥ ఓ మునీ! ఇంద్రుడు సుఖమును పొందకుండుటకుగల కారణములను వినగోరుచున్నాను. ఏ కార్యముచేత దేవతలు సుఖములు పొందిరో, ఆ కార్యములచే ఇంద్రునికి దుఃఖమేల కలిగినది. ॥3॥

టీ॥ హరేరింద్రస్య. ॥3॥

టీ॥ ఇంద్రుని యొక్క. ॥3॥

అవ॥ తస్య దుఃఖ హేతుం వక్తుం ప్రస్తావకథామాహ – వృత్ర విక్రమేత్యాదినా.

అవ॥ వృత్ర విక్రమేత్యాది శ్లోకమున ఇంద్రుని దుఃఖమునకుగల కారణము చెప్పుటకు ప్రస్తావకథను చెప్పుచున్నాడు.

శ్రీ శుక ఉవాచ.

శ్లో॥ వృత్ర విక్రమ సంవిగ్నాః సర్వేదేవాః సహర్షిభిః ।
తద్వధాయార్థ యన్నింద్రం నైచ్ఛద్భీతో బృహద్వధాత్ ॥ (4)

శ్రీశుకులవలికిరి.

తా॥ వృత్రుని యొక్క పరాక్రమముచే భయపడినవారై దేవతలు, మహర్షులతో కూడి వానిని వధించుట కొఱకు ఇంద్రుని ప్రార్థించిరి. కాని బ్రహ్మహత్యా దోషమునకు భయపడి ఇంద్రుడు ఇష్టపడలేదు. (4)

టీ॥ అర్థయన్ప్రార్థయన్త బృహద్వధాద్బ్రాహ్మణ వధాద్భీతః సన్. (4)

టీ॥ ప్రార్థించిరి. బ్రాహ్మణ వధమునకు భయపడి. ॥4॥

ఇంద్ర ఉవాచ.

శ్లో॥ స్త్రీ భూ జల ద్రుమైరేణో విశ్వరూప వధోద్భవమ్ ।
విభక్తమనుగృహ్ణద్భిర్వృత్ర హత్యాం క్వ మార్జ్మ్యహమ్ ॥ (5)

ఇంద్రుండు పలికెను.

తా॥ విశ్వరూపుని సంహరించుట వలన ఏర్పడిన బ్రహ్మహత్యా దోషమును స్త్రీలు, భూమి, నీరు, చెట్లు విభజించి పంచుకొని, నన్ను అనుగ్రహించినవి. కాని వృత్రుని హత్యను ఎక్కడ కడుగుకొనగలను.(5)

టీ॥ ఏనః పాపమ్. విభక్తం విభజ్య గృహీతమ్ మార్జ్మి శోధయామి॥5॥

టీ॥ ఏ పాపమును విభజించి పంచుకొనినవి–కడుగుకొనగలను.(5)

శ్రీ శుక ఉవాచ.

శ్లో॥ ఋషయస్తదుపాకర్ణ్య మహేంద్రమిదమబ్రువన్ ।
యాజయిష్యామభద్రం తే హయమేధేన మాస్మభైః ॥ (6)

శ్రీశుకులు పలికిరి.

తా॥ మహర్షులు ఇంద్రుని మాటలను విని, మహేంద్రునితో ఇట్లనిరి. ఓ ఇంద్రా! నీకు భద్రమగుగాక! నీచే అశ్వమేధయాగము చేయించెదము భయపడకుము. ॥6॥

శ్లో॥ హయమేధ్యేన పురుషం పరమాత్మానమీశ్వరమ్ ।
ఇష్ట్వా నారాయణం దేవం మోక్ష్యసేఽపి జగద్వధాత్ ॥ (7)

తా॥ ఆత్మస్వరూపుడు, పరమపురుషుడు ప్రభువు అయిన నారాయణుని అశ్వమేధయాగముచేత ఆరాధించినచో, జగత్తునంతటనీ సంహరించిననూ, ఆ దోషము నుండి బయటపడగలవు.॥7॥

శ్లో॥ బ్రహ్మహా పితృహా గోఘ్నో మాతృహాచార్యహాఘవాన్ ।
శ్వాదః పుల్కసకో వాపి శుద్ధేరన్యస్య కీర్తనాత్ ॥ (8)

తా॥ బ్రహ్మహత్య చేసినవాడు, పితృహత్య చేసినవాడు, గోవులను చంపినవాడు, ఆచార్యుని చంపినవాడు, కుక్కమాంసమును తినువాడు, కసాయివాడు కూడ నారాయణుని కీర్తించుటచే శుద్ధిని పొందుదురు.(8

శ్లో॥ తమశ్వమేధేన మహామఖేన
శ్రద్ధాన్వితోఽస్మాభిరనుష్ఠితేన ।
హత్వాపి సబ్రహ్మచరాచరం త్వం
న లిప్యసే కిం ఖల నిగ్రహేణ ॥ (9)

తా॥ మాచే అనుష్ఠింపబడిన అశ్వమేధమను మహాయజ్ఞమును శ్రద్ధతో ఆచరించినచో, బ్రహ్మతో కూడిన చరాచర ప్రాణులనింటినీ చంపిననూ పాపమును పొందవు. మఱి దుష్టుడైన వానిని నిగ్రహించుట వలన వచ్చు పాపమును గూర్చి చెప్పవలసినది ఏమున్నది. అనగా నీకు పాపమును అంటదు అని భావము. ॥9॥

శ్రీశుక ఉవాచ.

శ్లో॥ ఏవం సంచోదితో విప్రైర్మరుత్వానహనద్రిపుమ్ ।
బ్రహ్మహత్యా హతే తస్మిన్నాససాద వృషా కపిమ్ ॥ (10)

శ్రీశుకులవారు పలికిరి.

తా॥ ఈ విధముగా మహర్షులచేత ప్రేరేపింపబడినవాడై ఇంద్రుడు శత్రువును సంహరించెను. వాడు చంపబడగానే బ్రహ్మహత్యా దోషము ఇంద్రుని పట్టుకొనెను. ॥10॥

టీ॥ వృషాకపిమింద్రమ్. ॥6,7,8,9,10॥

టీ॥ వృషాకపుడు అనగా ఇంద్రుడు.(ఇంద్రుని) ॥6,7,8,9,10॥

శ్లో॥ తయేంద్రః స్మాసహత్తాపం నిర్వృతిర్నామువావిశత్ ।
హ్రీమన్తం వాచ్యతాం ప్రాప్తం సుఖయన్త్యపి నోగుణాః ॥ (11)

తా॥ నిందనుపొందిన లజ్జావంతునికి సద్గుణములు సుఖమును కల్గించవు గదా! అట్లే ఇంద్రుడు బ్రహ్మహత్యా దోషమును సహించుచుండుట వలన అతనికి సుఖములు కలుగలేదు. ॥11॥

టీ॥ తయా దేవాదిభిః కారితయా. స్మహేత్యవధారణే. ఇంద్ర ఏవ తాపమసహత నాన్యః. అముమింద్రం నిర్వృతిర్నావిశత్. నను ధైర్యాది గుణయుక్తస్య కుతోఽనిర్వృతిస్తత్రాహ - హ్రీమన్తం లజ్జావన్తం వాచ్యతాం నిన్ద్యతామ్. ॥11॥

టీ॥ దేవతలు, ఋషులచే ప్రేరేపింపబడి కార్యము చేయబడినప్పటికి (బ్రహ్మహత్యచేత) ఏర్పడిన తాపమును ఇంద్రుడు మాత్రమే సహించుచుండెను. ఇతరులు పొందలేదు. అందువలన ఇంద్రుడు సుఖమును పొందకుండెను. నిశ్చయముగా ధైర్యాది గుణములతో కూడిన వానికి

దుఃఖమెట్లు అన్నచో చెప్పుచున్నాడు. నింద్యతను పొందిన లజ్జావంతునికి (సిగ్గుగల) వినయశీలుని సద్గుణములు సుఖములు కలిగించవు కదా! 11

శ్లో॥ తాం దదర్శానుధావన్తీం చండాలీమివ రూపిణీమ్ ।
జరయా వేపమానాఙ్గీ యక్ష్మగ్రస్తామసృక్పటామ్ ॥ (12)

తా॥ రక్తమోడ్చు క్షయరోగ పీడితయై రక్తము అంటిన వస్త్రమును కలిగి ముసలితనముచే వణుకుచున్న చండాల స్త్రీవంటి రూపము కలిగి వెనక నుండి పరుగెత్తి వచ్చుచున్న ఆ బ్రహ్మహత్యను ఇంద్రుడు చూచెను. (12)

టీ॥ యక్ష్మ గ్రస్తాం క్షయరోగ వ్యాప్తమ్. ॥12॥

టీ॥ క్షయ రోగమును పొందిన. ॥12॥

శ్లో॥ వికీర్య పలితాన్కేశాం స్తిష్ఠతిష్ఠేతి భాషిణీమ్ ।
మీనగన్ధ్య సుగంధేన కుర్వతీం మార్గదూషణమ్ ॥ (13)

తా॥ నెఱసిన (తెల్లని) వెంట్రుకలను విరబోసుకొని, ఆగుమాగుమని పలుకుచున్నట్టి, చేపల కంపుతో మార్గమును చెడగొట్టుచున్న (బ్రహ్మ హత్యను చూచెను). ॥13॥

టీ॥ మీనస్యేవగన్ధో యస్య సమీనగన్ధః స చాసా వసుశ్చశ్వాస వాయుస్తస్య గన్ధేన. ॥13॥

టీ॥ చేపల వాసన వంటి వాసన ఎవరికో వాడు మీనగంధుడు. అట్టి వాసన గలది మీనగంధి. అది పీల్చి విడుచుగాలి కూడ చేపల కంపు కలిగి యున్నది. భూమిని కూడ (మార్గమును) దుర్వాసన పూరితముగా చేయుచున్నది.॥13॥

శ్లో॥ నభోగతో దిశః సర్వాః సహస్రాక్షో విశాంపతే ।
ప్రాగుదీచీం దిశం తూర్ణం ప్రవిష్టో నృపమానసమ్ ॥ (14)

టీ॥ ప్రాగుదీచీం దిశం గతః సంస్తూర్ణం మానసం సర్వః. ॥14॥

శ్లో॥ స ఆవసత్పుష్కర నాల తన్తూ
నలబ్ధభోగో యదిహాగ్నిదూతః ।
వర్షాణి సాహస్రమలక్షితోఽన్తః
సచిన్తయన్ బ్రహ్మవధాద్విమోక్షమ్ ॥ (15)

టీ॥ స ఇంద్రః సహస్రం వర్షాణి పుష్కర నాలస్య తన్తూనావసత్. కథం భూతః నలబ్ధో భోగో యేన సః. కుతః. యద్యస్మాదిహ జలే వసన్నగ్ని దూతశ్చ స్వయమ్ అగ్నేశ్చ స్వదూతస్య హవిర్భాగాన్నేతుర్జలే ప్రవేశాసంభవాదలబ్ధ భోగ ఇత్యర్థః పాఠాన్తరే నలబ్ధో యజ్ఞ భాగో యేన సః. ॥15॥

తా॥ ఓ రాజా! ఆ సహస్రాక్షుడు ఆకాశమందలి అన్ని దిక్కులను తిరిగి ఈశాన్య దిశనుగల మానససరోవరమును ప్రవేశించెను. (14)

టీ॥ ఈశాన్య దిశనుగల మానస సరోవరమును వేగముగా చేరెను. (14)

తా॥ ఆ ఇంద్రుడు తామరతూడు (దారము) యందు చేరి వేయి సంవత్సరములు కనబడని వాడయ్యెను. లోపల ఆ లోకమందు (జలములందు) అగ్ని దూతగా లేకపోవుటచే, భోగములు పొందలేక (అగ్ని ప్రవేశించని కారణమున హవిర్భాగములు లేకుండా) బ్రహ్మహత్య నుండి ముక్తిని పొందుటకు ఆలోచించుచూ నివసించెను. ॥15॥

టీ॥ ఆ ఇంద్రుడు వేయిసంవత్సరములు తామర తూడుల దారములందు నివసించెను. ఎట్టివాడై నివసించెను? ఎవడు భోగములను పొందలేడో వాడు అలబ్ధభోగుడు. అట్టివాడై, ఎందువలన? అనగా ఈ జలములయందు ఉండుటచేత, హవిర్భాగములను అందించు అగ్ని స్వయముగా ప్రవేశించలేని కారణముగా అతడు భోగములను పొందలేదు అని భావము. అలబ్ధభాగః అను పాఠాంతరమున లభింపని యజ్ఞ భాగములు ఎవరికో వాడు అలబ్ధభాగుడు. యజ్ఞ భాగములు పొందలేదని భావము. ॥15॥

శ్లో॥ తావత్త్రిణాకం నహుషః శశాసః
విద్యా తపో యోగ బలానుభావః ।
ససంపదైశ్వర్య మదాన్ధబుద్ధి
ర్నీతస్తిరశ్చాం గతి మింద్రపత్న్యా ॥ (16)

తా॥ ఆ కాలంలో విద్యా తపో యోగ బలముగల నహుషుడు స్వర్గమును శాసించెను. ఐశ్వర్య మదముచే బుద్ధిహీనుడై (ఇంద్రపత్నిని కోరిన కారణమున) ఇంద్రపత్ని వలన పశు పక్షాదుల వంటి నీచ గతిని పొందెను. ॥16॥

టీ॥ త్రిణాకమ్ న అకం దుఃఖం యస్మిన్నితి నాకః. పుణ్య లోకః. తృతీయం నాకం స్వర్గం నను మనుష్యస్య కుతః స్వర్గరాజ్యం తత్రాహ విద్యాదిభిరనుభావః స్వర్గపాలన సామర్థ్యం యస్యసః తర్హి తస్మిన్సతి కథం ఇంద్రస్య పునః స్వర్గప్రాప్తిస్తత్రాహ – స నహుషః సంపదైశ్వ ర్యాభ్యాం యో మదసేనాన్ధా బుద్ధిర్యస్య స ఇంద్రపత్న్యా శచ్యా తిరశ్చాం గతిం సర్పయోనిం నీత ఉపాయేన ప్రాపితః. ఏవం హ్యాఖ్యాయతే – నహుషః కిల కదాచిదింద్రాణీ మువాచ ఇంద్రస్త్వావదహమతస్త్వం మాం భజేతి తయా చావేదితి వృత్తాన్తో బృహస్పతిస్తామువాచ బ్రాహ్మణ వాహ్య శిబికాయా మారుహ్యాగతం త్వాం భజిష్యామీతి బ్రూహి తతోఽసౌ బ్రహ్మశాపా త్పతిష్యతీతి. తయా చ యథోక్తో నహుషోగస్త్యాదీన్ శిబికాం వాహయామాస. తదా శీఘ్రం సర్ప సర్పేత్యగస్త్యం పదాపస్పర్శ. తేన కుపితేన సర్పో భవేతి శప్తో మహాసర్పోఽజగరోఽభూదితి.॥16॥

టీ॥ దేనియందు దుఃఖములేదో అది నాకము. పుణ్యలోకము. (తృతీయం నాకమ్ స్వర్గమ్ – మూడవ నాకము అనగా–స్వర్గము. మనుష్యనకు స్వర్గ రాజ్యమెక్కడిది? అనుటకు చెప్పుచున్నాడు. తపస్సు విద్యా, బలములచే సమర్థుడైన వానికి మాత్రమే స్వర్గాధిపత్యము లభించును. అయినచో ఇంద్రునికి మరల స్వర్గరాజ్య ప్రాప్తి ఎట్లు కలిగెనో చెప్పుచున్నాడు. ఆ నహుషుడు విద్యా, తపో, బలములచే ఐశ్వర్యమును పొందిన మదముచేత అంధుడై వివేకమును కోల్పోయెను. ఇంద్రుని పత్ని శచీదేవి చేసిన ఉపాయముచేత తిర్యక్ జన్మమైన సర్పయోనిని పొందెను. దీనిని గూర్చిఈ విధముగా చెప్పబడుచున్నది "నహుషుడు ఒకానొక సందర్భమున ఇంద్రుని భార్యతో ఇంద్రుడు మరల వచ్చునంత వరకు నన్ను సేవింపుము అనెను. శచీదేవి ఈ విషయమును బృహస్పతికి వివరింపగా బృహస్పతి ఆమెతో బ్రాహ్మణు–లచే మోయబడు పల్లకి యందు వచ్చినచో నిన్ను సేవించగలనని చెప్పుమనెను. అందువలన బ్రాహ్మణ శాపమునకు గురియై నశించును

అని ఉపాయము చెప్పెను. ఆమె అట్లే చెప్పగా నహుషుడు అగస్త్యాది మహర్షులచే పల్లకిని మోయించుకొని వచ్చుచుండెను. అప్పుడు తొందరగా మోయుడు, అని చెప్పుటకు సర్ప సర్ప అనుచు పాదముతో అగస్త్యుని తాకెను. దానితో కోపించిన అగస్త్యుడు సర్పముగా కమ్మని శపించగా ఆ నహుషుడు ఇంద్రపదవిని, స్వర్గరాజ్యమును కోల్పోయి కొండచిలువగా (మహాసర్పముగా) మారిపోయెను. ॥16॥

శ్లో॥ తతో గతో బ్రహ్మగిరోపహూత
ఋతంభర ధ్యాన నివారితాఘః ।
పాపస్తు దిగ్దేవతయా హతౌజా
స్తంనాభ్య భూదవితం విష్ణుపత్న్యా ॥ (17)

తా॥ తరువాత ఋతంభర ధ్యానమున ఇంద్రుని పాపము తొలగి పోగా బ్రాహ్మణుల వాక్కుననుసరించి అతడు తిరిగి స్వర్గమునకు వెళ్ళెను. బ్రహ్మహత్యాపాపము (ఈశాన్య) దిగ్దేవతచే నశింపచేయ బడినది, విష్ణుపత్నిచే రక్షించబడిన ఇంద్రుని ఆ పాపము పీడింపలేక పోయెను. (17)

టీ॥ తత ఇంద్రః స్వర్గం గతః ప్రాప్తః. కథంభూతః. బ్రహ్మగిరా బ్రాహ్మణ వాక్యే నోపహూతః సన్. ఋతంభరః సత్యపాలకో హరిస్తస్య ధ్యానేన నివారిత మఘం యేన. ప్రాగపి తు పాపో బ్రహ్మ వధస్తమింద్రం నాభ్యభూత్తస్యాభిభవం నాకరోత్. కుతః దిగ్దేవతయా ప్రాగుదీచ్యాం దిశి స్థితయా శ్రీరుద్రేణ అవితం రక్షితం సన్తమ్. ॥17॥

టీ॥ తరువాత ఇంద్రుడు స్వర్గమును పొందెను. ఎటువంటివాడు! బ్రాహ్మణ వాక్యముచేత, లేదా సత్యపాలకుడైన విష్ణుమూర్తి ధ్యానముచేత తొలగించబడిన పాపముగలవాడై, ఆ పాపము ఈశాన్యదేవత అయిన రుద్రుని చేత తేజస్సును కోల్పోయి ఇంద్రుని పీడింపలేకపోయెను.॥17॥

శ్లో॥ తం చ బ్రహ్మర్షయోఽభ్యేత్య హయమేధేన భారత ।
యథావద్దీక్షయాం చక్రుః పురుషారాధనే న హ ॥ (18)

తా॥ ఓ రాజా! బ్రహ్మర్షులు ఆ ఇంద్రుని పరమపురుషుని ఆరాధన రూపమైన హయమేధయాగమున దీక్షితుని చేసిరి. (18)

టీ॥ పురుషస్య హరేరారాధనం యస్మింస్తేన. ॥18॥

టీ॥ పరమపురుషుడైన విష్ణువుయొక్క ఆరాధన దేనియందు గలదో అట్టి అశ్వమేధయాగమున. ॥18॥

శ్లో॥ అథేజ్యమానే పురుషే సర్వదేవ మయాత్మని ।
అశ్వమేధే మహేంద్రేణ వితతే బ్రహ్మవాదిభిః ॥ (19)

తా॥ తరువాత సర్వదేవస్వరూపుడు, పురుషోత్తముడు అయిన విష్ణుమూర్తి, ఇంద్రునిచే, బ్రహ్మవాదులైన వేదవేత్తలచే అశ్వమేధయాగ మందు ఆరాధించబడుచుండగా. (19)

టీ॥ సర్వవేదమయాత్మనీతి వా పాఠః. బ్రహ్మవాదిభిర్వితతేఽనుష్ఠితేఽశ్వమేధే మహేంద్రేణేజ్యమానే పురుషే సతి. ॥19॥

టీ॥ సర్వవేదమయాత్మని అని పాఠాంతరము. బ్రహ్మవాదులచే అనుష్ఠించబడు అశ్వమేధయాగమున సర్వదేవమయుడైన పురుషోత్తముని ఆ శ్రీహరిని ఇంద్రుడు ఆరాధించుచుండగా. ॥19॥

శ్లో॥ స వై త్వాష్ట్ర వధో భూయానపి పాప చ యో నృప
నీతస్తేనైవ శూన్యాయ నీహార ఇవ భానునా ॥ (20)

తా॥ ఆ త్వష్ట కుమారుడైన వృత్రుని సంహరించుట వలన కలిగిన బ్రహ్మహత్య వంటి మహాపాపము కూడా సూర్యునిచేత పొగమంచు తొలగించబడినట్లు, తొలగింపబడి నిశ్చయముగా నశించినది. (20)

టీ॥ తేనైవ పురుషేణైవ శూన్యాయనీతః నాశిత ఇత్యర్థః. ॥20॥

టీ॥ ఆ పరమపురుషునిచేతనే నశింపచేయబడెను. అనిభావము. 20

శ్లో॥ స వాజిమేధేన యథోదితేన
వితాయమానేన మరీచిమిశ్రైః ।
ఇష్ట్వాధియజ్ఞం పురుషం పురాణ
మింద్రోమహానాస విధూత పాపః ॥ (21)

టీ॥ అధికృతా యజ్ఞా యేన తమ్. ॥21॥

అవ॥ పాఠాది విధాతుమాఖ్యానం స్తౌతి ఇదమితి.

శ్లో॥ ఇదం మహాఖ్యాన మశేష పాప్మనాం
ప్రక్షాళనం తీర్థపదానుకీర్తితమ్ ।
భక్త్యు చ్ఛ్రయం భక్తజనానువర్ణనం
మహేంద్రమోక్షం విజయం మరుత్వతః ॥ (22)

టీ॥ ప్రక్షాల్యతేఽనేనేతి ప్రక్షాలనమ్ తీర్థ పదస్యాను కీర్తనమ్ యస్మిన్. భక్తేరుచ్ఛ్రయో యస్మిన్ భక్తజనానామనువర్ణనం యస్మిన్. మహేంద్రస్య మోక్షో యస్మిన్. మరుత్వతో విశేషేణ జయో యస్మిన్. ॥22॥

తా॥ ఆ ఇంద్రుడు,మరీచి మొదలగు వారిచే కలిసి యథావిధిగా అనుష్ఠింపచేయబడిన అశ్వమేధ యాగముచేత పురాణ పురుషుడైన విష్ణువునారాధించి పాపమును నశింపచేసుకొని పూజనీయుడయ్యెను. (21)

టీ॥ యజ్ఞముచేసి పూజనీయుడయ్యెను. ॥21॥

అవ॥ పఠన పారాయణవిధానము కొఱకై ఇదమితి శ్లోకమున చెప్పుచున్నాడు.

తా॥ తీర్థపదుని కీర్తించు (గంగోద్భవ పదముగల విష్ణువును) సకల పాప ప్రక్షాళనకరమగు భక్తజనుల చరితమును, మహేంద్రుని పాప విముక్తిని, ఇంద్ర విజయమును వర్ణించు ఈ గాథ భక్తిని పెంపొందించును. ॥22॥

టీ॥ ఇంద్ర విజయమను ఈ ఆఖ్యానము యొక్క విశిష్టతను చెప్పుచున్నాడు. దేని యందు తీర్థపదుని యొక్క కీర్తనగలదో అనగా పరమ పావనియైన గంగా జన్మస్థానమైన విష్ణుపదములను కీర్తించు, భక్తిని పెంపొందించునో, భక్తజనుల చరిత యొక్క వర్ణన కలదో,

మహేంద్రుని పాప విముక్తియు విశేషించి అతని జయము గలదో అట్టి ఈ చరితము సకల పాపములను ప్రక్షాళనము చేయును.॥22॥

శ్లో॥ పఠేమురాఖ్యాన మిదం సదా బుధాః
శ్రుత్వాన్యథో పర్వణి పర్వణీంద్రియమ్ ।
ధన్యం యశస్యం నిఖిలాఘమోచనం
రిపుజయం స్వస్త్యయనం తథాయుషమ్ ॥ (23)

తా॥ ఇంద్రియ పటుత్వమును, ధన్యతను, సంపదను యశస్సును సకల పాప విముక్తిని శత్రు విజయమును అట్లే ఆయుష్యను చేకూర్చు ఈ ఆఖ్యానమును విద్వాంసులు (పండితులు,బుద్ధిమంతులు) అన్ని కాలములలో లేదా పర్వదినముల యందు పఠించవలయును. (23)

టీ॥ ఇంద్రియం తత్పాటవకరమ్. ఇంద్ర సంబన్ధీతి వా ఆయుషమాయుష్యమ్. ॥23॥

టీ॥ ఇంద్రియ పటుత్వమును పెంచు లేదా ఇంద్ర సంబంధమైనది, ఆయుష్కరము అయిన (ఈ ఆఖ్యానము) ॥23॥

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే త్రయోదశోఽధ్యాయః

శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆఱవ స్కంధమున పదమూడవ అధ్యాయము సమాప్తము.

చతుర్దశోఽధ్యాయః

అవ॥ వృత్రస్య జ్ఞాన భక్త్యాది శ్రుత్వా పృష్టః పరీక్షితా హేతుమాహ చతుర్భిః తత్ప్రాగ్జన్మ చరితోక్తిభిః.(1) చతుర్దశేతు సహసా కృచ్ఛ్రలబ్ధే సుతేమృతే. చిత్రకేతోరతిస్నేహాదతిశోకో నిరూప్యతే.(2)

పదునాల్గవ అధ్యాయము

అవ॥ వృత్రుని యొక్క జ్ఞాన భక్త్యాది విషయములను వినిన పరీక్షిత్తు శుకుల వారిని వృత్రుని జ్ఞాన భక్త్యాదులకు హేతువును అడుగుటయు, అందులకు కారణము ఆతని పూర్వజన్మ చరిత్ర నాలుగు అధ్యాయములచే చెప్పబడుచున్నది. పదునాల్గవ అధ్యాయమునందు చిత్రకేతువు (అతి కష్టముగా పొందిన) సుతుడు మరణించగా పుత్ర వియోగమును వివరించుచూ అతి స్నేహమువలన అతి శోకము. దుఃఖము ఏర్పడునని చెప్పబడుచున్నది. ॥1,2॥

పరీక్షిదువాచ.

శ్లో॥ రాజస్తమః స్వభావస్య బ్రహ్మన్ వృత్రస్య పాప్మనః ।
నారాయణే భగవతి కథమాసీద్దృఢా మతిః ॥ (1)

పరీక్షిత్తు చెప్పుచున్నాడు.

తా॥ ఓ బ్రాహ్మణా! రజస్తమో గుణములు కలిగినట్టి పాపాత్ముడు అయిన వృత్రాసురునికి భగవంతుడైన నారాయణుని యందు దృఢమైన బుద్ధి ఎట్లు కలిగెను? (1)

టీ॥ రాజశ్చ తమశ్చ స్వభావో యస్య. సః రజస్తమ స్వభావః.॥1,2,॥

టీ॥ రజోగుణము, తమోగుణములు ఎవరికి స్వభావములో వాడు రజస్తమస్వభావుడు. ॥1॥

శ్లో॥ దేవానాం శుద్ధసత్త్వానామృషీణాం చామలాత్మనామ్ ।
భక్తిర్ముకుంద చరణే న ప్రాయేణోపజాయతే ॥ (2)

తా॥ శుద్ధసత్వగుణము కలిగినట్టియు, నిర్మల హృదయులు అయిన దేవతలకు, ఋషులకు కూడ ముకుందుని చరణముల యందు సాధారణముగా భక్తి ఏర్పడదు కదా! ॥2॥

అవ॥ భక్తేర్దుర్లభత్వం ప్రపఞ్చయతి - రజోభిరితి త్రిభిః.

అవ॥ రజోభిః అని ప్రారంభించబడి మూడు శ్లోకములలో భక్తి యొక్క దుర్లభత్వం చెప్పబడుచున్నది.

శ్లో॥ రజోభిః సమసంఖ్యాతాః పార్థివైరిహ జన్తవః ।
తేషాం యే కేచనే హన్తే శ్రేయోవై మనుజాదయః ॥ (3)

తా॥ భూమిలో ఉన్న పరమాణువులతో సమాన సంఖ్యగల ప్రాణులలో ఏవో కొన్ని, మానవుల వంటి ప్రాణులు (మొదలగువారు) మాత్రమే శ్రేయస్సును ఆచరించుదురు.(3)

టీ॥ పార్థివై రజోభిః పరమాణుభిః సమాః సంఖ్యాతాః అనన్తా ఇత్యర్థః జన్తవో జీవాః. తేషాం మధ్యే యే కేచన కతిపయే శ్రేయో ధర్మమీహన్తే కుర్వన్తి. ॥3॥

టీ॥ భూమిలో ఉన్న పరమాణువులకు సమానమైన సంఖ్యగల అనగా అనంతములైన జీవులలో ఏవో కొన్ని ప్రాణులైన మానవులు మొదలగువారు మాత్రమే ధర్మమును ఆచరించుచున్నారు.॥3॥

శ్లో॥ ప్రాయో ముముక్షవస్తేషాం కేచనైవ ద్విజోత్తమ ।
ముముక్షూణాం సహస్రేషు కశ్చిన్ముచ్యేత సిద్ధ్యతి ॥ (4)

తా॥ ఓ ద్విజోత్తమా! ఆ ధర్మమును ఆచరించు వారిలో ఏదో కొద్ది మంది మాత్రమే మోక్షమును(ముక్తిని) కోరుకొందురు. ఆ మోక్షమును కోరుకొనువారిలో వేలమందిలో ఒకానొక్కడు మాత్రమే ముక్తిని పొందుచున్నాడు. ॥4॥

టీ॥ ముచ్యేత గృహాది సఙ్గాద్విముచ్యతే సిద్ధ్యతి తత్త్వం జానాతి ॥4,5,6॥

టీ॥ ముక్తిని పొందుచున్నాడు అనగా గృహాది సంసార బంధముల నుండి విడవబడుచున్నాడు, సిద్ధిని పొందుచున్నాడనగా, పరమాత్మ తత్వమును తెలియుచున్నాడు.॥4,5,6॥

శ్లో॥ ముక్తానామపి సిద్ధానాం నారాయణ పరాయణః ।
సుదుర్లభః ప్రశాన్తాత్మా కోటిష్వపి మహామునే ॥ (5)

తా॥ ఓ మహామునీ! ముక్తులైన కోటి మంది సిద్ధులలోను, నారాయణుడే పరమలక్ష్యముగాగల శాంతమగు మనస్సు గలవారు లభించుట కూడా కష్టమే కదా! ॥5॥

శ్లో॥ వృత్రస్తు సకథం పాపః సర్వలోకోపతాపనః ।
ఇత్థం దృఢమతిః కృష్ణ ఆసీత్సంగ్రామ ఉల్బణే ॥ (6)

తా॥ కాని వృత్రుడు సర్వలోకములను పీడించిన మహాపాపి. అయినను వానికి, భయంకరమగు యుద్ధములో ఈ విధముగా, కృష్ణుని యందు దృఢమైన మనస్సు ఎట్లు నిలిచెను? (6)

శ్లో॥ అత్ర నః సంశయో భూయాన్ శ్రోతుం కౌతూహలం ప్రభో ।
యః పౌరుషేణ సమరే సహస్రాక్షమతోషయత్ ॥ (7)

తా॥ ఓ ప్రభూ! ఈ విషయమందు నాకు గొప్ప సంశయము కలదు. యుద్ధమందు ఏ పురుషత్వముచేత ఇంద్రుని సంతోషింపచేసెనో వానిని గూర్చి వినవలెనని కుతూహలము కలుగుచున్నది.॥7॥

టీ॥ న చేంద్రభియా కృష్ణం శరణం గత ఇత్యాహ యః పౌరుషేణేతి. 7

టీ॥ పౌరుషేణ అనుపదముచే ఇంద్రుని భయమున పరమాత్మ కృష్ణుని శరణుపొందలేదు. అని చెప్పుచున్నాడు. (7)

సూత ఉవాచ

శ్లో॥ పరీక్షితోఽథ సంప్రశ్నం భగవాన్బాదరాయణిః ।
నిశమ్య శ్రద్ధదానస్య ప్రతినన్ద్య వచోఽబ్రవీత్ ॥ (8)

సూతుడు పలికెను.

తా॥ శ్రద్ధగల పరీక్షిత్తు యొక్క చక్కని ప్రశ్నను విని బాదరాయణుని పుత్రుడు అభినందించి ఇట్లు పలికెను.॥8॥

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ శ్రుణుష్వావహితో రాజన్నితిహాసమిమం యథా ।
శ్రుతం ద్వైపాయనముఖాన్నారదాద్దేవలాదపి ॥ (9)

టీ॥ యథా యథావత్ శ్రుణు. ॥ 8,9,10॥

శ్లో॥ ఆసీద్రాజా సార్వభౌమః శూరసేనేషు వై నృప ।
చిత్రకేతురితిఖ్యాతో యస్యాసీత్కామధుఙ్మహీ ॥ (10)

శ్లో॥ తస్య భార్యా సహస్రాణాం సహస్రాణి దశోభవన్ ।
సాన్తాని కశ్చాపి నృపో న లేభే తాసుసన్తతిమ్ ॥ (11)

టీ॥ భార్యా సహస్రాణాం దశసహస్రాణి కోటిరిత్యర్థః. సాన్తానికః స్వయం సన్తానార్హోఽపి పుత్రోత్పాదన సమర్థోఽపి తాసు సన్తతిం న లేభే. సర్వాస్తావన్ధ్యా ఏవ దైవ యోగేన మిలితా ఇతి భావః. ॥11॥

శ్రీశుకులు పలికిరి.

తా॥ ఓ రాజా! వ్యాసుని, దేవర్షి నారదుడు, దేవలుని నుండి ఏ విధముగా ఈ వృత్తాంతమును వినియుంటినో దానిని చెప్పెదను ఏకాగ్ర - చిత్తముతో వినవలసినది. ॥9॥

టీ॥ ఉన్నది ఉన్నట్లుగా వినుము.(9)

తా॥ ఓ రాజా! శూరసేన దేశములందు, భూమిచేత అన్ని కోరికలు తీర్చబడిన, చిత్రకేతుడను పేర ప్రసిద్ధి గాంచిన చక్రవర్తి ఉండెను.(10)

తా॥ అతనికి వేలకొలది మంది భార్యలు ఉండిరి. సంతానోత్పాదనార్హుడే అయినను ఆ రాజు సంతానమును పొందలేదు.॥11॥

టీ॥ పదివేల వేల భార్యలు అనగా కోటి మంది భార్యలు అని అర్థము. స్వయముగా తాను (ఆ రాజు) సంతానార్హుడే అనగా పుత్రోత్పాదన సామర్థ్యము కలవాడే అయినను వారి యందు అతడు సంతానమును పొందలేదు. ఆ స్త్రీలు అందరు దైవయోగముచేత గొడ్రాళ్ళే అయి ఉండిరని భావము. ॥11॥

అవ॥ తదేవాహ వన్ధ్యా పతేరితి

అవ॥ వంధ్యాపతేరిత్యాది శ్లోకమున వంధ్యాపతియను మాటచే దీనినే (ఈ దుఃఖమునే) చెప్పుచున్నాడు.

శ్లో॥ రూపౌదార్య వయోజన్మ విద్యైశ్వర్య శ్రియాదిభిః ।
సంపన్నస్య గుణైః సర్వైశ్చిన్తా వన్ధ్యాపతేరభూత్ ॥ (12)

తా॥ రూపము(అందము) ఔదార్యము (దానగుణము) వయస్సు (యౌవ్వనము) ఉత్తమజన్మ (వంశము) విద్య మరియు ఐశ్వర్యము మొదలగు అన్ని గుణములతో సంపన్నుడైనను వంధ్యాపతి (గొడ్రాళ్ళ భర్త) అగుటచే దుఃఖమును పొందెను. ॥12॥

శ్లో॥ న తస్య సంపదః సర్వా మహిష్యో వామ లోచనాః ।
సార్వభౌమస్య భూశ్చేయమభవన్ప్రీతి హేతవః ॥ (13)

తా॥ సకల సంపదలు, అందమైన కన్నులుగల భార్యలు, పూర్తి అధికారముగల భూమియు సార్వభౌముడైన ఆ చక్రవర్తికి ప్రీతి హేతువులు కాలేదు. ॥13॥

శ్లో॥ తస్యైకదా తు భవనమఙ్గిరా భగవానృషిః ।
లోకానను చరన్నేతానుపాగచ్ఛద్యదృచ్ఛయా ॥ (14)

తా॥ లోకములందు సంచరించుచున్న, పూజ నీయుడగు అంగీరస మహర్షి ఒకనాడు యాదృచ్ఛికముగా అతని భవనమునకు విచ్చేసెను. ॥14॥

శ్లో॥ తం పూజయిత్వా విధి వత్ప్రత్యుత్థానార్హణాదిభిః ।
కృతాతిథ్య ముపాసీదత్సుఖాసీనం సమాహితః ॥ (15)

తా॥ లేచి ఎదురేగుట, అర్ఘ్యపాద్యాదులనిచ్చుట మొదలగువానిచే విధియుక్తముగా అతనిని పూజించి, అతిథి సత్కారమునందించిన రాజు, సుఖాసీనుడై కూర్చొని యున్న ఆ మహర్షి సమీపమునకు వెళ్ళి కూర్చుండెను. 15

టీ॥ ఉపాసీదత్తస్య సమీపముపవివేశ సమాహితః సంయతః. (12-15)

టీ॥ ఆతిథ్యమును స్వీకరించి కూర్చొనియున్న మహర్షి సమీపమునకు వెళ్ళి కూర్చొనెను. (12-15)

శ్లో॥ మహర్షిస్తముపాసీనం ప్రశ్రయావనతం క్షితౌ ।
ప్రతిపూజ్య మహారాజ సమాభాష్యేదమబ్రవీత్ ॥ (16)

తా॥ ఓ మహారాజా! వినయము నమ్రత కలిగి, తన దగ్గర నేలపై కూర్చొని ఉన్న ఆ రాజును అంగీరస మహర్షి సత్కరించి ఇట్లు పలికెను. ॥16॥

అంగిరా ఉవాచ

శ్లో॥ అపి తేనామయం స్వస్తి ప్రకృతీనాం తథాత్మనః ।
యథా ప్రకృతిభిర్గుప్తః పుమాన్ రాజాపి సప్తభిః ॥ (17)

అంగీరసనుడు పలికెను.

తా॥ నీ దేహము ఆరోగ్యముగానున్నదా? రాజ ప్రకృతులన్నింటికి మంగళమే కదా! పురుష ప్రకృతుల వంటి ఈ ప్రకృతులవలెనే రాజునకు కూడ ఏడు ప్రకృతులుండును. ॥17॥

టీ॥ అపి కిమ్ అనామయమారోగ్యమ్. స్వస్తిశుభమ్. ప్రకృత్యధీనమేవ హి రాజ్యమితి సదృష్టాన్తమాహ. యథా మహదాదిభిః సప్తభిః పుమాన్ జీవో నిత్యం గుప్తో భవతి నతు తద్వ్యతిరేకేణ క్షణమపి తిష్ఠితి తథా రాజాపి సప్త ప్రకృతిభిః స్వామ్యమాత్యౌ జనపదా దుర్గ ద్రవిణ సంచయాః దండో మిత్రం చ తస్యైతాః సప్త ప్రకృతయో మతాః ఇత్యుక్త లక్షణా భిర్నిత్యం గుప్తః సన్. స్వామీ గురుః స్వయం వా ॥17॥

టీ॥ మఱి మీ ఆరోగ్యము బాగుగనున్నదా! రాజ్యము కూడా ప్రకృతులకు అధీనంలోనుండునని దృష్టాంతపూర్వకముగా చెప్పు చున్నాడు. ఏ విధముగానైతే మహత్తత్త్వము, అహంకారము, పంచ భూతములు అను ఏడు ప్రకృతులచేత జీవుడు కాపాడబడునో, ఇవి లేనిచో ఒక్క క్షణము కూడ ఉండలేడో అట్లే ఆరాజు కూడ ప్రభుత్వము మంత్రి, రాజ్యము(ప్రదేశము) కోట,(దుర్గము) ద్రవ్యము(ఖజానా) దండము(న్యాయవ్యవస్థ) మిత్రులు అను సప్త (ఏడు) ప్రకృతులచేత

శ్లో॥ ఆత్మానం ప్రకృతిష్వద్ధా నిధాయ శ్రేయ ఆప్నుయాత్ ।
రాజ్ఞా తథా ప్రకృతయో నరదేవా హితాధయః ॥ (18)

టీ॥ ఆత్మానం ప్రకృతాష్వద్ధా సాక్షాన్నిధాయ తదనువర్తినం కృత్వా శ్రేయో రాజ్య సుఖం ప్రాప్నుయాదిత్యర్థః. ప్రకృతీనాం చ సుఖం రాజాధీనమేవేత్యాహ - హే నరదేవ తథా ప్రకృతయోపి రాజ్ఞా ఆహితాధయో నిహిత నిక్షేపాధనైః సమృద్ధా భవన్తి పాఠాన్తరే ఆసమన్తతో హతాధయో నిరస్త మనో దుఃఖా భవన్తీత్యర్థః. ॥18॥

శ్లో॥ అపి దారాః ప్రజామాత్యా భృత్యాః శ్రేణ్యోఽథ మన్త్రిణః ।
పౌర జానపదా భూపా ఆత్మజా వశవర్తినః ॥ (19)

చెప్పబడిన లక్షణములు మొదలుగాగల వానిచేత రక్షించబడుచున్నావు గదా! స్వామియనగా గురువు లేదా స్వయముగా తాను కూడ! ॥17॥

తా॥ ఓ రాజా! రాజు స్వయముగా ఈ ప్రకృతులయందు నిలిచి, శుభములు పొందును. అట్లే రాజుచేత ప్రకృతులు కూడ (రాజులచేత ఉంచబడిన సంపదలచేత సమృద్ధమయి) శుభములు పొందును (18)
.

టీ॥ స్వయముగా తనను తాను ఈ ప్రకృతులయందు నిలిపి శ్రేయస్కరమైన రాజ్య సుఖమును పొందును అని అర్థము. ప్రకృతుల యొక్క సుఖము కూడ రాజుయొక్క అధీనంలోనుండునని చెప్పబడు చున్నది. ఓ నరదేవా! (రాజా) అట్లే ప్రకృతులు కూడ రాజుచేత ఏర్పాటుచేయబడిన సంపదల చేత సమృద్ధములగును. పాఠాంతర మున ఆహోతాధయః-బాగుగా కొట్టబడిన మనో దుఃఖము గలవి యని అర్థము. ॥18॥

తా॥ అట్లే భార్యలు, ప్రజలు, అమాత్యులు, సేవకులు, వ్యాపారులు, మంత్రులు, పౌరులు(నగరవాసులు) పల్లెవాసులు, సామంతరాజులు, పుత్రులు అందరుకూడ నీ వశములో అధీనములో ఉన్నారా? (19)

టీ॥ ప్రజాశ్చ అమాత్యాశ్చ శ్రేణ్యశ్చ సమయ విశేషేణ సఙ్ఘశో వర్తమానా వణిక్ప్రభృతయః పౌరాః పురవాసినః. జానపదాస్తత్తద్దేశాధి కారిణః. మంత్రసహాయో మంత్రీకర్మ సహాయోఽమాత్య ఇతి భేదః ॥19॥

టీ॥ ప్రజలు, సమయ విశేషమును బట్టి కలిసియుండు అమాత్యులు, వ్యాపారవేత్తలు. నగరవాసులు, పల్లెవాసులు, మంత్రులు ఆ యా దేశాధికారులు నీ అధీనంలో ఉన్నారా! ఆలోచనయందు సహాయము చేయువారు మంత్రులు, కార్యములయందు సహాయము చేయువారు అమాత్యులు అని భావము. ॥19॥

శ్లో॥ యస్యాత్మానువశశ్చేత్స్యాత్సర్వే తద్వశగా ఇమే ।
లోకాః సపాలా యచ్ఛన్తి సర్వే బలిమతన్ద్రితాః ॥ (20)

తా॥ ఎవనికైతే మనస్సు తన వశములోనుండునో వానికి, పాలకులతో కూడిన లోకములన్నియు వశములో నుండి అలసత్వము లేక పన్నులు, కప్పములు చెల్లించును. ॥20॥

టీ॥ తవ మనః స్వవశే వా న వేత్యర్థాత్పృచ్ఛతి యస్యాత్మా మనోఽను వశోఽను వర్తీ అధీనః స్యాత్తస్య వశగా ఇమే భవన్తి. కించ లోకాశ్చ తస్య బలిం యచ్ఛన్తి. ॥20॥

టీ॥ నీ మనస్సు నీ వశములోనున్నదా లేదా అని అడుగుచున్నాడు. ఎవని యొక్క మనస్సు తన అధీనములో నుండునో అతనికి వీరందరు వశులై ఉందురు. జనులు కూడ కప్పములు కట్టుదురు.॥20॥

శ్లో॥ ఆత్మనా ప్రీయతేనాత్మా పరతః స్వత ఏవ వా ।
లక్షయేఽలబ్ధకామం త్వాం చిన్తయా శబలం ముఖమ్ ॥(21)

తా॥ నీ మనస్సునకు సంతోషములేదు. ఏదో పొందలేదను చింతచే (నీ వలనగాని, ఇతరుల వలనగాని) (బెంగచే) తేజోవిహీనమైనదిగా కనబడుచున్నది. (చూచుచున్నాను) (21)

టీ॥ ఆత్మా భవాన్ ఆత్మనా న ప్రీయతే న తుష్యతి తత్కిమ్. పరతో వా స్వతో వాఽలబ్ధ కామం త్వాం లక్షయే. ॥21॥

టీ॥ నీవు మనస్సుచేత సంతోషముగా లేవు! అది ఏమి? ఇతరుల వలన గాని స్వయముగా గాని, తీరని కోరికగల వానినిగా నిన్ను చూచుచున్నాను. 21

శ్లో॥ ఏవం వికల్పితో రాజన్విదుషా మునినాపి సః ।
ప్రశ్రయావనతోఽప్యాహ ప్రజాకామస్తతో మునిమ్ ॥ (22)

తా॥ ఓ రాజా! ముని సర్వము తెలిసినవాడైనప్పటికి, రాజును ఈ విధముగా ప్రశ్నించగా, సంతానమును కోరుచున్న ఆ రాజు వినయముగా ఇట్లు పలికెను. (22)

టీ॥ విదుషా సర్వజ్ఞేనాపి. ॥22॥

టీ॥ సర్వజ్ఞుడైనను కూడ. ॥22॥

అవ॥ అలబ్ధ కామత్వం కథయన్పుత్రం వాచతే భగవన్నితి చతుర్భిః

అవ॥ భగవన్ అని ప్రారంభించబడిన శ్లోకము నుండి నాలుగు శ్లోకములలో తనకు పుత్రులు కావలెననెడి కోరిక తీరలేదని చెప్పుచున్నాడు.

చిత్రకేతురువాచ

శ్లో॥ భగవాన్కింన విదితం తపో జ్ఞాన సమాదిభిః ।
యోగినాం ధ్వస్తపాపానాం బహిరన్తః శరీరిషు ॥ (23)

చిత్రకేతువు పలికెను.

తా॥ హే భగవన్! తపస్సు, జ్ఞానము, సమాధి మొదలగు వానిచే పాపములు నశించిన యోగులకు, దేహధారుల బహిరంతర్వృత్తాంతాలలో తెలియనివి ఏవి ? (23)

శ్లో॥ తథాపి పృచ్ఛతో బ్రూయాం బ్రహ్మన్నాత్మవిచిన్తితమ్ ।
భవతో విదుషశ్చాపి చోదితస్త్వదనుజ్ఞయా ॥ (24)

తా॥ ఓ మహర్షీ! మీకు తెలిసి ఉన్నప్పటికీ మీరు ప్రశ్నించుచుండగా మీ అనుజ్ఞ చేత ప్రేరేపించబడినవాడనై నా మనస్సునందలి బెంగను గూర్చి చెప్పెదను.॥24॥

శ్లో॥ లోకపాలైరపి ప్రార్థ్యాః సామ్రాజ్యైశ్వర్య సంపదః ।
న నన్దయన్త్యప్రజం మా క్షుత్తృట్ కామమివాపరే ॥ (25)

తా॥ ఆకలి దప్పికలుగల వానికి ఇతర పదార్థములు (అన్నపానాదులు కానివి) సంతోషమునీయనట్లు, లోకపాలురచేత కోఱబడు సామ్రాజ్యైశ్వర్యాది సంపదలు కూడ, సంతానములేని నన్ను సంతోషింప చేయుట లేదు. (25)

టీ॥ అప్రజమపుత్రమ్. క్షుత్తృడ్భ్యామన్నపానకామమపరే స్రక్చందనాదయో యథా న సుఖయన్తి. ॥23-25॥

టీ॥ పుత్రుడు లేకపోవుట, ఆకలి దప్పులచేత పీడింపబడు వానికి అన్నపానాదులు కాకుండా ఇతరములైన చందన, హారాదులు సుఖమునీయవో అట్లే. ॥23-25॥

శ్లో॥ తతః పాహి మహాభాగ పూర్వైః సహగతం తమః ।
యథా తరేమ దుస్తారం ప్రజయా తద్విధేహి నః ॥ (26)

తా॥ ఓ మహాత్మా! నేను నా పూర్వీకులతో సహా పొందబోయే ననరకము నుండి తరించుటకు, సంతానమును పొందే మార్గమును ఉపదేశించండి. ॥26॥

టీ॥ పూర్వైః పిత్రాదిభిః సహ గతం ప్రాప్తం తమో నరకం ప్రజయా యథా తరేమ తత్తథా విధేహి. ॥26

టీ॥ సంతాన లేమిచే పిత్రాదులతో కూడి మేము పొందు తరింపశక్యము గాని నరకమును-సంతానముతో ఏ విధముగా తరింపగలమో దానిని ఉపదేశింపుడు.॥26

శ్రీ శుక ఉవాచ.

శ్లో॥ ఇత్యర్థితః సః భగవాన్కృపాలుర్బ్రహ్మణః సుతః ।
శ్రపయిత్వా చరుం త్వాష్ట్రం త్వష్టారమయజద్విభుః ॥ (27)

తా॥ ఈ విధముగా ప్రార్థించబడిన భగవానుడు, దయాళువు, బ్రహ్మ పుత్రుడు అయిన అంగీరస మహర్షి త్వష్ట పుత్రుడైన త్వాష్ట్రుని కొఱకు చెఱువును (వండించి) ఆరాధించెను. (27)

శ్లో॥ జ్యేష్ఠా శ్రేష్ఠా చ యా రాజ్ఞో మహిషీణాం చ భారత ।
నామ్నా కృతద్యుతిస్తస్యై యజ్ఞోచ్ఛిష్ఠమదాద్ద్విజః ॥ (28)

తా॥ ఓ రాజా! ఆ మహర్షి, రాజు యొక్క రాణులలో జ్యేష్ఠురాలు, శ్రేష్ఠురాలు అయిన కృతద్యుతియను నామెకు ఆ యజ్ఞ ప్రసాదమును ఇచ్చెను. (28)

టీ॥ యజ్ఞోచ్ఛిష్ఠం యజ్ఞ శేషమ్. ॥27, 28॥

టీ॥ యజ్ఞ శేషమును ॥27,28॥

శ్లో॥ అథాహ నృపతిం రాజన్భవితైకస్తవాత్మజః ।
హర్షశోక ప్రదస్తుభ్యమితి బ్రహ్మసుతో యయౌ ॥ (29)

తా॥ బ్రహ్మసుతుడు అయిన మహర్షి రాజును గూర్చి ఓ రాజా! నీకు సంతోషమును, దుఃఖమును ఇచ్చు (కలిగించు) ఒక కొడుకు కలుగగలడని చెప్పి, వెళ్ళిపోయెను. (29)

శ్లో॥ సాపి తత్ప్రాశనాదేవ చిత్రకేతోరధారయత్ ।
గర్భం కృతద్యుతిర్దేవీ కృత్తికాఽగ్నేరివాత్మజమ్ ॥ (30)

తా॥ ఆ కృతద్యుతిదేవి కూడ (ఆ చెఱువును) తినిన వెంటనే చిత్రకేతువు వలన(అగ్నివలన కృత్తికవలె) గర్భమును ధరించెను. ॥30॥

టీ॥ జన్మనా హర్షం మరణేన చ శోకం ప్రదదాతీతి తథా ఇత్యేవ ముక్త్వా యయౌ. ॥29.30॥

టీ॥ జన్మచేత సంతోషమును, మరణముచేతదుఃఖమును ఇచ్చును. అని చెప్పివెళ్ళిపోయెను. ॥29.30॥

శ్లో॥ తస్యా అనుదినం గర్భః శుక్లపక్ష ఇవోడుపః ।
వవృధే శూరసేనేశ తేజసా శనకైర్నృప ॥ (31)

తా॥ ఓ రాజా! ఆమె గర్భము దినదినము శుక్లపక్ష చంద్రునివలె శూరసేన ప్రభువగు చిత్రకేతువు తేజస్సుతో వృద్ధి చెందుచుండెను.(31)

టీ॥ శూరసేనానామీశస్య తేజసా వీర్యేణ యో గర్భః స వవృధే. ॥31,32॥

టీ॥ శూరసేన రాజ్యాధిపతి (చిత్రకేతువు) యొక్క వీర్యము వలన కలిగిన ఏ గర్భముగలదో ఆ గర్భము చక్కగా వర్ధిల్లెను. ॥31,32॥

శ్లో॥ అథ కాల ఉపావృత్తే కుమారః సమజాయత ।
జనయన్ శూరసేనానాం శ్రుణ్వతాం పరమాం ముదమ్ ॥(32)

తా॥ తరువాత కొంతకాలము గడువగా శూరసేన దేశ ప్రజలకు పరమ సంతోషమును కూర్చుచు పుత్రుడు జన్మించెను. ॥32

శ్లో॥ హృష్టోరాజా కుమారస్య స్నాతః శుచిరలంకృతః ।
వాచాయిత్వాశిషో విప్రైః కారయామాస జాతకమ్ ॥ (33)

తా॥ సంతోషించిన రాజు, స్నానముచేసి, శుచియై, అలంకృతుడై బ్రాహ్మణులచే జాతకర్మను చేయించి, ఆశీస్సులను పొందెను. 33

టీ॥ జాతకమ్ జాతకర్మ. ॥33॥

టీ॥ జాతకర్మ. ॥33॥

శ్లో॥ తేభ్యో హిరణ్యం రజతం వాసాంస్యాభరణాని చ ।
గ్రామాన్హయాన్గజాన్ప్రాదాద్ధేనూనామ్ అర్బుదానిషట్ ॥ (34)

తా॥ వారికి (బ్రాహ్మణులకు) బంగారమును, వెండిని, వస్త్రములను, ఆభరణములను, గ్రామములను, గుఱ్ఱములను, ఏనుగులను, మఱియు ఆఱు అర్బుదముల గోవులను దానము చేసెను.(34)

టీ॥ అర్బుదం దశకోటి వేదేతు కోటిరివార్బుదం నియుతం చ

టీ॥ అర్బుదము అనగా పదికోట్లు, కాని వేదములందు

ప్రయుతంచార్బుదంచేతి ప్రయుతానన్తరం నిర్దేశాత్. ॥34॥

అర్బుదమనగా కోటియే నియతము. లక్షప్రయుతం, పదిలక్షలు, అర్బుదము కోటి అని అర్థమునిచ్చు వాక్యముండుటచే ప్రయుతము తరువాత నిర్దేశించుట వలన కోటియను అర్థము ఏర్పడుచున్నది.॥34॥

శ్లో॥ వవర్ష కామమన్యేషామ్ పర్జన్య ఇవ దేహినామ్ ।
ధన్యం యశస్యమాయుష్యం కుమారస్య మహామనాః ॥ (35)

తా॥ గొప్ప మనస్సుగల ఆ రాజు మేఘములు జలమును వర్షించునట్లు, కుమారునకు ఆయుష్యము, ధనము, కీర్తి కూర్చుట కొఱకు ఇతరులకు కూడ వారి కోరికలను వర్షించెను.(తీర్చెను)॥35॥

టీ॥ ధన్యం ధనకరమ్. ఆయుష్యమాయుష్యకరమ్. మహామనా అత్యుదారః. ॥35,36॥

టీ॥ ధనకారకముగను, ఆయుష్కరముగను, అగుట కొఱకు అతి ఉదారస్వభావుడైన రాజు (ఇతరులకు కోరికలను వర్షించెను.)॥35,36॥

శ్లో॥ కృచ్ఛ్ర లబ్ధేऽథ రాజర్షేస్తనయేऽనుదినం పితుః ।
యథా నిః స్వస్య కృచ్ఛ్రాప్తే ధనే స్నేహోऽన్వవర్ధత ॥ (36)

తా॥ తరువాత రాజర్షియగు చిత్రకేతువునకు క్లేశముచే అనగా లేక లేక కలిగిన తనయుని యందు, ధనములేని వానికి క్లేశమున లభించిన ధనముపట్ల ప్రేమ కలిగినట్లు అనుదినము ప్రేమ వర్ధిల్లెను. ॥36॥

శ్లో॥ మాతుస్త్వతితరాం పుత్రే స్నేహో మోహ సముద్భవః ।
కృతద్యుతేః సపత్నీనాం ప్రజాకామ జ్వరోऽభవత్ ॥ (37)

తా॥ తల్లియగు కృతద్యుతికి పుత్రునియందు అధికమైన స్నేహ మోహము ఏర్పడెను. ఇతర సవతులకు తమకు కూడ సంతానము కావలెనను కోరికచే సంతాన జ్వరము ఏర్పడెను. (37)

టీ॥ మోహస్య సముద్భవో యస్మిన్. ప్రజాకామ రూపో జ్వరస్తాపః (37)

టీ॥ (లేక లేక కలుగుట వలన) ఎవరికి వ్యామోహము ఏర్పడెనో (మిగిలిన వారికి) సంతానము కావలెననెడి వారికి తాపము (ఏర్పడెను) (37)

శ్లో॥ చిత్రకేతోరపి ప్రీతిర్యథా దారే ప్రజావతి ।
న తథాన్యేషు సంజజ్ఞే బాలం లాలయతోఽన్వహమ్ ॥ (38)

తా॥ అనుదినము పిల్ల వానిని లాలించుచున్న చిత్రకేతువునకు సంతానవతి అయిన భార్యయందు ఎట్లు అధికమైన ప్రేమ కలిగెనో, అట్లు ఇతర భార్యలందు ప్రేమ కలుగలేదు. (38)

టీ॥ దార ఇత్యేకవచనమ్ మార్షమ్. ॥38॥

టీ॥ దార అని ఏకవచనము ప్రయోగించుట ఆర్షము (ఋషి సంప్రదాయము) ॥38॥

శ్లో॥ తాః పర్యతప్యన్నాత్మానం గర్హయన్త్యోఽభ్యసూయయా ।
ఆనపత్యేన దుఃఖేన రాజ్ఞోఽనాదరణేన చ ॥ (39)

తా॥ వారు (సవతులు) తమను తాము నిందించుకొనుచు, తిట్టుకొనుచు సంతానము లేకపోవుటచేగల దుఃఖముచేతను, రాజు యొక్క అనాదరణచేతను అధికమైన అసూయను పొందిరి. (39)

టీ॥ ఆనపత్యేన అపుత్రత్వ నిమిత్తేన. ॥39॥

టీ॥ పుత్రులులేని కారణమున (దుఃఖమును పొందిరి) ॥39॥

శ్లో॥ ధిగప్రజాం స్త్రియం పాపాం పత్యుశ్చా గృహసంమతామ్ ।
సుప్రజాభిః సపత్నీభిర్దాసీమివ తిరస్కృతామ్ ॥ (40)

తా॥ సంతానములేని పాపపు స్త్రీలు ధిక్కరించబడుదురు మరియు పతికిని గృహ సమ్మతముకాదు, వారు చక్కని సంతానముగల స్త్రీలచే (సవతులచే) దాసీలవలె తిరస్కరించబడుదురు. (40)

టీ॥ న గృహే సంమతాం న బహుమతాం. యద్వా గృహిణ్యేవ గృహం న భార్యేతి సంమతామిత్యర్థః॥40॥

టీ॥ గృహమందు ఆదరము పొందదు. లేదా సంతానముగల స్త్రీయే గృహిణి అని, భార్యకాదు అని అర్థము.॥40॥

శ్లో॥ దాసీనాం కోఽను సంతాపః స్వామినః పరిచర్యయా ।
అభీక్ష్ణం లబ్ధమానానాం దాస్యా దాసీవ దుర్భగాః ॥ (41)

తా॥ అధికముగా ఆదరణము పొందిన దాసీ జనమునకు ప్రభువు యొక్క సపర్యలచే ఏమి దుఃఖము కలదు? (దుఃఖము ఉండదు అని అర్థము) దాసీకి దాసీల వంటి మనము అభాగ్యులము. (41)

టీ॥ దాస్యాః దాసీ యథా తథా వయం దుర్భగాః. ॥41॥

టీ॥ దాసీల దాసీకి దాసివలె మనము అభాగ్యులము. ॥41॥

శ్లో॥ ఏవం సందహ్యమానానాం సపత్న్యాః పుత్ర సంపదా ।
రాజ్ఞోఽసంమత వృత్తీనాం విద్వేషో బలవానభూత్ ॥ (42)

తా॥ ఈ విధముగా సపత్ని యొక్క (సవతి) పుత్ర సంపదచేతను రాజు యొక్క అనాదరణచేతను దహించబడుచున్న వారికి బలమైన ద్వేషము కలిగెను. (42)

టీ॥ న సంమతా వృత్తిర్జీవనం యాసామ్. ॥42॥

టీ॥ సంమతము (సమ్మతము) గాని జీవనము ఎవరికో వారు అసమ్మత వృత్తులు. ॥42॥

శ్లో॥ విద్వేష నష్ట మతయః స్త్రియో దారుణచేతసః ।
గరం దదుః కుమారాయ దుర్మర్షా నృపతిం ప్రతి ॥ (43)

తా॥ విద్వేషముచేత వివేకము నశించిన స్త్రీలు దారుణమైన మనస్సు గలవారై రాజ పుత్రునకు విషమును పెట్టిరి. (43)

టీ॥ విద్వేషేణ నష్టా మతిర్యాసాం తాః గరం విషమ్. దుర్మర్షా అసహమానాః. ॥43॥

టీ॥ విద్వేషముచేత ఎవరికి బుద్ధినశించునో వారు విద్వేష నష్ట మతులు. గరమనగా విషము. సహనములేని వారు.॥43॥

శ్లో॥ కృతద్యుతిరజానన్తీ సపత్నీనామఘం మహత్ ।
సుప్త ఏవేతి సంచిన్త్య నిరీక్ష్య వ్యచరద్గృహే ॥ (44)

తా॥ సవతుల యొక్క మహాపాపమును తెలియని కృతద్యుతి బాలుడు నిద్రించుచున్నాడనియే తలంచి వాని మెలకువను నిరీక్షించుచు గృహమందు తిరుగుచుండెను.॥44॥

శ్లో॥ శయానం సుచిరం బాలముపధార్య మనీషిణీ ।
పుత్ర మానయమే భద్రే ఇతి ధాత్రీ మచోదయత్ ॥ (45)

తా॥ చాలా కాలము నుండి నిద్రించుచున్నాడని నిశ్చయించి, ఓ కల్యాణీ! నా పుత్రుని తీసుకరమ్ము" అని దాదిని ఆదేశించెను. (45)

టీ॥ ధాత్రీం స్తన దాయినీం. ॥44,45॥

టీ॥ పాలిచ్చునట్టిదాది. ॥44,45॥

శ్లో॥ సా శయానముపవ్రజ్య దృష్ట్వా చోత్తార లోచనమ్ ।
ప్రాణేంద్రియాత్మ భిస్త్యక్తం హతాస్మీత్యపతద్భువి ॥ (46)

తా॥ ఆమె పడుకొనియున్న పిల్లవాని సమీపమునకు వెళ్ళి, గ్రుడ్లుతేల వేసిన, ప్రాణములచే, ఇంద్రియములచే విడిచిపెట్టబడిన వానిని చూచి హా! చచ్చితిని! అని భూమిపై పడిపోయెను. (46)

టీ॥ ఉద్గతే తారే కనీనికే యయోస్తే లోచనే యస్య తమ్. ॥46॥

టీ॥ పైకి వచ్చిన నల్లగ్రుడ్డుగల, కన్నులుగలవాడు ఎవడో వానిని- ఉత్తరాలోచనుని. ॥46॥

శ్లో॥ తస్యాస్తదాకర్ణ్య భృశాతురం స్వనం
ఘ్నన్త్యాః కరాభ్యాముర ఉచ్చకైరపి ।
ప్రవిశ్య రాజ్ఞీ త్వరయాత్మ జాన్తికం
దదర్శ బాలం సహసా మృతం సుతమ్ ॥ (47)

తా॥ అప్పుడు చేతులతో వక్షఃస్థలమును కొట్టుకొనుచు, మిక్కిలి ఆతురతతో గూడి బిగ్గరగా రోదించుచున్న ధ్వనిని విని కృతద్యుతి కూడ తొందరగా పుత్రుని దగ్గరకు వచ్చి మరణించిన బాలుడైన పుత్రుని చూచెను.॥47॥

శ్లో॥ పపాత భూమౌ పరివృద్ధయా శుచా ।
ముమోహ విభ్రష్ట శిరోరుహామ్బరా ॥ (48)

తా॥ అధికమైన దుఃఖముతో ఆమె జుట్టు ముడి వీడి, వెంట్రుకలు చెదిరి, చీర ముడి వీడి వస్త్రములు జారిపోగా (కృతద్యుత) నేలపైబడి మూర్ఛిల్లెను. (48)

టీ॥ విభ్రష్టాః శిరోరుహా అమ్బరం చ యస్యాః సా. ॥47,48॥

టీ॥ జుట్టు ముడి మరియు వస్త్రము కూడ జారిపోయినది. చెదిరిన, వెంట్రుకలు, జారిన వస్త్రములు కలది ఎవరో ఆమె విభ్రష్ట శిరోరుహాంబరా. ॥47,48॥

శ్లో॥ తతో నృపాన్తః పురవర్తినోజనా
నరాశ్చ నార్యశ్చ నిశమ్య రోదనమ్ ।
ఆగత్య తుల్య వ్యసనాః సుదుఃఖితాస్తాశ్చ
వ్యలీకం రురుదుః కృతాగసః ॥ (49)

తా॥ తరువాత రాజుగారి అంతఃపురమునందలి ప్రజలు పురుషులు, స్త్రీలు, కూడ ఏడుపును విని వచ్చినవారై సమానమైన శోకము కలిగినట్లు దుఃఖించిరి. పాపమును చేసిన స్త్రీలుకూడ కపటముగా దుఃఖించిరి. (49)

టీ॥ తాశ్చ సపత్న్యోఽపి. (49)

టీ॥ వారు కూడ అనగా సవతులు (దుఃఖమునునటించిరి). ॥49॥

శ్లో॥ శ్రుత్వా మృతం పుత్రమలక్షితాన్తకం
వినష్ట దృష్టిః ప్రపతన్ స్ఖలన్పథి ।
స్నేహానుబన్ధైధితయా శుచా భృశం
విమూర్ఛితోఽను ప్రకృతిర్ద్విజైర్వృతః ॥ (50)

తా॥ పుత్రుని మరణమును ఊహించని రాజు, పుత్రుని మరణ వార్తను విని, చూపు కోల్పోయి, పుత్రుని యందుగల అధికమైన ప్రేమ వలన అధిక దుఃఖము పొంది, మార్గమందు తొట్రుపడుచు, పడిపోవుచూ మూర్ఛిల్లెను. అనుచరులు మంత్రులు , బ్రాహ్మణులు ఆయన చుట్టూ చేరిరి. (50)

టీ॥ అలక్షితోన్తకో మృత్యుహేతుర్యస్యతమ్. అనుగతాః ప్రకృతయోఽమాత్యాదయో యస్య సోఽనుప్రకృతిః. ॥50॥

టీ॥ ఊహకందని మృత్యు హేతువు ఎవరికోవాడు అలక్షితాంతకుడు. వెంబడించిన అమాత్యాదులుగల ప్రకృతులు. ॥50॥

శ్లో॥ పపాత బాలస్య స పాదమూలే
మృతస్య విస్రస్త శిరోరుహాம్బరః ।
దీర్ఘం శ్వసన్బాష్పకలోపరోధతో
నిరుద్ధకణ్ఠో న శశాక భాషితుమ్ ॥ (51)

తా॥ చెదిరిపోయిన జుట్టు, జారిపోయిన వస్త్రములుగల ఆ రాజు మరణించిన బాలుని పాదముల చెంతపడి, దీర్ఘముగా నిట్టూర్చుచూ కన్నీటి బిందువులచే అడ్డుకోబడిన దృష్టిగలవాడై (డగ్గుత్తిక)గలవాడై మాట్లాడలేకపోయెను. (51)

టీ॥ బాష్పకలాభిరశ్రుబిన్దుభిరుప రోధతః సంవృతత్వేన నిరుద్ధః కణ్ఠో యస్య. ॥51॥

టీ॥ కన్నీటి బిందువులచే అడ్డుకోబడిన చూపుతో, దుఃఖముతో నిరోధించబడిన కంఠము ఎవరికో వాడు, నిరుద్ధ కంఠుడు.॥51॥

శ్లో॥ పతిం నిరీక్ష్యోరుశుచార్పితం తదా
మృతం చ బాలం సుతమేక సన్తతిమ్ ।
జనస్య రాజ్ఞీ ప్రకృతేశ్చ హృద్రుజం
సతీదధానా విలలాప చిత్రధా ॥ (52)

టీ॥ ఉరుశుచార్పితం బహుశోకేన వ్యాప్తమ్. ఏకమేవ సన్తతి రూపమ్. ॥52॥

శ్లో॥ స్తన ద్వయమ్ కుఙ్కుమ గన్ధమన్డితమ్
నిషిఞ్చతీ సాఞ్జన బాష్పబిన్దుభిః ।
వికీర్య కేశాన్విగల త్స్రజః సుతం
శుశోచ చిత్రం కురరీవ సుస్వరమ్ ॥ (53)

టీ॥ విగలన్త్యః స్రజో యేభ్య స్తాన్కేశాన్. ॥53॥

అవ॥ ఆత్మ సృష్టేరప్రతిరూపమననురూపం చేష్టసే. తదేవాహ – అహో ఇతి.

తా॥ అప్పుడు గొప్ప దుఃఖముచే వ్యాపించియున్న పతిని, మరణించిన ఒకే ఒక సుతుడైన పిల్లవానిని చూచి రాణి (కృతద్యుతి) జనమునకు మరియు మిత్రులకు హృదయమందు బాధ కలిగించునటుల పలు విధములుగా రోదించెను. (52)

టీ॥ బహు శోకముచే వ్యాపించబడిన ఒకే ఒక సంతానముగల ॥52॥

తా॥ కుంకుమతో, గంధముతోగల పాలిండ్లను, కాటుకతో కూడిన కన్నీటి బిందువులతో తడుపుచుండగా, చెదిరిన కేశములు, జారి పోవుచున్న పూల మాలలు కలదియై కొడుకును గూర్చి, ఆడ లకుముకి పిట్టవలె (కీచుగొంతుతో) పలు విధములుగా శోకించెను.(53)

టీ॥ ఏ కేశములనుండి పూలమాలలు జారిపోవుచున్నవో ఆ.. ॥53॥

అవ॥ అహో ఇత్యాది శ్లోకమున నీ సృష్టికి విరుద్ధముగా చేయుచున్నావు అని చెప్పుచున్నాడు.

శ్లో॥ అహో విధాత స్త్వమతీవ బాలిశో
యస్త్వాత్మసృష్ట్యప్రతి రూప మీహసే ।
పరేఽను జీవత్య పరస్య యా మృతి
ర్విపర్యయశ్చేత్త్వమసి ధృవః పరః ॥ (54)

తా॥ అయ్యో! విధాతా! హే బ్రహ్మన్! నీవు అతి మూర్ఖుడవు. ఏలయనగా నీవు సృష్టికి తగని విధముగా, పెద్దవారు జీవించియుండగా పిన్నవారు మరణించునట్లు సృష్టి చేయుచున్నావు. ఈ వైపరీత్యముచేత నీవు అమరుడవయ్యు శత్రువగుచున్నావు. (54)

టీ॥ ను అహో పరే వృద్ధే జీవత్య పరస్య బాలస్యయా మృతిస్తత్. తదాహి వృద్ధస్య సృష్టి సామర్థ్యా భావే బాలేచ మృతే సతి తవ సృష్టిర్నష్టా స్యాదిత్యర్థః. నను సాంప్రతం స్వసృష్టే ర్విపరీతోఽస్మీతి చేత్తత్రాహ విపర్యయో విపరీతోఽసి చేత్తర్హి త్వం ప్రాణినామతి దుఃఖ కారిత్వాత్ ధృవో నిత్యః పరః శత్రురసి నతు కృపాలురిత్యర్థః. ॥54॥

టీ॥ అహో! బ్రహ్మన్! వృద్ధులు (తల్లిదండ్రులు) బ్రతికియుండగా పిన్నవారు (పిల్లలు) మరణించుట నీ సృష్టికి విరుద్ధము. పిల్లలు మరణించినచో వృద్ధులకు సృష్టి యందు సామర్థ్యము లేకుండుటచే, నీ సృష్టికి నష్టము కలుగును. నేను విపరీతుడనైతిని అన్నచో చెప్పు చున్నాడు. నీ సృష్టి సంప్రదాయమునకు విపరీత సృష్టియే చేసినచో ప్రాణులకు నిశ్చయముగా అతి దుఃఖమును కలిగించుచున్నావు. అందువలన శత్రువువే అగుచున్నావు. దయగలవాడవు మాత్రము కాదు. ॥54॥

అవ॥ నను జీవకర్మాను సారేణ జన్మాది కుర్వతో మమ కోఽపరాధ స్తత్రాహ - నహీతి.

అవ॥ నహీత్యాది శ్లోకమున నిశ్చయముగా జీవుని కర్మల ననుసరించియే జనన మరణాది విషయములు జరుగుచున్నచో నా అపరాధమేమి? అన్నచో చెప్పుచున్నాడు.

శ్లో॥ నహి క్రమశ్చేదిహ మృత్యు జన్మనోః
శరీరిణామస్తు తదాత్మ కర్మభిః ।
యఃస్నేహ పాశో నిజ సర్గ వృద్ధయే
స్వయం కృతస్తే తమిమం వివృశ్చసి ॥ (55)

తా॥ ఈ లోకమందు శరీరధారుల జనన మరణములకు ఒక క్రమము లేకున్నచో అప్పుడు తమ తమ కర్మలకు వ్యర్థత కలుగదా! నీ సృష్టి వర్ధిల్లుట కొఱకు నీచే చేయబడిన ఏ స్నేహపాశము కలదో దానిని స్వయముగా తెగగొట్టుచున్నావు. ॥55॥

టీ॥ పుత్రే జీవత్యేవ పితా మ్రియతే, పితరి జీవత్యేవ పుత్రో జాయత ఇతి క్రమోనాస్తి కర్మాధీనత్వాదితి చేత్తర్హి ఆత్మకర్మాభిరేవ తజ్జన్మాదిమస్తు కిం త్వయా కృత్యమ్. నను మయేశ్వరేణ వినా జడైః కర్మభిరిదం కథం సిద్ధ్యేత్. భవతు నామ, తథాపి నిజసర్గవృద్ధయే తే త్వయా యః స్నేహపాశః కృతస్తమిమం స్వయమేవ వివృశ్చసి ఛివత్సీత్యాది క్రోశతి. నహ్యేవం విధం దుఃఖం దృష్ట్వా కశ్చిదపి పుత్రాదిషు స్నేహం కరిష్యతీతి భావః. 55

టీ॥ పుత్రుడు జీవించి యుండగా తండ్రి మరణించుట, తండ్రి జీవించి యుండగనే పుత్రుడు కలుగుట అనుక్రమము లేనిచో కర్మాధీనమైన జనన మరణములకు క్రమమున్నచో అదియే ఉండుగాక! అపుడు నీచే చేయబడునది ఏమి? ఈశ్వరుడు లేకుండగా జడములైన కర్మములు ఎట్లు సిద్ధించును? కానిమ్ము! నిజ సర్గవృద్ధి కొఱకు నీచే ఏర్పాటుచేయబడిన స్నేహపాశ బంధమును నీవే స్వయముగా తెగగొట్టుచున్నావు అని ఆక్రోశించుచున్నాడు. ఈ విధమైన దుఃఖమును చూచి ఎవడు కూడ పుత్రాదుల యందు స్నేహము చేయడు అని భావము. ॥55॥

శ్లో॥ త్వం తాత నార్హసి చ మాం కృపణామనాథాం
త్యక్తుం విచక్ష్వ పితరం తవ శోకతప్తమ్ ।
అఞ్జస్తరేమ భవతాఽప్రజ దుస్తరం యద్ధ్వా
న్తం న యాహ్యకరుణేన యమేన దూరమ్ ॥ (56)

తా॥ ఓ తండ్రీ! నీవు కృపణురాలనైనట్టి (దీనురాలను) అనాథను అగు నన్ను విడిచిపెట్టుటకు తగవు. (అర్హుడవుకావు) మరియు శోకముచే క్రుగ్గిపోవుచున్న నీ తండ్రిని చూడుము. సంతానము లేని వారు తరించ శక్యము గాని ఏ అంధకారమును నీ వలన

సునాయాసముగా తరించెదమో (అట్టి మమ్ము వదలి) దయలేని యమునితో దూరముగా వెళ్ళకుము. (56)

టీ॥ అప్రజ దుస్తర మప్రజానాం దుస్తరం అకరుణేన సహ.॥56॥

టీ॥ సంతానములేని వారికి తరింప శక్యముకాని (నరకమును) దయలేకుండా కూడి (వెళ్ళకుము) ॥56॥

శ్లో॥ ఉత్తిష్ఠ తాత ఇమే శిశవో వయస్యా
స్త్వామాహ్వయన్తి నృపనందన సంవిహర్తుమ్ ।
సప్తశ్చిరం హ్యశనయా చ భవాన్పరీతో
భుంక్ష్వస్తనం పిబ శుచో హర నః స్వకానామ్ ॥ (57)

తా॥ ఓ తండ్రీ! రాజకుమారా! లెమ్ము! నీ వయస్సులోగల ఈ పిల్లలు చక్కగా విహరించుటకు నిన్ను ఆహ్వానించుచున్నారు. చాలాసేపు పడుకొని యున్నావు, నీవు ఆకలితో ఉన్నావు తినుము. స్తనమును కుడుచుము పాలు తాగుము. నీ వారమగు మా యొక్క శోకమును పోగొట్టుము. (57)

టీ॥ అశనయా క్షుధా. ॥57॥

టీ॥ ఆకలితో ॥57॥

శ్లో॥ నాహం తనూజ దదృశే హత మఙ్గలా తే
ముగ్ధస్మితం ముదిత వీక్షణ మాననాబ్జమ్ ।
కింవా గతోఽస్య పునరన్వయమన్యలోకం
నీతోఽఘృణేన న శ్రుణోమి కలాగిరస్తే ॥ (58)

తా॥ ఓ పుత్రా! (శరీరమునుండి పుట్టినవాడా) నా మంగళములు నశింపచేయబడినవి. నేను నవ్వుచున్న (ఆనందముతో) చూపుగల పద్మము వంటి నీ ముఖమును చూడనే లేదు. దయలేని వానిచేత (యముని చేత) తిరిగిరాని లోకములకు కొనిపోబడినవాడవై వెళ్ళితివా! నీ మధురమైన మాటలను ఇంక వినకున్నాను. (58)

టీ॥ తనూజ హే పుత్ర నాహం ప్రథమం త్వత్పార్శ్వమాగతా సతీ తవ ముగ్ధ స్మితం వక్త్రం దదృశే దృష్టవత్యస్మి ఇదానీమపి గిరో న శ్రుణోమి తర్హి కిం అపునరన్వయం పునరాగమనం యథా న భవిష్యతి తథా గతోఽసి. ॥58-61॥

టీ॥ ఓ పుత్రా ! మొదట నీ చెంతకువచ్చి నీ యొక్క ముగ్ధమైన (సంతోషముగల) ముఖమును చూచి ఉండలేదు. ఇపుడు నీ మాటలను కూడా వినకున్నాను. అయినచో ఏమి? మళ్ళీ తిరిగిరాని విధముగా వెళ్ళియున్నావు గదా! ॥58-61॥

శ్రీశుక ఉవాచ

శ్రీశుకులు పలికిరి.

శ్లో॥ విలపన్త్యా మృతం పుత్రమితి చిత్రవిలాపనైః ।
చిత్రకేతుర్భృశం తప్తో ముక్తకణ్ఠో రురోదహ ॥ (59)

తా॥ మరణించిన పుత్రుని గూర్చి ఈ విధముగా, పెక్కు విధములుగా విలపించుచున్న ఆమెతో కూడి మిక్కిలి తాపమును పొందిన చిత్రకేతువు ఎలుగెత్తి రోదించెను. (59)

శ్లో॥ తయోర్విలపతోః సర్వే దమ్పత్యో స్తదనువ్రతాః ।
రురుదుః స్మ నరా నార్యః సర్వమాసీదచేతనమ్ ॥ (60)

తా॥ ఆ దంపతులు విలపించుచుండగా వారి అనుచరులు పురుషులు, స్త్రీలు అందరు కూడా రోదించిరి. అంతయు అచేతనముగా (స్పృహను కోల్పోయి) నయ్యెను. (60)

శ్లో॥ ఏవం కశ్మల మాపన్నం నష్ట సంజ్ఞమనాయకమ్ ।
జ్ఞాత్వాఙ్గిరానామ మునిరాజగామ స నారదః ॥ (61)

తా॥ చిత్రకేతువు తనకు కలిగిన నష్టముతో మోహమును పొంది, తెలివిని కోల్పోయిన విషయమును, అతనికి అధిపతిలేకపోవడమును తెలుసుకొని, అంగీరసుడను ముని నారదునితో కూడి వచ్చెను. ॥61॥

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే
చతుర్దశోఽధ్యాయః

శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆఱవ స్కంధమున
పద్నాల్గవ అధ్యాయము సమాప్తము.

పంచదశోஉధ్యాయః

అవ॥ తతః పఞ్చదశే చిత్రకేతోః శోకాపనోదనమ్. కృతం తత్త్వోపదేశేన నారదేనాఙ్గిరోయుజా.

శ్రీశుక ఉవాచ.

శ్లో॥ ఊచతుర్మృత కోపాన్తే పతితం మృతకోపమమ్ ।
శోకాభిభూతం రాజానం బోధయన్తౌ సదుక్తిభిః ॥ 1

టీ:- మృత కోపాన్తే శవ సమీపే. 1

శ్లో॥ కోஉయంస్యాత్తవ రాజేన్ద్ర భవాన్యమనుశోచతి ।
త్వం చాస్య కతమః సృష్టౌ పురేదానీమతః పరమ్ ॥ 2

టీ:- త్వం చాస్య బన్ధూనాం మధ్యే కతమః. సృష్టౌ ప్రజారూపాయమ్. అయం పుత్రోஉహం చాస్య పితేతి చేత్తత్రాహుః - పురేతి. యే పూర్వజన్మని పిత్రాది రూపేణ సంయుక్తా ఆసంస్త ఏవ మరణేన వియుక్తాః

పదిహేనవ అధ్యాయము

అవ॥ తరువాత పదిహేనవ అధ్యాయమున అఙ్గిరసునితో కూడి నారదుని చేత చేయబడిన తత్త్వోపదేశము చేత చిత్రకేతువు యొక్క దుఃఖము తొలగుట వివరించబడుచున్నది.

శ్రీ శుకులు పలికిరి.

తా:- మరణించిన (బాలుని) వాని సమీపమునందు మరణించిన వానివలె పడియున్న, శోకముచే నిండియున్న రాజునకు ఉత్తమమైన మాటలతో బోధించుచున్నవారై నారాదాఙ్గిరసులు పలికిరి. 1

టీ:- శవ సమీపమునందు...1

తా:- ఓ రాజేన్ద్రా! నీవు ఎవనిని గూర్చి దుఃఖించుచున్నావో ఆ ఈ బాలుడు నీకు ఏమగును? సృష్టి యందు పూర్వజన్మలో, ఇప్పటి జన్మ యందును, తరువాతి జన్మలో కూడా నీవు వీనికి ఏమగుదువు? 2

టీ:- సంతాన రూప సృష్టి యందు నీవు బన్ధువులలో ఎవడవు? అని ప్రశ్నించుచూ సంతాన హేతువుగా వీడు పుత్రుడు, నేను వీనికి తండ్రిని అన్నచో చెప్పుచున్నాడు. ఇందుకు హేతువుగా "పురేదానీమతః

స్తనో వర్తమాన జన్మని కదాచిత్తస్యైవాన్యస్య వా పుత్రాదయో భవన్తి తే జన్మాంతరే తస్యైవాన్యస్య వా కలత్రాదయః శత్రుమిత్రాదయో వా భవన్త్యతో నాయమ్ నియమ ఇతి భావః. 2

పరమ్" అని ప్రశ్నించుచున్నాడు. పూర్వ జన్మమునందు తండ్రి రూపమున ఉన్నటువంటివారు మరణముతో ముక్తులైరి. వర్తమాన జన్మమునందు అతనికి కాని, మరొకనికి కాని పుత్రాదులుగా అగుచున్నారు. జన్మాంతరమందు వానికికాని, మరిఒకనికికాని కళత్రాదులుగా శత్రు మిత్రాదులుగ అగుచున్నారు. అందుచేత పుత్రుడే మరలా పుత్రునిగా పుట్టునను నియమము లేదు. 2

అవ॥ తమేవాభిప్రాయం ప్రకటమతి - యథేతి.

అవ: యథేత్యాది శ్లోకమున ఆ అభిప్రాయమునే ప్రకటించుచున్నాడు.

శ్లో॥ యథాప్రయాన్తి సంయాన్తి స్రోతో వేగేన వాలుకాః ।
సంయుజ్యన్తే వియుజ్యన్తే తథా కాలేన దేహినః ॥ 3

తా:- ప్రవాహ వేగముచేత ఇసుక రేణువులు ఎట్లు విడిపోవునో, ఎట్లు కలియునో అట్లే కాలము చేత ప్రాణులు (దేహముకలవారు) విడిపోవుదురు, కలియుదురు. 3

టీ:- స్రోతసః ప్రవాహస్య వేగేన యథా ప్రయాన్తి వియుజ్యన్తే సంయాన్తి సంయుజ్యన్తే తథాః కాలవేగేన దేహినో జీవా అపి. 3

టీ:- ప్రవాహ వేగమునకు ఇసుక రేణువులు కొట్టుకొని పోవుచు ఒకదానితో ఒకటి కలియును, విడిపోవును, అట్లే కాల వేగముచేత జీవులు కూడా (కలియుదురు, విడిపోవుదురు). 3

శ్లో॥ యథా ధానాసువైధానా భవన్తి న భవన్తి చ ।
ఏవం భూతేషు భూతాని చోదితానీశమాయయా ॥ 4

తా:- ఏ విధముగా ధాన్యపు గింజలయందు ధాన్యపు గింజలు పుట్టవచ్చును, పుట్టకపోవచ్చునో, అట్లే భూతములయందు ఈశ్వరుని మాయచేత ప్రేరితములై జీవులు పుట్టవచ్చును, పుట్టకపోవచ్చును. 4

టీ:- తథాఽప్యేతావన్తం కాలం మమపుత్రో నాభూద్వార్ధకే జాతోమృత ఇతి దుఃఖమితి చేత్తత్రాహతుః - యథా ధానాసు బీజేషు ధానా బీజాన్తరాణి భవన్తి, కాసుచిత్కదాచిన్న భవన్తి నోత్పద్యన్తే నశ్యన్తి చ. న తు భవన్త్యేవ తిష్ఠన్త్యేవేతి వా నియమః. ఏవమేవ భూతాని పిత్రాది రూపాణి భూతేషు పుత్రాదిషు. అతో ధానానాం జన్యజనకత్వేఽపి యథా పితృపుత్రాదిభావోనాస్త్యేవమత్రాపీతి న శోకః కార్య ఇతి భావః ఈశ మాయయా ప్రేరితానామేవ భవనమభవనం, న వస్తుతః. 4

టీ:- ఇంతకాలము వరకు పుత్రుడు కలుగలేదు. ముదుసలితనము నందు పుట్టినవాడు చచ్చినాడు అని దుఃఖము కలిగినదన్నచో వివరించుచున్నాడు-ఏ విధముగా విత్తనముల యందు బీజాన్తరములు యుండునో అన్య బీజములు పుట్టునో, వానిలో కొన్నింటియందు బీజములు పుట్టవు. ఒకప్పుడు బీజములు పుట్టును మరియు నశించిపోవును కూడా లేదా పుట్టకయే ఉండును అని కూడా నియమము. ఈ విధముగానే జీవులు తండ్రులుగాను, కొడుకులుగాను పుట్టుదురు. అందుచేత విత్తనముల యందు జన్యజనక భావము నియమితము కానట్లు జీవులందు కూడా పితృపుత్రభావము లేనేలేదు. ఈ విషయమున శోకించవలసిన పనిలేదు అని భావము. ఈశ్వరుని మాయా ప్రేరితములై ఏర్పడుట, ఏర్పడకుండుట జరుగుచున్నవి. వాస్తవమునకు ఇవి ఏవియు లేవు అని భావము. 4

అవ॥ తస్య చ సర్వ సాధారణత్వాన్న పుత్ర ఏవ శోచనీయ ఇత్యాహతుః - వయం చేతి.

అవ:- వయంచ ఇత్యాది శ్లోకమున - సర్వసాధారణమగుటచేత పుత్రుని కొఱకు దుఃఖించకూడదని చెప్పుచున్నారు.

శ్లో॥ వయం చ త్వం చ యే చేమే తుల్యకాలాశ్చరాచరాః ।
జన్మమృత్యోర్యథా పశ్చాత్ప్రాజ్నైవమధునాపి భో ॥ 5

తా:- ఓ రాజా! సమకాలీనులైన మేము, నీవు ఇక్కడనున్నట్టివారు, మరియు కదిలే ప్రాణులు, కదలని ప్రాణులు ఏ విధముగానైతే పుట్టుటకు ముందు, మరణమునకు తర్వాత లేవో అట్లే ఇప్పుడు కూడా లేవు. 5

టీ:- తుల్యకాలా వర్తమాన కాలీనాః. జన్మనః ప్రాక్ మృత్యోః పశ్చాచ్చ యథానసన్త్యేవమధునాపి న సన్తి. భో రాజన్. ఆద్యన్తయోరసత్త్వాత్స్వప్న వదిత్యర్థః. 5

టీ:- ఓ రాజా! ప్రస్తుత కాలములో ఉన్న మనమందరము ఈ జన్మకు ముందుగాని, మరణము తర్వాతగాని ఎట్లు లేమో అట్లే ఇప్పుడుకూడా లేము. ఆద్యంతములయందు లేకుండుట వలన స్వప్నమువలె అని భావము. 5

అవ॥ అసత్త్వే కథం ప్రతీతిః కథంవాహమస్య జనక ఇత్యాద్యభిమాన స్తత్రాహతుః - భూతైరితి.

అవ:- భూతైరిత్యాది శ్లోకమున అసత్త్వమందు ఎఱుక? ఎట్లు లేదా నేను వీనికి తండ్రిని మొదలగు అభిమానములు ఎట్లు? అన్నచో చెప్పుచున్నాడు.

శ్లో॥ భూతైర్భూతాని భూతేశః సృజత్యవతి హన్త్యజః ।
ఆత్మసృష్టైరస్వ తన్త్రైరన పేక్షోఽపి బాలవత్ ॥ 6

తా:- ప్రాణులకు ఈశుడు, (ప్రభువు) పుట్టుకలేనివాడు అయిన పరమాత్మ బాలునివలె ప్రయోజనము లేకున్నను (ఆపేక్ష లేకున్నను) తనచేత సృష్టించబడిన స్వతంత్రులు కాని ప్రాణులచే ప్రాణులను పుట్టించును, రక్షించును మరియు సంహరించును. 6

టీ:- ఈశ్వరేణ మాయయా సృష్టత్వాత్ప్రతీతిర్నిమిత్తమాత్రత్వేనైవ చ భూతానామయ మభిమాన ఇతి భావః. నన్వీశ్వరస్య సృష్ట్యాదిభిః సాధ్యమస్తి చేత్తర్హ్య పూర్ణకామతాప్రాప్తానాస్తి చేత్కుతః ప్రవృత్తిస్తత్రాహతుః - అనపేక్షోఽపి బాలవల్లీలయా కరోతీతి. 6

టీ:- ఈశ్వరుని మాయచేత సృష్టింపబడిన కారణమున నిమిత్త మాత్రము చేత భూతములయందు అభిమానము ఏర్పడు చున్నదని భావము. ఈశ్వరుని యొక్క సృష్ట్యాదులచేత సాధ్యమగునన్నచో కామత పొందబడలేదు. అయినచో ప్రవృతి ఎట్లు అన్నచో చెప్పుచున్నాడు-ఆపేక్ష లేనివాడైనను బాలునివలె చేయుచున్నాడు. 6

అవ॥ అయం చ జన్మాది వ్యవహారో దేహానామేవనత్వాత్మన ఇత్యాహుతుః - దేహేన ఇత్యాది.

అవ:- దేహేన ఇత్యాది శ్లోకమున దేహములకు మాత్రమే జన్మాది వ్యవహారములనియు, ఆత్మకు కాదనియు చెప్పుచున్నాడు.

శ్లో॥ దేహేన దేహినో రాజన్దేహాద్దేహోఽభిజాయతే ।
బీజాదేవ యథా బీజం దేహ్యర్థ ఇవ శాశ్వతః ॥ 7

తా:- ఓ రాజా! దేహముచేత దేహము నుండి దేహి యొక్క దేహము, బీజము నుండి బీజము ఏర్పడు విధముగా ఏర్పడును. దేహి మాత్రము శాశ్వతముగా యుండును. 7

టీ:- దేహినః పితుర్దేహేన దేహినః పుత్రస్య దేహో మాతుర్దేహినో దేహాదభి జాయతే. యథా బీజాదేవ బీజం జాయతే. దేహీతు శాశ్వత ఏవ అర్థో భూమ్యాదిర్యథాతద్వత్. 7

టీ:- బీజము నుండి బీజము ఏర్పడునట్లు తండ్రి దేహముచేత తల్లి దేహము నుండి పుత్రుని యొక్క దేహము ఏర్పడు చున్నది. దేహమును పొందిన దేహి మాత్రము భూమ్యాదులవలె వ్యావహారిక శాశ్వతుడు. 7

అవ॥ నమ నశ్వర దేహ ప్రతియోగిత్వాదేహ్యపి న శాశ్వతః స్యాత్త్రత్రా హతుః - దేహ దేహీతి.

అవ:- నశ్వర దేహమునకు ప్రతియోగి అగుట వలన దేహికూడా నశ్వరము అన్నచో చెప్పుచున్నాడు - దేహదేహీత్యాది శ్లోకమున..

శ్లో॥ దేహదేహి విభాగోఽయమ వివేక కృతః పురా ।
జాతి వ్యక్తివిభాగోఽయం యథా వస్తుని కల్పితః ॥ 8

తా:- ఏ విధముగా వస్తువులందు జాతి, వ్యక్తి, విభాగము కల్పించబడినదో ఆ విధముగనే అజ్ఞానముచేత అనాది నుండియు దేహము, దేహియను ఈ విభాగము కల్పించబడినది. 8

టీ:- దేహదేహినోరయం పరస్పర ప్రతియోగవిభాగః పురాऽనాదిరవివేక కృతోऽజ్ఞాన కల్పితః. జాతిః సామాన్యం వ్యక్తిర్వి శేషస్తయోర్విభాగో యథా వస్తుని సన్మాత్రే కల్పితః. పరాస్పరాపేక్ష సిద్ధత్వేనానిరూప్యత్వాత్తద్వత్. 8

టీ:- దేహము, దేహియను ఈ పరస్పర విరోధ విభాగము అనాది నుండియు అజ్ఞాన కారణముగా కల్పించబడినది. వస్తువులయందు జాతి శబ్దము సామాన్య వాచకముగాను, వ్యక్తి శబ్దము విశేష వాచకముగా విభాగము కల్పించబడినట్లు దేహము, దేహియను విభాగము కల్పించబడినది. పరస్పర అపేక్షములగుటచే నిరూపణీయము కాదు గదా! 8

శ్రీశుక ఉవాచ

శ్లో॥ ఏవమాశ్వాసితో రాజాచిత్రకేతుర్ద్విజోక్తిభిః ।
ప్రమృజ్య పాణినా వక్త్రమాధిమ్లానమభాషత ॥ 9

శ్రీశుకులు పలికిరి.

తా:- ఈ విధముగా చిత్రకేతు మహారాజు బ్రాహ్మణుల మాటలచే ఓదార్చబడినవాడై మానసిక బాధచే వాడిపోయిన ముఖమును చేతితో తుడుచుకొని ఇట్లు పలికెను. 9

టీ:- అధిమ్లానం వక్త్రమ్. 9

టీ:- చింతచే వాడిపోయిన (పీక్కుపోయిన) ముఖము...9

రాజో ఉవాచ

శ్లో॥ కౌయువాం జ్ఞాన సంపన్నౌ మహిష్ఠౌ చ మహీయసామ్ ।
అవధూతేన వేషేణ గూఢావిహ సమాగతౌ ॥ 10

రాజు పలికెను.

తా:- జ్ఞానసంపన్నులు, గొప్పవారిలో మరింత గొప్పవారు, అవధూతల వేషముతో రహస్యముగా (తెలియబడకుండగ) ఇచ్చుటకు వచ్చిన మీరు ఇరువురు (ఇద్దరు) ఎవరు? 10

శ్లో॥ చరన్తి హ్యవనౌ కామం బ్రాహ్మణా భగవత్ప్రియాః ।
మాదృశాం గ్రామ్య బుద్ధీనాం బోధాయోన్మత్తలిఙ్గినః ॥ 11

తా:- బ్రాహ్మణులు, భగవంతునికి ప్రియమగువారు. ఇన్ద్రియాసక్త బుద్ధిగల మావంటి వారలకు బోధించుటకు ఉన్మత్త లక్షణములతో ఈ భూమియందు స్వేచ్ఛగా సంచరించుదురు. 11

టీ:- ఉన్మత్తస్యేవలిఙ్గం యేషాం తే - ఉన్మత్తలిఙ్గినః. (10,11)

టీ:- ఉన్మత్తుని యొక్క చిహ్నములు గలవారు ఎవరో వారు ఉన్మత్త లిఙ్గినులు అని పిలవబడుదురు. (10,11)

శ్లో॥ కుమారౌ నారద ఋభురఙ్గిరా దేవలోఽసితః ।
అపాంతర తమో వ్యాసోమార్కణ్డేయోఽథ గౌతమః ॥ 12

తా:- కుమారుడు (సనత్కుమారుడు), నారదుడు, ఋభువు, అఙ్గిరుడు, అసితుడు, దేవలుడు, అపాంతరతముడు, వ్యాసుడు, మార్కణ్డేయుడు, గౌతముడు...12

శ్లో॥ వసిష్ఠో భగవాన్ రామః కపిలో బాదరాయణిః ।
దుర్వాసా యాజ్ఞవల్క్యశ్చ జాతూకర్ణ్యస్తథారుణిః ॥ 13

తా:- వసిష్ఠుడు, భగవానుడగు రాముడు (పరశురాముడు), కపిలుడు, శుకుడు, దుర్వాసుడు, జాతుకర్ణి మరియు ఆరుణి.. 13

శ్లో॥ రోమశశ్చ్యవనో దత్త ఆసురిః సపతఞ్జలిః ।
ఋషిర్వేదశిరా బోధ్యో మునిః పఞ్చశిరాస్తథా ॥ 14

తా:- రోమశుడు, చ్యవనుడు, దత్త్రాత్రేయుడు, ఆసురి, పతఞ్జలి, వేదశిరఋషి, మునిగా తెలియవలసిన పఞ్చశిరుడు..14

శ్లో॥ హిరణ్యానాభః కౌసల్యః శ్రుతదేవ ఋతుధ్వజః ।
ఏతే పరే చ సిద్ధేశాశ్చరన్తి జ్ఞానహేతవః ॥ 15

తా:- హిరణ్యానాభుడు, కౌసల్యుడు, శ్రుతదేవుడు, ఋతధ్వజుడు మొదలగు వీరును ఇతర సిద్ధేశులు కూడా జ్ఞానకారణులై తిరుగు చుందురు. 15

శ్లో॥ తస్మాద్యువాం గ్రామ్య పశోర్మమమూఢధియః ప్రభూ ।
అన్ధే తమసి మగ్నస్య జ్ఞానదీప ఉదీర్యతామ్ ॥ 16

తా:- అందుచేత ప్రభువులగు మీరిద్దరు ఇన్ద్రియ సుఖాసక్తుడను, అజ్ఞాన తమస్సు నందు మునిగి యున్న నాకు జ్ఞానదీపమును అనుగ్రహించెదరు గాక. 16

టీ:- మమ ప్రభూ రక్షకౌ బోధే సమర్థావితి వా. అతో యువాభ్యాం జ్ఞాన దీపం ప్రవర్త్యతామ్. (12-16)

టీ:- నా యొక్క రక్షకులు లేదా బోధించుట యందు సమర్థులు అందువలన మీరిద్దరు నాకు జ్ఞానదీపమును ప్రవర్తింపజేయుదురు గాక. (12-16)

అంగిరస ఉవాచ

అంగీరసనుడు ఈ విధముగా పలికెను.

శ్లో॥ అహం తే పుత్రకామస్య పుత్రదోஉస్య్మఙ్గిరాన్నృప ।
ఏష బ్రహ్మసుతః సాక్షాన్నారదో భగవానృషిః ॥ 17

తా:- ఓ రాజా! నేను పుత్రుని యందు కోరికగల నీకు పుత్రుని ప్రసాదించిన అఙ్గిరసుడను, ఈతడు సాక్షాత్తుగ బ్రహ్మపుత్రుడగు భగవానుడు అయిన నారదమహర్షి..17

శ్లో॥ ఇత్థం త్వాం పుత్రశోకేన మగ్నం తమసిదుస్తరే ।
అతదర్హ మనుస్మృత్య మహాపురుష గోచరమ్ ॥ 18

తా:- ఈ విధముగా పురుషోత్తముని భక్తుడవగు నిన్ను, పుత్రశోకముచే తరించ శక్యముగాని, చీకటి యందు మునిగి యుండుటకు తగని వానిగా తెలుసుకొని..18

టీ:- మహాపురుష గోచరమ్ హరిభక్తం త్వామ్. (17,18)

టీ:- హరి భక్తుడవైన నిన్ను... (17,18)

శ్లో॥ అనుగ్రహాయ భవతః ప్రాప్తావావామిహ ప్రభో ।
బ్రహ్మణ్యో భగవద్భక్తో నావసీదితు మర్హతి ॥ 19

తా:- ఓ మహారాజా! నిన్ను అనుగ్రహించుట కొఱకు మేము ఇరువురము ఇచ్చటికి వచ్చితిమి. బ్రాహ్మణుడు (వేదజ్ఞానము కలవాడు), భగవద్భక్తుడు దుఃఖముతో కృంగిపోవుట తగదు..19

శ్లో॥ తదైవ తే పరం జ్ఞానం దదామి గృహమాగతః ।
జ్ఞాత్వాన్యాభి నివేశం తే పుత్రమేవ దదావహమ్ ॥ 20

తా:- నీకు ఉత్కృష్టమైనన జ్ఞానమును ప్రసాదించుటకే పూర్వము నీ గృహమునకు వచ్చియుంటిని. పుత్రులకై నీకు గల అభిమానము గమనించి (తెలుసుకొని) నీకు పుత్రునే ఇచ్చితిని. 20

టీ:- తదైవ యదా పూర్వ మాగతోఽస్మి. (19,20)

టీ:- పూర్వములో ఎప్పుడైతే వచ్చియుంటినో(వచ్చియున్నప్పుడు) (19,20)

శ్లో॥ అధునా పుత్రిణాం తాపో భవతైవానుభూయతే ।
ఏవం దారా గృహా రాయో వివిధైశ్వర్య సమ్పదః ॥ 21

తా:- ఇప్పుడు పుత్రులుగలవారల దుఃఖము నీ చేతనే అనుభవింప బడు చున్నది. ఈ విధముగనే భార్య, గృహములు, ధనమును మరియు వివిధములైన ఐశ్వర్యములును కూడా. 21

టీ:- రామః - అర్థాః - 21

టీ:- ధనములు...21

శ్లో॥ శబ్దాదయశ్చ విషయాశ్చలా రాజ్యవిభూతయః ।
మహీరాజ్యం బలం కోశో భృత్యామాత్యాః సుహృజ్జనాః ॥ 22

తా:- శబ్దము మొదలగు ఇన్ద్రియ భోగములు, రాజ్యవైభవములు, భూమి, రాజ్యము, బలము, కోశము, అమాత్యులు, సేవకులు, మిత్రజనులు అన్నియు అనిత్యములు. 22

టీ:- చలా అనిత్యాపి. కించ మహీతి. 22

టీ:- అనిత్యములు మరియు భూమి మొదలగునవి..22

శ్లో॥ సర్వేఽపి శూరసేనే మే శోకమోహభయార్తిదాః ।
గన్ధర్వ నగర ప్రఖ్యాః స్వప్నమాయా మనోరథాః ॥ 23

తా:- ఓ శూరసేనా! ఇవి అన్నియును శోకమును, మోహమును, భయమును, దుఃఖమును కలిగించునవియే. స్వప్నము, ఇన్ద్రజాలము, మనోకల్పితములు, గన్ధర్వ నగరముల వంటివి. 23

టీ:- హే శూరసేన, ఇమే సర్వేఽపి శోకాది ప్రదాః. కించ ఆగమాపాయిత్వేన గన్ధర్వ నగర తుల్యాః. గన్ధర్వ నగరంహ్యా కస్మాదేవ క్వచిదాయాత్యపయాతి చేతి ప్రసిద్ధమ్. తదేవ మనిత్యత్వం శోకాది హేతుత్వం చాగామాపాయిత్వం చోక్తమ్. మిథ్యాత్వమప్యాహ - స్వప్నశ్చమాయాచ మనోరథశ్చ యథా తద్వత్. 23

టీ:- ఓ శూరసేనా! ఇవి అన్నియును శోకాదులను కలిగించునవి. మఱియు వచ్చిపోవుటచేత గన్ధర్వ నగర సమానములు. "అకస్మాతుగ వచ్చి మరల పోవునది" గన్ధర్వనగరమనుట ప్రసిద్ధము. అదే విధముగ శోకాది హేతువులు. వచ్చిపోవుచుండుట అనిత్యత్వముగ చెప్పబడు చున్నది. స్వప్నము, మాయ, మనోరథములవలె ఇవి మిథ్యలు. 23

శ్లో॥ దృశ్య మానా వినార్థేన న దృశ్యన్తే మనోభవాః ।
కర్మభిర్ధ్యాయతో నానా కర్మాణి మనసోఽభవన్ ॥ 24

తా:- అర్థము (వస్తువు) లేకుండగా కనబడుచున్నది. మనః కల్పితములు ఆభాస మాత్రములై మరల కనబడకున్నవి. కర్మల గూర్చి నానాత్వమును ధ్యానించువానికి మనస్సు కారణముగా నానా కర్మలు ఏర్పడుచున్నవి. 24

టీ:- మనోభవా మనోమాత్ర విజృమ్భితాః. అత్ర హేతుః - అర్థేన తాత్త్వికస్వరూపేణ వినైవ దృశ్య మానాః. తత్కుతః. యస్మాత్ క్షణాంతరే

టీ:- మనస్సుచేత కల్పించబడినవే అనుటకు హేతువు ఏమనగా తత్త్వము లేకుండగనే (స్వరూపము లేకుండగనే) అనగా వస్తుతత్త్వము

న దృశ్యన్తే. తాత్త్వికత్వేహి క్షణాంతరే బాధోనస్యాత్. అతో మనో మాత్ర విజృమ్భితత్వేన స్వప్నాదివన్మిథ్యాభూతా ఇత్యర్థః. నన్వేతే పుణ్యా పుణ్యకృతా ఇతి మీమాంసకాః ప్రాహుస్తత్కుతో మనోభవత్వం తత్రాహ - కర్మభిః. కర్మవాసనాభిరర్థాన్ ధ్యాయతః పుంసో మనస ఏవ నిమిత్తాత్కర్మాణ్యభవన్. పాఠాన్తరే కర్మ ఈప్సిత తమమభిధ్యా యత ఇత్యర్థః. కర్మణోఽపి మనోభవత్వాత్తత్సాధ్యా అర్థా అపి మనోభవా ఏవేతి భావః. 24

లేకుండగనే కనబడుచున్నది. ఎక్కడనుండి (ఎట్లు) అన్నచో క్షణాన్తరములో కనబడదు. వస్తు స్వరూపమునకు క్షణాన్తరములో బాధ యుండదు. (నశించదు) అందుచేత మనస్సుచేతనే కల్పించబడిన వగుటచే స్వప్నాదులవలె మిథ్యాభూతములు అని భావము. యథార్థముగా సుఖ దుఃఖములన్నియు మనస్సుచేత కల్పించబడివవే. నిజమునకు అవి లేవు. దీనిని మీమాంసకులు పుణ్యాపుణ్యముల ఏర్పడునని చెప్పుదురు. లేనిచో మనస్సులోని ఈ భావనలు ఎట్లో చెప్పుచున్నాడు-కర్మలచేత అనగా కర్మలవాసనల చేత ప్రభావితుడై వ్యక్తి వస్తువులను ధ్యానించుటచే మనస్సుయొక్క నిమిత్తముగా కర్మలు ఏర్పడుచున్నవి. పాఠాన్తరమందు కర్మ భిర్ధ్యాయత అని యున్నది. ఈప్సితములను ధ్యానించుటవలన కర్మలు ఏర్పడుచున్నవని భావము. కర్మలుకూడా మనోభవముచేత సాధ్యము, సంపదలుకూడా మనోభవములే అనగా కర్మలు, సంపదలు, భోగములు అన్నియు మనోకల్పితములని భావము. 24

అవ॥ తదేవం మమతాస్పదానాం. పుత్రాదీనాం దుఃఖాది హేతుత్వ ముక్తం తత్ర దేహసంబన్ధో మూల మిత్యాహ - అయం హీతి.

అవ:- అయంహీత్యాది శ్లోకమున ఈ దేహమే మమతాస్పదులైన పుత్రాదులకు హేతువుగా చెప్పబడినది దుఃఖాదులకు ఈ దేహ సంబన్ధమే మూలముగా చెప్పబడునది ఇదే అనగా ఈ దేహమే.

శ్లో॥ అయం హి దేహినో దేహో ద్రవ్యజ్ఞాన క్రియాత్మకః ।
దేహినో వివిధక్లేశ సంతాపకృదుదాహృతః ॥ 25

టీ:- హీత్యవధారణే. అయం ద్రవ్య జ్ఞాన క్రియాత్మకోఽధి భూతాధి దైవాధ్యాత్మ రూపో దేహ ఏవ దేహినో దేహోఽహమితి మన్య మానస్య దేహినో జీవస్య వివిధాన్ క్లేశాన్సంతాపాంశ్చ కరోతీతి తథా. 25

తా:- ద్రవ్య, జ్ఞాన క్రియాత్మకమైన ఈ దేహమే దేహధారులకు వివిధ క్లేశములను, సన్తాపములను కలుగచేయుచున్నదని చెప్పబడినది. 25

టీ:- హి-ఇదే అని నిశ్చయత్వమును చెప్పచున్నాడు. ఈ దేహము ద్రవ్య జ్ఞాన క్రియాత్మకము. అధిభూతము, అధిదైవము, అధ్యాత్మము అయిన ఈ దేహమే దేహధారియైన జీవుడు. ఈ దేహము నేను అని భావించుటచేత జీవునకు వివిధములైన క్లేశములు, సంతాపములు కలుగుచున్నవి అని భావము. 25

శ్లో॥ తస్మాత్స్వస్థేన మనసా విమృశ్య గతిమాత్మనః ।
ద్వైతే ధ్రువార్థ విశ్రమ్భం త్యజోపశమమావిశ ॥ 26

టీ:- స్వస్థేనావ్యగ్రేణ. గతిం తత్త్వమ్. ధ్రువోఽయమర్థ ఇతి విశ్రమ్భం విశ్వాసం ప్రణయం వా త్యజ తపశ్శో పశమమావిశాశ్రయ. (26)

తా:- అందువలన స్వస్థమైన మనస్సుచేత ఆత్మయొక్క స్వరూపమును విచారించి ద్వైతమందు (భేదభావమందు) వస్తువు నిత్యమను నమ్మకమును విడిచిపెట్టుము. శాంతిని ఆశ్రయించుము. 26

టీ:- స్వస్థమనగా అవ్యగ్రేణ, (ప్రశాంతముగా) గతింతత్త్వమును, నిశ్చయింపుము ఈ వస్తువు నిత్య వస్తువు. నిత్యము అనుభావనను విశ్వాసముచేత, ఈ దేహము శాశ్వతము అను విశ్వాసమును, ప్రేమను (వ్యామోహమును) విడిచిపెట్టుము. తపస్సు చేత శాంతిని ఆశ్రయించుము. 26

అవ॥ అఙ్గిరసో పదిష్టం తత్త్వం పరమేశ్వర ప్రసాదం వినా నప్రాప్యత. ఇతి తత్ప్రసాదాయ మన్త్రవిద్యాం నారద ఉపదిశతి - ఏతామితి.

అవ:- అఙ్గిరసునిచేత ఉపదేశించబడిన తత్త్వము పరమేశ్వరుని అనుగ్రహము లేనిచో గ్రహింపలేదు. అని అతనికి దైవానుగ్రహమును అందించుటకు మన్త్రవిద్యను నారదుడు ఉపదేశించుచున్నాడు అని ఏతామితీత్యాది శ్లోకమున చెప్పుచున్నాడు.

నారద ఉవాచ

శ్లో॥ ఏతాం మన్త్రోపనిషదం ప్రతీచ్ఛ ప్రయతో మమ ।
యాం ధారమన్సప్తరాత్రాద్ద్రష్టా సంకర్షణం ప్రభుమ్ ॥ 27

నారదుడు ఈ విధముగా పలికెను.

తా:- దేనిని ధారణ చేసినచో ఏడు రాత్రులలో సంకర్షణ ప్రభువును చూడగలవో అట్టి ఈ ఉపనిషద్మన్త్రమును సావధానుడవై నా నుండి స్వీకరించుము. 27

టీ:- ఉపనిషణ్ణం పరం శ్రేయోఽస్యామిత్యుపనిషత్. మన్త్ర ఏవో పనిషత్తాం ప్రతీచ్ఛగృహాణ. ద్రష్టాద్రక్ష్యతి భవాన్. 27

టీ:- పరమశ్రేయస్సును అనగా మోక్షమును కలిగించు ఈ ఉపనిషత్ మన్త్రమును స్వీకరించుము. నీవు పరమేశ్వరుని చూడగలవు. 27

శ్లో॥ యత్పాదమూల ముపసృత్య నరేన్ద్ర పూర్వేశర్వాదమో
భ్రమమిమం ద్వితీయం విసృజ్య ।
సద్యస్తదీయ మతులానాధికం మహిత్వం ప్రాపుర్భ
వానపి పరం న చిరాదుపైతి ॥ (28)

తా:- ఓ రాజా! ఎవని పాదములనాశ్రయించి శివుడు మొదలగువారు ద్వైతరూపమగు ఈ భ్రమను వదిలిపెట్టి వెంటనే సాటిలేని అధికమైన మహిమను పొందిరో అట్టి మహిమను నీవు కూడా త్వరగా పొందుదువు. 28

టీ:- అతులంచ తదనధికం చ సమానాధికశూన్యం పరం మహిమానం ప్రాప్యః. ఉపైత్యుపైశ్యతి. 28

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే
పంచదశో౽ధ్యాయః

టీ:- దేనితో సమానమైనది లేదో, దేని కంటే అధికమైనది లేదో అది అతులావధికం. అట్టి శ్రేష్ఠమైన మహిమను పొందగలవు. 28

శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆఱవ స్కంధమున
పదిహేనవ అధ్యాయము సమాప్తము.

షోడశోఽధ్యాయః

16వ అధ్యాయము

అవ॥ షోడశే తత్సుతోక్త్యైవ విశోకీకృత్య తం నృపమ్. ఆదిదేశ మహా విద్యాం నారదః శేషతోషణీమ్.

అవ. పదహారవ అధ్యాయమునందు ఆ మహారాజు యొక్క సుతుని (కొడుకు) మాటల చేతనే దుఃఖహీనుడుగా చేసి నారదుడు అతనికి మహావిద్యను ఉపదేశించి సంతోషమును కలుగ చేసెను. అను వృత్తాంతము చెప్పబడుచున్నది.

శ్రీశుక ఉవాచ.

శ్లో॥ అథ దేవఋషీ రాజన్ సంపరేతం నృపాత్మజమ్ ।
దర్శయిత్వేతిహోవాచ జ్ఞాతీ నామనుశోచతామ్ ॥ 1

శ్రీశుకుడు ఈ విధముగా పలికెను.

తా. ఓ రాజా! ఆ తరువాత దేవర్షి నారదుడు మరణించిన (పరలోకముననున్న) రాజకుమారుని దుఖించుచున్న బంధుజనమునకు చూపించి, ఇట్లు పలికెను. 1

అవ॥ ఆదౌతావత్తత్పుత్ర ముఖేనైవ పితృ పుత్రాది సంబంధో మిధ్యేతి దర్శయితుం యోగబలేన తమేవ జ్ఞాతీనాం దర్శయిత్వా జీవాత్మ న్నిత్యాద్యువాచ ॥ (1,2)

అవ. మొదట, వారి పుత్రుని ముఖము ద్వారానే పితృ పుత్ర సంబంధం మిథ్యయని చూపుటకు యోగబలముచే ఆ మరణించిన పిల్లవానిని బన్ధువులకు చూపి, జీవాత్మన్నిత్యాదిగాగల శ్లోకములలో చెప్పుచున్నాడు. (1-2)

నారద ఉవాచ

శ్లో॥ జీవాత్మన్పశ్య భద్రం తే మాతరం పితరం చ తే ।
సుహృదోబాన్ధవాస్తప్తాః శుచా త్వత్కృతయాభృశమ్ ॥ 2

నారదుడు ఈ విధముగా పలికెను.

తా. ఓ జీవాత్మా! ఓ జీవుడా! నీకు శుభమగుగాక! నీ తల్లిని, తండ్రిని కూడ చూడుము! నీ కారణముగా కలిగిన దుఃఖముచే నీ మిత్రులును, బన్ధువులును మిక్కిలి తాపమును పొందియున్నారు. 2

శ్లో॥ కలేవరం స్వమావిశ్యశేషమాయుః సుహృద్వృతః ।
భుఙక్ష్వభోగాన్పితృప్రత్తానధి తిష్ఠ నృపాసనమ్ ॥ 3

తా. నీదైన శరీరమును ప్రవేశించి మిగిలియున్న ఆయుష్యను మిత్రులతో కలిసి నీ తండ్రిచే ఈయబడిన భోగములను అనుభ-వింపుము. రాజ సింహాసనమును అధిష్ఠించుము. 3

టీ:- శేషమవశిష్టమాయురస్తి! అపమృత్యునా మృతత్వాదిత్యర్థః. 3

టీ:- శేషించిన ఆయుష్య కలదు అనగా అపమృత్యు దోషముచేత మరణించినందున ఆయుష్యను భోగములచే గడుపుము అని నారదుడు చెప్పెను. (ప్రత్తాన్-దత్తాక-ఈయబడిన). 3

జీవ ఉవాచ

శ్లో॥ కస్మిఞ్జన్మన్యమీ మహ్యం పితరో మాతరోఽభవన్ ।
కర్మభిర్భ్రామ్యమాణస్య దేవతిర్యఙ్నృయోనిషు ॥ 4

జీవుడు ఈ విధముగా పలికెను.

తా. కర్మలచేత దేవ, పశు, మానవ, యోనులయందు త్రిప్పబడుచున్న నాకు వీరు ఏ జన్మమునందు తల్లులు, తండ్రులుగా అయ్యిరి? 4

టీ:- తదేవ కలేవరం ప్రవిశ్యోత్థితో జీవ ఉవాచ. యద్వా అన్తరాలే ప్రేత శరీరేస్థిత్వేతి జ్ఞేయమ్ ॥ 4

టీ:- ఆ కళేబరమునందు ప్రవేశించి నిలిచిన జీవుడు అని గాని, లేదా అంతరాళమందు ప్రేత శరీరమున ఉండిన జీవుడు పలికెను అని గ్రహించవలెను. 4

శ్లో॥ బన్ధుజ్ఞాత్యరి మధ్యస్థమిత్రోదాసీన విద్విషః ।
సర్వ ఏవ హి సర్వేషాం భవన్తి క్రమశో మిథః ॥ 5

తా. అందరికి అందరు పరస్పరము (వివిధ జన్మలలో) క్రమముగా బన్ధువులు, జ్ఞాతులు, శత్రువులు, మధ్యస్థులు, మిత్రులు, ఉదాసీనులు, ద్వేషించువారు అవుతునే యుందురు. 5

టీ:- మయి మృతే పుత్రదృష్ట్యా శోకశ్చేచ్ఛత్రుదృష్ట్యా హర్షః కింన క్రియత ఇత్యాశయేన సంబంధస్యానియతత్వమాహ - బన్ధవో వివాహాదిభిః సంబంధినః. జ్ఞాతయః సపిణ్డాః, అరయో-ఘాతకః, మిత్రాణి రక్షకః, మధ్యస్థా ఉభయవ్యతిర్త్తికాః సాధారణాః, విద్విషో ద్రవ్యాది నిమిత్తేన ద్వేషిణః, ఉదాసీనాస్తద్వ్యతిరిక్తా ఇతి భేదః ॥5

టీ:- నా యందు పుత్రభావముతో శోకము పొందినచో శత్రుభావము చేత సంతోషమును ఏల పొందకున్నారు అను ఆశయముచేత బన్ధ్వాదులతో గల సంబంధమునకు అనియతత్వమును చెప్పుచున్నాడు. వివాహములచేత ఏర్పడువారు బన్ధువులు, జ్ఞాతులు అనగా సపిణ్డులు, హానికలిగించువారు అరులు (శత్రువులు) మిత్రువులు, అనగా రక్షకులు. మిత్రువులు, శత్రువులు కానివారు ఉభయవ్యతిరిక్తులు. సాధారణులు. ద్రవ్యాది నిమిత్తములచేత ద్వేషమును పొందువారు విద్వేషులు. విద్వేషము లేనివారు ఉదాసీనులు అని బన్ధువుల మధ్య భేదము. 5

శ్లో॥ యథావస్తూని పణ్యాని హేమాదీని తతస్తతః ।
పర్యటన్తి నరేష్వేవం జీవో యోనిషు కర్తృషు ॥ 6

తా. ఏ విధముగా బంగారము మొదలగు వస్తువులు క్రయ విక్రయాదులందు మనుష్యుల మధ్య పరిభ్రమించుచుండునో, అట్లే జీవుడు జనకుల యందు (వివిధ జాతుల) జన్మలచేత తిరుగుచుండును. (6)

టీ:- కర్మభిర్భ్రామ్యమాణత్వే దృష్టాన్తః - యథా పణ్యాని క్రయ విక్రయాద్యర్థాణి కర్తృషు వ్యవహర్తృషు పరిభ్రమన్తి। ఏవం జీవో౽పి యోనిషు జనకేషు ॥ 6

టీ:- కర్మలచేత జీవుడు తిరగబడుచుండుట దృష్టాన్తముగా వివరింపబడుచున్నది- ఏ విధముగా వస్తువులు క్రయ విక్రయాది వ్యవహారములు సలుపు వారి యందు తిరుగుచుండునో అట్లే జీవుడు కూడా వివిధ యోనుల యందు అనగా జనకుల యందు పరిభ్రమించుచుండును. 6

అవ॥ ఏకస్మిన్నపి జన్మని సంబన్ధస్యానియతత్వం సదృష్టాన్తమాహ ద్వాభ్యామ్.

అవ. రాబోవు రెండు శ్లోకముల యందు ఒక జన్మయందైనను సంబంధము అనియతమని దృష్టాన్తపూర్వకముగ చెప్పుచున్నాడు.

శ్లో॥ నిత్యస్యార్థస్య సంబన్ధోహ్యనిత్యో దృశ్యతే నృషు ।
యావదస్య హి సంబన్ధో మమత్వం తావదేవ హి ॥ 7

తా. నిత్యుడైన జీవునకు అర్థముతోడి సంబన్ధము మానవులలో అనిత్యముగా కనబడుచున్నది. ఎంతవరకు దీనికి సంబన్ధమో మమకారము కూడా అంతవరకే కదా! (వస్తువులతో సంబన్ధము ఉండువరకే మమకారము ఉండును). 7

టీ:- నిత్యస్య జీవతో౽ప్యర్థస్య పశ్వాదేః. అనిత్యో౽నియతః. విక్రయాదినా సంబద్ధ నివృత్తేః. 7

టీ:- నిత్యుడైన జీవునకు, అర్థమనగా పశ్వాదులకుగల సంబన్ధము నిత్యము కాదు అనిత్యము. క్రయ, విక్రయాదుల వలన తొలగి పోవుచున్నది. కొనుట, అమ్ముట మొదలగు వాని ద్వారా మమకారము తొలగుచున్నది అని భావము. 7

శ్లో॥ ఏవం యోనిగతో జీవః సనిత్యోనిరహంకృతః ।
యావద్యత్రోపలభ్యేత తావత్స్వత్వం హి తస్య తత్ ॥ 8

తా. ఈ విధముగనే జన్మమును పొందినను జీవుడు నిత్యుడుగనే ఉండును, నిరహంకృతుడుగనే ఉండును. (నేను అను ధారణకు యోగ్యుడు కాదు) ఎంతవరకు జీవుడు దేహమందు ప్రకటితమగునో అంతవరకు మాత్రమే వానికి దానియందు నాది అను భావముండును. (8)

టీ:- ఏవం యోనిగతః పిత్రాది సంబన్ధం ప్రాప్తోఽపి స జీవోనిత్యః దేహ జన్మాదినా తస్య జన్మాద్యభావాత్. అత ఏవ వస్తుతో నిరహంకృతో ఽహమస్య పుత్ర ఇత్యభిమాన శూన్యః. యత్ర పిత్రాదౌ సంబన్ధిని యావదుపలభ్యేత కర్మవశేన వర్తేత తావదేవ తస్య పిత్రాదేస్తత్తస్మిన్ స్వత్వం న తు విక్రయాదుత్తర కాలమపి. అథ దైవ సంబన్ధః – యదుక్తం కలేవరం సమావిశ్యేతి తత్ర తస్మిన్ కలేవరే మమేదానీం స్వత్వం నివృత్తమితి సదృష్టాన్తమాహ నిత్యస్య చిరకాలావస్థాయినః సువర్ణాదేః యోనిగతో దేహం ప్రవిష్టః. యత్రదేహే. తస్య జీవస్య తత్తస్మిన్ దేహే స్వత్వమ్. నతు మరణోత్తరకాలమపీత్యర్థః. శేషం సమానమ్. 8

టీ:- ఈ విధముగనే యోని యందు ప్రవేశించి పితృ పుత్రాది సంబన్ధము పొందినను ఆ జీవుడు నిత్యుడే. దేహమునకే జన్మాదులు గానీ జీవునకు లేవుకదా! నేను వీని యొక్క పుత్రుడను అను అభిమానము జీవునకు ఉండదు. అందువలన అహంకారము ఉండదు. కర్మవశముచేత ఎంతవరకు ఈ దేహము యుండునో అంతవరకు మాత్రమే ఆ దేహమందు పితృ పుత్రాది సంబన్ధము కలిగియుండును. తదుపరి కాదు. అనగా విక్రయానంతరము వస్తువులకు వలె కాదు. బ్రతికియున్నంత వరకే నాది అని భావముండును. కాని మరణానంతరము కాదు అని భావము – అనగా అది మరొకరికి చెందును అని చెప్పుచున్నాడు. ఏ శరీరమును పొందిన కారణముగ ఆ శరీరమునందు నేను, నాది అను పుత్ర పిత్రాది సంబన్ధములుండును. శరీరము పోయిన తదుపరి ఈ సంబన్ధములుండవు. శరీరము పొందుము అని చెపప్పబడినదో ఆ శరీరమునందు నాకు నాది యను భావన లేదు.

అనుటను దృష్టాన్తపూర్వకముగా చెప్పుచున్నాడు. బంగారము మున్నగు -నవి చిరకాలముండునవియే అయినను నిత్యమైనను వాని యొక్క విక్రయము తదుపరి అవి తనవి ఎట్లు కాదో అట్లే శరీరము త్యాగానంతర కాలమందును శరీరము తనది కాదు. దాని యందు నేను అనే భావముండదు. 8

శ్లో॥ ఏషనిత్యోఽవ్యయః సూక్ష్మ ఏష సర్వాశ్రయః స్వదృక్ ।
ఆత్మమాయా గుణైర్విశ్వమాత్మానం సృజతే ప్రభుః ॥ 9

తా. ఈ జీవుడు శాశ్వతుడు. నాశము లేనివాడు. ఇన్ద్రియ గోచరుదు కాదు. (సూక్ష్ముడు) స్వయంప్రకాశకుడు. సర్వమునకు ఆశ్రయము కలవాడు. ఈశ్వరుడు తన మాయా గుణములచే తనను జగత్తుకు ప్రకటించుకొనును. (ప్రకటించుకొనుచున్నాడు). 9

టీ:- జీవస్యనిత్యత్వం సాధయతి- ఏష నిత్యః. తత్ర హేతుః - అవ్యయోఽపక్షయశూన్యః. తత్కుతః, సూక్ష్మో జన్మాది శూన్యః. తచ్చ కుతః. సర్వాశ్రయో జన్మాదిమతో దేహాదేరాశ్రయో న తు దేహాది రూపః. యతః స్వదృక్ స్వప్రకాశః. సర్వాశ్రయత్వముపపాదయతి. ఆత్మనా మాయయా గుణైరాత్మానమేవ విశ్వం విశ్వాత్మకం సృజతి. "తదాత్మానం స్వయమకురుత"ఇతి శ్రుతేఃఉపాదానకారణత్వాత్సర్వాశ్రయ ఇత్యర్థః. జీవస్య వస్తుతో బ్రహ్మత్వాద్బృహ్మణ ఏవ చిచ్ఛక్తి విశిష్ట స్యేశ్వరత్వేన స్రష్టత్వాజ్జీవః సృజతీతి వాచో యుక్తిః. యద్వా స్వకర్మ

టీ:- జీవుని నిత్యత్వమును నిరూపించుచున్నాడు. ఈ జీవుడు నిత్యుడు, శాశ్వతుడు అనుటకు హేతువు చెప్పుచున్నాడు. అపక్షయము (నాశము లేనివాటు) అనుట ఎట్లు? జీవుడు సూక్ష్ముడు జన్మాదులు లేనివాడు అది ఎట్లనగా జీవుడు జన్మాదులలో గల దేహాదులకు ఆశ్రయముగా గలవాడు గానీ దేహాది రూపము కాదు. ఎందుచేతననగా జీవుడు స్వయంప్రకాశకుడు, జీవుని యొక్క సర్వాశ్రయత్వాన్ని ప్రతిపాదించుచున్నాడు. -ఆత్మచేత మాయా గుణములచే స్వయముగా ఈ విశ్వమును సృజించుచున్నాడు(ది). ఆ పరమాత్మ తనను తానే

ద్వారా సృష్టి నిమిత్తత్వేన స్రష్టత్వం భోగ్యస్య చ, సర్వస్య భోక్త్రాశ్రయత్వా త్సర్వాశ్రయత్వం చోక్తమితి ద్రష్టవ్యమ్. 9

చేసుకొనును అని శ్రుతి ప్రమాణము. ఉపాదాన కారణమైనందువలన పరబ్రహ్మ సర్వాశ్రయుడగుచున్నాడు. అని అర్థము వాస్తవముగా జీవుడు బ్రహ్మత్వముచేత బ్రహ్మమే చిచ్ఛక్తి విశిష్టుడుగా ఈశ్వరుడుగా జీవులను సృజించును కానిచో స్వకర్మ కారణముగా సృష్టి నిమిత్తముగా భోగముల సృష్టించుచు భోగములననుభవించుచు సర్వాశ్రయుడై యున్నాడు అనుట స్పష్టము. 9

అవ॥ యదుక్తం సుహృద్ధ్రుత ఇతి సుహృదో బాన్ధవాస్తప్తా ఇతి చ తత్రాప్యాహ– నహ్యస్యేతి.

అవ. నహస్యేత్యాది శ్లోకమున మిత్రాది బన్ధములచేత తప్పుడు కాని వాడు అని చెప్పుచున్నాడు.

శ్లో॥ నహ్యస్యాతి ప్రియః కశ్చిన్నాప్రియః స్వః పరోఽపి వా ।
ఏకః సర్వధియాం ద్రష్టా కర్తౄణాం గుణ దోషయోః ॥ 10

తా. ఇతనికి మిక్కిలి ప్రియమైనవాడును మిక్కిలి అప్రియమైన వాడును, తనవాడును, పరాయివాడును లేడు. గుణ దోషముల యొక్క కర్తలకును, సకల బుద్ధి వృత్తులకును ద్రష్ట అనగా సాక్షి మాత్రమే. 10

టీ:– తతః హేతుః – ఏకః సుహృదాది సఙ్గరహితః. తత్కుతః గుణదోషయోర్హితాహితయోః కర్తౄణాం మిత్రాదీనాం యాః సర్వా ధియో విచిత్రా బుద్ధయస్తాసాం ద్రష్టాసాక్షీ .10

టీ:– జీవుడు సుహ్రుదాది సఙ్గరహితుడు అనగా ఒక్కడే. అది ఎట్లు? కర్తలైన మిత్రాదుల యొక్క గుణదోషములకు (హితా హితములకు) మరియు వారికిగల విచిత్ర బుద్ధులకు సాక్షీభూతము. 10

అవ॥ యథోక్తం భుజ్క్ష్వ భోగానిత్యాది తత్రాప్యాహ నా దత్త ఇతి.

శ్లో॥ నాదత్త ఆత్మాహి గుణం న దోషం న క్రియా ఫలమ్ ।
ఉదాసీనవదాసీనః పరావర దృగీశ్వరః ॥ 11

టీ:- గుణం సుఖమ్. దోషమ్-దుఃఖం. క్రియాఫలం చ రాజ్యాదికం. ఉదాసీనత్వే హేతుః. పరావరదృక్ కారణస్య కార్యస్య చ సాక్షీ న తు భోక్తా. యత ఈశ్వరః దేహాదిపారతంత్ర్యశూన్యః. అత ఏవం భూతస్య మమ చ. యుష్మాకం చ సంబంధాభావాచ్ఛోక్తం మా కురుతేతి వాక్యార్థః (11-13)

శ్లో॥ ఇత్యుదీర్య గతో జీవో జ్ఞాతయస్తస్యతే తదా ।
విస్మితా ముముచుశ్శోకం ఛిత్వాత్మస్నేహ శృంఖలామ్ ॥ 12

అవ. భుజ్క్ష్వ భోగానిత్యాదిగ చెప్పబడిన, భోగములు మొదలగు వానిని అనుభవించును అని చెప్పబడిన విషయమును నాదత్త ఇత్యాది శ్లోకమున చెప్పబడుచున్నది.

తా. ఆత్మ గుణదోషములను (సుఖదుఃఖములను) గానీ, కర్మ ఫలములను గానీ స్వీకరించదు. స్వతన్త్రమై ఉత్కృష్ట, అపకృష్టములకు ద్రష్టగా, ఉదాసీనుడుగా నుండును. 11

టీ:- గుణదోషములనగా సుఖదుఃఖములు క్రియాఫలములనగా రాజ్యాది భోగములు ఉదాసీనత్వమునకు హేతువు - పరావర అనగా కార్యకారణములకు దృక్ అనగా సాక్షీ. అనగా సాక్షిగా ఉండునే కానీ భోక్తకాదు. ఈశ్వరుడు కూడా ఏ విధముగా పరతంత్రత లేని వాడో అట్లే ఈ జీవుడు కూడా. ఈ జీవునకు నా తోడను, మీ తోడను సంబన్ధము లేకపోవడం వలన దుఃఖింపవలసిన అవసరము లేదు అని భావము. (11-13)

తా. ఈ విధముగా జీవుడు పలికి, వెళ్ళిపోగా నప్పుడు వాని యొక్క జ్ఞాతులు(బన్ధువులు) ఆశ్చర్యమును పొందినవారై తమ స్నేహ బన్ధములను సంకెళ్ళను ఛేదించుకొని దుఃఖమును విడిచిపెట్టిరి. 12

శ్లో॥ నిర్హృత్య జ్ఞాతయో జ్ఞాతేర్దేహం కృత్వోచితాః క్రియాః ।
తత్య జుర్దుస్త్యజం స్నేహం శోకమోహ భయార్తిదమ్ ॥ 13

తా. జ్ఞాతులైన వారు, ఆ జ్ఞాతి యొక్క దేహమునకు తగిన అంత్య క్రియలను చేసి విడిచిపెట్ట శక్యముకాని దుఃఖమును, మోహమును, భయమును, పీడను కలిగించు స్నేహమును విడనాడిరి. 13

శ్లో॥ బాలఘ్న్యో వ్రీడితాస్తత్ర బాలహత్యా హతప్రభాః ।
బాలహత్యా వ్రతం చేరుర్బ్రాహ్మణైర్యన్నిరూపితమ్ ।
యమునాయాం మహారాజ స్మరంత్యో ద్విజ భాషితమ్ ॥ 14

తా. ఓ మహారాజా! ఆ సమయమందు బాలఘాతకులు బాలుని చంపుట వలన కాంతి నశించినవారై సిగ్గుపడినవారై, ఆ బాలకుని చంపిన వారిని స్మరించుచు బ్రాహ్మణులచే ప్రతిపాదింపబడిన బాల-హత్యాదోష నివారక వ్రతమును (ప్రాయశ్చిత్తమును) యమునానది యందు ఆచరించిరి. 14

టీ:- ద్విజభాషితం అంగిరసా ప్రోక్తం. పుత్రాదీనాం దుఃఖహేతుత్వం స్మరంత్యః. పుత్రకామనాశూన్యాః. నిర్మత్సరాస్సత్య ఇతి భావః. 14

టీ:- అఙ్గిరసునిచే చెప్పబడిన పుత్రాదుల యొక్క దుఃఖహేతుత్వమును స్మరించుచు మత్సరము లేని వారైరి. 14

అవ॥ నిబిడ పఙ్కతుల్యం గృహం విహాయ నిష్క్రమణమతిధీరస్య తస్యైవ యోగ్యం నాన్యస్యేతి సదృష్టాన్తమాహ - స ఇత్థమితి.

అవ. మిక్కిలి దట్టమైన బురదతో సమానమైన గృహమును వీడి, వైరాగ్య బుద్ధితో ధీరత్వమును పొందుటయేముచితము అని ఉదాహరణ పూర్వకముగా చెప్పుచున్నాడు.

శ్లో॥ స ఇత్థం ప్రతిబుద్ధాత్మా చిత్రకేతుర్ద్విజోక్తిభిః ।
గృహాంధకూపాన్నిష్క్రాంతస్సరః పంకాదివ ద్విపః ॥ 15

తా. ఈ విధముగా ఆ చిత్రకేతువు ద్విజులు, (నారద, అఙ్గిరసులు) చెప్పిన మాటలచే వివేక పూర్వక బుద్ధిని పొందినవాడై సరస్సులోని

బురదనుండి లేచిన ఏనుగువలె, గృహమనెడి అంధకారకూపము నుండి బయటపడెను. 15

టీ:- సరసః పంకాత్ ద్విపో గజ ఇవ. 15

టీ:- బురదనీటి నుండి బయటపడిన ఎనుగువలె. 15

శ్లో॥ కాళింద్యాం విధివత్స్నాత్వా కృత పుణ్య జలక్రియః ।
మౌనేన సంయత ప్రాణో బ్రహ్మపుత్రావవందత ॥ 16

తా. కాలిందినది యందు(యమునానది యందు)విధి పూర్వకముగా స్నానమాచరించి తర్పణాది జల క్రియలచేసి ప్రాణములను సంయమింపచేసి బ్రహ్మ పుత్రులకు మౌనముగా (నారద, అఙ్గిరసులకు) నమస్కరించెను. 16

టీ:- కృతాః పుణ్యాః జల క్రియాః పితృ తర్పణాద్యా యేన సంయత ప్రాణో నియతేంద్రియః. (16-17)

టీ:- పుణ్య జలక్రియలనాచరించెను అనగా పితృ తర్పణాదుల నాచరించెను అనియు, సంయత ప్రాణుడు అనగా ఇన్ద్రియ నిగ్రహము గలవాడు అని భావము. (16-17)

శ్లో॥ అథ తస్మై ప్రపన్నాయ భక్తాయ ప్రయతాత్మనే ।
భగవాన్నారదః ప్రీతో విద్యామేతామువాచ హ ॥ 17

తా. అటు పిమ్మట నియమించబడిన మనస్సు కలవాడు, శరణు-వేడినట్టి భక్తునిపట్ల (చిత్రకేతునకు) భగవానుడైన నారదుడు సంతోషించి ఈ విద్యను ఉపదేశించెను. 17

శ్లో॥ ఓం నమస్తుభ్యం భగవతే వాసుదేవాయ ధీమహీ ।
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ నమస్సంకర్షణాయ చ ॥ 18

టీ:- నమో ధీమహి ధ్యాయేమ. మనసా నమస్యామ ఇత్యర్థః. 18

తా. ఓం మన్త్రారంభకము. భగవంతుడవు, వాసుదేవుడవు, ప్రద్యుమ్నుడవు, అనిరుద్ధుడవు మరియు సంకర్షణుడవు అయిన నీ కొరకు (నీకు) నమస్కారము. 18

టీ:- ధ్యానించుచున్నాము. మనస్సుచేత నమస్కరిస్తున్నాము అని అర్థము. 18

వివరణ: (ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము కలవానిని భగవానుడందురు). ఇచట వాసుదేవుడు (శ్రీకృష్ణుడు), ప్రద్యుమ్నుడు (ప్రకృష్టమైన తేజస్సు కలవాడు-కృష్ణుని తనయుడు), అనిరుద్ధుడు (అడ్డగింపబడనివాడు-కృష్ణుని మనుమడు), సంకర్షణుడు (సోదరుడు) వారి కొరకు మనస్సులో ధ్యానించుచున్నాము అనియు లేదా వాసుదేవ (వ్యాపించియుండి ప్రకాశించువాడు), ప్రద్యుమ్న (పాలనకర్త), అనిరుద్ధ (సృష్టికర్త), సంకర్షణ (లయకర్త)ములను నాలుగు వ్యూహములు అనియు లేదా ప్రకాశస్వరూపుడు, తేజస్వరూపుడు, స్వతంత్రుడు, ప్రేమస్వరూపుడు అగు భగవంతుని కొఱకు అనగా వాసుదేవ, అనిరుద్ధ, ప్రద్యుమ్న, సంకర్షణములను నాలుగు వ్యూహములుగల భగవానుడవైన నీకు నమస్కారము. అని చెప్ప-వచ్చును.

శ్లో॥ నమో విజ్ఞాన మాత్రాయ పరమానందమూర్తయే ।
ఆత్మారామాయ శాంతాయ నివృత్తద్వైత దృష్టయే ॥ 19

తా:- విజ్ఞాన స్వరూపుడవైనట్టి పరమానన్దమూర్తివైన ఆత్మారాముడవైన, శాంతస్వరూపుడవైన ద్వైత భావము (భేదభావము)లేని నీకు నమస్కారము. 19

టీ:- నివృత్తా అద్వైతదృష్టిర్యస్మాత్. 19

టీ:- ఎవని నుండి భేదదృష్టి తొలగినదో (అద్వైత దృష్టి ఏర్పడినదో) వాడు నివృత్త ద్వైతదృష్టి కలవాడు. 19

శ్లో॥ ఆత్మానందానుభూత్యైవ న్యస్తశక్త్యూర్మ యే నమః ।
హృషీకేశాయ మహతే నమస్తే విశ్వమూర్తయే ॥ 20
(అనంతశక్తయే)

తా:- స్వస్వరూపానందానుభూతిచే విడువబడిన శక్తులు (తరంగములు) కల నీకు నమస్కారము. హృషీకేశుడవైన (ఇన్ద్రియాధిపతి) గొప్పవాడవైన విశ్వమూర్తివైన (అనంతమూర్తివైన) నీకు నమస్కారము. 20

టీ:- న్యస్తాః నిరస్తాశ్శక్త్యూర్మయః మాయా నిమిత్తా రాగద్వేషా దయో యేన. 20

టీ:- మాయా నిమిత్తములైన రాగద్వేషాదులు లేనివాడు అనగా రాగద్వేషాదుల కతీతుడైనవాడు 20

శ్లో॥ వచస్యుపరతే ఽప్రాప్య య ఏకో మనసా సహ ।
అనామరూపశ్చిన్మాత్రస్సోఽవ్యాన్నస్సదసత్పరః ॥ 21

తా:- వాక్కు, మనస్సు కూడా కలసి ఎవనిని పొందలేక వెనుకకు మరలినవో అట్టి అద్వితీయుడు, నామ రూపరహితుడు, చైతన్య స్వరూపుడు, కార్యకారణముల కతీతుడు అయినవాడు మమ్ము రక్షించుగాక!. 21

టీ:- మనసా సహ వచసి. అప్రాప్య ఉపరతే సతి యః ఏక ఏవ ప్రకాశతే వచసీతి సర్వేంద్రియోపలక్షణం. సోఽస్మానవ్యాత్. సదసత్పరః కార్యకారణయోః కారణం. 21

టీ:- మనస్సుతో కలసి వాక్కు కూడ ఎవనిని పొందలేక, ఉపశమింపగ ఎవడు అద్వితీయుడై ప్రకాశించునో (వాడు), వచశ్శబ్దము సర్వేంద్రియోపలక్షణము. పరమాత్మ ఇన్ద్రియాతీతుడు. అట్టివాడు మనలను రక్షించుగాక! ఆ పరమాత్మ కార్యకారణములకు కారణమైన వాడు. 21

అవ॥ తదేవాహ- యస్మిన్నితి.

అవ:- యస్మిన్నిత్యాది శ్లోకమున దీనినే (కార్య కారణములకు కారణమునే) చెప్పుచున్నాడు.

శ్లో॥ యస్మిన్నిదం యతశ్చేదం తిష్ఠత్యప్యేతి జాయతే ।
మృణ్మయేష్వివ మృజ్జాతిస్తస్మైతే బ్రహ్మణే నమః ॥ 22

తా:- మృణ్మయముల యందు మృజ్జాతి వస్తువుల వలె ఎవని వలన ఎవని యందు ఈ జగత్తు పుట్టి, నిలిచి, గిట్టునో అట్టి పరబ్రహ్మవగు నీకు నమస్కారము. 22

టీ:- యస్మిన్నిదం కార్యం కారణం తిష్ఠతి. అప్యేతి చ. యతశ్చ జాయతే మృణ్మయేషు ఘటాదిషు మృజ్జాతిః మృణ్మాత్రమివ. సర్వానుస్యూతం యత్ తస్మై. 22

టీ:- ఎవని నుండి కార్యకారణ రూపమైన ఈ జగత్తు పుట్టుచున్నదో ఎవని యందు నిలుస్తున్నదో (మనుగడ సాగించుచున్నదో) ఘటాది వస్తువుల యందు మట్టియే అనుస్యూతమైనట్లు పరమాత్మయందు ఈ జగత్తు అనుస్యూతమై యున్నది. 22

అవ॥ నను సర్వానుస్యూతం చేత్ మృజ్జాతివత్ ప్రతీయేత కథం మనోవచసోరప్రాప్తిస్తత్రాహ - యదితి.

శ్లో॥ యన్నస్పృశంతి న విదుర్మనోబుద్ధీంద్రియాసవః ।
అంతర్బహిశ్చ వితతం వ్యోమవత్తన్నతోస్మ్యహమ్ ॥ 23

టీ:- యద్బ్రహ్మవ్యోమవత్. వితతమపి అసవః ప్రాణాః క్రియాశక్త్యా న స్పృశంతి. మన ఆదీని చ జ్ఞానశక్త్యా న విదుః. తద్బ్రహ్మనతోఽస్మి. (23)

అవ॥ తేషాం తదజ్ఞానే హేతుమాహ - దేహేతి.

శ్లో॥ దేహేంద్రియ ప్రాణమనోధియోఽమీ
యదంశవిద్ధాః ప్రచరంతి కర్మసు ।
నైవాన్యథా లోహమివా ప్రతప్తం
స్థానేషు తద్ద్రష్టృపదేశమేతి ॥ 24

అవ॥ యదిత్యాది శ్లోకమున, మట్టి వస్తువుల యందు మట్టివలె, పరబ్రహ్మ సర్వమునందు అనుస్యూతమై గోచరించినచో మనస్సునకు, వాక్కునకు, అందకుండుట ఎట్లు కుదురునో చెప్పుచున్నాడు.

తా:- ఆకాశమువలె లోపలను, బయటను వ్యాపించియున్న దేనిని మనస్సు, బుద్ధి, ఇన్ద్రియములు, ప్రాణములు స్పృశించలేవో అట్టి నీకు నమస్కరించెదను. 23

టీ:- ఏ పరబ్రహ్మ ఆకాశమువలె సర్వవ్యాపకమైనను కూడా దానిని ప్రాణములు క్రియాశక్తి చేత స్పృశించలేవు. మనోబుద్ధ్యాదులు జ్ఞానశక్తి చేత తెలియలేవు. అట్టి పరబ్రహ్మమువైన నీకు నమస్కరించుచున్నాను. (23)

అవ॥ దేహేతి శ్లోకమున పరమాత్మ తెలియబడకుండుటకు హేతువును చెప్పుచున్నాడు.

తా:- ఈ దేహము, ఇన్ద్రియములు, ప్రాణము, మనస్సు, బుద్ధులు (ఏ పరబ్రహ్మ) దేని యొక్క అంశములుగా కర్మల యందు ప్రవర్తిల్లునో, ఇతర సమయములందు కాల్చబడని లోహము వలె ప్రవర్తిల్లవో, అది వివిధ అవస్థల యందు ద్రష్టయనుచు వ్యవహరింపబడుచున్నదో (ది) అదియే పరబ్రహ్మ. 24

టీ:- దేహేంద్రియాదయః అమీయదంశవిద్ధాః. యచ్చైతన్యాం శేనావిష్టాస్సంతః. కర్మసు స్వస్వవిషయేషు ప్రచరంతి జాగ్రత్స్వప్నయోః అన్యథా సుషుప్తిమూర్చాదౌ నైవప్రచరంతి. యథా అప్రతప్తం లోహం న దహతి. కింతు ప్రతప్త మేవ అతో యథా లోహమగ్నిశక్త్యైవ దాహకం సత్ అగ్నిం వినా న దహతి ఏవం బ్రహ్మగతజ్ఞానక్రియాశక్తిభ్యాం ప్రవర్తమానాః దేహాదయః తత్ న స్పృశంతి న విదుశ్చేతి భావః. జీవస్తర్హి ద్రష్టృత్వా జ్ఞానాత్. నేత్యాహ స్థానేషు జాగ్రదాదిషు ద్రష్టృప్రదేశం ద్రష్టృసంజ్ఞాం తదేవైతి ప్రాప్నోతి నాన్యో జీవో నామాస్తి నాన్యోఽతోఽస్తి ద్రష్టా ఇత్యాది శ్రుతేః యద్వా - ద్రష్ట్ర ప్రదేశం ద్రష్టృసంజ్ఞం జీవమపి తదేవైతి జానాతి. న తు జీవః తజ్జానాతీత్యర్థః. తదుక్తం. హంసగుహ్యస్తోత్రే దేహోసవోఽక్షా ఇత్యాది. 24

టీ:- ఏ చైతన్యముయొక్క అంశచేత దేహేంద్రియాదులు ఆవేశించబడి యుండి జాగ్రత్స్వప్నావస్థల యందలి విషయముల యందు ప్రవర్తిల్లు చున్నవో కాల్చబడని లోహము దహించని విధముగా ఇతర సందర్భము లైన మూర్ఛాది, సుషుప్తుల యందు ప్రవర్తిల్లుట లేదో అందుచేత, లోహము అగ్ని శక్తిచేతనే ఎట్లు దహించునో. ఆ యగ్ని లేకుండా ఎట్లు దహించదో. అట్లే బ్రహ్మగత జ్ఞానక్రియాశక్తుల వలననే ప్రవర్తిల్లు దేహాది ఇంద్రియములు దానిని స్పృశించలేకున్నవి, తెలియకున్నవి అని భావము. అయినచో జీవుడు సాక్షిత్వము చేతనే తెలియబడునా? లేదు అని చెప్పుచున్నాడు-జాగ్రదాది అవస్థలయందు విషయ విషయాభావములు చూచువాడైనందున ద్రష్ట సంజ్ఞచే పొందును. జీవుడను పేరుతో మరొకటి లేదు. "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" ద్రష్ట అంటూ మరొకటి లేదు అని శ్రుతి ప్రమాణము. కానిచో ద్రష్ట పేరుతో చెప్పబడు జీవుడు తనను బ్రహ్మముగనే తెలియును కాని జీవుడు దానిని (బ్రహ్మమును) తెలుసుకొనుట కాదు అని అర్థము. ఈ విషయమునే హంసగుహ్య స్తోత్రమందు "దేహోఽసవోఽక్షా" ఇత్యాదిగా దేహాదుల సంఘత్వమునకు జీవుడు ద్రష్టగా నుండును అని చెప్పబడినది. 24

శ్లో॥ ఓం నమో భగవతే మహాపురుషాయ
మహానుభావాయ మహావిభూతి పతయే ।
సకలసాత్త్వత పరివృఢ నికరకరకమల
కుడ్మలోపలాలిత చరణారవింద
యుగల పరమ పరమేష్ఠిన్నమస్తే ॥ 25

టీ:- సకలా యే సాత్త్వతపరివృఢాః. తేషాం నికరస్సమూహః. తస్య కరకమలానాం. కుడ్మలైర్ముకులైః ఉపలాలితం చరణారవిందయుగలం. యస్య తస్య సంబోధనం. పరమ ఉత్కృష్ట పరమేష్ఠిన్ సర్వేశ్వర. 25

తా:- పురుషోత్తముడవైన, భగవానుడవైన, మహానుభావుడవైన (గొప్ప మహిమలుగల వాని కొరకు) మహావిభూతులకు ప్రభుడవైన సకల భక్త శ్రేష్ఠుల సమూహముల యొక్క కమలముల వంటి చేతులను మొగ్గలచే సేవింపబడు పద్మముల వంటి పాద ద్వయము గల సర్వాతీత సర్వేశ్వరుడవైన నీకు నమస్కారము. 25

టీ:- సమస్త భక్తజన సమూహముల యొక్క కరకమలములచే సేవించబడు పాదపద్మములు కలవాడా! సర్వాతీతునకు, సర్వేశ్వరునకు నమస్కారము. ఓ గొప్ప మహిమలు కలిగినట్టియు, మహైశ్వర్యములకు ప్రభువు అగు పురుషోత్తముడవైన భగవానునకు నమస్కారము. (ఈ గద్యము సంబోధనాంత పద విశిష్టము). 25

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ భక్తాయైతాం ప్రపన్నాయ విద్యామాదిశ్య నారదః ।
యయావంగిరసా సాకం ధామ స్వాయంభువం ప్రభో ॥ 26

టీ:- పూర్వం. స నారదోఽంగిరా అజగామేత్యంగిరాః ప్రాధాన్యేనోక్తః చిత్రకేతోః పుత్రప్రదత్వేన తస్య పృథగుక్తత్వాత్. ఇహ తు నారదః

శ్రీ శుకుడు ఈ విధముగా పలికెను.

తా:- ఓ పరీక్షిన్మహారాజా! నారదుడు ఈ విద్యను (ఉపాసనను) భక్తుడు ప్రపన్నుడు అయిన వానికి (చిత్రకేతువునకు) ఉపదేశించి, అఙ్గిరసునితో కూడి బ్రహ్మలోకమునకు వెళ్ళెను. 26

టీ:- ఓ మహారాజా! పూర్వము అఙ్గిరసుడు నారదునితో కూడి వచ్చినను చిత్రకేతువునకు పుత్రుని ప్రసాదించుటచేత అఙ్గిరసుని యొక్క

అంగిరసా సాకం యయావితి నారదస్య ప్రాధాన్యేన నిర్దేశః. తదుపదేశేన తస్య వైరాగ్యోత్పత్తేః. ప్రభో హే సమర్థ. 26

ప్రాధాన్యతను అనుసరించి అఙ్గిరసుడు వచ్చెనని చెప్పబడినది. ఇప్పుడు నారదుడు అఙ్గిరసునితో గూడి వెళ్ళెనని విద్యా ప్రదానత్వమున నారదుని యొక్క ప్రాధాన్యము నిర్దేశించబడిబనది. ఆ ఉపదేశముచేత వానికి వైరాగ్యము కలిగెను. 26

శ్లో॥ చిత్రకేతుస్తు విద్యాం తాం యథా నారదభాషితామ్ ।
ధారయామాస సప్తాహమబ్భక్షస్సుసమాహితః ॥ 27

తా:- చిత్రకేతువు నారదుడు ఉపదేశించిన విద్యను యథాతథముగా ఆచరించుచూ నీరు మాత్రమే ఆహారముగా తీసుకొనుచు (ఏకాగ్ర చిత్తుడై) ఏడు రోజులు జపించెను. 27

టీ:- యథా యథావత్ ధారయామాస. 27

టీ:- యథాతథముగా (నారదుడు చెప్పినట్లుగా) ఉన్నది ఉన్నట్లుగా ధరించుచుండెను. 27 (సూచన: ఇది సంకర్షణ విద్యయని కొందఱి అభిప్రాయము)

శ్లో॥ తతశ్చ సప్తరాత్రాంతే విద్యయా ధార్యమాణయా ।
విద్యాధరాధిపత్యం స లేభే ప్రతిహతం నృప ॥ 28

తా:- ఓ రాజా! ఆ రాజు ఏడురోజుల పిదప ఉపాసిత మన్త్ర ప్రభావమున తిరుగులేని విద్యాధరాధిపత్యము నొందెను. 28

టీ:- విద్యాధరాధిపత్యం చ అవాంతరం ఫలం లేభే అప్రతిహత మస్ఖలితం. 28

టీ:- విద్యా ప్రభావమున అప్రతిహతమైన విద్యాధరాధిపత్యము పొందెను. 28

శ్లో॥ తతః కతిపయాహోభిర్విద్య యేద్ధ మనోగతిః ।
జగామ దేవ దేవస్య శేషస్య చరణాంతికమ్ ॥ 29

తా:- తరువాత కొన్ని రోజులకు మన్త్రోపాసనచేత ప్రదీప్త మనస్కుడై దేవదేవుడైన శేషుని పాదముల సమీపమునకు చేరెను. 29

టీ:- కతిపయైరహోభిః. విద్యయా ఇద్ధేన దీప్తేన మనసా గతిర్యస్య. 29

టీ:- కొన్ని రోజులకు విద్యచేత దీపించిన మనస్సు తోడి గతి ఎవరికో వాడు ఇద్ధ మనోగతుడు . 29

శ్లో॥ మృణాల గౌరం శితివాససం
స్ఫురత్కిరీట కేయూర కటిత్ర కంకణమ్ ।
ప్రసన్న వక్త్రారుణలోచనం వృతం
దదర్శ సిద్ధేశ్వరమండలైః ప్రభుమ్ ॥ 30

తా:- తామర తూడువలె నీలి మిశ్ర ధౌత వర్ణముగల వస్త్రము, కిరీటము, భుజకీర్తులు, మొలత్రాడు, కఙ్కణములు గల ప్రసన్న ముఖము, ఎరుపు కన్నులు గలిగి సిద్ధ పురుషుల సమూహములచే చుట్టబడియున్న ప్రభువును (ఆదిశేషుని) చూచెను. 30

టీ:- మృణాలవద్గౌరం శితివాససం. నీలాంబరం స్ఫురంతి కిరీటాదీని యస్య. కటిత్రం కటిసూత్రం. ప్రసన్నాని వక్త్రాణి యస్య. అరుణాని లోచనాని యస్య. తం చ. తం చ. 30

టీ:- తామరతూడువలె తెలుపు, నీలివస్త్రము, ప్రకాశించుచున్న కిరీటాదులు, కటి సూత్రము, ప్రసన్నమైన వదనములు (ముఖములు), ఎరుపైన కన్నులు ఎవరికో అట్టి (ఆదిశేషుని) వానిని చూచెను. 30

శ్లో॥ తద్దర్శనధ్వస్త సమస్తకిల్బిషస్స్వచ్ఛా
మలాంతః కరణోఽభ్యయాన్మునిః ।
ప్రవృద్ధభక్త్యా ప్రణయాశ్రులోచనః
ప్రహృష్టరోమాఽనమదాది పూరుషమ్ ॥ 31

తా:- ఆతని దర్శనముచే సకల పాపములు తొలగినవాడు, స్వచ్ఛమైన అన్తఃకరణముగల వాడు, మునియైనవాడు, భక్తి పరవశ ప్రేమచే నిండిన బాష్పములుగల కన్నులు కలిగి పులకించిన రోమములు గలవాడై, పూర్వుడైన ఆదిపురుషునికి ఎదురుగా వచ్చి నమస్కరించెను. 31

టీ:- దృష్ట్వా చ తమాది పురుషం అభ్యయాత్ శరణం గతః అనమన్నా-నామ. కథంభూతః. తస్య దర్శనేన ధ్వస్తం సమస్తం కిల్బిషం యస్య. స్వచ్ఛమమలం చాంతఃకరణం యస్య. ప్రణయేనాశ్రుయుక్తే లోచనే యస్య. ప్రహృష్టాని రోమాణి యస్య సః. 31

శ్లో॥ స ఉత్తమ శ్లోకపదాబ్జవిష్టరం ప్రేమా
శ్రులేశైరుపసేచయన్ముహుః ।
ప్రేమోపరుద్ధాఖిల వర్ణనిర్గమో నై
వాశకత్తం ప్రసమీడితుం చిరమ్ ॥ 32

టీ:- తం ప్రసమీడితుం స్తోతుం. చిరం నైవాశకత్ నశశాక. తత్ర హేతుః - ఉత్తమశ్లోకస్య పాదాబ్జయోర్విష్టరమాసనం ఉపమేహయన్న భిషించన్. ప్రేమ్ణా ఉపరుద్ధః. అఖిలానాం వర్ణనాం నిర్యమ ఉచ్చారణం యస్య సః. 32

శ్లో॥ తతస్సమాధాయ మనోమనీషయా
బభాష ఏతత్ప్రతిలబ్ధవాగసౌ ।
నియమ్య సర్వేంద్రియబాహ్యవర్తనం
జగద్గురుం సాత్త్వత శాస్త్ర విగ్రహమ్ ॥33

టీ:- ఆదిపురుషుని చూచి, ఎదురేగి చరణములకు నమస్కరించెను. ఎట్లు ఉండెను (అన్నచో)! అతని దర్శనము చేతనే ఎవరి యొక్క సమస్త పాపములు తొలగింపబడెనో స్వచ్ఛము, అమలము అయిన అన్తఃకరణము ఎవరికో, ప్రేమచే చెమ్మగిల్లిన కళ్ళు ఎవరికో పులకరించిన రోమములు ఎవరికో అట్టివాడై నమస్కరించెను. 31

తా:- అతడు (చిత్రకేతువు) గొప్ప కీర్తిగల పాదపద్మములను మాటి మాటికి ప్రేమపూరితమగు కన్నీటిచే అభిషేకించుచు, ప్రేమచే మాటలు - రాక చాలాసేపైనను స్తుతించుటకు సమర్థుడు కాలేడు. (దగ్గుత్తికతో స్తుతించలేకపోయెను అని భావము). 32

టీ:- అతనిని స్తుతించుటకు చాలాసేపటివరకు శక్తుడు కాలేదు. అందులకు కారణము-ఉత్తమ శ్లోకుని (శేషుని) పాదావయవముల అభిషేకించుచు ప్రేమతో పొంగిన ఉద్వేగమున మాటలనుచ్చరించ లేకపోయెను. 32

తా:- తరువాత మనస్సును బుద్ధితో ఏకాగ్రము చేసి మాటలను తిరిగి పొంది ఇన్ద్రియ భాష్య వర్తనమున నియమించి సాత్త్వత (భాగవతము) శాస్త్రమందు వర్ణింపబడిన రూపముగల జగద్గురువు నుద్దేశించి ఇట్లు పలికెను. 33

టీ:- మనీషయా బుద్ధ్యా మనః సమాధాయై తద్వక్ష్యమాణం బభాషే. ప్రతిలబ్ధా వాగ్యేన సాత్త్వతశాస్త్రోక్తో విగ్రహో యస్య తం. 33

టీ:- బుద్ధిచేత మనస్సును సమాధానముచేసి, చెప్పవలసిన మాటలను తిరిగి పొంది, సాత్త్వత శాస్త్రమందు (భాగవత శాస్త్రమందు) చెప్పబడిన విగ్రహము గలవానితో (ఇట్లు పలికెను). 33

అవ|| అన్యోన్య ప్రేమజానన్దనిభృతాన్స్వామిసేవకాన్. అభినన్దన్ముదా స్తౌతి దశభిః పఞ్చభిర్విభుమ్.

అవ:- స్వామి, సేవకుల అన్యోన్య ప్రేమచేత పుట్టిన ఆనందమును అభినందించుచు, సంతోషముతో పదిహేను శ్లోకములలో స్తుతించు చున్నాడు.

చిత్రకేతురువాచ.

శ్లో|| అజిత జితస్సమమతిభిస్సాధు
భిర్భవాన్ జితాత్మభిర్భవతా ।
విజితాస్తేఽపి చ భజతామ
కామాత్మనాం య ఆత్మదోఽతికరుణః ॥ 34

చిత్రకేతువు పలికెను.

తా:- ఓ జయింపశక్యముకాని వాడా! నీవు జయింపబడిన సమాన-మైన బుద్ధిగల సాధువులచే జయింపబడినవాడవు. వారు కూడా నీచే జయింపబడినవారు. నిష్కామ మనస్సుతో భజించు వారలకు పరమ దయతో నిన్ను నీవు సమర్పించుకుందువు. (నీకు సర్వం సమర్పించు-కొన్న వారికి నిన్ను నీవు సమర్పించుకొందువని భావము) 34

టీ:- హే అజిత, అన్యైరజితోఽపి భవాన్ సాధుభిర్భక్తైః. జితస్స్వాధీన ఏవ కృతః. యతో భవానతి కరుణః. తేఽపి చ నిష్కామా అపి భవతా విజితాః. యో భవాన్. అకామాత్మనామాత్మాన మేవ దదాతి. 34

టీ:- ఇతరులచే జయింపబడని వాడవైనను, నీవు భక్తులచే జయింపబడుదువు అనగా భక్తుల వశమందుండుదువు. ఎట్లు? నీవు పరమదయాళుడవు గావున వారు కూడా నిష్కాములగుట చేత నీచే జయింపబడుదురు. నిష్కామ మనస్సు గలవారికి నిన్నునీవు సమర్పించుకుందువు స్వామీ! 34

అవ॥ నను భక్తైరేవ జిత ఇతి కథం, స్పర్ధమానైరపి సృష్ట్యాది కర్తృభిరన్యై రీశ్వరైర్జయ సంభవాత్తత్రాహ - తవేతి.

శ్లో॥ తవ విభవః ఖలు భగవన్
జగదుదయస్థితి లయాదీని ।
విశ్వసృజస్తేఽంశాంశాస్తత్ర
మృషా స్పర్ధంతే పృథగభిమత్యా ॥35

టీ:- జగతః ఉదయాదీని తవైవ విభవః విభవ్యం మహిమా. లీలేతి యావత్. ఆదిశబ్దేన ప్రవేశ నియమనాదీని విశ్వ సృజస్తు బ్రహ్మాదయో. నేశ్వరాః కింతు తే తవాంశో యః పురుషః తస్యాంశాః తత్ర ఏవం స్థితేఽపి. పృథక్ పృథగీశ్వరా వయమిత్యభిమానేన వృథైవ స్పర్ధంతే. 35

అవ॥ సత్యమేవ సృష్ట్యాదికర్తేత్యేతదుపపాదయతి-పరమాణ్వితి.

అవ:- తవేత్యాది శ్లోకమున భక్తులచేత జయింపబడుదువు అనుట ఎట్లో వివరించుచున్నాడు. స్పర్ధను పొందుచున్న వారైనను సృష్ట్యాది కర్తలగు వారలు అన్య ఈశ్వరులచే జయింపబడుదురు.

తా:- ఓ భగవానుడా! ఈ జగత్తు యొక్క సృష్టి, స్థితి, లయాదులన్నియు నీ విభవములే (లీలలే) కదా! నీ అంశాంశములగు జగత్తును సృష్టించు వారలు (ప్రజాపతులు) తమను నేరుగా అభిమానించుకొనుచూ, వ్యర్థముగా స్పర్ధను పొందుచున్నారు. 35

టీ:- జగత్తు పుట్టుట, స్థితిని పొందుట, లయమొందుట మున్నగునవి నీ లీలలే. అనాదినుండియు జీవులు ప్రవేశించుట, నియమించుటను ఆది శబ్దము చెప్పును. సృష్టికర్తలైన ప్రజాపతులు, బ్రహ్మాదులు మున్నగువారు ఈశ్వరులు (ప్రభువులు) కారు. కాని వారు నీ అంశగల ఏ పురుషుడు గలడో అతని అంశములు. ఈ విధముగానున్నప్పటికి వేరు వేరుగా మేము ఈశ్వరులము (ప్రభువులము) అని అభిమానించు కొనుచూ వ్యర్థముగా స్పర్ధను పొందుచున్నారు. 35

అవ॥ పరమాణ్విత్యాది శ్లోకమున నీవే సృష్ట్యాదులకు కర్తవు అని ప్రతిపాదించుచున్నాడు.

శ్లో॥ పరమాణు పరమమహతోస్త్వ
మాద్యంతాంతరవర్తీత్రయ విధురః ।
ఆదావంతేఽపి చ సత్త్వానాం
యద్ధ్రువం తదేవాంతరాలేఽపి ॥ 36

టీ:- పరమాణుః సుక్ష్మం మూలకారణం. పరమమహదంతిమం కార్యం. తయోస్త్వమేవాద్యంతాంతరవర్తీ. ఆదావంతే చాంతరే మధ్యే చ. వర్తితుం శీలం యస్య సః. అతఏవ. త్రయ విధుర ఆద్యంతమధ్యశూన్యో ధ్రువః తే చ త్వయా సృజ్యంతే న తు ధ్రువాః. కుత ఇత్యత ఆహ - సత్త్వానాం సత్త్వేన ప్రతీతానాం కార్యాణాం ఆదావంతేఽపి యద్ధ్రువం అనపాయి. అంతరాళేఽపి చ తదేవ ధ్రువం సువర్ణాదివత్. 36

తా:- పరమాణువు నుండి మహత్తత్త్వమువరకు గల సమస్తమునకు ఆద్యంతముల, మధ్యమమందును ఉండువాడవును, ఈ మూడును లేని వాడవును నీవే. పదార్థములలో ఆది యందును, అంత్యమందును ఏది శాశ్వతమో (ధృవమో) అదియే మధ్యమమందును (అంతరాళ మందు) ధృవము. (శాశ్వతము) 36

టీ:- సూక్ష్మమైన మూలకారణము పరమాణువు. అంతిమ కార్యమునకు పరము (మహత్తు) - వానికి ఆదియందును, అంతమందును, మధ్యమమందును కూడా నీవే వర్తించుచున్నావు. ఆదియందును, అంతమందును, మధ్యమందును ఉండు శీలము ఎవరికి గలదో వాడు ఆద్యంతాంతరాంతర మధ్యవర్తీ. అందుచేత నీవు ఆద్యంతములయందు మధ్యమమందును ఉండుటచే నీవు ధృవము అవి కూడా నీచే సృజింపబడును గానీ ధృవములు కావు. ఎట్లనగా-స్వర్ణాదులవలె పదార్థములన్నియు ఏ ఉనికి చేత ప్రకాశించ బడుచున్నవో కార్యములయొక్క ఆద్యంతముల యందు, అన్తరాళ మందును ఏది శాశ్వతమో అదియే నీవు. బంగారు సొమ్ముల యందు బంగారము సత్యము, స్థిరము. సొమ్మునకు ముందును తరువాతను, సొమ్ముగా రూపొందునపుడును బంగారమే యుండును గదా! 36

అవ॥ ఏవం ధృవత్వేన కాలతః పరిచ్ఛేదో నాస్తీత్యుక్తం దేషతో౽ప్య పరిచ్ఛేదమహ–క్షిత్యాదిభిరితి.

అవ:– ఈ విధముగా కాలాపరిచ్ఛిన్నతను చెప్పి, క్షితిభిరిత్యాది శ్లోకమున దేశాపరిచ్ఛిన్నత చెప్పబడుచున్నది.

శ్లో॥ క్షిత్యాదిభిరేష కిలావృతస్సప్తభిర్దశగుణోత్తరైరాండకోశః ।
యత్ర పతత్యణు కల్పస్సహాండకోటి కోటిభిస్తదనంతః ॥ 37

తా:– ఒకటి మరొకదానికన్నా పదిరెట్లచొప్పున పెద్దదైన భూమి మొదలగు సప్త తత్త్వములచేత ఈ బ్రహ్మాండము ఏర్పడుచున్నది. అట్టి కోట్ల కొలది బ్రహ్మాండములు నీ యందు కణమువలె తిరుగుచున్నవి. కావున నీవు అనన్తుడవు. 37

టీ:– పూర్వస్మాత్పూర్వస్మాద్దశ గుణముత్తరోత్తరైరధికైరావృతః. యత్ర త్వయి. అణుకల్పః అణుతుల్యః పతతి పరిభ్రమతి. తత్తస్మాదనంతస్త్వం. (37)

టీ:– ముందున్న దానికన్నా ముందున్నది పదిరెట్ల చొప్పున (ఒకదాని కన్నా నొకటి పదిరెట్లు అధికముగా) పరిణామముగల క్షిత్యాదుల (భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, అహంకారము, మహత్తు)చే ఆవరించబడిన ఈ బ్రహ్మాండము నీ యందు అణుమాత్రమై పరిభ్రమించుచున్నది. అందుచేత నీవు అనన్తుడవు. 37

అవ॥ యస్మాదేవం పరమేశ్వరస్త్వమేవ. అన్యే దేవాస్తవ విభూతయః అతస్త్వాం విహాయ విషయకామనయా అన్యోపాసకా అతిమందా ఇత్యాహ–విషయేతి.

అవ:– విషయిత్యాది శ్లోకమున. పరమేశ్వరుడవైన నిన్నుగాక విషయ కామనలతో నీ విభూతులు అయిన ఇతర దేవతలనుపాసించువారు అతిమన్దులు (బుద్ధిహీనులు) అని చెప్పుచున్నాడు.

శ్లో॥ విషయ తృషో నరపశవో య
ఉపాసతే విభూతీర్న పరం త్వామ్ ।
తేషామాశిష ఈశ తదను
వినశ్యంతి యథా రాజ కులమ్ ॥ 38

తా:- ఓ ఈశ్వరా! విషయ (ఇన్ద్రియ భోగములందు) తృష్ణచేత ఏ నరపశువులు పరాత్పరుడవైన నిన్ను గాక నీ విభూతులైన (ఇంద్రాది దేవతలను) వారలను ఉపాసించెదరో, వారి భోగములు ఆ విభూతుల వెంబడి, రాజవంశముల (భోగాదులు కుల నాశనంతో నశించెడి విధముగ) వలె నశించును. 38

టీ:- విషయేషు. తృట్ తృష్ణా యేషాం తే. నరాకారాః పశవః. కుతః యే విభూతీరింద్రాద్యా ఉపాసతే. నతు పరం త్వాం. తతః కిం? తత్రాహ-తేషామితి. తదను ఉపాస్యనాశానంతరం. యథా రాజ కులమను. రాజకులనాశానంతరం తత్సేవకానాం. ఆశిషో నశ్యంతి తద్వత్. అయం చ పరమోఽవధిః. మధ్యేఽపి వినశ్యంత్యేవ. 38

టీ:- విషయముల యందు ఆసక్తిగలవారు ఎవరో వారు విషయ తృష్ణలు అటువంటివారు మానవ రూపములో గల పశువులు. ఎందువలన? ఎవరైతే పరముడవైన నిన్ను కాక, నీ విభూతులైన ఇన్ద్రాదులను ఉపాసించెదరో, (అట్టివారు నరపశువులు). తేషామిత్యాది పాదమున ఇంకను(దాని నుండి) ఏమి చెప్పుచున్నాడు - ఆ తరువాత ఏమీ అనగా- రాజకులములు నశించుట తోడనే వారి భోగములు,వారి సేవకుల ఆశలు, ఏ విధముగా నశించి పోవునో అటులనే ఉపాస్య దేవతల తోబాటే నశించిబోవుదురు. అనగా పరమావధి చేరకుండగనే మధ్యలోనే నశించెదరు. 38

అవ॥ విషయకామేనాపి కృతా త్వత్సేవా మోక్షఫలైవేత్యాహ-కామేతి.

అవ॥ కామేత్యాది శ్లోకమున విషయములందుగల కోరికచేతనైనను నీ సేవచేయువానికి అత్యన్తిక ఫలము మోక్షమే అని చెప్పుచున్నాడు.

శ్లో॥ కామధియస్త్వయి రచితా న పరమ
రోహంతి యథా కరంబబీజాని ।
జ్ఞానాత్మన్యగుణమయే గుణగణతోఽస్య
భవంతి ద్వంద్వ జాలాని ॥ 39

టీ:- కామధియః. విషయకామనా అపి. హే పరమ. త్వయి రచితాః కృతాశ్చేత్. న రోహంతి దేహాంతరోత్పత్తయే న భవంతి. కరంబ బీజాని. భర్జిత బీజాని. యథా యతోఽస్య జీవస్య గుణగణాదేవ ద్వంద్వ సమూహా భవంతి. అతః కామేనాపి నిర్గుణస్య తవ భజనాచ్ఛనైర్నైర్గుణ్యం భవతీత్యర్థః. 39

అవ॥ ఫలకామనయాపి త్వదారాధనం యదా మోక్షహేతుస్తదా కిం వక్తవ్యం భగవద్ధర్మ మహాత్మ్యమితి వక్తుం తత్సంప్రదాయప్రవర్తకత్వేన చ భగవన్తం స్తౌతి - జితమితి.

తా:- ఓ పరమా! జ్ఞానస్వరూపుడవు, అన్య గుణములును గల నీ యందు గుణముల సముదాయము వలన జీవునకు సుఖ దుఃఖములు కలిగినను (కోరికల యందు బుద్ధిగల వారికి), క్రమముగా వేయించిన విత్తనములవలె వారి కర్మలు మొలకెత్తవు. 39

టీ:- ఓ పరమపురుషా! విషయముల యందలి కోరికలచేతనైనను నీయందు చేయబడిన సేవలు దేహాన్తరోత్పత్తులు కలిగించవు. (దేహాన్తర జన్మల నీయవు). వేయించిన విత్తనములు మొలకెత్తవు గదా జీవుల యొక్క గుణగణములచేతనే ద్వంద్వసమూహములు (సుఖ దుఃఖములు) ఏర్పడును. అందుచేత కోరికచేతనైనను, కామనతో కూడినవే అయినను నిర్గుణుడవైన నిన్ను భజించుట చేత గుణరహితుడు (గుణములు లేనివాడు) అగుచున్నాడు అని భావము. 39

అవ:- జితమిత్యాది శ్లోకమున కామన చేతనైనను నీ యొక్క ఆరాధనము ఎప్పుడైతే మోక్షహేతువో అప్పుడు భగవద్ధర్మ మాహాత్మ్య-మును గూర్చి చెప్పవలసినదేమున్నది. అని ఆయా సంప్రదాయ ప్రవర్తకత్వ మున ప్రవర్తకునిగా భగవంతుని స్తుతించుచున్నాడు.

శ్లో॥ జితామజిత తదా భవతా యదాహ
భాగవతం ధర్మమనవద్యమ్ ।
నిష్కించనా యే మునయ ఆత్మారామా
యముపాసతేఽపవర్గాయ ॥ 40

టీ:- యదా భవాన్. భాగవతం ధర్మమాహ-తదా హే భగవన్. త్వయా జితం సర్వోత్కర్షేణ స్థితం. తత్రహేతుః యే నిష్కించనాః సనత్కుమారాదయో మునయస్తే. యం భగవంతం. అపవర్గాయ సేవంతే. తేన భవతా జితం. యం ధర్మమితి. వా. 40

అవ॥ అనవద్యతామేవహ - విషమేతి.

శ్లో॥ విషమమతిర్న యత్ర నృణాం
త్వమహమితి మమ తవేతి చ యదన్యత్ర ।
విషమధియా రచితో యః స హ్యవిశుద్ధః
క్షయిష్ణురధర్మ బహుళః ॥ 41

తా:- పరాజయము లేనివాడా! ఏ కోరికలు లేని ఆత్మారాములు (ఆత్మయందేరమించువారు) మోక్షము కొఱకు ఎవనిని ఉపాసించుదురో అట్టి నీచే ఎప్పుడైతే నిర్దోషమగు భాగవత ధర్మము ఉపదేశించబడినదో అప్పుడు సర్వోత్కర్షము పొందబడుచున్నది.(భాగవతధర్మమే శ్రేష్ఠము)40

టీ:- ఎప్పుడైతే నీవు భాగవత ధర్మమును చెప్పితివో అప్పుడు నీచే సర్వోత్కర్షము పొందబడినది. అందులకు హేతువు ఏమియు కోరుకొనని సనత్కుమారాదులైన మునులు మోక్షము కొఱకు ఏ భగవంతుని సేవించుదురో అట్టివారిచేత నీవు లేదా ఏ భాగవత ధర్మము గలదో దానిచేత నీవు జయించబడుదువు. 40

అవ॥ విషయేత్యాది శ్లోకమున నిర్దోషత్వమునే చెప్పుచున్నాడు.

తా:- ఏ ధర్మమునందైతే మానవులకు నీవు, నేను, నాది, నీది అను భేదబుద్ధి లేదో అదియే భాగవతధర్మము. ఇతర ధర్మమందు ఏది కలదో ఏ ధర్మము భేద బుద్ధితో రచించబడినదో అది నిశ్చయముగా విశుద్ధము కాదు. నశించు స్వభావము కలది అధర్మమధికముగా కలది. 41

టీ:- విషమమతిః యత్ర యస్మిన్ భాగవతే ధర్మే నాస్తి. యదన్యత్ర. యథాన్యస్మిన్ కామ్యేధర్మే. నను సోఽపి వేదోక్తత్వాదనవద్య ఏవ. తత్రాహ-విషమధియా శత్రుమరణాది కామనయా రచితో విహితో యః. సహ్యావిశుద్ధః రాగద్వేషాదిమత్వాత్. క్షయిష్ణుశ్చ. నశ్వరఫలత్వాత్ అధర్మ బహులశ్చ. హింసాది బాహుల్యాత్. తదుక్తం శబరస్వామిభిః. "ఉభయమిహ చోదనయాం లక్ష్యతే. అర్థోఽనర్థశ్చ' ఇత్యాది. 41

అవ॥ ఏతత్ప్రపఞ్చయతి - కః ఇతి.

శ్లో॥ కః క్షేమో నిజపరయోః కియానర్థస్స్వపరద్రుహా ధర్మేణ ।
స్వద్రోహాత్తవ కోపః పరపీడనయా చ తథాఽధర్మః ॥ 42

టీ:- కః క్షేమః? కిం కుశలం? న కించిత్. నిజపరయోః స్వస్య పరస్య చ. స్వపరద్రుహా స్వస్మై పరస్మై చ ద్రుహతీతి స్వపరద్రుక్ తేన యతః స్వద్రోహాత్ అత్యంతకాయక్లేశాత్తవ కోపః పీడా సంభవతి.

టీ:- భేద బుద్ధి భాగవత ధర్మమునందు లేదు. ఈ భేదము ఇతర ధర్మములందు కలదు. అది కూడా వేదోక్తమగుట వలన దోషము లేనిదే అని చెప్పుచున్నాడు-(సకామకర్మ) శత్రు మరణాది కామనగల భేద బుద్ధితో రచింపబడిన ధర్మము ఏది కలదో అది రాగ ద్వేషాదులతో కూడినది కావున అంత పవిత్రమైనది కాదు. నశించిపోవు స్వభావము కలది. హింసాదుల చేత అది అధర్మ బహుళము. శబర స్వాముల చేత చెప్పబడినట్లుగా - ఇచట ఉభయము అనగా అర్థము. అనర్థము అని వేద విధిచేత తెలియబడుచున్నది. 41

అవ:- కః ఇత్యాది శ్లోకమున దీనినే వివరించుచున్నాడు.

తా:- తనకును, పరులకును ద్రోహము కలిగించు ధర్మము వలన తనకును, ఇతరులకును ఏమి కుశలము కలుగును? ఏమి ప్రయోజనము కలుగును? ఆత్మద్రోహముచేత నీకు కోపమును మరియు ఇతరులకు కలిగించిన పీడ అధర్మమును కూడా అగును. 42

టీ:- తనకును, పరులకును ద్రోహము కలిగించు ధర్మము వలన ఏమి క్షేమము కలుగును? ఏమియు కలుగదు. స్వద్రోహ కారణముగా అత్యంత కాయక్లేశము చేత నీకు కోపమును, పీడయు కలుగును.

తదుక్తం గీతాసు. శ్లో. "కర్శయంతశ్శరీరస్థం భూత గ్రామమచేతసః మాం చైవాంతశ్శరీరస్థం తాన్ విద్యాసుర నిశ్చయాన్" ఇతి. తథా పరపీడనయా అన్యహింసయా అధర్మః చ శబ్దాత్తవ కోపశ్చ. అతస్త్వయా రాగాంధమపి కథంచిద్వేదమార్గే ప్రవర్తయితుం కామ్యధర్మోఽభిహితో. న తత్త్వదృష్ట్యా. 42

గీతయందు కూడా - కర్షయంతః....విద్ధ్యసురనిశ్చయాన్ (17-6). శరీరమందున్న జీవులను, మరియు అంతర్యామినైన నన్ను కృశింపచేయువారు అజ్ఞానులైన అసుర స్వభావము గలవారని ఎఱుంగుము. అని గీతాచార్యుడు తెలిపియున్నాడు. ఆ విధముగా పరపీడనముచేత అధర్మము. చ శబ్దము నీ కోపమును తెలియచేయును. అందువలన నీచేత రాగస్థుడైనను ఏదో విధముగా వేదమార్గమందు ప్రవర్తించుటకు కామ్యమార్గము చెప్పబడుచున్నది. కాని తత్త్వదృష్టిచేత కాదు. 42

అవ॥ భాగవత ధర్మేణ తు న ద్రోహ ఇత్యాహ - నేతి.

అవ:- న ఇత్యాది శ్లోకమున భాగవత ధర్మముచేత ద్రోహము లేదు అని చెప్పుచున్నాడు.

శ్లో॥ న వ్యభిచరతి తవేక్షా యయాహ్య<br>
భిహితో భాగవతో ధర్మః ।<br>
స్థిరచరసత్త్వకదంబేష్వ<br>
పృథగ్ధియో యముపాసతేఽత్వార్యాః ॥ 43

తా:- ఏ దృష్టిచే నీచే భాగవత ధర్మము ఉపదేశించబడినదో అట్టి నీ దృష్టి సత్య దూరము కాజాలదు. స్థిర చర ప్రాణులందు భేదబుద్ధి లేని మహాత్ములు ఈ ధర్మమునే ఆచరించుచున్నారు. (భేదబుద్ధి లేనివారు దేనిని ఉపాసించుదురో అదియే పరమము గొప్పది) 43

టీ:- న వ్యభిచరతి న పరమార్థం జహాతి. తవ ఈక్షా దృష్టి. అవ్యభిచారే హేతుః - స్థిరేతి. స్థావరజంగమప్రాణి సమూహేషు. సమబుద్ధయో భాగవతా యం ధర్మం సేవంతే. 43

టీ:- పరమార్థము తొలిగిపోదు. నీ దృష్టి స్థిరమైనది-అవ్యభిచారమునకు హేతువుగా స్థిరేతి అని చెప్పుచున్నాడు. స్థావర జఙ్గమ ప్రాణి సమూహములందు సమబుద్ధిగల వారు భగవంతుని యొక్క ఏ ధర్మము కలదో దానిని సేవించుదురు. 43

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

అవ॥ ఏవం భూతస్య భాగవతధర్మ ప్రవర్తకస్య తవ దర్శనాత్ సర్వ పాపక్షయో భవతీతి కిం చిత్రమిత్యాహ – నహీతి.

అవ:– ఈ విధముగా భాగవత ధర్మ ప్రవర్తకుని యొక్క (నీ యొక్క) దర్శనము చేత సర్వ పాప క్షయమగునని చెప్పుటలో చిత్రమేమున్నది? ఏమియు లేదు అని నహీత్యాది శ్లోకమున చెప్పుచున్నాడు.

శ్లో॥ న హి భగవన్నఘటితమిదం
త్వద్దర్శనాన్నృణామఖిలపాపక్షయః ।
యన్నామ్నస్సకృచ్ఛ్రవణాత్పుల్కస
కోఽపి విముచ్యతే సంసారాత్ ॥ 44

తా:– ఓ భగవానుడా! నీ దర్శనము వలన నరుల యొక్క సమస్త పాప క్షయమగుట అసంగతము కాదు సుమా! నీ నామమును ఒకసారి వినినంతనే చండాలుడు కూడా సంసారము నుండి విముక్తుడు అగును. (44)

టీ:– పుల్కసః చండాలః అత్రత్యార్యాసు విగణాదిప్రయోగ ఆర్షః. 44

టీ॥ పుల్కసుడనగా చండాలుడు. ఈ ఆర్యావృత్త శ్లోకమున వేరువేరు గణములు (మాత్రృ గణములు కాక) వాడబడినవి అది ఆర్షమని తెలియదగినది. (44)

అవ॥ అతోఽహం కృతార్థోఽస్మీత్యాహ – అథేతి. 45

అవ:– అథ ఇత్యాది శ్లోకమున అందుచేత నేను కృతార్థుడనైతిని అని చెప్పబడుచున్నది.

శ్లో॥ అథ భగవన్ వయమధునా
త్వదవలోకపరిమృష్టాశయమలాః ।
సురఋషిణా యదుదితం తావ
కేన కథమన్యథా భవతి ॥ 45

తా:– ఓ భగవానుడా! కావున ఈనాడు నీ దర్శనముచే మా అన్తః కరణములందలి మాలిన్యములు కడిగివేయబడినవి. దేవర్షి (నారదుని) ఉపదేశము ఏదికలదో అది మరియొక విధముగా అగుట (వ్యర్థమగుట) ఎట్లు? 45

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

టీ:- అతో హేతోః తవావలోకనేన పరిమృష్టా నిరస్తా ఆశయే చిత్తే మలా యేషాం తే. త్వద్దర్శనం చ మమ నారదోపదేశేన జాతమిత్యాహ - సుర ఋషిణేతి. 45

అవ॥ యథా చాహం పూర్వమతిమూఢ ఆసం యథా చ నారదేనాను గృహీతోఽస్మి తత్సర్వాన్తర్యామిణస్తవ మయా కిం ప్రకాశనీయమిత్యాహ - విదితమితి.

శ్లో॥ విదితమనంత సమస్తం తవ జగదాత్మనో జనైరిహాచరితమ్ ।
విజ్ఞాప్యం పరమగురోః కియదివ సవితురివ ఖద్యోతైః ॥ 46

టీ:- విశేషేణ జ్ఞాప్యం ప్రకాశనీయం. కియదివన కిమపీత్యర్థః. సవితుర్యథా ఖద్యోతైః ప్రకాశనీయం నాస్తి తద్వత్. 46

అవ॥ ఉక్తలక్షణం భగవన్తం ప్రణమతి - నమ ఇతిద్వాభ్యామ్.

టీ:- (కృతార్థతకు) హేతువు - నీ దర్శనముచేత చిత్తమందలి మలినములు తొలగింపబడిన వారెవరో వారు మృష్టాశయులు. నీ దర్శనము కూడా నారదోపదేశముననే కలిగినది అని సుర ఋషిణా ఇత్యాది పాదమున చెప్పుచున్నాడు. 45

అవ:- విదితమిత్యాది శ్లోకమున ఏ విధముగా నేను పూర్వమందు అతి మూఢుడనైయుంటినో మరియు నారదునిచేత అనుగ్రహించ బడితినో అన్నియును సర్వాంతర్యామివైన నీకు నాచే చెప్పదగినదే మున్నది అని చెప్పుచున్నాడు.

తా:- ఓ అనన్తుడా! జగదాత్మకుడవైన నీకు ఈ లోకమందు జనులచే ఆచరించబడిన సర్వమును తెలియుచున్నది. పరమగురువు అగు నీకు సూర్యునకు మిణుగురు పురుగువలె విన్నవించదగినది ఏమున్నది? 46

టీ:- విశేషించి నీకు జ్ఞాపకము చేయదగినదేమున్నది? ఏమియు లేదు అని భావము. సూర్యుని యందు మిణుగురు పురుగులతో ప్రకాశింపచేయదగినది ఏమియు లేనట్లు! 46

అవ:- నమిత్యాది శ్లోక ద్వయమున చెప్పబడిన లక్షణములు గల భగవంతుని నమస్కరించుచున్నాడు.

శ్లో॥ నమస్తుభ్యం భగవతే సకల జగత్
స్థితి లయోదయేశాయ ।
దురవసితాత్మగతయే కుయోగినాం
భిదా పరమహంసాయ ॥ 47

టీ:- సకలస్య జగతః స్థిత్యాదీనామీశాయ సమర్థాయదురవసితా అవిజ్ఞాతా ఆత్మగతిర్నిజతత్త్వం యస్య తస్మై. తేషాం కు యోగినాం. కేన భిదా భేద దృష్ట్యా. 47

తా:- భగవానుడవైనట్టి, సకల జగత్తు యొక్క రక్షణమునకు, నాశనమునకు, సృష్టికి ప్రభుడవైనట్టి, భేద భావముగల అయోగ్యులకు తెలియశక్యముగాని పరమహంసవగు నీకు నమస్కారము. 47

టీ:- ఈ జగత్తు యొక్క స్థిత్యాదులకు సమర్థుడవైనట్టియు, నిజతత్త్వము (ఆత్మతత్త్వము) తెలియని భేదభావముగల కుయోగులకు, తెలియశక్యము కానట్టియు అయిన నీకు నమస్కారము. 47

శ్లో॥ యం వై శ్వసంతమను విశ్వసృజశ్శ్వసంతి
యం చేకితానమనుచిత్తయ ఉచ్చకంతి ।
భూమండలం సర్షపాయతి యస్య మూర్ధ్ని
తస్మై నమో భగవతేఽస్తు సహస్రమూర్ధ్నే ॥ 48

టీ:- శ్వసంతి చేష్టంతేచేకితానం పశ్యంతమనుచిత్తయః జ్ఞానేంద్రియాణి. ఉచ్చకంతి స్వారూఢం పశ్యంతి. (48-49)

తా:- ఎవని చేష్టలననుసరించి ప్రజాపతులు చేష్టల చేయుచున్నారో (సృష్ట్యాది కార్యములు), ఎవని ప్రకాశము ననుసరించి చిత్తములు ప్రకాశించుచున్నవో, ఎవని తలయందు భూమండలము ఆవగింజవలె నున్నదో అట్టి వేయి పడగలుగల భగవానునికి నమస్కారము. 48

టీ:- ఎవని చేష్టలననుసరించి చేష్టల చేయుదురో, ఎవని ప్రకాశము ననుసరించి చిత్తములు ప్రకాశము పొందునో జ్ఞానేంద్రియములు శక్తిని పొంది ఆరూఢుడైన వానిని చూచుచున్నావో అట్టి వానికి నమస్కారము. (48-49)

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ సంస్తుతో భగవానేవంతస్తమభాషత ।
విద్యాధరపతిం ప్రీతశ్చిత్రకేతుం కురూద్వహ ॥ 49

శ్రీ శుకుల వలికిరి.

తా:- ఓ కురువంశశ్రేష్ఠా! ఈ విధముగా చక్కగా స్తుతించబడిన భగవానుడనన్తుడు ప్రసన్నుడై విద్యాధరులకు ప్రభువగు ఆ చిత్రకేతువుతో ఇట్లనెను. 49

శ్రీ భగవానువాచ

శ్లో॥ యన్నారదాంగిరోభ్యాం తే వ్యాహృతం మేఽనుశాసనమ్ ।
సంసిద్ధోఽసితయా రాజన్ విద్యయా దర్శనాచ్చ మే ॥ 50

శ్రీ భగవానుడు వలికెను.

తా:- ఓ రాజా! నారదాఙ్గిరసులచే ఉపదేశించబడిన ఉపాసనముచే, మరియు నా దర్శనముచే నీవు పూర్తిగా సిద్ధిని బడిసినావు. 50

టీ:- మేఽనుశాసనం మద్విషయ ఉపదేశః తేన చ తయా చ విద్యయా. అస్మాచ్చ దర్శనాత్. సంసిద్ధోఽసి. 50

టీ:- నా విషయమును గూర్చిన ఉపదేశము చేతను దాని ఉపాసన చేతను మరియు నా దర్శనము చేతను సిద్ధిని పొందినావు. 50

అవ॥ తద్బోధదార్ఢ్యాయ స్వయమప్యుపదిశతి -అహమిత్యాదినా.

అవ॥ తత్త్వబోధనదార్ఢ్యముచే స్వయముగా ఉపదేశించుచున్నాడు -అహమిత్యాది శ్లోకమున..

శ్లో॥ అహం వై సర్వ భూతాని భూతాత్మా భూతభావనః ।
శబ్ద బ్రహ్మపరంబ్రహ్మ మమోభేశాశ్వతీ తనూ ॥ 51

తా:- అన్ని భూతములును, భూతములకు ఆత్మను, భూతములను పోషించువాడను నేనే. శబ్దబ్రహ్మమును, పరబ్రహ్మమును రెండును నా శాశ్వత స్వరూపములు. 51

టీ:- సర్వభూతాన్య హమేవ. భూతానామాత్మా.. భోక్తాప్యహమేవ. భోక్తృభోగ్యాత్మకం విశ్వం మద్వ్యతిరిక్తం నాస్తీత్యర్థః. యతో௨హం భూతభావనః భూతానాం ప్రకాశకః కారణం చ. నను శబ్దబ్రహ్మ ప్రకాశకం పరంబ్రహ్మకారణం చ ప్రకాశకం చ. సత్యం తే ఉభే. మమైవ రూపే ఇత్యాహ-శబ్దబ్రహ్మేతి. శాశ్వతే శాశ్వత్యౌ. 51

టీ:- అన్ని భూతములును నేనే, భూతముల యొక్క ఆత్మను భోక్తను కూడా నేనే, భోక్తృభోగ్యాత్మకమైన విశ్వము నాకు అతిరిక్తముగా లేదు అని భావము. ఏలననగా నేనే భూతములకు ప్రకాశమును, కారణ-మును కూడా అయివున్నాను. ప్రకాశమైన శబ్దబ్రహ్మమును, కారణము, ప్రకాశకము అయిన పరబ్రహ్మమును నేనే. సత్యము, ఈ రెండును నాయొక్క శాశ్వత తనువులే. (ఈ రెండును నా యొక్క రూపములు, శక్తులు).. 51

అవ|| అతస్తమేవం పశ్యేత్యాహ.

అవ:- అందుచేత అతనినే చూడుము అని చెప్పుచున్నాడు.

శ్లో|| లోకే వితతమాత్మానం లోకం చాత్మని సంతతమ్ ।
ఉభయం చ మయా వ్యాప్తం మయిచైవోభయం కృతమ్ ॥ 52

తా:- లోకములందు ఆత్మయు, ఆత్మ యందు లోకములు వ్యాపించి యున్నవి. నాచే ఈ రెండును వ్యాపించబడియున్నవి. నా యందే ఈ రెండును చేయబడియున్నవి. 52

టీ:- లోకే భోగ్య ప్రపంచే. భోక్తృత్వేన వితతమనుగతమాత్మానం. లోకం చాత్మని భోగ్యత్వేన. సతతం వ్యాప్తం తదుభయం చ మయా కారణాత్మనా వ్యాప్తం. మయి చైవో భయం కృతం ప్రకల్పితం. స్మరేదితి తృతీయేనాన్వయః. పశ్యేదిత్యధ్యాహారో వా. 52

టీ:- భోగ్య ప్రపఞ్చమందు భోక్త రూపముగా అనుగతమై యున్నాను. ఆత్మ యందు భోగ్యరూప లోకమున వ్యాపించి యున్నాను. ఈ రెండు కారణాత్మకమైన నాచే వ్యాపించబడి యున్నవి. నాయందు ఈ రెండును ప్రకల్పించబడినట్లుగా స్మరించవలయును. కారణాత్మనా అను శబ్దమును తృతీయ చేత అన్వయించుకోవలయును. చూడుము అని అధ్యాహారము...52

అవ॥ నను జాగ్రదాద్యవస్థా భేదేన భోక్తృభోగ్యాత్మకం విశ్వం స్ఫుటం ప్రతీయమానం కథం కల్పితం స్యాదిత్యాశఙ్క్య స్వప్నగత జాగ్రదాది దృష్టాన్తేన సంభావమన్నాహ – యథేతి ద్వాభ్యామ్.

అవ:– యథా ఇత్యాది శ్లోక ద్వయమున జాగ్రదాది అవస్థలలోని భేదముచే భోక్తృభోగ్యాత్మకమైన స్ఫుటముగా గోచరించు విశ్వము కల్పించబడెననుట ఎట్లో చెప్పుటకు స్వప్నగత జాగ్రదాది దృష్టాన్తముచే ప్రకటించుచున్నాడు.

శ్లో॥ యథా ప్రసుప్తః పురుషో విశ్వం పశ్యతి చాత్మని ।
ఆత్మానమేక దేశస్థం మన్యతే స్వప్న ఉత్థితః ॥ 53

తా:– ఏ విధముగా నిద్రించిన పురుషుడు స్వప్నమున తనయందు విశ్వమును చూచునో, అతడే నిద్రలేచిన తదుపరి తనను ఒకచోటనున్న వానిగా తలపోయునో (ను). 53

టీ:– యథా సప్నే సుప్తో విశ్వం గిరివనాదిరూపం. దేశాంతరస్థ మాత్మన్యేవ పశ్యతి. స్వప్న మధ్యే సుషుప్తిం స్వప్నం చ పశ్యతీత్యర్థః. తథా స్వప్న ఏవ ఉత్థితస్సన్ ఆత్మానమేకదేశస్థం శయనదేశే స్థితం మన్యతే. జాగ్రదవస్థా మనుభవతి. 53

టీ:– ఏ విధముగా స్వప్నమందు నిద్రించుచున్న పురుషుడు గిరి వనాది రూపమైన విశ్వమును, దేశాన్తర స్థితులను తన యందే చూచునో, స్వప్న మధ్యమున నిద్రను మరియు స్వప్నమును చూచును. అట్లే స్వప్నము నుండి మేల్కొనినవాడు తనను ఒకచోట (శయనించిన చోట) ఉన్నట్లుగా జాగ్రదవస్థను అనుభవించును. 53

శ్లో॥ ఏవం జాగరణాదీని జీవ స్థానాని చాత్మనః ।
మాయామాత్రాణి విజ్ఞాయ తద్ద్రష్టారం పరం స్మరేత్ ॥ 54

తా:– ఇదే విధముగా జాగరణాది జీవుని అవస్థలు ఆత్మ యొక్క మాయచే కల్పించబడినవే అని తెలిసికొని ఆ ద్రష్టను పరమునిగా స్మరించవలయును. 54

టీ:- ఏవం ప్రసిద్ధాన్యపి జాగరాదీని జీవనస్థానాని. జీవోపాధే ర్బుద్ధేరవస్థా భూతాని. ఆత్మనో మాయా మాత్రాణీత్యేవం విజ్ఞాయ. తేషాం ద్రష్టారం అతఏవ పరం తదవస్థారహితం. ఆత్మానం స్మరేత్. 54

టీ:- ఈ విధముగానే ప్రసిద్ధములైన జాగ్రదాది జీవుని అవస్థలను జీవోపాధియైన బుద్ధి యొక్క అవస్థలను మాయా కల్పితములుగా తెలుసుకొని వాని ద్రష్టయైన అవస్థారహితుడైన పరమాత్మను స్మరించ-వలయును. 54

అవ॥ నను తేషాంద్రష్టారమితి కథముచ్యతే, స్వాపే దృశ్యాభావేన ద్రష్ట ృత్వాభావాత్తత్రాహ - యేనేతి.

అవ:- యేన ఇత్యాది శ్లోకమున అతనిని ద్రష్టగా తెలిసికొనుట ఎట్లో చెప్పుచున్నాడు. నిద్ర యందు దృశ్యము లేదు, ద్రష్ట కూడా లేదు. అన్నచో చెప్పుచున్నాడు.

శ్లో॥ యేన ప్రసుప్తః పురుషస్స్వాపం వేదాత్మనస్తదా ।
సుఖం చ నిర్గుణం బ్రహ్మ తమాత్మానమవేహి మామ్ ॥ 55

తా:- గాఢమగు నిద్రను పొందిన పురుషుడు దేనిచే తన నిద్రను తెలియునో ఆ ఆత్మను ఆనన్దస్వరూపమును, నిర్గుణమును అగు పరబ్రహ్మమును నన్నుగా తెలుసుకొనుము. 55

టీ:- ప్రసుప్తః పురుషో జీవః యేన రూపేణ. తదా స్వాపకాలే. ఆత్మనః స్వాపం నిర్గుణం అతీంద్రియం సుఖం చ వేద. తమాత్మానం బ్రహ్మ మామవేహి. తదా స్వాప సుఖయోరసంవేదనే సుఖమహ మస్వాప్సమితి స్మ ృతేరసంభవాత్. 55

టీ:- నిద్రించుచున్న జీవుడు ఏ రూపము చేత నిద్రించుచున్న కాలమున తన నిద్రను, అతీంద్రియ సుఖరూపమైన బ్రహ్మమును (నిర్గుణ బ్రహ్మమును) తెలియునో దానిని స్వయముగా బ్రహ్మమునని నన్నుగా తెలుసుకొనును. అప్పుడు నిద్రయు, బ్రహ్మసుఖము నిద్రా సుఖములు అసంవేదనములు. 'సుఖముగా నిద్రించితిని' అనుట అసంభవము అని స్మ ృతి. 55

అవ॥ నను స్వాపసాక్షిణాదృష్టం కథం జాగ్రదవస్థః స్మరేత్, నహ్యన్యేన దృష్టమన్యః స్మరతి తత్రాహ – ఉభయమితి.

శ్లో॥ ఉభయం స్మరతః పుంసః ప్రస్వాపప్రతిబోధయోః ।
అన్వేతి వ్యతిరిచ్యేత తద్ జ్ఞానం బ్రహ్మతత్పరమ్ ॥ 56

టీ:– ఉభయం ప్రస్వాపం ప్రతిబోధం చ. స్మరతః అనుసందధతః. తయోః. ప్రస్వాపప్రతిబోధయోః. ప్రకాశకత్వేన యదన్వేతి. తాభ్యాం వ్యతిరిచ్యేత చ. ఏకైకాపాయేఽప్యనపాయాత్. తత్ జ్ఞానం పరంబ్రహ్మ. తదేవ న తు భిన్నం. తస్మాన్మద్వ్యతిరిక్తం నాస్తీత్యర్థః. అతో బాల్యే దృష్టస్య యౌవనే స్మృతి వదవస్థాంతరత్వేఽపి స్వాపానందయోః స్మరణం ఘటత ఇతి భావః. తదేవంభూతం బ్రహ్మే త్మానమవేహీత్యనుషంగః. (56)

అవ:– ఉభయమిత్యాది శ్లోకమున, నిద్రకు సాక్షిగా ఉన్నవాడు జాగ్రదవస్థను స్మరించుట ఎట్లు? ఒకనిచే చూపబడిన దానిని మరొకడు స్మరించదుకదా! అన్నచో చెప్పుచున్నాడు.

తా:– రెండింటిని స్మరించే వ్యక్తికి నిద్రజాగ్రదవస్థలయందు ఏ జ్ఞానము అనుగతమై విలక్షణముగా నుండునో ఆ జ్ఞానమే పరబ్రహ్మ. (56)

టీ:– నిద్రావస్థను మరియు జాగ్రదవస్థను స్మరించుట అను ఉభయములు అనుసంధించుట ఎట్లు? నిద్రావస్థ మరియు జాగ్రదవస్థలను ఏ జ్ఞానము ప్రకాశించుచున్నదో ఏది వీనిని అన్వయించుచున్నదో, అతిక్రమించియున్నదో అపాయ అనపాయముల చేతను ఏ జ్ఞానము కలదో ఆ జ్ఞానము పరబ్రహ్మము. అదియే అభిన్నము అని అర్థము. అందుచేత బాల్యమందు చూచినటువంటి విషయమును యౌవనమందు స్మరించునో అట్లు రూపమున అవస్థాంతరము నందును ఉండునటుల నిద్రావస్థకు అవస్థాంతరమైన ప్రతిబోధత స్థితి స్వప్నానందములయందును స్మరించుట ఘటించును. దానినే బ్రహ్మముగా తెలియవలయును అని అన్వయము. ఈ రెండింటియందు ఏ ఒక్కటి లేకపోయినను ప్రకాశకము అనపాయము కావున ఈ అనపాయ ప్రకాశక జ్ఞానమే పరబ్రహ్మము. స్వాభిన్నము. 56

అవ॥ విపక్షే దోషమాహ - యదేతదితి.

శ్లో॥ యదేతద్విస్మృతం పుంసో మద్భావం భిన్నమాత్మనః ।
తతస్సంసార ఏతస్య దేహాద్దేహో మృతేర్మృతిః ॥ 57

టీ:- యత్ యది. ఏతన్మద్భావం మత్స్వరూపం. బ్రహ్మ విస్మృతం. తదాత్మనః సకాశాత్ భిన్నం భవతి. తత ఏతస్య పుంసః సంసారో భవతి. సంసార స్వరూపమాహ-దేహాద్దేహః జన్మానంతరం పునర్జన్మ మృతేరనంతరం మృతిశ్చేతి. 57

అవ॥ యోన్యన్తరేఽపి భోగాది సంపాదనం శక్యం జ్ఞానార్థం త్వత్రైవ యతితవ్యమిత్యాహ - లబ్ధ్వేతి.

అవ:- యదేతదిత్యాది శ్లోకమున విపక్షమందు (ద్వైతమందు) దోషమును చెప్పుచున్నాడు.

తా:- జీవునకు నాతోగల ఈ అభేదము ఏదియో దానిని విస్మరించిన వాడు తన నుండి తాను వేరగును. దానివలన వీనికి సంసారము, ఒక దేహము నుండి మరొక దేహము, మరణము నుండి మరణము ఏర్పడుచున్నవి. 57

టీ:- ఒకవేళ ఈ నా స్వరూపమును, బ్రహ్మమును (జీవుడు) విస్మరించినచో వాడు ఆత్మనుండి వేరగును. అట్టి జీవునకు సంసారము కలుగును. సంసార స్వరూపమును చెప్పుచున్నాడు. దేహము నుండి దేహము అనగా జన్మ అనన్తరము మరొక జన్మ మరియు మరణము అనన్తరము మరల మరణము (జననమరణపరంపర) సంభవించు చున్నవి. 57

అవ:- లబ్ధ్వా ఇత్యాది శ్లోకమున భోగాది సంపాదనలు ఇతర జన్మల యందును శక్యమే కాని జ్ఞానము మాత్రము ఇచ్చుటనే (ఈ మానవ జన్మమునందే) పొందవలెనని చెప్పుచున్నాడు.

శ్లో॥ లబ్ధ్వేహ మానుషీం యోనిం జ్ఞాన విజ్ఞాన సంభవామ్ ।
ఆత్మానం యో న బుధ్యేత న క్వచిచ్ఛమమాప్నుయాత్ ॥ 58

తా:- ఈ జగత్తు (లోకము) నందు జ్ఞాన, విజ్ఞానముల సంభవించు అవకాశముగల మానవజన్మమును పొంది ఎవడు తనను తెలుసుకొనడో వాడు ఎక్కడైనను (ఏ జన్మమునందును) శాంతిని పొందడు. 58

టీ:- జ్ఞానం శాస్త్రోక్తం విజ్ఞానమపరోక్షం తయోః సంభవో యస్యాం తాం. 58

టీ:- శాస్త్రములందు చెప్పబడినది జ్ఞానము, అపరోక్ష బోధము విజ్ఞానము. ఈ రెండింటిని దేని యందు పొందగలమో ఆ ఈ మానవ జన్మమును తనను తాను తెలుసుకొనుటకు ఉపయోగించుకోవలయునని భావము. 58

అవ॥ వైరాగ్యార్థమాహ. స్మృత్వేతి.

అవ:- స్మృత్వేతిద్యాది శ్లోకమున వైరాగ్యార్థమును చెప్పుచున్నాడు.

శ్లో॥ స్మృత్వేహాయాం పరిక్లేశం తతః ఫలవిపర్యయమ్ ।
అభయం చాప్యనీహాయాం సంకల్పాద్విరమేత్కవిః ॥ 59

తా:- కోరిక వలన పరిక్లేశమును, కోరిక లేనిచో అభయమును ఏర్పడునని వివేకి అయినవాడు సంకల్పము నుండి విరమించుకొనవలెను. 59

టీ:- ఈహాయాం ప్రవృత్తిమార్గే. తత ఈహాతః. అనీహాయాం నివృత్తిమార్గే తు అభయం మోక్షో భవతీతి చ. స్మృత్వా. ఫలసంకల్పాత్ విరమేత్. పాఠాంతరే. నోభయం. పరిక్లేశః ఫలవిపర్యయశ్చ నాస్తీత్యేవం స్మృత్వా. 59

టీ:- ప్రవృత్తి మార్గమందు సంసారము, నివృత్తి మార్గమందు మోక్షము ఏర్పడునని తెలుసుకొని ఫలముల నాశించు సంకల్పము నుండి విరమించవలయును. పాఠాంతరమున "నో భయం పరిక్లేశః" ఫల విపర్యయము లేదు అని గ్రహించవలయును. 59

అవ॥ ఏతద్వివృణోతి - సుఖాయేతి త్రిభిః.

అవ:- "సుఖాయ" ఇత్యాది మూడు శ్లోకముల ద్వారా దీనిని వివరించు చున్నాడు.

శ్లో॥ సుఖాయ దుఃఖ మోక్షాయ కుర్వాతే దంపతీక్రియాః ।
తతో నివృత్తిరప్రాప్తిర్దుఃఖస్య చ సుఖస్య చ ॥ 60

తా:- దంపతులు సుఖము కొఱకు దుఃఖ నివృత్తి కొఱకు కర్మలను చేయుదురు. వాని వలన దుఃఖము తొలగదు, సుఖము లభింపదు. 60

టీ:- దుఃఖస్యానివృత్తిః. సుఖస్యాప్రాప్తిః. 60

టీ:- ప్రవృత్తి మార్గమున దుఃఖము తొలగుటయు లేదు, సుఖము లభించుటయు లేదు. 60

శ్లో॥ ఏవం విపర్యయం బుధ్వా నృణాం విజ్ఞాభిమానినామ్ ।
ఆత్మనశ్చ గతిం సూక్ష్మాం స్థాన త్రయ విలక్షణామ్ ॥ 61

తా:- ఈ విధముగా తెలిసినవారమనే అభిమానముగల మనుష్యులు కర్మఫల విపర్యయమగు కర్మలనాచరించి, విరుద్ధఫలములు పొందు చున్నారు. స్థానత్రయ విలక్షణమైనట్టి, సూక్ష్మమైనట్టి ఆత్మగతిని తెలుసుకొని.... 61

టీ:- విజ్ఞానే ఉద్యమే. ప్రవీణావయమిత్యాభిమానవతాం. స్థానత్రయ విలక్షణాం తురీయాం. బుధ్వా. 61

టీ:- తెలిసినవారమను అభిమానము గల మనుష్యులు స్థాన త్రయాదుల (జాగ్రదాదులకు) విలక్షణమైన తురీయమైన దానిని తెలుసుకొని... 61

శ్లో॥ దృష్ట శ్రుతాభిర్మాత్రాభిర్నిర్ముక్తస్స్వేన తేజసా ।
జ్ఞాన విజ్ఞాన సంతుష్టో మద్భక్తః పురుషో భవేత్ ॥ 62

తా:- తన తేజస్సుచే చూచిన, వినిన ఇహ పర లోక విషయముల నుండి విముక్తుడై జ్ఞాన, విజ్ఞానమున సంతృప్తుడైన పురుషుడు (ఆత్మానుభవమునందు సంతుష్టుడై) నా భక్తుడు అగును. 62

టీ:- దృష్ట శ్రుతాభిః మాత్రాభిః ఐహికాముష్మికైర్విషయైః స్వేన తేజసా వివేక బలేన చ. 62

టీ:- దృష్ట శ్రుతములైన ఐహిక ఆయుష్మిక విషయముల నుండి వివేక బలముచే విముక్తుడు అగును. 62

అవ॥ నచాతః పరః పురుషార్థోఽస్తీత్యాహ - ఏతావానితి.

అవ:- ఏతావానిత్యాది శ్లోకమున ఇంతకు మించిన పురుషార్థము లేదని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఏతావానేవ మనుజైర్యోగ నైపుణ బుద్ధిభిః ।
స్వార్థస్సర్వాత్మనా జ్ఞేయో యత్పరాత్మైక దర్శనమ్ ॥ 63

తా:- యోగమునందు నిపుణమైన బుద్ధిగల మానవులచే పురుషార్థము ఇదియేనని, అన్ని విధములుగా పరబ్రహ్మయే ఆత్మ రూపముగా నున్నదని తెలియవలెను. 63

టీ:- యోగే నైపుణం యస్యాం. సా బుద్ధిర్యేషాం. పరస్యాత్మనః. ఏకం దర్శనమితి యత్. ఏతావానేవ. (63-65)

టీ:- యోగమందు నైపుణ్యము దేనియందో ఆ బుద్ధి యోగనైపుణ్య బుద్ధి. అట్టివారు పరమును, ఆత్మయును ఒక్కటేనని మాత్రమే దర్శింపదగినది. (63 - 65)

శ్లో॥ త్వమేవతచ్ఛ్రద్ధయా రాజన్నప్రమత్తో వచో మమ ।
జ్ఞానవిజ్ఞానసంపన్నో ధారయన్నాశు సిధ్యసి ॥ 64

తా:- ఓ రాజా! నీవు మఱపులేనివాడవై ఈ నా వచనములను శ్రద్ధగా ధారణ చేయువాడవై ఆత్మజ్ఞాన, ఆత్మానుభవ సంపన్నుడవై శీఘ్రముగా సిద్ధిని పొందగలవు. 64

శ్రీ శుక ఉవాచ.

శ్లో॥ ఆశ్వాస్య భగవానిత్థం చిత్రకేతుం జగద్గురుః ।
పశ్యతస్తస్య విశ్వాత్మా తతశ్చాంతర్దధే హరిః ॥ 65

శ్రీ శుకులు పలికిరి.

తా:- ఈ విధముగా జగద్గురువు, విశ్వాత్మకుడు, భగవానుడైన హరి చిత్రకేతువును ఓదార్చి అతడు చూచుచుండగనే అక్కడ నుండి అంతర్ధానము నొందెను. 65

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే
షోడశో౽ధ్యాయః

శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆఱవ స్కంధమున
పదహారవ అధ్యాయము సమాప్తము.

## సప్తదశోఽధ్యాయః

అవ॥ తతస్సప్తదశే యోగమాహర్ధిం ప్రాప్య ఖే చరన్. విహస్య గిరిశం శాపాదుమాయావృత్రతాం గతః.

శ్రీ శుక ఉవాచ.

శ్లో॥ యతశ్చాంతర్హితోఽనంతస్తస్యై కృత్వా దిశే నమః ।
విద్యాధరశ్చిత్రకేతుశ్చచార గగనే చరః ॥ 1

టీ:- యతః యస్యాం. తస్యై దిశే. నమః నమనం కృత్వా. 1

అవ॥ స చిత్రకేతుర్విద్యాధరస్త్రీ భిర్హరిం గాపయన్ రేమ ఇతి ద్వయో రన్వయః.

## 17వ అధ్యాయము

అవ:- తదుపరి పదిహేడవ అధ్యాయమున మహా (యోగ) మహత్తును పొంది (చిత్రకేతువు) ఆకాశమందు సంచరించుటను, గిరీశుని అపహాస్యముచేసినందున పార్వతిచే శపింపబడి వృత్రత్వమును పొందెను. అని వివరించబడుచున్నది.

శ్రీ శుకులు పలికిరి.

తా:- ఏ దిక్కు నుండి ఆ అనన్తుడు అన్తర్ధానమునొందెనో, ఆ దిక్కునకు నమస్కరించి, గగనచరుడు, విద్యాధరుడు అయిన చిత్రకేతువు ఆకాశమందు సంచరించెను. 1

టీ:- ఏ దిక్కునందో (అన్తర్ధానమునొందెనో) ఆ దిక్కునకు నమస్కరించి (ఆకాశమందు సంచరించెను). 1

అవ:- ఆ చిత్రకేతువు విద్యాధర స్త్రీలతో హరిని స్తుతింపచేయుచు ఆనందించుచుండెను అని రెండు శ్లోకములతో అన్వయము చేయబడుచున్నది.

శ్లో॥ స లక్షం లక్ష వర్షాణామవ్యాహత బలేంద్రియః ।
స్తూయమానో మహాయోగీ మునిభిస్సిద్ధచారణైః ॥ 2

శ్లో॥ కులాచలేంద్ర ద్రోణీషు నానా సంకల్ప సిద్ధిషు ।
రేమే విద్యాధరస్త్రీభిర్గాపయన్ హరిమీశ్వరమ్ ॥ 3

తా:- క్షీణించబడని బలము, ఇన్ద్రియములుగలవాడు, సిద్ధులచేతను, చారణులచేతను, మునులచేతను స్తుతించబడుచున్న వాడు అయిన ఆ చిత్రకేతువు అనేక సంకల్పములు సిద్ధింపచేయు కులపర్వత శ్రేష్ఠుడగు మేరుపర్వత సానువులయందు విద్యాధర స్త్రీలచే, శ్రీహరిని గానము చేయించువాడై లక్ష సంవత్సరములు ఆనందించెను. (2-3)

టీ:- అవ్యాహతం బలమింద్రిపాటవం యస్య. (2)

టీ:- క్షీణించబడని బలము, ఇన్ద్రియ పాటవము ఎవరికో వాడు అవ్యాహత బలేన్ద్రియుడు. (2)

టీ:- కులేతి. నానావిధాస్సంకల్పేనైవ సిద్ధయో యాసు తాసు. (3-4)

టీ:- నానా విధములైన కోరికలను సంకల్పము చేతనే సిద్ధింపచేయు శక్తి ఎవరికో అట్టి సిద్ధులుగల వారి యందు...3,4

అవ॥ అకస్మాదద్భుతైశ్వర్య గర్వాత్ప్రాచీన కర్మతః. ఆసురీం యోని మాపన్నో భవానీ శాపతః స తు. తదాహ - ఏకదేత్యాదినా.

అవ:- ఏకదా ఇత్యాది శ్లోకములలో, అకస్మాత్తుగా లభించిన అద్భుత ఐశ్వర్య గర్వముచే, ప్రాచీన (పురాకృత) కర్మ విశేషమున, భవానీదేవి (పార్వతీదేవి) శాపకారణముగా అసుర యోని యందు జన్మించెను అని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఏకదాస్వవిమానేన విష్ణుదత్తేన భాస్వతా ।
గిరీశం దదృశే గచ్ఛన్ పరీతం సిద్ధచారణైః ॥ 4

తా:- ఒకప్పుడు, అతడు విష్ణువుచే ప్రసాదించబడిన ప్రకాశించెడి విమానమునందు వెళ్ళుచున్నవాడై సిద్ధచారణులతో పరివేష్ఠుడైన గిరీశుని (శివుని) చూచెను. 4

శ్లో॥ ఆలింగ్యాంకీకృతాం దేవీం బాహునా ముని సంసది ।
ఉవాచ దేవ్యాం శృణ్వత్యా జహాసోచ్చైస్తదంతికే ॥ 5

తా:- మునుల సమక్షమున పార్వతీదేవిని తన బాహువులతో ఆలిఙ్గనము చేసుకొని, తొడయందు కూర్చోబెట్టుకొనియున్న వానిని (శంకరుని)చూచి ఆమె వినుచుండగా బిగ్గరగా నవ్వి, ఇంకా ఇట్లు పలికెను. 5

టీ:- అంకీకృతాం ఉత్సంగేనైకీకృత్య దేవీం బాహునాలింగ్య స్థిత ఉవాచ జహాస చ. తస్యాంతికే స్థితస్సన్. (5)

టీ:- ఉత్సఙ్గమున ఏకీభవింపజేయుచు తొడపై కూర్చోబెట్టుకున్న , బాహువులచే ఆలిఙ్గనముచేసుకొనియున్న శివుని చూచి పరిహసించుచు ఆమె సమీపమున ఇట్లు పలికెను. 5

చిత్రకేతురువాచ.

శ్లో॥ ఏష లోక గురుస్సాక్షాద్ధర్మం వక్తా శరీరిణామ్ ।
ఆస్తే ముఖ్యస్సభాయాం వై మిథునీభూయ భార్యయా ॥ 6

చిత్రకేతువు పలికెను.

తా:- ఈయన సాక్షాత్తుగా లోకములకు గురువు (తండ్రి) ఈయన మానవులకు ధర్మమును బోధించును. ప్రముఖుడైననూ ఈ సభయందు భార్యతో కలిసి ఉన్నాడు. 6

టీ:- ధర్మం వక్తా ధర్మం వదతి. శరీరిణాం మధ్యే ముఖ్యశ్చ భార్యయా మిథునీభూయాస్తే. (6)

టీ:- (ఈయన) ధర్మమునుచెప్పును. శరీరుల మధ్య ముఖ్యుడయ్యు భార్యతో కలిసిపోయి ఉన్నాడు. 6

శ్లో॥ జటాధరస్తీవ్రతపా బ్రహ్మవాది సభాపతిః ।
అంకీకృత్య స్త్రియం చాస్తే గతహ్రీః ప్రాకృతో యథా ॥ 7

తా:- జడలను ధరించువాడు, కఠినమైన తపస్సు కలవాడు. బ్రహ్మవాదుల సభలో అధ్యక్షుడు (అయినను) ప్రాకృతునివలె (సామాన్య మానవునివలె) సిగ్గును వదిలి స్త్రీని కౌగలించుకొనియున్నాడు. 7

శ్లో॥ ప్రాయశః ప్రాకృతాశ్చాపి స్త్రియం రహసి బిభ్రతి ।
అయం మహావ్రతధరో బిభర్తి సదసి స్త్రియమ్ ॥ 8

తా:- ప్రాకృతులుకూడా, (బహుశా) స్త్రీని ఏకాంతమందు అఙ్కమందు కూర్చుండబెట్టుకుందురు. మహావ్రతధరుడు అయిన ఈతడు సభయందు స్త్రీని అఙ్కమందు కూర్చుండబెట్టుకొన్నాడు. 8

శ్రీ శుక ఉవాచ.

శ్లో॥ భగవానపి తచ్ఛ్రుత్వా ప్రహస్యాగాధధీర్నృప ।
తూష్ణీం బభూవ సదసి సభ్యాశ్చ తదనువ్రతాః ॥ 9

శ్రీ శుకులు పలికిరి.

తా:- ఓ రాజా! గంభీరమైన సంకల్పముగల భగవానుడు (శివుడు) కూడా ఆ మాటను విని నవ్వి ఊరకుండెను (మిన్నకుండెను). సభయందలి సభ్యులు కూడా ఆయనను అనుసరించి యుండిరి. 9

టీ:- భగవానితి. అగాధా గంభీరా ధీర్యస్య సః. 9

టీ:- గంభీరమైన బుద్ధిగలవాడు ఎవడో వాడు అగాధధీ. 9

శ్లో॥ ఇత్యతద్వీర్య విదుషి బ్రువాణే బహ్వశోభనమ్ ।
రుషాఽఽహ దేవీ ధృష్టాయ నిర్జితాత్మాభిమానినే ॥ 10

తా:- ఆ శివుని శక్తిని ఎరుగని చిత్రకేతువు ఈ విధముగా అశోభనముగా పలుకుచుండగా మనస్సును జయించినాననే అభిమానముగల, గర్వముతోనున్న వానితో (చిత్రకేతువుతో) పార్వతీదేవీ కోపముతో (రోషముతో) పలికెను. 10

టీ:- ఇతీతి. న తస్య వీర్యం ప్రభావం విద్వాన్ అతద్వీర్యవిద్వాన్. తస్మిన్. నిర్జితాత్మాభిమానినే జితేంద్రియోఽహమిత్యభిమానవతే. ఇతి రుషా క్రోధేనాహ. 10

టీ:- అతనియొక్క (పరమశివునియొక్క) శక్తిని, ప్రభావమును తెలియనివాడు. జితేన్ద్రియుడనను అభిమానముగల వానితో కోపముతో నిట్లు పలికెను. 10

పార్వత్యువాచ

శ్లో॥ అయం కిమధునా లోకే శాస్తా దండధరః ప్రభుః ।
అస్మద్విధానాం దుష్టానాం నిర్లజ్జానాం చ విప్రకృత్ ॥ 11

పార్వతీదేవి పలికెను.

తా:- ఇపుడు, ఈ లోకమందు సిగ్గులేని దుష్టులమగు మన వంటి వారలకు శిక్షనిచ్చి అపకారముచేయు ప్రభువు ఇతడేనా ఏమి? 11

టీ:- అయమితి. విరుద్ధం ప్రకర్షేణ కరోతీతి విప్రకృత్. 11

టీ:- విరుద్ధముగా(ఎక్కువగా అపకరించువాడు కావున విప్రకృతుడు) చేయువాడు. 11

శ్లో॥ న వేద ధర్మం కిల పద్మయోనిర్న
బ్రహ్మపుత్రా భృగు నారదాద్యాః ।
న వై కుమారః కపిలో మనుశ్చ
యేనో నిషేధాత్యతివర్తినం హరమ్ ॥ 12

తా:- పద్మమునుండి పుట్టిన బ్రహ్మదేవుడు, ధర్మమును ఎరుగడు కదా! బ్రహ్మ పుత్రులైన భృగు, నారదులు కూడా ఎరుగరు. సనత్కుమారుడు, కపిలుడు, మనువులు కూడా నిశ్చయముగా ఎరుగరు. ఎవరైతే మితిమీరి ప్రవర్తించుచున్నాడని శివుని నిషేధించుట లేదో...12

టీ:- నేతి. అతివర్తినం శాస్త్రమతిక్రమ్య వర్తనశీలం. యే బ్రహ్మాద్యాః నో నిషేధంతి న నివారయంతి. 12

టీ:- శాస్త్రమును అతిక్రమించి ప్రవర్తించు వానిని (ఎవరు శివుని) బ్రహ్మ, నారదాదులు ఎందుకో నివారించుట లేదు. 12

శ్లో॥ ఏషామనుధ్యేయ పదాబ్జయుగ్మం
జగద్గురుం మంగల మంగలం స్వయమ్ ।
యః క్షత్రబంధుః పరిభూయ సూరీన్
ప్రశాస్తి ధృష్టస్తదయం హి దండ్యః ॥ 13

తా:- వీరందరిచే నిరంతరము ధ్యానించదగు పాదపద్మములుగల జగద్గురువును స్వయముగా మఙ్గళములకు మఙ్గళమైన వానిని (శివుని) ఏ క్షత్రీయాధముడు గర్వముచే మహర్షులను సైతం తిరస్కరించి శాసించుచున్నాడో అట్టి ఈతడు శిక్షార్హుడు కాదా! 13

టీ:- ఏషామితి. ఏషాం బ్రహ్మాదీనాం అనుధేయం పదాబ్జయుగ్మం యస్య తం. మంగల మంగలం. పరమ మంగలమూర్తిం. సూరీన్ పరిభూయ అజ్ఞాన్. కృత్వా జగద్గురుం సర్వేశ్వరం సదాశివం యః ప్రశాస్తి తత్తస్మాత్. 13

టీ:- బ్రహ్మాదులైన వీరందరిచేతను పూజింపదగు పాదపద్మములు ఎవనికి గలవో వానిని, పరమ ధర్మమూర్తిని, (శివుని) పండితులైన వారిని తిరస్కరించి అవమానించుచున్నాడో, ఎవడు జగద్గురువును శాసించుచున్నాడో అట్టివాడు దణ్డనీయుడు. 13

అవ॥ నను హరిభక్తో౽యం న దణ్డార్హ ఇతి చేత్త త్రాహ-నాయమితి

అవ:- నాయమిత్యాది శ్లోకమున వీడు హరిభక్తుడు కావున దణ్డనీయుడు కాదు అన్నచో చెప్పుచున్నాడు.

శ్లో॥ నాయమర్హతి వైకుంఠపాదమూలోపసర్పణమ్ ।
సంభావితమతిస్త ్సబ్ధస్సాధుభిః పర్యుపాసితమ్ ॥ 14

తా:- తాను ఉత్తముడనను గర్వముగల వీడు, సాధువులచే సేవింపబడు శ్రీహరి పాదపద్మముల పొందుటకు అర్హుడు కాదు. 14

టీ:- నాయం. సాధుభిః పరిసేవితం. వైకుంఠస్య పాదమూలోపసర్పణమర్హతి. యతః సంభావితా అహమధిక ఇతి కృతా మతిర్యేన. అత ఏవ స్తబ్ధః అనమ్రః. 14

టీ:- వీడు సాధువులచే పరిసేవింపచబడు వైకుంఠుని యొక్క పాదముమూలము చేరుటకు అర్హుడు కాదు. ఎందుచేతననగా నేను అధికుడను అను గర్వముగల మతిని పొందిన వాడు. స్తబ్ధుడు, నమ్రత లేనివాడు. 14

అవ॥ తదేవం స్వయం దణ్డ్యత్వం నిశిత్య తంప్రాహ - అత ఇతి.

అవ:- ఈ విధముగా స్వయముగా దణ్డ్యత్వమును నిశ్చయించి వానితో పలుకుచున్నది-అత ఇత్యాది శ్లోకమున..

శ్లో॥ అతః పాపీయసీం యోనిమాసురీం యాహి దుర్మతే ।
యథేహ భూయో మహతాం న కర్తా పుత్ర కిల్బిషమ్ ॥ 15

తా:- ఓ దుర్బుద్ధీ! అందువలన పాప భూయిష్ఠమైన రాక్షస యోనిని పొందుము. ఓ కుమారా! ఈ విధముగా తిరిగి నీవీ లోకములో మహాత్ముల యెడల అపరాధము చేయకుండెదవు. 15

టీ:- హే పుత్ర. యథా భూయో మహతాం కిల్బిషమపరాధం న కర్తా న కరిష్యసి. తథా యాహీత్యర్థః. (15-16)

టీ:- ఓ పుత్రా! ఏ విధముగా మరల మహాత్ముల యెడల అపరాధము చేయవో ఆ విధముగా వెళ్ళుము అని అర్థము.(కోపముతో పుత్రా అని సంబోధించుట పార్వతి యొక్క జగన్మాతృత్వమునుచెప్పుచున్నది) (15,16)

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఏవం శప్తశ్చిత్రకేతుర్విమానాదవరుహ్య సః ।
ప్రసాదయామాస సతీం మూర్ధ్నా నమ్రేణ భారత ॥ 16

శ్రీ శుకులు పలికిరి.

తా:- ఈ విధముగా శపింపబడిన చిత్రకేతువు విమానము నుండి కిందకి దిగి వినమ్రమైన శిరస్సుతో పార్వతీదేవిని ప్రసన్నురాలిని చేసుకొనెను. 16

చిత్రకేతురువాచ

శ్లో॥ ప్రతి గృహ్ణామి శాపం తే హ్యాత్మనోఽఞ్జలినాంబికే ।
దేవైర్మర్త్యాయ యత్ప్రోక్తం పూర్వదిష్టం హితస్య తత్ ॥ 17

చిత్రకేతువు పలికెను.

తా:- ఓ అంబికా! నీవిచ్చిన శాపమును నేను దోసిలి యొగ్గి (వినయముతో) స్వీకరించుచున్నాను. మానవుల కొఱకు దేవతలచే ఏది చెప్పబడుచున్నదో అది వారి పూర్వకర్మచే లభించునదియే. 17

టీ:- ప్రతిగృహ్ణామీతి. పూర్వదిష్టం ప్రాచీనకర్మ ప్రాప్తమేవ. 17-19

టీ:- పూర్వ కర్మలచే లభించునదియే. (17-19)

అవ॥ అయం చ సంసార చక్రస్వభావ ఏవ న చిత్రమిత్యాహ - సంసారచక్రా ఇతి.

అవ: సంసారచక్రమిత్యాది శ్లోకమున, ఇదియే సంసార చక్ర స్వభావము మరియు ఇది చిత్రము కాదు. అని చెప్పుచున్నాడు.

శ్లో॥ సంసారచక్ర ఏతస్మిన్ జంతురజ్ఞానమోహితః ।
భ్రామ్యన్సుఖం చ దుఃఖం చ భుంక్తే సర్వత్ర సర్వదా ॥ 18

తా:- ఈ సంసారచక్రమందు అజ్ఞాన మోహముచే మానవుడు తిరుగుచున్నవాడై ఎల్లప్పుడును అన్ని ప్రదేశములందును సుఖమును, దుఃఖమును కూడా అనుభవించుచున్నాడు. 18

అవ॥ అత ఏవాత్ర మమ చ తవ చ న కోఽపి దోష ఇత్యాహ - నైవేతి.

అవ: నైవ ఇత్యాది శ్లోకమున అందుచేత ఇక్కడ నా యొక్క కాని, నీ యొక్క కాని దోషము లేదు. ఎవరి యొక్క దోషమును లేదు. అని చెప్పుచున్నాడు.

శ్లో॥ నైవాత్మాన పరశ్చాపి కర్తా స్యాత్సుఖ దుఃఖయోః ।
కర్తారం మన్యతే ఽప్రాజ్ఞ ఆత్మానం పరమేవ చ ॥ 19

తా:- సుఖ దుఃఖములకు తాను కాని, మరియొకడుగాని కర్త కాదు. అజ్ఞాని తనను, ఇతరులను కూడా కర్తగా తలపోయును. 19

అవ॥ ఏవం తావత్సుఖ దుఃఖాదికమంగీకృత్యోక్తం. ఇదానీం. తదపి వస్తుతో నాస్తీత్యాహ - గుణ ఇతి.

అవ:- గుణ ఇత్యాది శ్లోకమున ఈ విధముగా అప్పటివరకు సుఖ దుఃఖాదులను అంగీకరించియు, వానిని చెప్పియు ఇపుడు వస్తుతః అవి లేవు అని చెప్పుచున్నాడు.

శ్లో॥ గుణ ప్రవాహ ఏతస్మిన్ కశ్శాపః కోన్వనుగ్రహః ।
కస్స్వర్గో నరకః కోవా కిం సుఖం దుఃఖమేవ వా ॥ 20

తా:- ఈ గుణప్రవాహమందు శాపమనగానేమి? అనుగ్రహమనగా నేమి? స్వర్గమేది? నరకమేది? సుఖమేది? దుఃఖమేది? 20

టీ:- గుణానాం మాయామయానాం. ప్రవాహే సంసారే. 20

టీ:- గుణముల యొక్క అనగా మాయామయమైన ఈ సంసార ప్రవాహమందు సుఖ దుఃఖములు, స్వర్గనరకాదులు మిథ్యయని భావము. 20

అవ॥ నను మాయాగుణానాం చేదయం ప్రవాహస్తర్హి తేషాం జడత్వా-ద్బంధమోక్షాద్యనుభవో న స్యాత్తత్రాహ - ఏక ఇతి.

అవ॥ ఏకః ఇత్యాది శ్లోకమున ఈ సంసారమంతయు మాయాగుణమయ ప్రవాహమైనచో వారికి జడత్వముచేత బన్ధమోక్షాది అనుభవ-ములు ఉండవుగదా! అని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఏకస్సృజతి భూతాని భగవానాత్మమాయయా ।
ఏషాం బంధం చ మోక్షం చ సుఖం దుఃఖం చ నిష్కలః ॥ 21

తా:- అద్వితీయుడు, నిష్కలుడు (శుద్ధుడు) అగు భగవంతుడు తన మాయచేత ప్రాణులను, వీటి యొక్క బన్ధమును, మోక్షమును, సుఖమును, దుఃఖమును కూడా సృష్టించుచున్నాడు. 21

టీ॥ ఏకః పరమేశ్వరః. మాయయా నిమిత్తభూతయా భూతాని ప్రాణినః సృజతి. ఏషాం బంధాదికం చ సృజతి. నిష్కలః స్వయం బంధాదిశూన్యః. 21

టీ:- ఒక్కడైన ఆ పరమేశ్వరుడు నిమిత్త మాత్రముగ ప్రాణులను సృష్టించును. వీనియందు బన్ధము మున్నగు వానిని కూడా సృష్టించును. స్వయముగా ఆయన నిష్కలుడు అనగా బన్ధాది శూన్యుడు. 21

అవ॥ నన్వేవం భూతా విషమసృష్టౌ తస్య కిం కారణం? ప్రియాది వైషమ్యాభావాదిత్యాశంక్య యద్యపి ప్రియాదయో న సంతి తథాపి తత్తత్కర్మవశాత్సర్వం ఘటత ఇత్యాహ - న తస్యేతి ద్వాభ్యామ్.

అవ:- న తస్య ఇత్యాది శ్లోక ద్వయమున ఈ విధముగా భూతములను సృష్టించుటకు కారణమేమి? ప్రియాది వైషమ్యములులేని వారికి ప్రియాదులు ఉండరు, అయినను ఆయా కర్మలచేత అంతయూ కుదురును అని చెప్పుచున్నాడు.

శ్లో॥ న తస్య కశ్చిద్దయితో న ప్రతీపో
న జ్ఞాతిబంధుర్నపరో న చ స్వః ।
సమస్య సర్వత్ర నిరంజనస్య
సుఖేన రాగః కుత ఏవ రోషః ॥ 22

టీ:- ప్రతీపః అప్రియః. న జ్ఞాతిర్బంధుశ్చేత్యర్థః. తత్ర హేతుః - సర్వత్ర సమస్య తత్కృతః. నిరంజనస్య నిస్సంగస్య. అత ఏవ తన్నిమిత్తే సుఖే రాగో నాస్తి రాగానుబంధాభావే రోషః కుతస్స్యాత్. 22

తా:- అంతటా సముడయినట్టి, నిరంజనునకు (రాగ ద్వేష రహితునికి) ఒకానొకడు ప్రియుడు కాదు, శత్రువు కాదు. జ్ఞాతులు, బన్ధువులు కాదు, తనవాడు, పరాయివాడు లేడు. సుఖమునందు ఆసక్తియు లేదు. ఇట్టి వానికి కోపమెక్కడిది. 22

టీ:- ప్రతీపుడనగా అప్రియుడు. జ్ఞాతులుగాని, బన్ధువులుగాని లేరు. అందులకు హేతువు-సర్వత్రసముడై ఉండువాడు. అది ఎట్లు? నిరంజనము చేత నిస్సంగత్వము చేత అందుచేత ఆ నిమిత్తముగా సుఖముయందు రాగము (ఆసక్తి) లేదు. రాగానుబన్ధములు లేని వాడికి కోపమెక్కడిది. 22

శ్లో॥ తథాపి తచ్ఛక్తి విసర్గ ఏషాం
సుఖాయ దుఃఖాయ హితాహితాయ ।
బంధాయ మోక్షాయ చ మృత్యుజన్మనో
శ్శరీరిణాం సంసృతయేఽవకల్పతే ॥ 23

టీ:- యద్యప్యేవం. తథాపి - తస్య శక్త్యా మాయయా యో విసర్గః పుణ్యపాపాది లక్షణం కర్మ ఏషాం శరీరిణాం సుఖాద్యర్థ మవకల్పతే సమర్థోభవతి యథోక్తం. గీతాసు. శ్లో. "భూత భావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞిత" ఇతి. 23

తా॥ అయినప్పటికి ఆయన మాయాశక్తి యొక్క విడుదల దేహదారులకు సుఖము కొరకు, దుఃఖము కొరకు, హితమునకు, అహితమునకు, బన్ధమునకు, మోక్షమునకు, జననమరణములకు, సంసారము కొఱకును సమర్థమగుచున్నది. 23

టీ:- అది అట్లైనప్పటికి అతని మాయాశక్తి యొక్క ఏ విసర్గము కలదో అది పుణ్య పాపాది లక్షణములు గల కర్మ. ఈ శరీరధారులకు సుఖ దుఃఖముల కల్పించుటయందు సమర్థమగుచున్నది. దీనిని గీత యందు-"భూతభావో----కర్మసజ్జితః" అని చెప్పబడినది. 23

శ్లో॥ అథః ప్రసాదయే న త్వాం శాపమోక్షాయభామిని ।
యన్మన్యసే హ్యసాధూక్తం మమ తతక్షమ్యతాం సతి ॥ 24

టీ:- అత ఇతి. అథః తస్మాత్. భామిని. హే కోపనే త్వాం కేవలం ప్రసాదయామి న తు శాపమోక్షాయ. తర్హి కిం ప్రసాదనేన? అత ఆహ- మమోక్తుముక్తిం సాధ్వపి అసాధువన్మన్యసే. తత్ త్వయా క్షమ్యతామ్. 24

తా:- ఓ భామినీ! (ఓ కోపవతీ!) పతివ్రతా! కావున నిన్ను ప్రసన్న-రాలిని చేసుకొనుచున్నాను. శాపమోక్షమును కోఱుట లేదు. నా మాటలలో చెడు అని తలచిన దానిని క్షమింపుము. 24

టీ:- ఓ కోపము గలదానా! భామినీ! అందుచేత నిన్ను కేవలము ప్రసన్నురాలిని చేసుకొనుచున్నాను. కాని శాపమోక్షము కొఱకు కాదు. అయినచో ప్రసన్నురాలవగుట ఎందుకు అన్నచో చెప్పుచున్నాడు-నా చేత చెప్పబడిన మాటలు ఉత్తమమైనవే అయినను ఉత్తమము కాదని భావించినచో దానిని నీవు క్షమించుదువు గాక ! 24

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఇతి ప్రసాద్య గిరిశౌ చిత్రకేతురరిందమ ।
జగామ స్వవిమానేన పశ్యతోః స్మ యతోస్తయోః ॥ 25

టీ:- గిరిశౌ భవానీ శంకరౌ ప్రసాద్య స్మ యతోః విస్మయం కుర్వతోః సతోః. (25-27)

శ్రీ శుకులు పలికిరి.

తా:- ఓ శత్రువుల నణచినవాడా! చిత్రకేతువు ఈ విధముగా పార్వతీ పరమేశ్వరులను ప్రసన్నులుగా చేసుకొని, ఆశ్చర్యముతో వారు చూచుచుండగా తన విమానములో వెళ్ళిపోయెను. 25

టీ:- పార్వతీపరమేశ్వరులను ప్రసన్నులుగా చేసుకొని (ప్రసన్నుల గావించి) విస్మయము (ఆశ్చర్యము) పొందుచుండగా (వెళ్ళిపోయెను అని భావము). (25-27)

శ్లో॥ తతస్తు భగవాన్ రుద్రో రుద్రాణీమిదమబ్రవీత్ ।
దేవర్షి దైత్యసిద్ధానాం పార్షదానాం చ శ్రుణ్వతామ్ ॥ 26

తా:- తరువాత భగవానుడైన రుద్రుడు, దేవతలు, ఋషులు, దైత్యులు, సిద్ధులు, రుద్రానుచరులు వినుచుండగా పార్వతినుద్దేశించి ఇట్లు పలికెను. 26

శ్రీ రుద్ర ఉవాచ

శ్రీ రుద్రుడు ఈ విధముగా పలికెను.

శ్లో॥ దృష్టవత్యసి సుశ్రోణి హరేరద్భుత కర్మణః ।
మాహాత్మ్యం భృత్య భృత్యానాం నిస్పృహాణాం మహాత్మనామ్॥27

తా:- ఓ సుశ్రోణీ! (సుందరీ!) ఆశ్చర్యమును గొలుపు కర్మలుగల శ్రీహరి యొక్క, కోరికలు లేనట్టి, మహాత్ములైన సేవకుల యొక్క సేవకుల మహిమను ఇప్పుడు చూచితివి . 27

శ్లో॥ నారాయణ పరాస్సర్వే న కుతశ్చన బిభ్యతి ।
స్వర్గాపవర్గ నరకేష్వపి తుల్యార్థ దర్శినః ॥ 28

తా:- నారాయణపరాయణులైన వారందరు దేనికీ భయమును పొందరు. స్వర్గమును, మోక్షమును, నరకములను కూడా సమానముగా చూచెదరు. 28

టీ:- నారాయణేతి. స్వర్గాదావేవ తుల్యార్థః ప్రయోజనమితి ద్రష్టుం శీలం యేషాం తే తథా. 28

టీ:- స్వర్గ నరకాదుల యందు సమాన ప్రయోజనములు చూచునట్టి శీలము ఎవరి యందో వారు తుల్యార్థదర్శనులు. 28

అవ॥ తత్ర తదుక్తమేవ హేతుమాహ దేహినామితి ద్వాభ్యామ్.

అవ:- దేహినామిత్యాది రెండు శ్లోకములలో (సుఖ దుఃఖాది) ద్వంద్వములకు కారణము చెప్పుచున్నాడు.

శ్లో॥ దేహినాం దేహసంయోగాద్ద్వంద్వానీశ్వర లీలయా ।
సుఖం దుఃఖం మృతిర్జన్మశాపోఽనుగ్రహ ఏవ చ ॥ 29

టీ:- దేహినాం సుఖం దుఃఖమిత్యాది ద్వంద్వాని. ఈశ్వరస్య లీలయా మాయయా భవంతి. తేషు చ గుణదోష వికల్పశ్చేత్యన్వయః. 29

శ్లో॥ అవివేక కృతః పుంసోహ్యర్థభేద ఇవాత్మని ।
గుణదోష వికల్పశ్చభిదేవ స్రజివత్కృతః ॥ 30

టీ:- అవివేకేతి. తేషు చ గుణదోష వికల్పాశ్చేత్యన్వయః. ఇష్టానిష్టభేద ఇవ యః స్ఫురతి. సః ఆత్మన్యర్థభేదః సుఖాదిభేదః. పుంసః స్వప్నే యథా అవివేక కృతో భవతి. స్రజివత్సర్పమాలాదిభిదాః యథా తథైవ కృత ఇత్యర్థః. స్రగ్వదితి వక్తవ్యే స్రజివదిత్యార్షమ్. స్వప్నకల్పితేతి పాఠే సుగమం. 30

తా:- దేహధారులకు దేహ సంయోగము వలన, ఈశ్వర లీలచే దేహముతోడి సుఖ దుఃఖములు, జనన మరణములు, శాపానుగ్రహ ములు మొదలగు ద్వంద్వములు కలుగుచున్నవి. 29

టీ:- ప్రాణులకు సుఖ దుఃఖములు మొదలగు ద్వంద్వములు ఈశ్వర లీలచే అనగా మాయచేత కలుగును. వాటి యందు గుణదోషాది వికల్పములు అన్వయించుకొనవలయును. 29

తా:- జీవునకు అవివేక కారణముగా వస్తువులయందు భేదమువలె ఆత్మయందు మంచి చెడులు, (గుణదోషములు) వికల్పములు కలుగు చుండును. మాలయందు సర్ప బుద్ధి అనే భేదమువలె అవివేకముచే ఆత్మయందు అర్థ భేదము కలుగును. 30

టీ:- ఇష్టము, అనిష్టము అను భేదము వలె ఏది స్ఫురించునో అది ఆత్మయందు అర్థభేదము వంటిది. స్వప్నమునందువలె సుఖాది భేదములు అవివేకము చేత కలుగును. పూలదండ యందు సర్పమును చూచినట్లు ఉన్నదాని యందు లేనిది చూచుదురు. స్రగ్వత్ అని చెప్పుటకు బదులు స్రజివత్ అని చెప్పుట ఆర్షము. స్రజివత్ అనగా పాఠమునకు బదులు సర్పవదితి పాఠము సుగమము. దీనికన్నను స్వప్నవత్ అను పాఠము ఉచితము. 30

అవ॥ అతో భాగవతానాం నిస్పృహత్వముచితమేవేత్యాహ - వాసుదేవ ఇతి.

అవ॥ వాసుదేవ ఇత్యాది శ్లోకమున, అందుచేత భాగవతులకు నిస్పృహత్వము ఉచితమని చెప్పబడుచున్నది.

శ్లో॥ వాసుదేవే భగవతి భక్తిముద్వహతాం నృణామ్ ।
జ్ఞానవైరాగ్య వీర్యాణాం నేహ కశ్చిద్వ్యపాశ్రయః ॥ 31

తా:- వాసుదేవ భగవానుని యందు భక్తి, జ్ఞాన, వైరాగ్య బలము కలిగిన మానవులకు ఈ లోకములో ఆశ్రయించదగినది మరేదియును లేదు. 31

టీ:- జ్ఞానవైరాగ్యయోర్వీర్యం బలం యేషాం తేషాం. వ్యపాశ్రయః సృష్టేర్విశిష్టబుద్ధ్యా ఆశ్రయణీయోఽర్థో నాస్తి. 31

టీ:- జ్ఞాన వైరాగ్యముల యొక్క బలము ఎవరికో వారు జ్ఞాన వైరాగ్య వీర్యులు. విశిష్ఠ బుద్ధిచేత ఆశ్రయించ తగిన అర్థము (ప్రయోజనము) ఏమియును లేదు. 31

అవ॥ అస్య చ హరిదాసత్వేన. తత్స్వభావత్వాన్నైతచ్చిత్రమితి వక్తుం హరేర్మాహాత్మ్యమాహ - ద్వాభ్యామ్.

అవ:- నాహమిత్యాది శ్లోక ద్వయమున-ఈతడు హరిదాసుడు అగుటచేతను , దాని స్వభావము వలనను చిత్రమైనది ఏదియును లేదు అనిచెప్పుటకు శ్రీహరి యొక్క మాహాత్మ్యమును చెప్పుచున్నాడు. 32

శ్లో॥ నాహం విరించో న కుమార నారదౌ
న బ్రహ్మపుత్రామునయస్సురేశాః ।
విదామ యస్యేహితమంశకాంశకాన
తత్స్వరూపం పృథగీశమానినః ॥ 32

తా:- నేనుగాని, బ్రహ్మదేవుడుగాని శ్రీహరి లీలలను తెలియకున్నాము. బ్రహ్మ పుత్రులైన సనత్కుమారుడుగాని, నారదుడుగాని మునులుగాని, సురేశ్వరులుగాని, ఎవరి యొక్క (శ్రీహరి యొక్క) అంశాంశజులు అయినవారు భేద బుద్ధిచే తమను తాము ప్రభువులమని తలచు లోకపాలకులుగాని (సురేశులు) శ్రీహరి లీలలను తెలియకున్నారు. 32

టీ:- ఈహితమభిప్రాయం లీలాం వా యదా వయం న విద్మః. తదా తస్య స్వరూపం. అంశకాంశకా అపి సంతః. పృథగీశమానినో న విదురేవ. 32

టీ:- ఆ శ్రీహరి యొక్క లీలలను ఎప్పుడైతే మేము తెలియకున్నామో అపుడు వాని యొక్క స్వరూపాంశములైన వారలు తమను వేఱుగా ప్రభువులుగా భావించువారలు తెలియనే తెలియరు. 32

శ్లో॥ న హ్యస్యాస్తి ప్రియః కశ్చిన్నాప్రియః స్వః పరోఽపి వా ।
ఆత్మత్వాత్సర్వభూతానాం సర్వభూత ప్రియో హరిః ॥ 33

తా:- ఈ ఈశ్వరునకు ఒకానొకడు ప్రియుడుగా లేడు, అప్రియుడును లేడు. తనవాడుగాని, పరుడుగాని లేడు. సర్వ ప్రాణులకు ఆత్మయై ఉండుట వలన శ్రీహరి సకల ప్రాణులకు ప్రియమైన వాడు. 33

టీ:- అత ఏవ హరిరేవ సర్వేషాం భూతానాం ప్రియః. 33

టీ:- అందుచేత హరియే(కూడా) సర్వభూతములకు ప్రియుడు. 33

శ్లో॥ తస్య చాయం మహాభాగశ్చిత్రకేతుః ప్రియోఽనుగః ।
సర్వత్ర సమదృక్ఛాంతో హ్యహం చైవాచ్యుత ప్రియః ॥ 34

తా:- గొప్ప భాగ్యవంతుడగు ఈ చిత్రకేతువు శ్రీహరికి ప్రియమైన అనుచరుడు. అంతట సమదర్శనము కలవాడు, శాంత స్వభావము కలవాడు. నేను కూడా అచ్యుతునకు ప్రియుడనే. 34

టీ:- తస్యేతి. అహం చైవాచ్యుతస్య ప్రియః. తస్మాన్మమాస్మిన్ క్రోధోనాభూదితి భావః. (34-36)

టీ:- నేను కూడా అచ్యుతునకు ప్రియుడనే. అందుచేత నాకు వీని యందు క్రోధము కలుగలేదు అని భావము. (34-36)

శ్లో॥ తస్మాన్న విస్మయః కార్యః పురుషేషు మహాత్మసు ।
మహాపురుష భక్తేషు శాంతేషు సమదర్శిషు ॥ 35

తా:- అందువలన మహాత్ములయందును, మహాపురుష భక్తుల యందును, సమదర్శనము గలవారును, శాంతస్వభావులు ఉందురను విషయమున విస్మయము అవసరంలేదు. 35

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఇతి శ్రుత్వా భగవతశ్శివస్యోమాభిభాషితమ్ ।
బభూవ శాంతధీ రాజన్ దేవీ విగత విస్మయా ॥ 36

శ్రీ శుకులు ఈ విధముగా పలికిరి.

తా:- ఓ మహారాజా! ఈ విధముగా శివభగవానుని యొక్క సంభాషణమును విని ఉమాదేవి విస్మయము తొలగినదియై, ప్రసన్నమైన మనస్సును పొందెను. 36

శ్లో॥ ఇతి భాగవతో దేవ్యాః ప్రతిశప్తుమలంతమః ।
మూర్ధ్నా సంజగృహే శాపమేతావత్సాధు లక్షణమ్ ॥ 37

తా:- ఈ విధముగా భగవద్భక్తుడగు చిత్రకేతువు పార్వతీదేవిని తిరిగి శపించగల సమర్థుడే అయినను, తలవంచి శాపమును స్వీకరించెను. సత్పురుషుల లక్షణము ఈ విధముగనే ఉండును. 37

టీ:- ఇతీతి. ప్రతిశాపందాతుం. అలం తమః సమర్థతమోఽపి. (37-38)

టీ:- ప్రతిశాపమునిచ్చుటకు తగిన సమర్థత కలిగియున్నను కూడ. (37-38)

శ్లో॥ జజ్ఞే త్వష్టుర్దక్షిణాగ్నౌ దానవీం యోని మాశ్రితః ।
వృత్ర ఇత్యభివిఖ్యాతో జ్ఞాన విజ్ఞాన సంయుతః ॥ 38

తా:- రాక్షస జన్మను ఆశ్రయించినవాడై, త్వష్టకు దక్షిణాగ్నియందు జన్మించెను. జ్ఞాన విజ్ఞానములతో, ప్రత్యక్ష, పరోక్ష ఆత్మజ్ఞానములతో వృత్రుడనుపేర అంతటా ప్రసిద్ధి గాంచెను. 38

శ్లో॥ ఏతత్తే సర్వమాఖ్యాతం యన్మాం త్వం పరిపృచ్ఛసి ।
వృత్రస్యాసురజాతేశ్చ కారణం భగవన్మతేః ॥ 39

తా:- వృత్రుడు రాక్షసుడుగా జన్మించినను. భగవంతుని యందు భక్తి యుండుటకు కారణమేమి? అని నీవు ప్రశ్నించగా ఈ ఆఖ్యానము నంతయు నేను నీకు చెప్పితిని. 39

టీ:- ఏతదితి. అసురజాతేః అసురస్వభావేనోత్పత్తేః భగవతి మతేశ్చ. (39-40)

టీ:- అసురజాతి యందు జన్మించినను భగవంతుని యందు భక్తి కలుగుట వలన అసురభావములు జనించలేదు. (39-40)

శ్లో॥ ఇతిహాసమిమం పుణ్యం చిత్రకేతుర్మహాత్మనః ।
మాహాత్మ్యం విష్ణుభక్తానాం శ్రుత్వా బంధాద్విముచ్యతే ॥ 40

తా:- మహాత్ముడగు చిత్రకేతువు యొక్క ఈ పవిత్రమైన (పుణ్యప్రదమైన) వృత్తాంతమును విష్ణు భక్తుల మహిమలు విన్నచో సంసార బన్ధము నుండి విముక్తుడగును. 40

శ్లో॥ య ఇమం ప్రాతరుత్థాయ శ్రద్ధావాన్ వాగ్యతః పఠేత్ ।
ఇతిహాసం హరిం స్మృత్వా స యాతి పరమాం గతిమ్ ॥ 41

తా:- ఎవడు ఉదయమున లేచి మౌనముతో శ్రీహరిని స్మరించి ఈ వృత్తాంతమును శ్రద్ధతో పఠించునో వాడు సర్వోత్కృష్టమగు గతిని (మోక్షమును పొందును). 41

టీ॥ ఏతదేతమ్. (41)

టీ॥ ఏతత్. ఇది అను పదము ఏతమ్ దీనిని అను అర్థమున ప్రయోగించబడినది. (41)

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే
సప్తదశోఽధ్యాయః

శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆఱవ స్కంధమున
పదిహేడవ అధ్యాయము సమాప్తము.

అష్టాదశోఽధ్యాయః

అవ॥ ఆదిత్యానాం చతుర్థస్య త్వష్టుర్వంశ ప్రసజ్గతః ।
ప్రోక్తమిన్ద్రకృతం విశ్వరూప వృత్రవధాదికమ్ ॥ 1

అదితేః పంచమాదీనాం పుత్రాణామన్వ యోక్తిభిః ।
అష్టాదశే దితేర్గర్భే శక్రేణ మరుతాం భిదా ॥ 2

త్వష్టుర్వంశ మనుక్రమ్య సప్రసంగం యథా క్రమం ।
ఆదిత్యానా మథాన్యేషాం వంశానాహ మునీశ్వరః ॥ 3

దక్ష్యకన్యాన్వయాను కథనే ఆదిత్యా ద్వాదశ పుత్రాః ।
ప్రోక్తాః వివస్వానర్యమాపుషా త్వష్టాఽథ సవితా భగః॥ 4

ధాతా విధాతా వరుణో మిత్రః శక్ర ఉరుక్రమః ఇతి॥
తత్ర షష్ఠాధ్యాయాన్తమారభ్య విశ్వరూప
వృత్ర చిత్రకేతూపాఖ్యానైస్త్వష్టుర్వంశ
మనువర్ణ్యేదానీం, సవితుర్వంశమాహ -పృశ్నిస్త్వితి ॥

18వ అధ్యాయము

అవ:- ఈ పద్దెనిమిదవ అధ్యాయమున ఆదిత్యులలో నాల్గవవాడైన త్వష్ట యొక్క వంశ ప్రసజ్గమున ఇన్ద్రునిచే విశ్వరూప, వృత్రాసుర వధ మొదలగునవి (చెప్పబడిన తరువాత) అదితి యొక్క ఐదవవాడు మొదలుగాగల వారి వృత్తాంతమును వారి పుత్రుల యొక్క వంశముల గూర్చియు ఇంద్రునిచేత దితి గర్భమందలి మరుత్తులను వేరుచేయుటయు చెప్పబడినది. త్వష్ట వంశమును యథా క్రమమున ఆదిత్యుల గూర్చియు మరియు ఇతరుల గూర్చియు, వంశముల గూర్చియు మునీశ్వరుడు చెప్పెను. (1-3)

దక్షకన్యల యొక్క కథన అన్వయమందు ఆరవ అధ్యాయాంతము నుండి విశ్వరూప, చిత్రకేతు, వృత్రాసుర ఉపాఖ్యానములచేత త్వష్ట యొక్క వంశమును చెప్పి ఇపుడు పృశ్నిరిత్యాది శ్లోకమున సవిత్రుని యొక్క (సవిత యొక్క) వంశమును “వివస్వుడు, అర్యముడు, పూషుడు, త్వష్ట మరియు సవితృడు, భగుడు, ధాత, విధాత, వరుణుడు, మిత్రుడు మరియు పరాక్రమవంతుడైన శక్రుడు అను పన్నెండుగురు ఆదిత్యులగూర్చి చెప్పబడినది.

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ పృశ్నిస్తు పత్నీ సవితుస్సావిత్రీం వ్యాహృతి త్రయమ్ ।
అగ్నిహోత్రం పశుం సోమం చాతుర్మాస్యం మహామఖాన్ ॥ 1

శ్రీ శుకులు ఈ విధముగా పలికిరి.

తా:- సవితయొక్క భార్యయగు పృశ్నికి సావిత్రి, వ్యాహృతిత్రయం (భూః, భువః, సువః) అగ్నిహోత్రుడు, పశుయాగము, సోముడు, చాతుర్మాస్యుడు, పంచ మహాయజ్ఞములును (దేవ, ఋషి, పితృ, బ్రహ్మ, మనుష్య, అతిథి) సంతానముగా కలిగిరి. 1

శ్లో॥ సిద్ధిర్భగస్య భార్యాంగ మహిమానాం విభుం ప్రభుమ్ ।
ఆశిషం చ వరారోహాం కన్యాం ప్రాసూత సువ్రతామ్ ॥ 2

తా:- భగుడు భార్యయైన సిద్ధి యందు విభుడు, ప్రభుడు అయిన మహిముని, గొప్ప వ్రతనిష్ఠ గల ఆశీస్సు అనే కన్యను కూడా కనెను. 2

టీ:- సావిత్రీమిత్యాదిషు ప్రాసూతేత్యుత్త రస్యానుషంగః. పశుం పశు యాగం మహామఖాన్ పంచయజ్ఞాన్. (1-2)

టీ:- ఆది యందు సావిత్రిని తదుపరి వరుసగా ఉత్తరోత్తరముగా ప్రసవించెను. పశుం అనగా పశుయాగమును, మహామఖములను అనగా పంచయజ్ఞములను. (1-2)

శ్లో॥ ధాతుః కుహూస్సినీవాలీ రాకా చానుమతి స్తథా ।
సాయం దర్శమథ ప్రాతః పూర్ణమాసమనుక్రమాత్ ॥ 3

తా:- ధాతకు కుహూ (అమావాస్య), సినీవాలీ (దృష్ట చంద్ర అమావాస్య), రాకా (పూర్ణిమ), అనుమతి (చతుర్దశితో కూడిన పూర్ణిమ) అనువారు నలుగురు భార్యలు. వారికి వరుసగా సాయంకాలము, దర్శ (అమావాస్య), ప్రాతఃకాలము, పూర్ణమాసుడు అను పుత్రులు కలిగిరి. 3

టీ:- ధాతురితి. ధాతుర్భార్యా కుహూః. సాయం పుత్రం ప్రాసూత ఏవం సినీవాలీ దర్శమిత్యనుక్రమాత్. 3

టీ:- ధాత యొక్క భార్య కుహూ సాయమను పుత్రుని కనెను. ఈ విధముగా సినీవాలీ దర్శుని, (అమావాస్య) రాకా ప్రాతఃకాలమును, అనుమతి పూర్ణమాసుని కనిరి. 3

శ్లో॥ అగ్నీన్ పురీష్యానాధత్త క్రియాయాం సమనంతరః ।
చర్షణీ వరుణస్యాసీద్యస్యాం జాతో భృగుః పునః ॥ 4

తా:- తరువాతవాడగు విధాత క్రియయందు పురీష్యులైన అగ్నులను కనెను. వరుణునకు చర్షణి అను భార్యయందు భృగువు మరల జన్మించెను. 4

టీ:- అగ్నీనితి. సమనంతరో విధాతా క్రియాయాం భార్యాయాం పురీష్యానగ్నీన్పంచచితాన్. శ్రు.'పరీష్యాసో అగ్నయ' ఇతి. శ్రు."పంచవా ఏతేఽగ్నయో యచ్చిత్తయః ఉధదిరేవ నామ ప్రథమో దుర్ధ్రో ద్వితీయో గహ్యస్తృతీయః కింగంశిల్పశ్చతుర్థోవన్యః పంచమస్తేభ్యో యదాహుతీర్న జుహుయా" దితి చ శ్రుతేః. చర్షణీ వరుణస్య భార్యా ఆసీత్. పూర్వం బ్రహ్మణః పుత్రో భృగుర్యస్యాం పునర్జాతః. 4

టీ:- తరువాతవాడగు విధాతకు క్రియా అనెడి భార్య యందు పురీషులను పంచాగ్నులు (ఐదు అగ్నులు) కలిగిరి. ఈ అగ్నులు ఐదనియు ఉదధి మొదటివాడు, దుర్ధ్రుడు రెండవవాడు, గుహ్యుడు మూడవవాడు, కింశిల్పము నాల్గవవాడు, వన్యుడు ఐదవవాడు అని ఐదు ఆహుతులకు పేర్లు. లేదా ఈ అగ్నులు అగ్ని యొక్క చిత్తములుగా శ్రుతి చెప్పుచున్నది. వరుణునికి చర్షణి అను భార్య కలదు. పూర్వ - కాలములో బ్రహ్మపుత్రుడైన భృగువు ఈమెకు మరల జన్మించెను. 4

శ్లో॥ వాల్మీకిశ్చ మహాయోగీ వల్మీకాదభవత్కిల ।
అగస్త్యశ్చ వసిష్ఠశ్చ మిత్రావరుణయోర్ఋషీ ॥ 5

తా:- యోగిపుఙ్గవుడైన వాల్మీకి కూడా వరుణుని పుత్రుడే. పుట్ట నుండి పుట్టి వాల్మీకి అయ్యెనుగదా! అగస్త్యుడు, వసిష్ఠుడు కూడా మిత్రా వరుణుల పుత్రులే. 5

టీ:- వాల్మీకిః. వల్మీకాత్ వరుణస్యైవ పుత్రోఽభవత్. ఏతౌ వరుణస్యాసాధారణౌ పుత్రౌ. తథా ఉత్సర్గాదయః మిత్రాస్యాసాధారణాః తయో రేవ సాధారణౌ ద్వౌ పుత్రౌ చాహ్ - అగస్త్య ఇతి. అగస్త్యశ్చ వసిష్ఠశ్చ మిత్రావరుణ యోరభవతాం. 5

టీ:- వాల్మీకి కూడా వరుణుని యొక్క పుత్రుడే. వీరు వరుణుని యొక్క అసాధారణ పుత్రులు. అట్లే ఉత్సర్గాదులు కూడా మిత్రుని యొక్క అసాధారణ పుత్రులు. వారికి సాధారణములైన ఇద్దరు పుత్రులు కలిగిరి. మిత్రావరుణులకు అగస్త్యుడు, వసిష్ఠుడు పుత్రులుగా కలిగిరి. 5

శ్లో॥ రేతస్సిషిచతుః కుంభే హ్యూర్వశ్యాస్సన్నిధౌ ద్రుతమ్ ।
రేవత్యాం మిత్ర ఉత్సర్గమరిష్టం పిప్పలంవ్యధాత్ ॥ 6

తా:- ఊర్వశి యొక్క సన్నిధి యందు స్ఖలితమైన రేతస్సును కుమ్భము (కుండ) నందు విడువగా మిత్రా, వరుణులకు అగస్త్యుడు, వసిష్ఠుడు కలిగిరి. మిత్రునికి రేవతి యందు ఉత్సర్గుడు, అరిష్టుడు, పిప్పలుడు అను పుత్రులు కలిగిరి. 6

టీ:- ఉభావపి కుంభే రేతః సిషిచతుః శ్రు. "సత్రే హజాతా విషితానయోభిః కుంభే రేతస్సిషిచతుస్సమాన" మితి. శ్రుతేః. ద్రుతం స్కన్నం. (6-8)

టీ:- ఆ విధముగా ఇద్దరు కూడా కుండ యందు జన్మించిరి. మిత్రా వరుణలు ఇద్దరును స్ఖలితమైన తమ రేతస్సులను కుండ యందు సమానముగా విడిచిరి అని శ్రుతి ప్రమాణము. (6-8)

శ్లో॥ పౌలోమ్యామింద్ర ఆధత్త త్రీన్పుత్రానితి న శ్రుతమ్ ।
జయంతమృషభం తాత తృతీయం విడుషం విభుః ॥ 7

తా:- ఓ తండ్రీ! ప్రభువగు ఇన్ద్రుడు పులోముని పుత్రికయగు శచీదేవి యందు (పౌలోమి) జయన్తుని, వృషభుని, మూడవవాడగు మీఢుని ముగ్గురు పుత్రులను కనెనని మేము వినియుంటిమి. 7

శ్లో॥ ఉరుక్ర మస్య దేవస్య మాయావామనరూపిణః ।
కీర్త్యోపత్న్యాం బృహచ్ఛ్లోకస్తస్యాసన్ సౌభగాదయః ॥ 8

తా:- ఉరుక్రముడు, భగవానుడు, కపట మాయా వామనునికి, దేవునికి భార్యయైన కీర్తి యందు బృహచ్ఛ్లోకుడు, వానికి సౌభగుడు మొదలగు వారు కలిగిరి. 8

శ్లో॥ తత్కర్మగుణవీర్యాణి కాశ్యపస్య మహాత్మనః ।
పశ్చాద్వక్ష్యామహేఽదిత్యాం యథైవావతతార హ ॥ 9

తా:- మహాత్ముడైన కశ్యప పుత్రుడగు వామనుని గూర్చి, అదితి యందు అతను అవతరించిన విధము, అతని ప్రసిద్ధమగు కర్మలను, గుణములను, పరాక్రమమును తరువాత చెప్పగలను. 9

టీ:- పశ్చాదష్టమస్కంధే. 9

టీ:- తరువాత అనగా అష్టమ స్కంధమందు (వివరించబడును). 9

శ్లో॥ అథ కశ్యపదా యాదాన్ దైతేయాన్ కీర్తయామి తే ।
యత్ర భాగవతశ్శ్రీమాన్ ప్రహ్లాదో బలిరేవ చ ॥ 10

తా:- తరువాత కశ్యపుని వలన దితికి కలిగిన దైతేయులను గూర్చి నీకు చెప్పెదను. వీరి యందే భగవద్భక్తులగు ప్రహ్లాదుడు, బలి కూడా కలరు. 10

టీ:- అథేతి అథ కశ్యపస్యాదితేః పుత్రాణాం ద్వాదశాదిత్యానామ్ సంతతిముక్త్వాదితేః పుత్రాన్. కీర్తియామి. కథయామీత్యర్థః. 10

టీ:- తరువాత అనగా కశ్యపుని యొక్క, అదితి యొక్క పుత్రులైన ద్వాదశాదిత్యుల యొక్క సంతతిని చెప్పిన తరువాత దితి యొక్క పుత్రులను గూర్చి చెప్పుచున్నాను అని అర్థము. 10

శ్లో॥ దితేర్ద్వావేవ దాయాదౌ దైత్య దానవ వందితౌ ।
హిరణ్యకశిపుర్నామ హిరణ్యాక్షశ్చకీర్తితౌ ॥ 11

తా:- దితికి హిరణ్యకశిపువు, హిరణ్యాక్షుడు అని ప్రసిద్ధి గాంచిన ఇద్దరు పుత్రులు మాత్రమే కలరు. దైత్యుల చేతను, దానవుల చేతను వీరు నమస్కరించబడుదురు. వీరిని గూర్చి వివరించితిని. (11)

టీ:- దితేరితి. హిరణ్యకశిపుర్హిరణ్యాక్షశ్చేతి ప్రథమం ద్వావేవ తౌ చకీర్తితౌ. తృతీయస్కంధే. (11-12)

టీ:- హిరణ్యకశిపువు, హిరణ్యాక్షుడని ముందుగా ఇద్దరు మాత్రమే సంతానము వీరిని గూర్చి తృతీయస్కంధమున చెప్పబడినది. (11-12)

శ్లో॥ హిరణ్యకశిపోర్భార్యా కయాధుర్నామ దానవీ ।
జంభస్య తనయా దత్తా సుషువే చతురస్సుతాన్ ॥ 12

తా:- దనువు వంశమునకు చెందినదియు, జంభుని తనయయైన హిరణ్యకశిపువునకు భార్యగా ఈయబడిన కయాధువు అను నామము కలది, నలుగురు పుత్రులను కనెను. 12

శ్లో॥ సంహ్రాదం ప్రాగనుహ్రాదం హ్రాదం ప్రహ్లాద మేవ చ ।
తత్స్వసా సింహికా నామ రాహుం విప్రచితోఽగ్రహీత్ ॥ 13

తా:- కయాధువు సంహ్రాదుడు, అనుహ్రాదుడు, హ్రాదుడు, ప్రహ్లాదుడు అను నలుగురు పుత్రులను కనెను. ఆమెయొక్క చెల్లెలు విప్రచిత్తుని భార్యయైన సింహికాయనునది రాహువును కనెను. 13

టీ:- ప్రహ్లాదమితి విప్రచితో దానవాద్భర్తుః సకాశాత్. రాహుం పుత్రమగ్రహీత్. 13

టీ:- దానవుడైన విప్రచిత్తుడు రాహువును బడసెను. 13

శ్లో॥ శిరోఽహరద్యస్య హరిశ్చక్రేణ పిబతోఽమృతమ్ ।
సంహ్రాదస్య గతిర్భార్యాసూత పంచజనం తతః ॥ 14

తా:- ఈ రాహువుయొక్క శిరస్సును (అమృతము తాగుచుండగా) శ్రీహరి చక్రముతో భేదించెను. సంహ్రాదుని భార్య కృతి వాని వలన పంచజనుని కనెను. 14

టీ:- తతః సంహ్రాదాదసూత. 14

టీ:- సంహ్రాదుని వలన కనెను. 14

శ్లో॥ హ్రాదస్య దమని ర్భార్యాఽసూత వాతాపిమిల్వలమ్ ।
యోఽగస్త్యాయాత్వతిథయే పేచే వాతాపి మిల్వలః ॥ 15

తా:- హ్రాదునకు ధమనియను భార్యయందు వాతాపి, ఇల్వలు డను సుతులు కలిగిరి. ఆ ఇల్వలుడే అతిధియైన అగస్త్యుని కొఱకు వాతాపిని వండెను. 15

టీ:- యో మేషరూపం వాతాపిం పేచే తమిల్వలం. యం పేచే తం వాతాపిం చాసూతేత్యన్వయః. (15-16)

టీ:- మేక రూపములోగల వాతాపిని వండిన ఆ ఇల్వలుని, ఎవడు వండబడెనో ఆ వాతాపిని కూడా కనెను అని అన్వయము. (15-16)

శ్లో॥ అనుహ్లాదస్య సూర్యాయాం బాష్కలో మహిషస్తథా ।
విరోచనస్తు ప్రాహ్లాదిర్బలిస్తస్యాభవత్కిల ॥ 16

తా:- అనుహ్రాదునకు సూర్మ్య యందు బాష్కలుడు, మహిషుడు కలిగిరి. ప్రహ్లాదుని పుత్రుడు విరోచనుడు, అతనికి బలి జన్మించెను. 16

శ్లో॥ బాణం జ్యేష్ఠం పుత్రశతమశనాయాం తతోఽభవత్ ।
తస్యానుభావస్సుశ్లోక్యః పశ్చాదేవాభిధాస్యతే ॥ 17

తా:- ఆ బలికి అశన యందు బాణుడు, జ్యేష్ఠ పుత్రుడుగా వందమంది సంతానము కలిగెను. మిక్కిలి కీర్తించదగిన బలి యొక్క ప్రభావము తదుపరి చెప్పబడును. 17

టీ:- బాణేతి. తతోబలేస్సకాశాదభవత్. తస్య బలేః అనుభావః సుశ్లోక్యః పుణ్యకీర్త్యర్హః. యద్వా అనుభావ్యతే సద్భిస్సూయత ఇత్యనుభావం. సుశ్లోక్యం యశ ఇతి శేషః. 17

టీ:- కీర్తించదగిన బలి యొక్క పుణ్యకరమైన ప్రభావమును లేదా సత్పురుషులచే స్తుతించబడు కీర్తిగల ప్రభావము అని అర్థము. 17

శ్లో॥ బాణ ఆరాధ్య గిరిశం లేభే తద్గణ ముఖ్యతామ్ ।
యత్పార్శ్వే భగవానాస్తే హ్యద్యాపి పురపాలకః ॥ 18

తా:- బాణుడు కైలాసపతియైన శివుని ఆరాధించి, ఆతని గణములలో ప్రధాన స్థానమును పొందెను. ఈనాటికి కూడా అతని వద్దనే భగవానుడగు శివుడు పురమును రక్షించుచూ ఉండును. 18

టీ:- భాణ ఇతి. తస్య గణేషు ముఖ్యతాం ప్రాధాన్యం. 18

టీ:- అతని గణములలో ప్రాధాన్యమును పొందెను. 18

శ్లో॥ మరుతశ్చదితేః పుత్రాశ్చత్వారింశన్న వాధికాః ।
త ఆసన్న ప్రజాస్సర్వే నీతా ఇంద్రేణ సాత్మతామ్ ॥ 19

తా:- దితికి నలుబది తొమ్మిదిమంది మరుత్తులు అను పుత్రులు కలిగిరి. వారికి సంతానము లేదు. వారు ఇంద్రుని అనుగ్రహంచే ఇంద్రునితో సమానమైన దైవత్వమును పొందినారు. 19

టీ:- మరుత ఇతి. సాత్మతాం సమాన రూపతాం. 19

టీ:- సమానమైన రూపమును... 19

రాజో ఉవాచ

శ్లో॥ కథం త ఆసురం భావమపోహ్యౌత్పత్తికం గురో ।
ఇంద్రేణ ప్రాపితాస్సాత్మ్యం కిం తత్సాధుకృతం హితైః ॥ 20

రాజు ఈ విధముగా పలికెను.

తా:- ఓ ఆచార్యా! (గురుదేవా!) సహజమైన అసురభావము తొలిగింపబడి ఇన్ద్రునిచే సమానమైన దైవత్వమును వారు ఎట్లు పొందిరి? 20

టీ:- కథమితి. సాత్వ్యం దేవత్వం. ప్రాపితాః. (20-21)

శ్లో॥ ఇమే శ్రద్ధధతే బ్రహ్మన్నృషయోఽపి మయా సహ ।
పరిజ్ఞానాయ భగవంస్తన్నో వ్యాఖ్యాతుమర్హసి ॥ 21

సూత ఉవాచ

శ్లో॥ తద్విష్ణురాతస్య సబాదరాయణిర్వచో
నిశమ్యాదృతమల్పమర్థవత్ ।
సభాజయంస్తన్నిభృతేన చేతసా
జగాద సత్రాయణసర్వదర్శనః ॥ 22

టీ:- ఆదృతం సాదరం అల్పం మితాక్షరం. అర్థవత్ బహ్వర్థ యుక్తం. సత్రమయనం ఆశ్రయో యస్య హే సత్రాయణ శౌనక. 22

టీ:- దైవత్వము పొందబడినది. (20-21)

తా:- ఓ బ్రహ్మర్షీ! ఈ ఋషులు నాతో పాటుగా ఈ విషయమును తెలుసుకొనుట యందు శ్రద్ధ కలిగియున్నారు. మాకా విషయమును వివరించదగి యున్నావు. (వివరింపుము). 21

సూతుడు ఈ విధముగా పలికెను.

తా:- సత్రయాగము ఆశ్రయముగాగల ఓ మహర్షీ! సత్రాయణా! సర్వమును తెలిసివాడు బాదరాయణుడు అయిన ఆ శుకుడు విష్ణురాతుని (పరీక్షిత్తు) యొక్క ఆదరముతో కూడిన అర్థవంతమైన మాటలను (మితమైన అక్షరముల) విని ఆనందముతో నిండిన మనస్సుతో ఇట్లు పలికెను. 22

టీ:- సాదరముగా మితమైన అక్షరములతో అధికమైన అర్థముతో కూడిన మాటలను విని, బాదరాయణుడు సత్రయాగము ఆశ్రయము ఎవరికో అట్టి శౌనకుని సత్రాయణా! అని సంబోధించుచున్నాడు. 22

శ్రీ బాదరాయణి ఉవాచ

శ్రీ శుకులు ఈ విధముగా పలికిరి.

శ్లో॥ హతపుత్రాః దితిశ్శక్రాత్పార్ష్ణిగ్రాహేన విష్ణునా ।
మన్యునా శోకదీప్తేన జ్వలంతీ పర్యచింతయత్ ॥ 23

తా:- ఇన్ద్రునికి వెన్నుదన్నుగానున్న విష్ణువుచేత సంహరించ బడిన పుత్రులు గల దితి శోకముతో ప్రజర్విల్లిన కోపముతో జ్వలించుచున్నదై ఇట్లు ఆలోచించెను. 23

టీ:- శక్రస్య. పార్ష్ణిగ్రాహేణ పృష్ఠతస్సహాయేన. 23

టీ:- ఇన్ద్రుని వెనుక నుండి సహాయము చేయువాడు అనగా ఇన్ద్రుని రక్షకుడు అయిన విష్ణువు. 23

శ్లో॥ కదా ను భ్రాతృహంతారమింద్రియారామముల్బణమ్ ।
అక్లిన్నహృదయం పాపం ఘాతయిత్వా శయే సుఖమ్ ॥ 24

తా:- సోదరులను చంపినట్టి, ఇన్ద్రియ భోగములందు రమించు నట్టి, క్రూరుడు, కఠినుడు అయిన పాపిని (ఇన్ద్రుని) చంపించి ఎప్పుడు సుఖముగా నిద్రించెదనో కదా! 24

టీ:- భ్రాతృహంతారం ఇంద్రం మారయిత్వా సఖినీ కదా స్యామితి విచింతయామాస దితిః. ఉల్బణం క్రూరం అక్లిన్నహృదయం కఠిన చిత్తం. 24

టీ:- సోదరులను చంపినట్టి ఇన్ద్రుని చంపించి, సుఖముగా ఎప్పుడు ఉండగలనో కదా అని దితి చింతించుచుండెను. ఉల్బణం-క్రూరుని, అక్లిన్నహృదయం-కఠిన చిత్తము. 24

అవ॥ నను రాజా స్వదేహరక్షార్థమన్యేషాం ఘాతం కరోత్యేవ కిమత్ర చిత్రం తత్రాహ - కృమీతి.

అవ:- కృమీత్యాది శ్లోకమున రాజు స్వదేహ రక్షణార్థం ఇతరులకు హాని చేయుట ఏమి చిత్రము అని చెప్పబడుచున్నది.

శ్లో॥ క్రిమివిడ్భస్మ సంజ్ఞాసీ దస్యేశాభిహితస్య చ ।
భూతధ్రుక్తత్కృతే స్వార్థం కిం వేద నిరయో యతః ॥ 25

టీ:- ఈశః ప్రభుః ఇత్యభిహితస్యాపి యస్య పూర్వేషాం రాజ్ఞాం దేహస్య అంతే మరణానంతరం. ద్వి త్రిదినావస్థితస్య క్రిమయ ఇతి. శ్వాదిభిర్భక్షితస్య తు విష్ఠేతి. దగ్ధస్య భస్మేతి చ . సంజ్ఞా ఆసీత్ తత్కృతే తస్య దేహస్యార్థే యో భూతేభ్యో ద్రుహ్యతి. స కిం స్వార్థం వేద? న వేదైవ. తత్ర హేతుః - యతః భూతద్రోహాన్నిరయో భవతి. 25

తా:- ప్రభువుగా చెప్పబడునట్టి వాని (రాజు) ఈ దేహము క్రిములు, మలము, బూడిద యను పేర్లుగలదిగా చెప్పబడును. మఱి అట్టి దేహము కొఱకు మానవుడు ప్రాణులను హింసించుచున్నాడు. ఇది పురుషార్థము కాదు. ఇది స్వార్థమని తెలియనివారలకు నరకమే ప్రాప్తమగును కదా! 25

టీ:- పూర్వములో ఏ దేహము ప్రభువుగా చెప్పబడెనో, మరణాంతరము ఆ దేహము రెండు మూడు రోజులలో క్రిములు, శ్వాది (కుక్కలు మొదలగు) వానిచే తినబడిన, దానిని మలమనియు, కాల్చిన తరువాత భస్మమనియు (బూడిద) పేరును పొందును. అట్టి దేహము కొఱకు ఎవడు భూతములకు (దోషము) హాని కలిగించునో వాడు ఎట్టి స్వప్రయోజనమును పొందును. పురుషార్థమును పొందడు అని భావము. ఎందువలన అనగా దీనివలన నరకము కలుగును. అనగా నరకమును కలిగించు ప్రాణిహింస ఎట్లు ప్రయోజనము? అని భావము. 25

శ్లో॥ ఆశా సానస్య తస్యేదం ధ్రువమున్నద్ధ చేతసః ।
మదశోషక ఇంద్రస్య భూయాద్యేన సుతో హి మే ॥ 26

తా:- దీనిని (ఈ దేహమును) శాశ్వతమని తలపోయునట్టి ఉచ్ఛృంఖలమగు మనస్సుగల ఇంద్రుని గర్వమునణచునట్టి పుత్రుడు నాకు ఏ విధముగా కలుగునో...26

టీ:- ఇదం దేహాదికం. ధ్రువం నిత్యం. ఆశాసానస్య మన్యమానస్య అతః. ఉన్నద్ధం ఉచ్ఛృంఖలం చేతో యస్య తస్యేంద్రస్య యో మదస్తస్య శోషకః పుత్రో మమ యేన హేతునా భూయత్. భవేత్. 26

టీ:- దేహము నిత్యమని తలపోయునట్టి ఉచ్ఛృంఖలమైన మనస్సు ఎవరికి గలదో అట్టి ఇన్ద్రుని యొక్క గర్వమును (మదమును) తొలగించు నట్టి పుత్రుడు నాకు ఏ విధముగా కలుగునో కదా! 26

శ్లో॥ ఇతి భావేన సా భర్తురాచచార సకృత్ప్రియమ్ ।
శుశ్రూషయానురాగేణ ప్రశ్రయేణ దమేన చ ॥ 27

తా:- ఈ భావముచేత అనురాగముచేతను, వినయముచేతను, ఇన్ద్రియ నిగ్రహముచేతను, సేవచేతను నితంరతము భర్తకు ప్రియమును ఆచరించుచుండెను. 27

టీ:- ఇతీతి. తద్భర్తుః ప్రియాచరణ మేవేతి భావేన. సా భర్తుః ప్రియమసకృదాచచార. (27-28)

టీ:- భర్తకు ప్రియము కలిగించుట ద్వారా అని, భావించి ఆమె భర్తకు నిరంతరము ప్రీతిని కలిగించుచుండెను. (27-28)

శ్లో॥ భక్త్యా పరమయా రాజన్ మనోజ్ఞైర్వల్గుభాషితైః ।
మనో జగ్రాహ భావజ్ఞా సస్మితాపాంగవీక్షణైః ॥ 28

తా:- ఓ రాజా! భర్త మనస్సునెఱిగినదై పరమమైన భక్తిచేతను, మధురమైన సంభాషణములచేతను, చిరునవ్వుతో కూడిన చూపులతో (కడగంటి) భర్త మనస్సును హరించెను. 28

శ్లో॥ ఏవం స్త్రియా జడీభూతో విద్వానపి విదగ్ధయా ।
బాఢమిత్యాహ వివశో న తచ్చిత్రం హి యోషితి ॥ 29

తా:- ఈ విధముగా భర్త కశ్యపుడు, విద్వాంసుడైనప్పటికిని, నేర్పరి-యైన స్త్రీచేత జడుడుగా మార్చబడి వివశుడై (స్వాధీనము తప్పి) సరే అని పలికెను. అది స్త్రీయందు చిత్రము కాదు కదా! 29

టీ:- వివశః స్త్రీ పరతంత్రస్సన్ బాఢం తవ మనోరథం పూరయిష్యామీతి యదాహ తన్న చిత్రం. 29

టీ:- వివశుడై సరే! నీ మనోరథమును పూరించెదను అని చెప్పుట చిత్రము కాదు. 29

అవ॥ తత్ర హేతుమాహ - విలోక్యేతి.

అవ:- విలోక్య ఇత్యాది శ్లోకమున (పురుషుడు, స్త్రీ వశుడగుట) అందులకు హేతువును (కారణమును) చెప్పుచున్నాడు.

శ్లో॥ విలోక్యైకాంత భూతాని భూతాన్యాదౌ ప్రజాపతిః ।
స్త్రియం చక్రే స్వదేహార్థం యయా పుంసాం మతిర్హృతా ॥ 30

తా:- మొదట (సృష్ట్యారమ్భమున) బ్రహ్మదేవుడు ఏకాంతము నందుండు ప్రాణుల జూచి తన దేహములో అర్ధ భాగమును స్త్రీగా మార్చెను. నాటి నుండి ఆ స్త్రీ పురుషుల మనస్సును హరించుచునే-యున్నది. 30

టీ:- ఏకాంత భూతాని నిస్సంగాని మైథునేన సృష్టి వృద్ధ్యర్థం స్వదేహార్ధమేవ స్త్రియం చక్రే. 30

టీ:- నిస్సంగులైన ప్రాణులకు మైథునముచేత సృష్టిని వృద్ధిపరచుటకు బ్రహ్మ తన దేహార్ధము నుండి స్త్రీని ఏర్పరచెను. 30

శ్లో॥ ఏవం శుశ్రూషితస్తాత భగవాన్ కశ్యపః స్త్రియా ।
ప్రహస్య పరమప్రీతో దితి మాహాభినంద్య చ ॥ 31

తా:- ఓ తండ్రీ! ఈ విధముగా స్త్రీచే సేవలను పొందినవాడైన కశ్యపుడు మిక్కిలి ప్రీతిని కలవాడై నవ్వి దితిని అభినందించి ఇట్లు పలికెను. 31

టీ:- ఏవమితి. ఏవం స్త్రియా శుశ్రూషితస్సన్. 31

టీ:- ఈ విధముగా సేవలను పొందివాడై...31

కశ్యప ఉవాచ.

శ్లో॥ వరం వరయ వామోరు ప్రీతస్తేఽహమనిందితే ।
స్త్రియా భర్తరి సుప్రీతే కః కామ ఇహ చాగమః ॥ 32

టీ:- వరమితి. ఇహ అత్ర చకారాత్పరత్ర చ ఆగమః అప్రాప్యః. 32

అవ॥ నను పరమేశ్వరే సుప్రీతే సర్వకామప్రాప్తిరితి ప్రసిద్ధం తత్రాహ - పతిరేవేతి.

శ్లో॥ పతిరేవ హి నారీణాం దైవతం పరమం స్మృతమ్ ।
మానసః సర్వభూతానాం వాసుదేవశ్శ్రియః పతిః ॥ 33

టీ:- నను మనసి స్థితః. శ్రీవాసుదేవ ఏవ లక్ష్మీపతిః. పరం దైవతమితి ప్రసిద్ధం సత్యమ్, స ఏవ స్వాధికారేణ రూపభేదైః పూజ్యత ఇత్యాహ - మానస ఇతి సార్ధేన. 33

కశ్యపుడు పలికెను.

తా:- ఓ సున్దరీ! వరమును కోరుకొనుము. ఓ దోషము లేనిదానా! నేను నీ యందు ప్రీతిని పొందితిని. భర్త ప్రీతుడుకాగా ఈ లోకములో పొందరాని వస్తువు (కోరిక) ఏమున్నది? 32

టీ:- ఈ లోకముననను, చకారము వలన పరలోకమునందును కూడా అని అర్థము స్ఫురించును. పొందరానిది (ఏమున్నది). 32

అవ:- పతిరేవేత్యాది శ్లోకమున పరమేశ్వరుడు ప్రీతిచెందినపుడు సర్వకామ్యములు సిద్ధించునను ప్రసిద్ధ వాక్యమును ఆ విషయమునే చెప్పుచున్నాడు.

తా:- స్త్రీలకు పతియే పరమ దైవమని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి కదా! లక్ష్మీపతియైన వాసుదేవుడు సర్వభూతములకు మానస భర్త. 33

టీ:- మనస్సు (హృదయము) నందు ఉన్నటువంటి శ్రీ వాసుదేవుడు లక్ష్మీపతియే. ఆయనయే పరమ దైవమని ప్రసిద్ధము, సత్యము కదా! ఆతడే రూపభేదమున తన అధికారమున పూజింపబడుచున్నాడు అని మానస ఇత్యాది సార్ధ శ్లోకమున చెప్పబడుచున్నది. 33

శ్లో॥ స ఏవ దేవతాలింగైర్నామరూప వికల్పితైః ।
ఇజ్యతే భగవాన్ పుంభిస్స్త్రీభిశ్చపతి రూపధృక్ ॥ 34

తా:- ఆయనయే వేరువేరు నామరూపములు కలవాడుగా కల్పించబడి కర్మాది రూపములుగా పురుషులచేతను, మరియు స్త్రీలచేత భర్తృ రూపమును దాల్చినవాడుగా పూజంపబడుచున్నాడు. 34

టీ:- స ఇతి. దేవతాలింగైర్మూర్తిభిః. ఉపలక్షితః. తాన్యేవాహ - నామ ఇంద్రాది రూపం వజ్రహస్తత్వాది, తాభ్యాం వివిధం కల్పితైః. (34-36)

టీ:- దేవతాచిహ్నములచేత, ఆ దేవతగా గుర్తింపబడుదురు. వానినే- నామ - ఇన్ద్రాది నామములతో వజ్రాయుధముల కలవాడు ఇత్యాది రూపములతో అనేక విధములుగా కల్పించబడినవాడు (ఏ చిహ్నము ఏ దేవతకుండునో ఆ చిహ్నము చేత ఆ దేవత చెప్పబడును) (34-36)

శ్లో॥ తస్మాత్పతివ్రతా నార్య్రశ్శ్రేయస్కామాస్సుమధ్యమే ।
యజన్తేఽనన్యభావేనపతిమాత్మాన మీశ్వరమ్ ॥ 35

తా:- ఓ సుమధ్యమా! (సన్నని నడుము కలదానా) అందువలన శ్రేయస్సుల కోరు పతివ్రతలైన స్త్రీలు అనన్య భావముతో ఆత్మ స్వరూపుడైన ఈశ్వరునిగా పతిని పూజించెదరు. 35

శ్లో॥ సోఽహం త్వయార్చితో భద్రేఈదృగ్భావేన భక్తితః ।
తంత్తే సంపాదయే కామమసతీనాం సుదుర్లభమ్ ॥ 36

తా:- ఓ కళ్యాణీ! ఇట్టి భక్తితో నీచే అర్చించబడినట్టి నేను, పతివ్రతలు కాని స్త్రీలు పొందశక్యముకాని కామములను నీకు సంపాదించి పెట్టెదను. (కోరికలు తీర్చగలను). 36

దితిరువాచ

శ్లో॥ వరదో యది మే బ్రహ్మన్ పుత్రమింద్రహణం వృణే ।
అమృత్యుం మృత పుత్రాహం యేన మే ఘాతితౌ సుతౌ ॥ 37

దితి ఈ విధముగా పలికెను.

తా:- హే మహర్షీ! (బ్రహ్మన్) నా కొఱకు వరమును ఇచ్చువాడవైనచో, ఏ ఇన్ద్రుని చేత నా ఇద్దరు పుత్రులు చంపబడిరో, ఆ ఇన్ద్రుని చంపగల, మరణములేని పుత్రుని కోరుకొనుచున్నాను. 37

టీ:- వరద ఇతి. ఇంద్రహణం ఇంద్రహంతారం. అమృత్యుం మృత్యుంశూన్యం. యేన ఇంద్రేణ విష్ణునా. సహాయేన ఘాతితౌ. (37-39)

టీ:- ఇన్ద్రుని చంపునట్టి, మృత్యువు లేనట్టి, విష్ణువు సహాయమున ఏ ఇన్ద్రుని చేత (నా పుత్రులిరువురు) చంపబడిరో...(37-39)

శ్లో॥ నిశమ్య తద్వచో విప్రో విమనాః పర్యతప్యత ।
అహో అధర్మః సుమహానద్య మే సముపస్థితః ॥ 38

తా:- ఆ విప్రుడు ఆమె మాటలను విని విమనస్కుడై పరితపించెను. అయ్యో! ఈనాడు నాకు గొప్ప అధర్మము వచ్చిపడినది. 38

శ్లో॥ అహో అర్థేంద్రియారామో యోషిన్మయ్యేహ మాయయా ।
గృహీత చేతాః కృపణః పతిష్యే నరకే ధ్రువమ్ ॥ 39

తా:- అయ్యో! ఇప్పుడు ఇన్ద్రియ సుఖములు కలిగించు స్త్రీ రూపమున గల మాయకు వశమైన మనస్సుగల దీనుడనైన నేను నిశ్చయముగా నరకమునందు పడగలను. 39

శ్లో॥ కోఽతిక్రమోఽనువర్తంత్యాస్స్వభావమిహ యోషితః ।
ధిఙ్మాం బతాబుధం స్వార్థే యదహం త్వజితేంద్రియః ॥ 40

తా:- ఈ సందర్భమున స్వభావమును అనుసరించుచున్న స్త్రీయొక్క దోషమేమి? వివేకములేని నా పురుషార్థము నిందించబడుగాక! ఎంత కష్టము! నేను ఇన్ద్రియములను జయించినవాడను కాను. 40

టీ:- క ఇతి. స్వభావమనువర్తమానాయా యోషితః కోఽతిక్రమోఽపరాధః. 40

టీ:- స్వభావముననుసరించు స్త్రీయొక్క అపరాధమేమున్నది. 40

అవ॥ స్వభావమేవాహ - ద్వాభ్యామ్.

అవ:- పై శ్లోకమున చెప్పబడిన స్త్రీల స్వభావమును రెండు శ్లోకముల ద్వారా చెప్పుచున్నాడు.

శ్లో॥ శరత్పద్మోత్సవం వక్త్రం వచశ్చ శ్రవణామృతమ్ ।
హృదయం క్షురధారాభం స్త్రీణాం కో వేద చేష్టితమ్ ॥ 41

తా:- (స్త్రీల యొక్క) ముఖము శరత్కాలమందు వికసించిన పద్మము వలెను మాటలు వినుటకు అమృతమువలె నుండి పదునైన కత్తివంటి హృదయముగల స్త్రీలయొక్క చేష్టలను ఎవడు తెలియగలడు? 41

టీ:- శరత్పద్మ స్యేవోత్సవో వికాసో యస్మిన్. శ్రవణే శ్రుతీ. తయోరమృతం క్షురధారోపమం చిత్తం. 41

టీ:- శరత్కాలమందు వికసించిన పద్మమువలె ముఖము ఎవరి యందో; వినుట యందు చెవులకు అమృతమువలె, కత్తి అంచువలె మనస్సు (హృదయము) పదునుగా ఉండును. 41

శ్లో॥ న హి కశ్చిత్ప్రియస్త్రీణామంజసా స్వాశిషాత్మనామ్ ।
పతిం పుత్రం భ్రాతరం వా ఘ్నంత్యర్థే ఘాతయంతి చ ॥ 42

తా:- తమ కోరికలే ప్రియముగాగల స్త్రీలకు యథార్థముగా ప్రియమైన వాడు ఎవడును లేడు. తమ ప్రయోజనమునకై భర్తనుగాని, పుత్రునిగాని, సోదరునిగాని చంపెదరు లేదా చంపించెదరు. 42

టీ:- నహీతి. ఆతః. స్వాశిషాత్మనాం స్వార్థకామనయా ఆత్మవత్ప్రేష్ఠత్వేన ప్రతీయమానానామిత్యర్థః. 42

టీ:- స్వార్థమైన కోరికలే తమకు మిక్కిలి ప్రియముగా భావించు (స్త్రీలు)...42

శ్లో॥ ప్రతిశుతం దదామీతి వచస్తన్న మృషా భవేత్ ।
వధం నార్హతి చేంద్రోఽపి తత్రేదముపకల్పతే ॥ 43

తా:- ఇచ్చెదనని ప్రతిజ్ఞచేయబడిన ఆ మాట అసత్యము కారాదు. ఇన్ద్రుడు కూడా వధార్హుడు కాదు. ఈ విషయములో ఇది (వ్రతము) యోగ్యముగా ఉండును. 43

టీ:- తత్రేదముపకల్పతే యోగ్యం భవతి అయం భావః. - వైష్ణవం వ్రతం తావదుపదేక్ష్యామి తేనైవాస్యాః శుద్ధచిత్తాయాః. ఇంద్రం ప్రతి క్రోధో నివర్తిష్యతే పుత్రస్త్వమర్త్యో భవిష్యతి దీర్ఘకాలత్వే చ వ్రతస్య కథంచిద్వైగుణ్యే సతీంద్రస్య వధోఽపి న భవిష్యతీతి. (43-44)

టీ:- ఇది యోగ్యముగా ఉండును అనగా ఇపుడు వైష్ణవ వ్రతమును ఉపదేశించెదను. దానివలన చిత్తము శుద్ధము చేయబడినదై ఇన్ద్రుని యందు కోపము తొలగిపోగలదు. పుత్రుడు కూడా మరణించడు. దీర్ఘకాలము (చాలాకాలము) వ్రతమును ఆచరించుట వలన ఏదో విధముగా వైగుణ్యము వలన లోపము ఏర్పడి ఇన్ద్రుని యొక్క వధ గూడా జరగదు. (43-44)

శ్లో॥ ఇతి సంచిత్యభగవాన్ మారీచః కురునందన ।
ఉవాచ కించిత్కుపిత ఆత్మానం చ విగర్హయన్ ॥ 44

తా:- ఓ కురునన్దనా! ఈ విధముగా ఆలోచించినవాడై భగవానుడైన మరీచి పుత్రుడు అయిన కశ్యపుడు కొంచెము కోపించినవాడై తనను తాను నిందించుకొని ఇట్లు పలికెను. 44

కశ్యప ఉవాచ

కశ్యపుడు ఈ విధముగా పలికెను.

శ్లో॥ పుత్రస్తే భవితా భద్రే ఇంద్రహా దేవభాంధవః ।
సంవత్సరం వ్రతమిదం యద్యంజో ధారయిష్యసి ॥ 45

తా:- ఓ భద్రా! సంవత్సరకాలము ఈ వ్రతము యథా తథముగా ఆచరించినచో ఇన్ద్రుని చంపునట్టి, దేవతలకు మిత్రుడగునట్టి పుత్రుడు కలుగగలడు. 45

టీ:- హే భద్రే అజ్ఞః యథావత్. యది ధారయిష్యసి. తర్హీంద్రహా భవిష్యతి వైగుణ్యే తు దేవబాంధవో భవిష్యతి. వైష్ణవ త్వాద్వ్రతస్య కథంచిద్వైగుణ్యే సత్యపి సర్వథా వైకల్యాభావాత్. 45

టీ:- యథా తథముగా ఆ వ్రతమును ఆచరించినచో ఇన్ద్రుని చంపునట్టి కొడుకు కలుగగలడు. దోషము కలిగినచో విష్ణువు యొక్క ఆరాధనచేత దేవతల బన్ధువు కాగలడు. ఎట్టైనను ఫలము లేని కారణమున వ్రతమును మానరాదు. 45

దితిరువాచ.

దితి ఈ విధముగా పలికెను.

శ్లో॥ ధారయిష్యే వ్రతం బ్రహ్మన్ బ్రూహి కార్యాణి యాని మే ।
యాని చేహ నిషిద్ధాని న వ్రతం ఘ్నంతి యాని తు ॥ 46

తా:- ఓ బ్రహ్మో! వ్రతమును ఆచరించెదను. ఈ వ్రతమునందు చేయదగినవి, చేయకూడనివి కార్యములు ఏవో వేనివలన వ్రతము భంగము కాకుండునో వానిని నాకు చెప్పుము. 46

టీ:- ధారయిష్య ఇతి. కార్యాణి అవశ్యకాని వ్రతం యాని న ఘ్నంతి. నావశ్యకాని న చ నిషిద్ధాని. కింత్వభ్యనుజ్ఞాతాని తాని సర్వాణ్యపి బ్రూహి. 46

టీ:- అవసరమైన కార్యములను, వేనివలన వ్రతము చెడదో, ఏవి అవసరము లేనివో, ఏవి నిషిద్ధములో, అనుసరించవలసిన, ఇంకను తెలుసుకోవలసిన అన్ని విషయములను తెలియచేయుము. (చెప్పుము). 46

అవ॥ తత్రైకత్రింశన్నిషేధానాహ - న హింస్యాదితి పఞ్చభిః.

అవ:- నహింస్యాదిత్యాది నుండి ఐదు శ్లోకములలో ముప్పదినొక్క నిషేధములను గూర్చి చెప్పుచున్నాడు.

కశ్యప ఉవాచ

శ్లో॥ న హింస్యాద్భూతజాతాని న శపేన్నానృతం వదేత్ ।
న ఛ్ఛిద్యాన్న ఖరోమాణిన స్పృశేద్యదమంగలమ్ ॥ 47

టీ:- న శపేన్నాక్రోశేత్. యదమంగలం కపాలాస్థ్యాదికం. తన్న స్పృశేత్. 47

శ్లో॥ నాప్సుస్నాయాన్నకుప్యేత న సంబాషేత దుర్జనైః ।
న వసీతాధౌతవాసస్స్రజం చ విధృతాం క్వచిత్ ॥ 48

టీ:- నాప్సుప్రవిశ్యస్నాయాత్. పూర్వం విధృతాం స్రజం పునర్న ధారయేత్. 48

అవ॥ భోజనే పంచనిషేధానాహ–నోచ్ఛిష్టమితి.

కశ్యపుడు ఈ విధముగా పలికెను.

తా:- ప్రాణిసమూహములను (జీవరాసులను) హింసించరాదు. (తిట్టకూడదు, దోషమునెంచకూడదు), కోపమును పొందరాదు. అసత్యమును చెప్పగూడదు. గోర్లను, రోమములను (వెంట్రుకలను) కత్తిరించరాదు. అమంగళములను స్పృశించరాదు (కూడదు). 47

టీ:- ఆక్రోషాన్ని పొందగూడదు (తిట్టకూడదు), కపాలము (పుఱ్ఱె), ఎముకలు మొదలగు వానిని స్పృశించకూడదు. 47

తా:- నీటియందు (నీళ్ళలో దిగి) స్నానమాడరాదు. కోపమును పొందగూడదు. దుష్టులతో మాట్లాడకూడదు. ఏ కాలమందును ఉతకని వస్త్రములను ధరించగూడదు, పెట్టుకొని తీసివేసిన మాలలను మరల ధరించగూడదు. 48

టీ:- నీళ్ళలోకి దిగి స్నానమాడకూడదు. పూర్వము ధరించిన పూలమాలను మరల ధరించరాదు. 48

అవ:- నోచిష్ట మిత్యాది శ్లోకమున భోజనము యందు ఐదు నిషేధములను చెప్పుచున్నాడు.

శ్లో॥ నోచ్ఛిష్టం చండికాన్నం చ సామిషం వృషలాహృతమ్ ।
భుంజీతోదక్యయా దృష్టం పిబేన్నాంజలినా త్వపః ॥ 49

తా:- ఎంగిలిది (ఉచ్ఛిష్టమును) భద్రకాళికి (దేవతలకు) నివేదించినది, మాంసముతో కూడినది, ధర్మ దూరులైన వారిచే తీసుకురాబడినది, రజస్వల స్త్రీచే చూడబడినది ఐన ఆహారమును తినగూడదు. దోసిటితో నీటిని త్రాగరాదు. 49

టీ:- చండికాన్నం భద్రకాళ్యై నివేదితం పిపీలికాది దూషితం వా అంజలినా అపః న పిబేత్. 49

టీ:- ఎంగిలిది అనగా పిపీలికాది జీవులచేత తినబడినది, భద్రకాళికి నివేదించినది తినకూడదు. దోసిలితో నీటిని త్రాగకూడదు. 49

అవ॥ గృహాద్బహిర్నిర్గమే సప్తనిషేధానాహ - నోచ్ఛిష్టేతి.

అవ:- నోచ్ఛిష్టేత్యాది శ్లోకమున గృహము నుండి బయటకు వెళ్ళునపుడు ఏడు నిషేధములను చెప్పుచున్నాడు.

శ్లో॥ నోచ్ఛిష్టాస్పృష్ట సలిలా సంధ్యాయాంర్ముక్తమూర్ధజా ।
అనర్చితాసంయతవాఙ్నా సంవీతా బహిశ్చరేత్ ॥ 50

తా:- ఎంగిలిని తాకకూడదు, తినకూడదు. అట్లు చేసినచో నీటిని తాకకుండా ఉండకూడదు. (నీరు తాకాలి) సన్ధ్యాకాలమందు జుట్టును విరబోసుకొని ఉండకూడదు. అలంకారములు లేకుండా ఉండకూడదు. దేహమును కప్పుకొనకుండగా నియమమును తప్పి మాట్లాడకూడదు. (50)

టీ:- అనర్చితా మండనహీనా. అసంవీతా అప్రావృతా. 50

టీ:- అలంకారములు లేకుండా, దేహమును (వస్త్రముచే) కప్పుకొన కుండగా... 50

అవ॥ శయనేఽష్టౌ నిషేధానాహ - నాధౌత పాదేతి.

శ్లో॥ నాధౌత పాదాఽప్రయతా నార్ద్రపాన్నో ఉదక్శిరాః ।
శయీత న పరాఙ్నాన్యైర్న నగ్నా న చ సంధ్యయోః ॥ 51

టీ:- న పరాక్ పశ్చిమశిరాః. 51

అవ॥ కార్యాణ్యాహ-ధౌతవాసా ఇతి ద్వాభ్యామ్.

శ్లో॥ ధౌతవాసాశ్శుచిర్నిత్యం సర్వమంగల సంయుతా ।
పూజయేత్ప్రాతరాశాత్ప్రాగ్గోవిప్రాన్ శ్రియమచ్యుతమ్ ॥ 52

టీ:- ధౌతేతి. ప్రాతరాశాత్ ప్రథమభోజనాత్. 52

అవ:- నాధౌతపాదేతిత్యాది శ్లోకమున పడుకొనుటయందు ఎనిమిది నిషేధములు చెప్పుచున్నాడు.

తా:- కాళ్ళు కడుగుకోకుండా, నియమములేకుండా, తడికాళ్ళుగలిగి, ఉత్తరమునకు శిరస్సునుంచి, ఇతరుల కూడి, నగ్నముగా మరియు రెండు సన్ధ్యలందు పడుకొనగూడదు. 51

టీ:- పశ్చిమవైపునకు...51

అవ:- ధౌతవాసేత్యాది శ్లోక ద్వయమున చేయవలసిన కార్యములను చెప్పుచున్నాడు.

తా:- ఎల్లప్పుడు శుచిగా ఉండవలెను. ఉతికిన వస్త్రములను ధరించవలెను. మంగళ చిహ్నములన్నియును కలిగిఉండవలయును. ఉదయము ఆహారము తీసుకొనుటకు ముందు గోవులను, విప్రులను లక్ష్మీదేవిని అచ్యుతుని (విష్ణువును) పూజించవలయును. 52

టీ:- మొదటి భోజనమునకు ముందు అనగా ఉదయము తీసుకొను ఆహారమునకు ముందు...52

శ్లో॥ స్త్రియో వీరవతీశ్చార్చేత్స్రగ్గంధవలిమండనైః ।
పతిం చార్చ్యోపతిష్ఠేత ధ్యాయేత్కోష్ఠగతం చ తమ్ ॥ 53

తా:- సువాసినులగు స్త్రీలను గన్ధము, పుష్పములు, అలంకారము తోను పూజించవలయును. భర్తను కూడా అన్ని విధములుగా అర్చించి స్తుతించవలయును. ఆ భర్త తన యుదరమందున్న వానిగా ధ్యానించ వలయును. 53

టీ:- స్త్రియ ఇతి. వీరవతీః జీవద్భర్తృకాః. అర్చ్య సంపూజ్య కోష్ఠగతం కుక్ష్యన్తరగతం. 53

టీ:- భర్తలు జీవించియున్న వారిని (సువాసినీ స్త్రీలను), భర్తను పూజించి తనయుదరమందు ఉన్న వానిని... 53

శ్లో॥ సాంవత్సరం పుంసవనం వ్రతమేతదవిప్లుతమ్ ।
ధారయిష్యసి చేత్తుభ్యం శక్రహా భవితా సుతః ॥ 54

తా:- సంవత్సరముపాటు చేయదగిన ఈ పుంసవనమను వ్రతమును నిర్విఘ్నముగా ఆచరించినచో నీకు ఇన్ద్రుని సంహరించగల పుత్రుడు జన్మించును. 54

టీ:- పుంసవనం పుత్రోత్పత్తికరం తుభ్యం తవ. (54-57)

టీ:- పుత్రుని ఉత్పత్తిచేయు వ్రతము (పుంసవనం) నీకు... (54-57)

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ బాఢమిత్యభి ప్రేత్యాథ దితీరాజన్మహామనాః ।
కాశ్యపం గర్భమాధత్త వ్రతం చాంజో దధార సా ॥ 55

శ్రీశుకుడు ఈ విధంగా పలికెను

తా:- ఓ రాజా! సరే అని అంగీకరించి గొప్ప సఙ్కల్పముగల ఆమె కశ్యప సంబంధి గర్భమును ధరించెను. వ్రతమునుకూడా యథా విధిగా ధారణ చేసెను. 55

శ్లో॥ మాతృష్వసురభిప్రాయమింద్ర ఆజ్ఞాయ మానద ।
శుశ్రూషణేనాశ్రమస్థాం దితిం పర్యచరత్కవిః ॥ 56

తా:- గౌరవమునిచ్చువాడా! (రాజా!) కవియైన ఇన్ద్రుడు సవతి తల్లి యొక్క అభిప్రాయమును గ్రహించినవాడై ఆశ్రమము యందుగల దితిని సేవించుచుండెను. 56

శ్లో॥ నిత్యంవనాత్సుమనసః ఫలమూలసమిత్కుశాన్ ।
పత్రాంకురమృదోఽపశ్చ కాలే కాల ఉపాహరత్ ॥ 57

తా:- ప్రతిదినము ఆయా సమయములందు అడవి నుండి పుష్పములను, ఫలములను, కందమూలములను, సమిధలను, దర్భలను, ఆకులను, చిగుళ్ళను, మట్టిని మరియు నీటిని కూడా తెచ్చుచుండెను. 57

శ్లో॥ ఏవం తస్యా వ్రతస్థాయా వ్రతచ్ఛిద్రం హరిర్నృప ।
ప్రేప్సుః పర్యచరజ్జిహ్మో మృగహేవ మృగాకృతిః ॥ 58

తా:- ఓ రాజా! ఈ విధముగా కుటిలుడైన ఇన్ద్రుడు మృగరూపములో నుండి మృగముల చంపు కిరాతకునివలె ఆమె యొక్క వ్రతమందలి దోషములను తెలుసుకొనగోరి పరిచర్యలు చేయుచుండెను. 58

టీ:- హరిరింద్రః. వ్రతస్య ఛ్ఛిద్రం.ప్రేప్సుః ప్రాప్తుమిచ్ఛుః. జింహః కుటిలః. సాధువేషః మృగహా లుబ్ధకః. యథా మృగవంచనాయ మృగవేషో భవతి తద్వత్. 58

టీ:- వ్రతమునందు దోషమును వెదుకగోరి కుటిలుడైన ఇన్ద్రుడు మృగరూపములో నుండి మృగమును వంచించు కిరాతకునివలె సాధు వేశమున సేవించుచుండెను. 58

శ్లో॥ నాధ్యగచ్ఛద్వ్రతచ్ఛిద్రం తత్పరోఽథ మహీపతే ।
చింతాం తీవ్రాం గతశ్శక్రః కేన మేస్యాచ్ఛివం త్విహ ॥ 59

తా:- ఓ మహీపతీ! వ్రతమందలి లోపమునే వెదుకగోరు ఇన్ద్రుడు లోపములను పట్టలేకపోయెను. నాకు ఏ విధముగా మంగళము కలుగును అను తీవ్రమైన చిన్తను పొందెను. 59

టీ:- కేన మే శివం స్యాదితి చింతాం ప్రాప్తః. 59

టీ:- దేనివలన శుభము కలుగునో అని చింతను పొందెను. 59

శ్లో॥ ఏకదా సా తు సంధ్యాయాముచ్ఛిష్టా వ్రతకర్శితా ।
అస్పృష్టవార్య ధౌతాంఘ్రిస్సుష్వాప విధిమోహితా ॥ 60

తా:- ఒకసారి వ్రతముచే కృశించియున్న ఆమె విధిచేత మోహమును పొందినదై ఎంగిలి నోటిని, చేతులను, కాళ్ళను కడుగుకొనకుండగనే సన్ధ్యాకాలములో నిద్రించెను. 60

టీ:- అస్పృష్టవారిశ్చాసావధౌ తాంఘ్రిశ్చ. 60

టీ:- చేతులు, కాళ్ళు కడుగుకొనకుండగనే...60

శ్లో॥ లబ్ధ్వాతదంతరం శక్రో నిద్రాపహృతచేతసః ।
దితేః ప్రవిష్ట ఉదరం యోగేశో యోగమాయయా ॥ 61

తా:- అవకాశమును పొందిన యోగేశ్వరుడైన ఇన్ద్రుడు నిద్రమత్తు యందుగల దితి ఉదరమందు యోగమాయతో ప్రవేశించెను. 61

టీ:- నిద్రయా అపహృతం చేతో యస్యాః. 61

టీ:- నిద్రచేత అపహరించబడిన చేతస్సు ఎవరికో ఆమె నిద్రాపహృత చేతసః...61

శ్లో॥ చకర్త సప్తధా గర్భం వజ్రేణ కనక ప్రభమ్ ।
రుదంతం సప్తధైకైకం మారోదీరితి తాన్ పునః ॥ 62

తా:- బంగరుకాన్తిగల తన వజ్రాయుధముతో గర్భమును ఏడు ముక్కలు చేసెను. రోదించుచున్న ఆ ముక్కలను ఒక్కొక్క దానిని రోదించకుము అని అంటూ మరల ఏడు ముక్కలు చేసెను. 62

టీ:- చకర్తేతి. మారోదీరిత్యుపలాలయన్నివ తాన్ పునః సప్తధా చకర్త చిచ్ఛేద. (62-63)

టీ:- ఏడ్వకుము (రోదించకము) అని లాలిస్తున్నవానివలె వానిని మరలా ఏడు ముక్కలుగా చేసెను. (62-63)

శ్లో॥ తే తమూచుః పీడ్యమానాస్సర్వే ప్రాంజలయో నృప ।
నో జిఘాంససి కిమిన్ద్ర భ్రాతరో మరుతస్తవ ॥ 63

తా:- ఓ రాజా! ముక్కలు చేయబడుచున్న వారందరు చేతులు జోడించి ఇన్ద్రునితో పలికిరి. ఓ ఇన్ద్రా నీ తమ్ములము మరుత్తులము అగుమమ్ము ఎందులకు చంపగోరుచున్నావు. 63

ఇంద్ర ఉవాచ

శ్లో॥ మాభైష్ట భ్రాతరో మహ్యం యూయమిత్యాహ కౌశికః ।
అనన్యభావాన్పార్షదానాత్మనో మరుతాం గణాన్ ॥ 64

ఇంద్రుడు ఈవిధంగా పలికెను

తా:- తనకు అనుచరులు (పార్షదులు) అగు మరుద్గణములను అనన్య భావముతో భయపడకుడు! మీరు నాకు సోదరులు అని కౌశికుడు (ఇన్ద్రుడు) వారితో పలికెను. 64

టీ:- మేతి. కౌశికః ఇంద్రః. గణాన్ సప్త. శ్రు. సప్తగణా వై మరుతః ఇతి శ్రుతేః. (64-66)

టీ:- శ్రుతి యందు మరుత్తులు ఏడు గణములు అని చెప్పబడెను. కౌశికః అనగా ఇన్ద్రుడు. (64-66)

శ్లో॥ న మమార దితేర్గర్భశ్శ్రీనివాసానుకంపయా ।
బహుధా కులిశక్షుణ్ణో ద్రౌణ్యస్త్రేణ యథా భవన్ ॥ 65

తా:- శ్రీనివాసుని కృపచే, నీవు ద్రోణ పుత్రుని అస్త్రములచే మరణించని విధముగా, వజ్రాయుధముచే అనేక ముక్కలుగా చేయబడిన దితి గర్భము కూడా మరణించలేదు. 65

శ్లో॥ సకృదిష్ట్వాది పురుషం పురుషో యాతి సామ్యతామ్ ।
సంవత్సరం కించిదూనం దిత్యా యద్ధరిరర్చితః ॥ 66

తా:- ఒక్కసారి ఆదిపురుషుని ఆరాధించినంతనే (పూజించినంత) మానవుడు సమానత్వమును పొందును. కొంచెము తక్కువగా సంవత్సర కాలమంత దితిచేత శ్రీహరి పూజించబడినాడో (అందుచేత)...66

శ్లో॥ సజూరింద్రేణ పంచాశద్దేవాస్తే మరుతోఽభవన్ ।
వ్యపోహ్యామాతృదోషం తే హరిణా సోమపాః కృతాః ॥ 67

తా:- ఆ మరుత్తులు ఇన్ద్రునితో కూడి ఏబదిమంది దేవతలు అయ్యిరి. మాతృ దోషమును తొలగించి వారు ఇన్ద్రునితో సోమరస పానము చేయువారుగా చేయబడిరి. 67

టీ:- సజూః సహ.(67-70)

టీ:- కలిపి. (67-70)

శ్లో॥ దితిరుత్థాయ దదృశే కుమారా ననలప్రభాన్ ।
ఇంద్రేణ సహితాన్ దేవీ పర్యతుష్యదనిందితా ॥ 68

తా:- దితి నిద్రనుండి లేచి అగ్నివలె ప్రకాశించుచున్న ఇన్ద్రునితో కూడియున్న పుత్రులను చూచెను. దోషము లేని ఆ దేవి చాలా సంతోషించెను. 68

శ్లో॥ అథేంద్రమాహ తాతాహమాదిత్యానాం భయావహమ్ ।
అపత్యమిచ్ఛంత్యచరం వ్రతమేతత్సుదుష్కరమ్ ॥ 69

తా:- తరువాత ఇన్ద్రునితో ఇట్లనెను-తండ్రీ! అదితి పుత్రులకు భయమును కలిగించు పుత్రుని, కోరుదానవై మిక్కిలి దుష్కరమైన ఈ వ్రతమును ఆచరించితిని. 69

శ్లో॥ ఏకస్సంకల్పితః పుత్రస్సప్తసప్తాభవన్ కథమ్ ।
యది తే విదితం పుత్ర సత్యం కథయ మా మృషా ॥ 70

తా:- ఓ పుత్రా! నేను కోరినది ఒక్క పుత్రునే కాగా నలుబది తొమ్మిది మంది ఎట్లు కలిగిరి? నీకు తెలిసినచో సత్యమును చెప్పుము. అసత్యమును చెప్పకుము. 70

అవ॥ దిత్యా నిష్కపటముక్తే సతీన్ద్రోఽపి నిష్కపట మేవాహ-అమ్బేతి

అవ:- దితి నిష్కపటముగా పలుకగా ఇన్ద్రుడు కూడా నిష్కపటముగనే పలికినాడు, అని అంబేతి శ్లోకమున చెప్పుచున్నాడు.

ఇంద్ర ఉవాచ

ఇన్ద్రుడు ఈ విధముగా పలికెను.

శ్లో॥ అంబ తేఽహం వ్యవసితమవధార్యాగతోఽంతికమ్ ।
లబ్ధాంతరోఽచ్ఛిదం గర్భమర్థ బుద్ధిర్న ధర్మవిత్ ॥ 71

తా:- అమ్మా! నేను నీ యొక్క నిశ్చయమును తెలుసుకొనినవాడనై నిన్ను సమీపించి అవకాశము చిక్కగా గర్భమును ఛేదించితిని. స్వార్థ బుద్ధిగలవాడను. ధర్మమును తెలిసినవాడను కాను. 71

టీ:- దిత్యా నిష్కపటమేవాహ - అంబేతి. లబ్ధమంతరం యేన అర్థే ఏవ బుద్ధిర్యస్య. (71-73)

టీ:- అవకాశం (అన్తరం) ఎవరికి దక్కెనో వాడు లబ్ధాన్తరుడు. ప్రయోజనముయందే బుద్ధి ఎవరికో వాడు అర్థబుద్ధి. (71-73)

శ్లో॥ కృత్తో మే సప్తధా గర్భ ఆసన్ సప్తకుమారకాః ।
తేఽపి చైకైకశో వృక్ణాస్సప్తధా నాపిమమ్రిరే ॥ 72

తా:- నేను గర్భమును ఏడు ముక్కలు చేయగా ఏడుగురు బాలకులుగా అయ్యిరి. వారిని కూడా ఒక్కొక్క దానిని ఏడు ముక్కలుగా కోసినను వారు మరణించలేదు. 72

శ్లో॥ తతస్తత్పరమాశ్చర్యం వీక్ష్యాధ్యవసితం మయా ।
మహాపురుష పూజాయాస్సిద్ధిః కాప్యానుషంగిణీ ॥ 73

తా:- తరువాత ఆ పరమాద్భుతము చూచి మహాపురుషుని పూజించుట వలన ఏర్పడిన ఒకానొక గొప్ప సిద్ధఫలమని నిశ్చయము కలిగెను. 73

శ్లో॥ ఆరాధనం భగవత ఈహమానా నిరాశిషః ।
యే తు నేచ్ఛంత్యపి పరం తే స్వార్థకుశలాః స్మృతాః ॥ 74

తా:- ఎవరైతే భగవానుని, నిష్కాములై ఆరాధన చేయుచున్నారో పరమును (మోక్షమును) కూడా కోరరో వారు తమ పురుషార్థములలో నిపుణులని చెప్పబడినారు. (స్మృతులు, శాస్త్రములు చెప్పుచున్నవి)74

టీ:- అపిపరం మోక్షమపి. 74

టీ:- మోక్షమునుకూడా కోరరో...74

శ్లో॥ ఆరాధ్యాత్మ పదం దేవం స్వాత్మానం జగదీశ్వరమ్ ।
కో వృణీతే గుణస్పర్శం బుధస్స్యాన్నరకేఽపి యత్ ॥ 75

తా:- తనను తానే ఇచ్చివేయునట్టి, ఆత్మస్వరూపుడైన జగదీశ్వరుని ఆరాధించి, నరకము (కూడా) కలిగించు ఇన్ద్రియ భోగములను బుద్ధిమంతుడైన వాడు ఎవడు కోరుకొనును? 75

టీ:- గుణస్పర్శం విషయభోగం బుధః కో వృణీతే యద్యస్మాన్నరకేఽపి విషయభోగస్స్యాత్. 75

టీ:- బుద్ధిమన్తుడైనవాడెవడు విషయ భోగములు కోరుకొనును? ఒకవేళ కోరుకొనినను నరకమందు కూడా విషయభోగములుండును కదా! (ఇన్ద్రియ భోగములు నరకమునందు కూడా ఉండుట వలన వాటి కొఱకు ఆరాధించుట వ్యర్థము అని భావము). 75

శ్లో॥ తదిదం మమ దౌర్జన్యం బాలిశస్య మహీయసి ।
క్షంతు మర్హసి మాతస్త్వం దిష్ట్యా గర్భో మృతోత్థితః ॥ 76

తా:- ఓ మహాత్మురాలా! అజ్ఞానము చేత నేను చేసినట్టి ఈ దౌర్జన్యమును క్షమించుటకు నీవు తగుదవు తల్లీ! దైవవశమున గర్భము మరణించియు బ్రతికినది. 76

టీ:- హే మహీయసి హే మహత్తమే, మృతస్సన్ ఉత్థితః. (76-78)

టీ:- మహాత్మురాలవు. మరణించియు బ్రతికినది. (76-78)

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ ఇంద్రస్తయాభ్యనుజ్ఞాత శ్శుద్ధభావేన తుష్టయా ।
మరుద్భిస్సహ తాం నత్వా జగామ త్రిదివం విభుః ॥ 77

శ్రీ శుకులు ఈ విధముగా పలికిరి.

తా:- శుద్ధభావముతో సంతోషము పొందిన ఆమె యొక్క (దితి) అనుమతిని పొంది మరుత్తులతో కూడి ఆమెకు నమస్కరించి స్వర్గమునకు చేరుకొనెను. 77

శ్లో॥ ఏవం తే సర్వమాఖ్యాతం యన్మాం త్వం పరిపృచ్ఛసి ।
మంగలం మరుతాం జన్మకిం భూయః కథయామి తే ॥ 78

తా:- ఈ విధముగా నీవు అడిగినట్లుగా మంగళకరమైన మరుత్తుల జన్మ వృత్తాన్తము నంతయును నీకు చెప్పితిని. నీకు ఇంకను ఏమి చెప్పవలయును. 78

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే
అష్టాదశోఽధ్యాయః

శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆఱవ స్కంధమున
పద్దెనిమిదవ అధ్యాయము సమాప్తము.

### ఏకోనవింశోఽధ్యాయః

అవ॥ ఊనవింశేఽతు యత్ప్రోక్తం కశ్యపేన దిత్యేర్వ్రతం. తదేవ వివృతం లోకహితాయ హరితోషణమ్.

రాజో ఉవాచ

శ్లో॥ వ్రతం పుంసవనం బ్రహ్మన్ భవతా యదుదీరితమ్ ।
తస్య వేదితుమిచ్ఛామి యేన విష్ణుః ప్రసీదతి ॥ 1

టీ:- తస్య ప్రకారమితి. శేషః. 1

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ శుక్లే మార్గశిరే పక్షే యోషిద్భర్తురనుజ్ఞయా ।
ఆరభేత వ్రతమిదం సార్వకామికమాదితః ॥ 2

టీ:- శుక్ల ఇతి. మార్గశీర్షే మాసే శుక్లపక్షే ఆదితః ప్రతిదితి. 2

### 19వ అధ్యాయము

అవ:- ఈ పందొమ్మిదవ అధ్యాయమున కశ్యపుని చేత దితికి హరిని సంతోషింపజేయు ఏ వ్రతము ఉపదేశించబడినదో ఆ వ్రతమే లోక హితము కొఱకు వివరించబడినది.

రాజు ఈ విధముగా పలికెను.

తా:- ఓ మహర్షీ! మీచే చెప్పబడిన పుంసవమను వ్రతము ఏది కలదో, దేనిచేత విష్ణువు ప్రసన్నుడగునో, ఆ వ్రతమును తెలియగోరుచున్నాను. 1

టీ:- దాని యొక్క విధానమును వివరింపుము (అని భావము). 1

శ్రీ శుకులు ఈ విధముగా పలికిరి.

తా:- మార్గశిరమాసమున శుక్లపక్షమున ఆరంభము నుండి (పాడ్యమి నుండి) సర్వకామములను తీర్చు ఈ వ్రతము స్త్రీ, భర్త యొక్క అనుమతితో ప్రారంభింపవలయును. 2

టీ:- మార్గశిరమాస మందు శుక్లపక్షమున పాడ్యమి నుండి...2

శ్లో॥ నిశమ్య మరుతాం జన్మ బ్రాహ్మణాననుమంత్ర్య చ ।
స్నాత్వా శుక్లదతీ శుక్లే వసీత్వాంలంకృతాంబరే ।
పూజయేత్ప్రాతరాశాత్ప్రాగ్భగవంతం శ్రియా సహ ॥ 3

తా:- మరుత్తుల జన్మ వృత్తాంతమును విని, (బ్రాహ్మణుల యొక్క అనుమతిని బడిసి) తెల్లని దన్తములుగల (పండ్లు తోముకొని) స్త్రీ తెల్లని వస్త్రములను ధరించి, అలంకరించుకొని, ప్రాతఃకాలమందు ఆహారమును స్వీకరించుటకు ముందుగనే లక్ష్మీదేవితో కూడిన భగవానుని (విష్ణువును) పూజించవలయును. 3

టీ:- అనుమంత్ర్య పృష్ట్వా. శుక్లాదంతా యస్యాః సా శుక్లదతీ ధౌతదంతేత్యర్థః. అలంకృతా సతీ. పూజయేత్. 3

టీ:- బ్రాహ్మణులను అడిగి (అజ్ఞాను గైకొని), ఎవరియొక్క దన్తములు తెల్లనివో, ఆమె శుక్లదంతీ అనగా దన్తములని శుభ్రముగా కడుగుకొని, స్నానమాచరించి, అలంకరించుకొని భగవానుని పూజించవలయునని భావము. 3

అవ॥ ఆదౌ తావన్నమస్కారమన్త్రానాహ త్రిభిః.

అవ:- మూడు శ్లోకముల ద్వారా ముందుగా నమస్కార మన్త్రములను చెప్పుచున్నాడు..

శ్లో॥ అలంతే నిరపేక్షాయ పూర్ణకామ నమోస్తుతే ।
మహావిభూతి పతయే నమః సకల సిద్ధయే ॥ 4

తా:- ఓ పూర్ణకాముడా! అపేక్షలు లేనివాడవు, గొప్ప ఐశ్వర్యమునకు (లక్ష్మీదేవికి) ప్రభుడవు, సకల సిద్ధులు కలవాడవును అగు నీకు నమస్కారము. 4

టీ:- తుభ్యం మలం పర్యాప్తమేవ సర్వం న కించిదన్యైః కృత్యమస్తి., అతః కేవలం తే తుభ్యం నమోఽస్తు. పర్యాప్తౌ హేతవః - నిరపేక్షాయ హే పూర్ణకామ, మహావిభూతిపతయే లక్ష్మీపతయే. సకలాః సిద్ధయోఽణిమాద్యా యస్మింస్తస్మై. 4

టీ:- నీ నమస్కారము సరిపోయినదే, నీవు అన్ని కామములను పరిపూర్ణముగా పొందిన వాడవు. ఇంకను వేరుగా ఇతరులు నీ కొఱకు ఏమియు చేయువలసినది లేదు. అందుకొఱకు నీకు నమస్కారమొకటియే చాలును. చాలుననుటకు సరిపోయినన్ని హేతువులున్నవి. నిరపేక్షుడవు (అపేక్షలు, ఇంకా సిద్ధించవలసిన కోరికలు లేనివాడవు) నీవు పూర్ణకాముడవు. సమస్త సంపదలకు ప్రభుడవు అనగా లక్ష్మీపతివి. అణిమాది సకల సిద్ధులు ఎవనియందో వాడు సకలసిద్ధుడు. అట్టి నీకు నమస్కారము. 4

శ్లో॥ యథా త్వం కృపయా భూత్యా తేజసా మహినౌజసా ।
జుష్ట ఈశగుణైః సర్వైస్తతోఽసి భగవాన్ప్రభుః ॥ 5

తా:- ఓ ఈశ్వరా! వాస్తవముగా దయ, సంపద, తేజస్సు, మహిమ, శక్తి మొదలగు పరిపూర్ణ గుణములచే కూడియున్నావు. అందుచేత భగవానుడవు, ప్రభుడవు అగుచున్నావు. 5

టీ:- భో ఈశ, యథా యథావత్. త్వం కృపాదిభిర్జుష్టః. అన్యైశ్చ సత్య సంకల్పత్వాదిభిః సర్వైర్గుణైః. తతస్తస్మాత్. 5

టీ:- ఓ ఈశా! నీవు యథార్థముగా కృపాది గుణముల చేతను, ఇతర సత్య సఙ్కల్పాది సర్వ గుణముల చేతను కూడియున్నావు. అందువలన నీవు భగవానుడవు. 5

శ్లో॥ విష్ణుపత్ని మహామాయే మహాపురుష లక్షణే ।
ప్రీయేథా మే మహాభాగే లోకమాతర్నమోస్తుతే ॥ 6

తా:- ఓ విష్ణుపత్నీ! (లక్ష్మి), ఓ మహామాయా! మాహా పురుష లక్షణములు కలదానా! ఓ మహాభాగా! లోకమాతా! నాకు ప్రీతురాలవు కమ్ము! నీకు నమస్కారము. 6

టీ:- విష్ణుపత్నీతి. మహాపురుషస్య పరమేశ్వరస్యైవ లక్షణాని నిరపేక్షత్వాదీని యస్యాః తస్యాః సంబోధనం. 6

టీ:- మహాపురుషుని యొక్క, పరమేశ్వరుని యొక్క నిరపేక్షత్వాది లక్షణములు గలదానా! అని సంబోధనము చేయబడుచున్నది. 6

అవ॥ పూజామన్త్రమాహ - ఓం నమ ఇతి.

అవ:- ఓం నమ ఇత్యాది శ్లోకమున (మన్త్రమున) పూజామన్త్రమును చెప్పుచున్నాడు.

శ్లో॥ ఓం నమో భగవతే మహాపురుషాయ మహానుభావాయ
మహావిభూత పతయే సహ మహావిభూతిభిర్బలిముప
హరాణీతి ॥ 7

తా:- ఓం మహాప్రభావము కలవాడవు, గొప్ప ఐశ్వర్యములకు (మహిమలకు) ప్రభువు, మహావిభూతులతో కూడిన మహాపురుషుడవు అగు భగవానునకు నమస్కారము. ఉపచారములను సమర్పించెదను గాక యను ఈ మన్త్రములతో ప్రతిదినము విష్ణువునకు ఆవాహనము, అర్ఘ్యము, పాద్యము, ఆచమనము, స్నానము, వస్త్రము, యజ్ఞోపవీతము, ఆభరణములు, గన్ధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము మున్నగు ఉపచారములను కూడా ఏకాగ్రత కలిగి సమర్పింప వలయును. 7

టీ:- అనేనాహర హర్మంత్రేణ - విష్ణోరావాహనార్ఘ్యపాద్యోపస్పర్శన స్నానవాస ఉపవీత విభూషణ గంధ పుష్ప ధూప దీపోపహారాద్యు పచారాంశ్చ సమాహిత ఉపాహరేత్. 7

శ్లో॥ హవి శ్శేషం తు జుహుయాదనలే ద్వాదశాహుతీః ।
ఓం నమో భగవతే-మహాపురుషాయ
మహావిభూతయే స్వాహేతి ॥ 8

తా:- నైవేద్యమును పెట్టగా మిగిలిన దానిని అగ్నియందు మహదైశ్వర్యములు గల లక్ష్మీదేవికి పతియగు, మహాపురుషుడు అగు భగవానుని కొఱకు సమర్పింపబడుచున్నది అను భావము గల మన్త్రముచే పన్నెండు మారులు ఆహుతులు సమర్పింపవలయును (హోమము చేయవలయును అని భావము). 8

టీ:- హవిశ్శేషం ఉపహారావశిష్టం. హోమమన్త్రమ్ దర్శయతి - ఓమితి. 8

టీ:- మిగిలిన హవిష్యమును హోమము చేయవలయును. ఓమిత్యాది పాదమున హోమమన్త్రము తెలుపుచున్నాడు. 8

శ్లో॥ శ్రియం విష్ణుం చ వరదావాశిషాం ప్రభవావుభౌ ।
భక్త్యా సంపూజయేన్నిత్యం యదీచ్ఛేత్సర్వసంపదః ॥ 9

తా:- సర్వసంపదలను కోరుకొనువాడు, మనోరథముల తీర్చు వరములనిచ్చు లక్ష్మీదేవి, విష్ణుమూర్తులిద్దరిని ప్రతి నిత్యము భక్తితో చక్కగా పూజించవలయును. 9

టీ:- ప్రకర్షేణ భవాన్త్యాభ్యామితి ప్రభవౌ. 9

టీ:- వీరిచేత శుభములు చేకూర్చబడును కావున సమర్థులు. 9

శ్లో॥ ప్రణమేద్దండవద్భూమౌ భక్తిప్రహ్వేణ చేతసా ।
దశవారం జపేన్మంత్రం తతః స్తోత్రమదీరయేత్ ॥ 10

తా:- వినమ్రమైన భక్తిగల మనస్సుచేత (భూమియందు కర్రవలె) సాష్టాంగ నమస్కారము చేయవలయును. మన్త్రమును పదిమార్లు జపింపవలయును. తరువాత స్తోత్రమును పఠించవలయును. 10

శ్లో॥ యువాం తు విశ్వస్య విభూ జగతః కారణం పరమ్ ।
ఇయం హి ప్రకృతిస్సూక్ష్మా మాయాశక్తిర్దురత్యయా ॥ 11

తా:- మీరిద్దరు విశ్వమునకు ప్రభువులు. ఈ జగత్తునకు కారణము మీరే. ఈ లక్ష్మీదేవియే సూక్ష్మమగు ప్రకృతి. దాటరాని మాయాశక్తి ఈమెయే. 11

శ్లో॥ తస్యా అధీశ్వరస్సాక్షాత్త్వమేవ పురుషః పరః ।
త్వం సర్వయజ్ఞ ఇజ్యేయం క్రియేయం ఫలభుగ్భవాన్ ॥ 12

తా:- పరమ పురుషుడవైన నీవే సాక్షాత్తుగా ఈమె యొక్క అధీశ్వరుడవు. సర్వ యజ్ఞ స్వరూపుడవు నీవే. ఈమెయే యజ్ఞక్రియ. క్రియ ఈమె కాగా ఫలభోక్తవు నీవు. 12

టీ:- ఇజ్యా యజ్ఞప్రవర్తకః పురుషవ్యాపారో భావనాఖ్యః. క్రియా లౌకికీ. (10-12)

టీ:- యజ్ఞమును నిర్వర్తించు పురుష వ్యాపారము నీవు. లౌకికము క్రియ.. (10-12)

శ్లో॥ గుణవ్యక్తిరియం దేవీ వ్యంజకః ఫలభుగ్భవాన్ ।
త్వం హి సర్వశరీర్యాత్మా శ్రీ శ్శరీరేంద్రియాశయా ।
నామరూపే భగవతీప్రత్య యస్త్వముపాశ్రయః ॥ 13

తా:- గుణముల ప్రకటనము రూపముగా గలది ఈ దేవి. నీవు గుణముల వ్యజ్ఞించువాడవు. గుణములను అనుభవించువాడవు. సర్వశరీర ధారుల (ప్రాణుల) ఆత్మవు నీవే. శరీరము, ఇన్ద్రియములు లక్ష్మీదేవి. ఈమె నామరూపములుకాగా వానికి ఆశ్రయము ప్రకాశమును నీవే. 13

టీ:- ప్రత్యయో నామ రూపయోః ప్రకాశకః. అపాశ్రయః తయోరాధారః. 13

టీ:- నామరూపముల ప్రకాశింపచేయు జ్ఞానము నీవు. వానికి ఆధారము నీవు. 13

శ్లో॥ యథా యువాం త్రిలోకస్య వరదౌ పరమేష్ఠినౌ ।
తథా మ ఉత్తమశ్లోక సంతు సత్యా మహాశిషః ॥ 14

తా:- ఓ ఉత్తమశ్లోకుడా! (పవిత్రమైన కీర్తికలవాడా!) ఏ విధముగా మీరిద్దరు ముల్లోకములకు వరములనిచ్చు పరమేశ్వరులో అదే విధముగా నాయొక్క కోరికలు (ఆశయములు) సత్యములగుగాక! (తీరునుగాక)14

శ్లో॥ ఇత్యభిష్టూయ వరదం శ్రీనివాసం శ్రియా సహ ।
తన్నిస్సార్యోపహరణం దత్వాచమనమర్చయేత్ ॥ 15

తా:- శ్రీదేవితోకూడి వరములనిచ్చు శ్రీనివాసుని ఈ విధముగా పూజించి, నైవేద్యమును, పూజాది ద్రవ్యములను అచటి నుండి తొలగించి, ఆచమనమును సమర్పించి అర్చించవలయును. 15

శ్లో॥ తతః స్తువీత స్తోత్రేణ భక్తి ప్రహ్వేణ చేతసా ।
యజ్ఞోచ్ఛిష్టమవఘ్రాయ పునరభ్యర్చయేద్ధరిమ్ ॥ 16

తా:- తరువాత భక్తితో వినమ్రమైన మనస్సుతో సోత్రమును పఠించవలయును. యజ్ఞోచ్ఛిష్టమును (యజ్ఞముచేయగా మిగిలిన హవిస్సును) ఆఘ్రాణించి (వాసనచూచి) మరల శ్రీహరిని అర్చించ వలయును. 16

శ్లో॥ పతిం చ పరమాభక్త్యా మహాపురుషచేతసా ।
ప్రియైస్తైస్తైరుపనమేత్ప్రేమశీలః స్వయం పతిః ॥ 17

తా:- పతినికూడా మహాపురుషుడను భావనగల మనస్సుతో పరమమైన భక్తితో పూజించవలయును. స్వయముగా భర్తగూడా ప్రేమస్వభావము కలవాడై ప్రియములగు ఆయా వస్తువులను భార్యకు అర్పించవలయును. భార్య యొక్క చిన్నవి మరియు పెద్దవి అయిన అనుకూలమైన కర్మలు చేయవలయును. 17

టీ:- మహాపురుష చేతసా ఈశ్వర బుద్ధ్యోపనమేద్భజేత్, పతిశ్చ స్వయం ప్రేమశీలః సన్ పత్న్యాః కర్మాణిబిభృయాత్, తదనుకూలో భవేదిత్యర్థః (14-17)

టీ:- భర్తను ఈశ్వరుడను బుద్ధిచేత భజించవలయును, నమస్కరించ వలయును. అట్లా పతి కూడా స్వయముగా ప్రేమ స్వభావము కలవాడై పత్నియొక్క చేష్టలను అఙ్గీకరించవలయును. ఆమెకు అనుకూలముగా ఉండవలెనని భావము. (14-17)

శ్లో॥ కృతమేకతరేణాపి దంపత్యో రుభయోరపి ।
పత్న్యాం కుర్యాదనర్హాయాం పతిరేతత్సమాహితః ॥ 18

తా:- దంపతులిద్దరిలో ఏ ఒక్కరైనను వ్రతమును ఆచరింవచ్చును. వ్రతము చేయుటయందు భార్య సమర్థురాలు కానిచో భర్త ఏకాగ్ర చిత్తముతో ఈ వ్రతమును ఆచరించవలయును. 18

టీ:- యతో దంపత్యోర్మధ్యే ఏకతరేణ కృతముభయోరపి భవతి. 18

టీ:- దంపతులిద్దరిలో ఏ ఒక్కరు ఆచరించినను ఉభయులకు ఫలము వచ్చును.. 18

శ్లో॥ విష్ణోర్వ్రతమిదమ్ బిభ్రన్న విహన్యాత్కథంచన ।
విప్రాన్స్త్రియో వీరవతీః స్రగ్గన్ధ బలి మణ్డనైః ।
అర్చేదహరహర్భక్త్యా దేవం నియమమాస్థితః ॥ 19

తా:- విష్ణువు యొక్క ఈ వ్రతమును ఆచరించువాడు ఏ విధముగానైనను దీనికి ఆటంకములు (విచ్ఛిన్నము) చేయరాదు. నియమములనన్నింటిని పాటించుచు బ్రాహ్మణులను, సువాసినీ స్త్రీలను, దేవుని (శ్రీహరిని) పూలదండలతోగను, గన్ధముతోడను అలంకారముల తోడను, నైవేద్యములతోడను, ప్రతిదినము అర్చించవలయును. 19

టీ:- న విహన్యాన్న విచ్ఛిన్ద్యాత్. 19

టీ:- విచ్ఛిన్నము చేయరాదు... 19

శ్లో॥ ఉద్వాస్య దేవం స్వేధామ్ని తన్నివేదితమగ్రతః ।
అద్యాదాత్మ విశుద్ధ్యర్థం సర్వకామర్ధయే తథా ॥ 20

తా:- దేవుని తన నివాసమునకు పంపించి (ఉద్వాసనచేసి) అంతఃకరణ శుద్ధి కొఱకును, సకల మనోరథ సిద్ధి కొఱకును ముందుగా నివేదింపబడిన పదార్థములను భుజించవలయును. 20

శ్లో॥ ఏతేన పూజా విధినా మాసాన్ద్వాదశ హాయనమ్ ।
నీత్వాఽథో పచరేత్సాధ్వీ కార్తికే చరమేఽహని ॥ 21

తా:- సాధ్వియైన స్త్రీ ఈ వ్రతమును పన్నెండు మాసములు (సంవత్సరము) అనుష్ఠించి తరువాత కార్తీక మాసమంలి చివరి దినము (అమావాస్యనాడు ఉపవసించవలయును). 21

టీ:- ద్వాదశమాసానిత్యుక్తే కదాచిత్తన్మధ్యే మలమాసే సతి తేన సహ ద్వాదశ సంఖ్యాయాం సత్యాం శుద్ధస్యైకస్య త్యాగః స్యాత్. హాయన మిత్యుక్తేతన్మధ్య పతితస్య తస్యాపి ప్రసఙ్గః స్యాత్. తదుభయం వారయితుముభయముక్తమ్. ఉపచరేత్ ఉపవసేత్. (20,21)

టీ:- పన్నెండు నెలలు అనగా వాని మధ్యలో మల మాసము (అధిక మాసము) ఉన్నచో దానిని, వదిలివేసి పన్నెండు సంఖ్యగాగల శుద్ధమైన సంవత్సరము అయి ఉండవచ్చు. హాయనమనగా దాని మధ్యలో విచ్ఛినమైనచో దానిని కూడా కలుపుకొని అని అర్థము లభించును. ఈ రెండింటిని నివారించవలయునని పన్నెండు నెలలు అనియు, హాయనము అని రెండును చెప్పబడినవి. అనగా మలమాసము లేని శుద్ధమైన సంవత్సరము పన్నెండు నెలలు ఆచరించవలయునని భావము. ఉపచరేత్ అనగా ఉపవాసము చేయవలెయును. (20,21)

శ్లో॥ శ్వోభూతేఽప ఉపస్పృశ్య కృష్ణమభ్యర్చ్య పూర్వవత్ ।
పయః శృతేన జుహుయాచ్చరుణా సహసర్పిషా ।
పాకయజ్ఞవిధానేన ద్వాదశైవా హుతీః పతిః ॥ 22

తా:- మరునాడు ఉదయమున నీటిని స్పృశించి (స్నానమాచరించి) భర్త మాత్రమే పూర్వము వలెనే కృష్ణుని అర్చించి, నెయ్యితో కూడిన చరువును పాకయజ్ఞవిధానమున (స్థాలీపాక విధానమున) పన్నెండు ఆహుతులను హోమము చేయవలెయును. 22

టీ:- శ్వోభూతే ప్రభాతే సతి. పయసి శృతేన పక్వేన. పాక యజ్ఞ విధానేన పార్వణస్థాలీ పాక విధానేన. 22

టీ:- మరునాడు ఉదయము పాలతో ఉడికించిన చరువును వండి పార్వణ స్థాలీపాక విధానమున (హవనము చేయవలయును)..22

శ్లో॥ ఆశిషః శిరసాదాయ ద్విజైః ప్రీతైః సమీరితాః ।
ప్రణమ్య శిరసా భక్త్యా భుఞ్జీత తదనుజ్ఞయా ॥ 23

తా:- బ్రాహ్మణులను సంతుష్టులను చేసి వారి చక్కటి ఆశీస్సులను శిరస్సు వంచి స్వీకరించి, భక్తితో వారికి శిరస్సు వంచి నమస్కరించి వారి అనుమతితో భుజించవలయును. 23

శ్లో॥ ఆచార్యమగ్రతః కృత్వా వాగ్యతః సహ బన్ధుభిః ।
దద్యాత్పత్న్యైచరోః శేషం సుప్రజాస్త్వం సుసౌభగమ్ ॥ 24

తా:- వాక్కును నియంత్రించినవాడై (మౌనముగా) బంధువులతో కూడి ఆచార్యుని ముందుగా నుంచుకొని, హోమము చేయగా మిగిలిన చరువును చక్కని సంతానమును పొందుటకు, సౌభాగ్యము కొఱకును భార్యకు ఈయవలెయును. 24

టీ:- సుప్రజాస్త్వం సత్పుత్రమిత్యర్థః. తద్యతస్తం శేషమ్. (23,24)

టీ:- సుపుత్రుని పొందుటకు యజ్ఞముచేయగా మిగిలిన శేషము (ఇవ్వవలయును)... (23,24)

శ్లో॥ ఏతచ్చరిత్వా విధివద్వ్రతం విభోరభీప్సితార్థం
లభతే పుమానిహ ।
స్త్రీ త్వేతదాస్థాయ లభేత సౌభగం శ్రియం ప్రజాం
జీవపతిమ్ యశో గృహమ్ ॥ 25

తా:- ప్రభువు (విష్ణువు) యొక్క ఈ వ్రతమును యథావిధిగా ఆచరించిన పురుషుడు ఈ లోకమునందు మనోరథములను (కోరుకొనిన ప్రయోజనములను) పొందును. స్త్రీ దీనిని ఆచరించినచో సౌభాగ్యమును, సంపదను, సంతానమును, ఆయుష్మంతుడగు పతిని, యశస్సును (కీర్తిని), గృహమును పొందును. 25

శ్లో॥ కన్యా చ విన్దేత సమగ్ర లక్షణం వరం త్వవీరా
హత కిల్బిషా గతిమ్ ।
మృత ప్రజా జీవసుతా ధనేశ్వరీ సుదుర్భగా
సుభగా రూప మగ్ర్యమ్ ॥ 26

తా:- కన్య అయినచో సమగ్ర లక్షణములు గల భర్తను, భర్తలేని స్త్రీ అయినచో పాపములు తొలగించబడినదియై పుణ్యలోకములు పొందును. మరణించిన సంతానముగల స్త్రీ దీర్ఘాయుష్యు కలిగిన సంతానమును, సంపదలు కలిగియున్నను దురదృష్టము గల స్త్రీ ఆచరించినచో సౌభాగ్యమును పొందును. 26

టీ:- అవీరా విధవా. ధనేశ్వరీ సత్యపి యా సుదర్భగా సా సుభగా భవతి. (25,26)

టీ'- అవీరా అనగా విధవ (భర్తలేని స్త్రీ). ధనవంతురాలే అయినను దౌర్భాగ్యము గల స్త్రీ సౌభాగ్యమును పొందును. (25,26)

శ్లో॥ విన్దే ద్విరూపా విరుజా విముచ్యతే య
ఆమయా వీన్ద్రియ కల్పదేహమ్ ।
ఏతత్పరన్నాభ్యుద యే చ కర్మణ్య
నన్తతృప్తిః పితృ దేవతానామ్ ॥ 27

తా:- విరూప అయిన స్త్రీ ఆచరించినచో చక్కని రూపమును పొందును. రోగములు గల స్త్రీ రోగముల నుండి విముక్తురాలగును మరియు ఇన్ద్రియ పాటవమును గల దేహమును కూడా పొందును. వివిధ కర్మలు (దానములు, యజ్ఞములు) చేయునపుడు దీనిని పఠించవలయును. ఇది పితృదేవతలకు కూడా అనన్తమైన తృప్తి నిచ్చును. 27

టీ:- య ఆయయాలీ రోగీ స విరుజా విశిష్టయారుజా విముచ్యతే. ఇన్ద్రియైః సహితం కల్పం దేహంచ విన్దేదితి శేషః. పఠన్యో వర్తేత తస్య పితౄణాం దేవతానాం చానన్తా తృప్తిర్భవతేత్యర్థః. 27

టీ:- రోగముగలవాడు ఆచరించినచో రోగము నుండి విముక్తియేగాక విశేషించి ఇన్ద్రియ పాటవము గల శరీరమును కూడా పొందును. దీనిని పఠించువాని యొక్క పితృదేవతలు అనన్తమైన తృప్తిని పొందెదరు అని భావము. 27

అవ॥ ఉపసంహారతి - రాజాన్నితి.

అవ:- రాజన్నిత్యాది పాదమున ఉపసంహారము చేయుచున్నాడు.

శ్లో॥ తుష్టాః ప్రయచ్ఛన్తి సమస్తకామాన్హోమావసానే హృత భుక్ శ్రీహరిశ్చ ।
రాజన్మహన్మరుతాం జన్మపుణ్యం
దితేర్వ్రతం చాభిహితం మహత్తే ॥ 28

టీ:- మహత్పుణ్యం జన్మ మహద్వ్రతం చ. 28

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే
ఏకోనవింశో౽ ధ్యాయః

సమాప్తోయం షష్ఠః స్కన్ధః

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు

తా:- హోమము పూర్తియైన తరువాత హోమద్రవ్యముల భోక్తలగు శ్రీహరి, లక్ష్మీదేవి కూడా తృప్తిని పొందినవారై సమస్తమైన కోరికలు తీర్చెదరు. ఓ పరీక్షిన్మహారాజా! గొప్పదైనదియు మరియు పవిత్రమైనది-యును అయిన మరుత్తుల జన్మవృత్తాంతమును దితి యొక్క గొప్ప వ్రతమును నీకు చెప్పితిని. 28

టీ:- మహా పుణ్యకరమైన (మరుత్తుల) జన్మవృత్తాంతమును మరియు గొప్పనైన వ్రతమును (వినిపించినాను). 28

శ్రీమద్భాగవత మహాపురాణమందు ఆఱవ స్కంధమున
పంతొమ్మిదవ అధ్యాయము సమాప్తము.

ఆఱవ స్కన్ధము సమాప్తము

ఓం తత్సత్ - శ్రీకృష్ణునకు అర్పించబడుగాక

